శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)


సంపుటము ౨౫. { ధాతృనామసంవత్సరము. చైత్ర వైశాఖమాసములు. } సంచిక ౧.





కాకినాడ

కొత్తపల్లి సూర్యారావుచేఁ

ప్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

సం. 1936 మార్చి, ఏప్రిల్ మాసములు.

# విషయసూచిక.




1. స్వవిషయము ... ... ౧-౨
2. చిన్నిపూలు ... ... ౨-౩

   నిడుదవోలు వేంకటరావుగారు, బి. ఏ.

3. ఆంధ్రభాషయందలిద్రుతస్వరూపము ... ౪-౬
4. గ్రంథస్వీకారము ... ... ౭-౮
5. శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు ... ... ౯-౨౮
6. సంధి ... ... ౨౯-౩౯
7. తాతాచరిత్రము ... ... ౩౯
8. కావ్యాత్మ ... ... ౪౦
9. భాసుఁడు ... ... ౪౧-౪౮

   కిశాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

10. రఘునాథరామాయణము ... ... 1-8

    రఘునాథభూపాలుఁడు.

11. లక్షణసారసంగ్రహము ... ... 1-8

    చిత్రకవి పెద్దనార్యుఁడు.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౫. { ధాతృనామసంవత్సరము. చైత్రవైశాఖమాసములు. } సంచిక ౧.

## స్వవిషయము.

ఆంధ్రసాహిత్యపరిషత్తును స్థాపించి యిరువదియైదేండ్లయినది. పరిషత్పత్రిక మొదలిడి యిరువదినాల్గేండ్లు గడచి యిరువదియైదవయేఁడు జరుగుచున్నది. మొత్తమున రెండిటికిని రజతోత్సవసమయ మనియే చెప్పవచ్చును. పరిషత్తున కింతదనుక మహారాజులు నుదారులు నగు వారిచేతనే పోషణము జరుగుచున్నది. కాని భాషాభిమానులు, భాషావేత్తలు, విద్యాధికులు చేయు సాయము చాలఁ దక్కువ. పరిషత్తునకేమి మహారాజులెల్లరుఁ దోడ్పడుచున్నా రని తక్కినవారు కొందఱు తలంచుచున్నారు. సత్యమేకాని వారుచేసిన సాయము పరిషత్కార్యము లన్నియు నిర్విఘ్నముగా జరగుటకుఁ జాలదు. చెఱకు తీపి యని వేళ్ళతో నమలఁ జూడరు. ఇచ్చిన మహోదారు లిచ్చిరి. ఇచ్చిరికావుననే యీరజతోత్సవము లోకము చూడఁ దటస్థించినది. ఇఁకమీఁదఁ బరిషత్తునకు దేశాభిమానులు, భాషాభిమానులు నగు ధనికులు విద్యాధికులుఁ దోడ్పడిన మఱికొంతకాలము నిర్విఘ్నముగా జరుగఁగలదు. తమతమ మిత్రులం బ్రోత్సహించి పూర్వపాఠకులును గ్రొత్తపాఠకులంజేర్చి విద్యాభిమానులును దోడ్పడఁ గోరుచున్నారము.

దేశమునకుఁ గావలసినది మొదట విద్య, దానితోడ్పాటులేదు, మఱి దేని కెవ్వ రెన్ని చేసినఁ బ్రయోజనమేమి? మూలమునకుఁ దోహదము చేయనిదే శాఖలలో నంటుగట్టఁదలఁచిన నత్తుకొనక వెఱ్ఱితలలు

వేయును. శుష్కవాదములను విని మెచ్చువారే కాని నిక్కముగఁ బని చేయుచున్నవారి నాదరించువారు తక్కువ.

శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు ప్రథమసంపుటము ముద్రణము పూర్తియైనది. వేయిపుటలలో నచ్చులుముగిసినవి. త్వరలోనె తక్కిన సంపుటములు వెలువడును. ఇప్పుడీప్రథమసంపుటము, వెల రు. 5-0-0. పోస్టువ్యయములు కొనువారే భరింపవలయును.

ఈవత్సరమున రఘునాథరాయల రామాయణమును*, చిత్రకవి పెద్దనార్యుని లక్షణసారసంగ్రహమును బ్రకటింపఁదలఁచితిమి. ఆంధ్రభాషావాతావరణమున విప్లవసూచకములు గన్పడుచున్నవి. కర్ణాటకేరళాదివాఙ్మయముల యాధునికస్థితిని గూర్చి పండితాభిప్రాయములఁ బ్రకటించితిమి. వారినిశ్చితాభిప్రాయములే యాంధ్రలోకమునకు మార్గదర్శకము లగుఁగాక. ప్రథమమునుండియు నీపరిషత్తు భాషవిషయమై తన యుద్దేశమును స్పష్టముగఁ దెలుపుచునేయున్నది. ప్రాచీనులవలె సంస్కృతభాషాపాండిత్యము నాధునికులు తమతమ రచనములఁ గన్పఱుప నక్కఱలేదు. సులభశైలిని సలక్షణముగ వ్రాయవచ్చును. భాష నియమరహితము గా దనియే మామతము. ఆంధ్రభాషాభ్యుదయమే పరిషత్తునకు ముఖ్యకర్తవ్యము. ఆసముద్దేశముతోడనే యింతవఱకు భాషాసేవ యొనర్చినది. ఇంకను జేయఁగలదు.

---

## చిన్నిపూలు.

—: నిడుదవోలు వేంకటరావుగారు బి. ఎ. కాకినాడ. :—

క. శ్రీవాగ్దేవీత్రయమూ, పావిర్భావములఁ ద్రిజగదాధారం బౌ
శ్రీవిద్యాశక్తికి నై, శ్రీవాగ్దేవినిఁ దలంతుఁ జిత్తములోనన్. ౧

గీ. తమ్మినెఱచూలినెమ్మోముఁదమ్మితోఁట
నాడుకొనునట్టి మేటి రాయంచకొదమ
సర్వశుక్ల, సరస్వతి, సర్వకాల
మధివసించుత మామానసాంతరముల. ౨

* దీనికి సంపూర్ణప్రతి యెవ్వరైన సంపాదించికొనినచో మాకొక్కసారి పంపఁగోరెదము.

గీ. త్రిభువనోపాస్యమై బుధోద్గీత యగుచు
నమృత మాతృకళామయియైన వాణి
నక్షరగ్రంథరూపాప్తి నలరఁజేయు
ప్రాకృతుల కెల్ల మన్న మోవాక మిదియ. ౩

గీ. ప్రకృతివికృతుల భేదంబు వర్ణసంజ్ఞ
నాగమక్రియ ద్రుతగతి నతకరించి
కళకుఁ గళయైన దానినిఁ గాంచుఁ డంచుఁ
దెలుపు నిన్గొల్చువారలపలుకు వాణి ! ౪

గీ. గురువులను బొందు సర్వలఘుత్వసరణి
యతులనుం గల్గు పెక్కుసంగతు లటంచుఁ
బదవివర్ణంబుఁ జెందక మొదలఁ దుదల
వర్ణసంబంధమునఁ గీర్తివఱలుసుకవి ! ౫

క. మొలఁబొడలతోలుమేనం, బొలుపగుజవరాలు, కేల ముమ్మొనవాలుం
దలపై వెన్నెలజాలును, మలప్రోలును వెల్లడాలమను నీకుశివా! ౬

క. కడలకడ, తలఁపుకొన, ప్రా, నుడువులతుది, యెఱుకచివరనుంగలనిన్నుం
ముడిసడలు నెడఁదచూపుల, గడిఁగనుజడదారులేని గనలేరు శివా !

క. మను, నీరు, నిప్పు, వలి, విను,
వినురతనము, నెలయు, గేస్తు పేరులు గా నీ
యెనిమిదిరూపుల నెల్లర
మనఁ జూచెడునీకు నివియె మన్ననలు శివా ! ౮

క. కలిమియు లేమియు నొకటిగఁ
దలఁచుచుఁ బెన్గొలల రోసి, తాలిమికొలుకుల్
దలఁగిన వారల నెఱుకలు
నెలవులుగా నుండుదీవు నెఱిదోఁప శివా ! ౯

క. ఇక్కన్నుగలుగుదొరలకు, నెక్కటియై, యెఱుకగలుగు నెల్లరకును దాఁ
జక్కటియై, యలరారెడు, ముక్కంటీ! నీకుఁ జిన్నిపూ లివిగొన్నుమా!

# ఆంధ్రభాషయందలి ద్రుతస్వరూపములు.

ఈవిషయమునుగూర్చి ఎర్నాకులము కాలేజియందు ప్రధానాంగ్లోపన్యాసకు లగు యల్. వి. రామస్వామి అయ్యరుగారిచే బెంగుళూరు మిథిక్ పత్రికయం[1]దొకవిపులమగువ్యాసము ప్రకటింపఁబడినయది. వీరు భాషాశాస్త్రపరిశోధకులు- ద్రావిడభాషాచరితమునకు సంబంధించిన పెక్కు వ్యాసములను వ్రాసి యాంగ్లభాషాపత్రికలయందు ప్రచురించు చున్నారు. అవి ద్రావిడభాషలలోనికిఁ బరివర్తింపఁబడినచో నాయావిష యములఁ బండితులు చర్చించుట కనుకూలముగ నుండియుండును. ఆంధ్ర మునఁ గలద్రుత మిటీవల వచ్చినది కాదు. ప్రాచీనభాషలయందలి ప్రత్య యములు కొన్ని మాఱి మనభాషయందు ద్రుతస్వరూపమును గాంచినవి. వైయాకరణులు "ద్రుతాఖ్యో నః" అనుసూత్రముచే ద్రుతమును నిర్ణ యించి "లుక్సంశ్లేషౌనాచి" యిత్యాదిసూత్రములచే సంధిసమాసాదుల నదిపొందు మార్పులను విధించియున్నారు. పాశ్చాత్యు లీద్రుతస్వరూప మును సరిగ గ్రహించి యుండలేరు. కాల్డ్వెలు తనద్రావిడభాషావ్యాక రణమున దీనినిగూర్చి విమర్శించుచు (పు. 175. తృతీయముద్రణము) నది యచ్చులకలయికను నిరోధించుటకై గైకొనఁబడినదని యూహించిరి (Hiatus-filler). కాని యాయూహ పొరపాటని రామస్వామి అయ్య రుగారు, రామకృష్ణయ్యగారు మొదలగు భాషాశాస్త్రపరిశోధకులు వ్రా యుచున్నారు. ద్రుతమును గూర్చి రామస్వామి అయ్యరుగారు సిద్ధాంతీక రించిన విషయము లివి:—

(1) గ్రాంథికాంధ్రమునఁ గన్పడు ద్రుతసహితప్రత్యయములకు సాజాత్యప్రత్యయము లితరద్రావిడభాషలలోఁ గలవు. తెనుఁగుభాష లోని (1) భూతార్థకప్రథమపురుషైకవచన మగు- ఎన్; (2) తద్ధర్మా ద్యర్థకప్రథమపురుషైకవచనమునఁ గల- ఎడున్- ఎడిన్; (3) ఆశీరా ద్యర్థక మగు- ఎడున్ (4) ఆనంతర్యార్థక మగు- డున్ ప్రత్యయములఁ బోలినవి తమిళకన్నడముల లేవు.

1. Vol' XXIII-Parts 2 & 3, Vol. XXIV-Parts 1 & 2).

(2) ద్రుతనకార మొక్కొకచోట నాంధ్రభాషయొక్క వ్యక్తిత్వ మును (individuality) నిరూపించుచున్నను జాలవఱకు దమిళ కన్నడప్రత్యయముల మార్పుగాఁ గన్పడుచున్నది. కొన్నిస్థలముల సముచ్చయనకార మితరప్రత్యయములఁ జేరి సముచ్చయార్థమును వదలినది. (ఉదా:- కొఱకున్, శత్రర్థక చున్ ప్రత్యయము.)

(3) ద్రుతనకారము ప్రథమమున హలంతరూపమై(న్)యిటీవల నజంతమయినది.

(4) ద్రుతసంధినియమములు ద్రావిడభాష లన్నిటిలోపలఁ గన్పడు భాషాశాస్త్రనియమముల (philological principles) ననుసరించియే యున్నవి.

(5) గ్రాంథికాంధ్రమున ద్రుతస్వభావము స్పష్టముగఁ గన్పడుచున్నది. కాని వ్యావహారికమునఁ జాలభాగము విడువఁబడినది. కొన్ని తావుల గ్రాంథికద్రుతస్వరూప మింకను స్మరణకు వచ్చుచున్నది. (ఉదా: రానక్కఱలేదు. ఆరంభించినాఁడు, రాఁగానే, చెయ్యనేల......).

ఈవ్యాసమునఁ దమిళకర్ణాట భాషల నేయేప్రత్యయము లాంధ్రమున ద్రుతము వచ్చుతావులఁ గన్పడుచున్నవో, విపులముగఁ జర్చింపఁబడినది. తమిళమళయాళకన్నడముల ల, న, ర, య, ళ, ణ, లు హలంతములుగ నుపయోగింపఁబడును. కాని ద్రుతనకారమే యాంధ్రమున హలంత మననగును. విశేషవిధిచేఁ గొన్నిస్థలముల ర ల లు హలంతములుగఁ బ్రయోగములు గలవు. (వనముల్, వారల్...) కాని వ్యాసకర్త లీక్రిందివిషయములఁ గమనింపవలసియున్నది.

(1) ఊరన్- కాలన్- కంటన్... (పు. 5) యివి ఔపవిభక్తిక క్రియలు గావు. ఔపవిభక్తికప్రత్యయసహిత నామవాచకము లనఁ దగును.

(2) తృతీయార్థమున మెయన్, మయన్, మెయ్యన్ కుఁ బదులు (పు. 2, 10)- మైన్, మెయిన్ అనిమాత్రమే యుండవలయును.

(3) అనియెను మొదలగువానిలోని ఇ ప్రత్యయము భూతార్థ ద్యోతక మగు ప్రత్యయమా యని వీరు సందేహించిరి. (పు. 12). అని, కొట్టి, చంపి మున్నగు క్త్వార్థకములయందలి యికారము భూతార్థమునే సూచించుచున్నది. అట్టి ఇకార మితర ద్రావిడ భాషలందును గలదు. (Caldwell, P. 502, 503, 505). కాని యది ప్రథమమున నొకవేళ సముచ్చయమై ధాతువును, భూతార్థ ప్రత్యయమును గలుపుటకై ప్రయోగింపఁబడి యుండవచ్చు నని కాల్డ్వెలుగా రూహించుచున్నారు.

(4) షష్ఠీ ప్రత్యయ మగు 'లో' తమిళమున 'ఉళ్లమ్' నుండి వచ్చినదని కలదు. (పు. 10). కన్నడ (ఓల్) తమిళ (ఉళ్) ప్రత్యయముల వర్ణవ్యత్యయముల (metathesis) చే నిది వచ్చియుండునా ?

(5) వ్యాసాదిని ద్రుతము లోపించు తావులు పేర్కొనఁబడినవి. సమాసమునందును, అవసానమునందును ద్రుతమునకు లోపము గలుగు నని కూడ నెఱుంగునది. (ఉదా: వాడువచ్చెన్- వాడువచ్చె- ఎల్లయర్థములు......).

ఒక్కొకచోట ద్రుతముపై నకారము కూడఁ గనఁబడుచున్నది. (ఉదా. అదియునున్నాక).

ద్రుతము కొన్ని చోటులఁ బూర్ణానుస్వారముగను, మఱి కొన్ని స్థలముల నర్ధానుస్వారముగను మాఱుచున్నయది. ఒకచో సంశ్లేషము, గజడదబాదేశమును గలుగుచున్నది. తమిళాదిభాషల ఉమ్ మున్నగు ప్రత్యయములు పరంబగుచోటుల నాంధ్రమున ద్రుతము వచ్చుచున్నది. అర్థానుస్వారమనునది ప్రథమమున వర్గానునాసికాక్షరమై యుండు నని యు సరళాదేశము తమిళకన్నడభాషలయందుఁ గూడ నచ్చటచ్చటఁ గల దనియు, నాంధ్రమున ద్రుతముమీఁది పరుషము లెప్పుడును సరళములగుచున్నవనియు వీరు వ్రాసియున్నారు. ఇంకను బెక్కువిషయములు వివరింపఁబడినవి. భాషాశాస్త్రసామ్యము నెఱుంగఁగోరు ప్రతియాంధ్రుఁడు నువీరివ్యాసములఁ జదివి యందలిసారమును గ్రహింపవలసియున్నది.

---

# గ్రంథస్వీకారము.

౧. శ్రీరామబాల్యము—ఐదంకముల స్వతంత్రనాటకము. ఒంగోలు నివాసులు శ్రీమాన్ ఆదూరి వెంకటరంగస్వామి అయ్యంగారు రచించినది. గుంటూరు పి. వి. రమణయ్యా అండు సన్ వారిచేఁ బ్రకటింపఁబడినది. కథ, దశరథుఁడు వేటపోయి మునిబాలకుని వధించుటమొదలు శ్రీరామవివాహానంతరము పరశురామభంగమువఱకుఁ గల రామబాల్యచరిత్రతో నిండినది. కథాకల్పనము నుచితముగ నున్నది. భాషనిర్దుష్టము. అల్లికజటిలమైనది, యింపైనది. మచ్చుపద్యములు—

చ. చిఱుతలు తల్లిచాటుల వసించెడికూనలు, కేళి కెన్నఁడో
   శరముల దాల్తు రాక్షసులజాడ లెఱుఁగరు రాత్రులెల్ల ని
   ద్దురగొనువారు రాత్రిచరదోర్బలముల్ సహియింతు రొక్కొ మీ
   రరసి యనుజ్ఞనిచ్చిన రయంబునఁ గాచెద నేన యాగముల్. 3 అ.

శరములఁదాల్తు అనుటకంటె శరములఁగొందు అనుట తగు నేమో యనుకొందుము.

చ. జడికిని నెండ కోర్చి హిమశైలమునందున వాయుభోక్తనై
   కడిఁదితపంబున న్గనకగర్భునిచే వరమంది వేల్పులన్
   గడగడలాడఁ జేసి కరకంఠమహానగ మెత్తినట్టి నా
   పిడికిటిక్రేటుచే శిరముఁ బిండియొనర్చెదఁ గాచుకొమ్మికన్. ౪ అ.

దీనివెల రు 0-12-0. కావలసినవారు కవిగారికి శ్రీరామానుజభవనము, కోర్టువీథి. ఒంగోలు-గాని, పి. వి. రమణయ్యా అండ్ సన్-వారికి గుంటూరు గాని వ్రాయఁదగును.

౨. బ్రహ్మోత్తరఖండము—(వచనకావ్యము) శ్రీశైవగ్రంథమందలి ద్వితీయగ్రంథము. రాజమహేంద్రవరములో వెలువడినది. వి. విశ్వనాథముగారు కర్త. శ్రీ కాళహస్తి తమ్మయ్యదేవరగారు శ్రీశైవగ్రంథమండలిపక్షమునఁ బ్రకాశకులు. పూర్వకవి యగు శ్రీ ధరమల్లె వేం

కటరామకవికృతపద్యకావ్యము ను బట్టి రచింపఁబడినవచనము. "ఎల్లరు సులభముగఁ జదువుకొని గ్రహింపఁదగిన పురాణములు ప్రబంధములు నిక్కాలమున నెల్లరకును దుర్గ్రాహ్యంబులై నామమాత్రావశిష్టంబులై యుండెను. మతజ్ఞానవైరాగ్యోపదేశములు పురాణమూలమునఁ బ్రబోధింపవలయునను పురాణపురుషోద్దేశములు కాలవైపరీత్యంబున నివ్విధముగఁ బరిణమించె"నను విచారమునఁ బురాణాదు లరముచేసికొనఁజాలని వారికై యీవచనము రచియింపఁబడినయది. ఉద్దేశము చక్కనిది. భాషయెంతయు సలక్షణముగ నున్నది. రచన చక్కగనున్నది. సంస్కృతాంధ్రపదసమత్వమున నాతికఠినరీతి నలరారుచున్నది. శైవులేకాదు, భాషాభిమానులెల్లరు నాదరించి చదువవలసినగ్రంథము. వెల రు. 1. నైజాంరాష్ట్రాంధ్రుల సౌకర్యమునకై సికింద్రాబాదు బుక్కుడిపోలో కొండా శంకరయ్యగారియొద్ద నీపుస్తకము లుంపఁబడినవి. తక్కినవారికి రాజమహేంద్రవరములో దొరకును.

3. శ్రీ విద్యార్థికల్పతరువు—రాజమహేంద్రవరము టౌనుహైస్కూలు తెనుఁగుపండితులగు బ్ర. మునునూరి వేంకటశాస్త్రిగారుకూర్చిన నిఘంటువు. వెల రు 1-8-0. ఇందు సాంకేతికపదములు, నానార్థములు, పర్యాయపదములు, వ్యుత్పత్త్యర్థములు, జంటపదములు, ప్రకృతివికృతులును దెలుపఁబడినయవి. ఇది ప్రవేశపరీక్షావిద్యార్థులకే కా దితరులకు నత్యంతోపకారముం జేయఁగలదు. వ్యాకరణసంగ్రహము, ఛందఃపరిచ్ఛేదము, ఉపమేయోపమానము, శకటరేఫవిభాగము మున్నగు ననేకముఖ్యవిషయములు విద్యార్థికిఁ గరతలామలకముగఁ దెలియును. ఇందు సాధారణముగా నే విషయము కావలసి వచ్చినను దెలిసికొనుటకు సాధనము లున్నయవి. వేంకటశాస్త్రిగారు శ్రమపడి లోకమునకుఁ జేసిన యుపకారమునకుఁ బ్రత్యుపకార మాంధ్రులు చేయవలసినది, యేతత్కల్పతరువును వారికిఁ గల్పతరువునుగాఁ జేయుటయే. అత్యల్పకాలములో నీరిట్టి యుపయోగగ్రంథమును సమకూర్చుట కష్టమే గాని విద్యార్థుల కష్టమును తగ్గించినారు గావున వారిని బ్రశంసింపఁ దగును. ఇది కవిగారియొద్దనే దొరకును.

# శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు.

## ఆంధ్రసాహిత్యపరిషత్సభ.

---

శ్రీ పిఠాపురము మహారాజావారగు శ్రీ రావు వేంకట కుమార మహీపతి సూర్యరావు బహదరువారి ధనసహాయమున, ఆంధ్రసాహిత్య పరిషత్తువారు రచియింపించి ప్రకటించిన శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు ప్రథమసంపుటమును శ్రీ మహారాజావారికి సమర్పించుటకై ది 5 ఏప్రిల్ 1936 సంవత్సరము ఆదివారము సాయంకాలము 4 గంటలకు, చెన్నపట్టణము, మైలాపూరులో రానెడీ భవనమున సభ కావింపఁబడినది. అడ్వొకేటు జనరల్ సర్. అల్లాడి కృష్ణస్వామయ్యగారు సభ కగ్రాసనాధిపత్యమును వహించిరి.

శ్రీ పిఠాపురము మహారాజావారు, శ్రీయువ మహారాజావారు, సర్. యస్. రాధాకృష్ణన్‌గారు, సర్. వేపా రామేశముగారు, ముత్తయ్య మొదలియార్ సి. ఐ. ఇ. గారు, టి. ఆర్. వెంకట రామశాస్త్రియార్ సి. ఐ. ఇ. గారు, డాక్టర్ యస్. కృష్ణస్వామయ్యగారు, గంటి లక్ష్మన్న గారు, పప్పు సోమసుందరముగారు, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, వింజమూరి గోవిందరాజాచార్యులుగారు, బండి శ్రీహరిరావు నాయుఁడుగారు, మంత్రిప్రెగడ నరసింహారావు పంతులుగారు, చావలి నాగేశ్వరరావుగారు, చల్లా జగన్నాథముగారు, జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, కస్తూరి శేషగిరిరావుగారు, నేత్రకంటి శ్రీనివాస కోనేటిరావు పంతులుగారు, దాసు త్రివిక్రమరావుగారు, జి. వి. శ్రీనివాస రావుగారు, అల్లాడి సుబ్రహ్మణ్యముగారు, కాశీ కృష్ణాచార్యులుగారు, పురాణం సూర్యనారాయణ తీర్థులుగారు, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు, కోరాడ రామకృష్ణయ్యగారు, డాక్టరు యన్. వేంకటరమణగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, గన్నవరము సుబ్బరామయ్యగారు, గరిమెళ్ళ సత్యగోదావరి శర్మగారు, ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, డాక్టరు పి. వి. సుబ్బారావుగారు, ఎనమండ్ర సూర్యనారాయణగారు, దువ్వూరి రామి

రెడ్డిగారు, శిరోభూషణము వేంకటరంగాచార్యులుగారు, యం. రామానుజరావు నాయఁడుగారు, బులుసు వెంకటరమణయ్యగారు, విద్వాన్ ఆర్ముగంపిళ్లెగారు, యం. యస్. రామచంద్రరావుగారు, యం. కృష్ణారావుగారు, త్రిపాసూరి వేంకటరావుగారు, ఉప్పులూరి కాళిదాసుగారు, మండలీక వేంకటరత్నము పంతులుగారు, పెనుమెత్స సత్యనారాయణ రాజుగారు, సాధు వరదరాజుపంతులుగారు, సమర్ధి రామానుజంసెట్టిగారు, సి. హెచ్. రాఘవరావుగారు మున్నగు ననేకులు న్యాయవాదులు సంపన్నగృహస్థులు, నధికారులు, భాషాభిమానులును, విద్వాన్ కంచనపల్లి కనకమ్మగారు, విద్యాసుందరి బెంగుళూరి నాగరత్నముగారు మొదలగు విదుషీమణులు, సభ నలంకరించిరి.

తొలుత కాశీ కృష్ణాచార్యులుగారు, ఓలేటి వేంకటరామశాస్త్రులుగారును దైవప్రార్థనము గావించిరి. పిదప సభకు రాఁజాలమైతిమని కట్టమంచి రామలింగారెడ్డిగారు, పెద్దాడ రామస్వామిగారు, వడ్డాది సుబ్బరాయఁడుగారు, జనమంచి శేషాద్రిశర్మగారు, దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు పంపిన లేఖలు చదువఁబడినవి. వడ్డాది సుబ్బారాయఁడుగారును, దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారును బంపిన పద్యములు చదువఁబడినవి.

అంతట శ్రీజయంతి రామయ్యపంతులుగారు తమకృషిని గూర్చి యిట్లుపన్యసించిరి.

— శ్రీజయంతి రామయ్యపంతులుగారి యుపన్యాసము. —

“అధ్యక్షమహాశయా! మహారాజ! సభ్యులారా!

తెలుఁగుభాషను, వాఙ్మయమును అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమచేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు” ప్రయోజనములుగా నాంధ్రసాహిత్యపరిష త్తీచెన్నపురియందు ఆ 1911 వ సంవత్సరమందుఁ బ్రతిష్ఠింపఁబడినది. ఏతత్పరిషత్ప్రయోజనముల నెఱవేర్చు మార్గములలో “తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వాంకషమగు నిఘంటు వొకటి రచించి ప్రకటించుట” ప్రథమమార్గముగా నిరూపింపఁబడినది.

ఇట్లు నిరూపింపఁబడిన వెనువెంటనే శ్రీ పీఠికాపురవరాధీశ్వరు లగు మహారాజా శ్రీరావు వేంకట కుమారమహీపతి సూర్యారావు బహద్దరుగారు మాతృభాషాభిమానమును బురస్కరించుకొని నిఘంటునిర్మాణమునకుఁ గావలసిన ధన మంతయుఁ దామె యిచ్చెద మని ప్రతిజ్ఞచేసి యాప్రకారము నడపుచున్నారు. శ్రీవారి యౌదార్య మనన్యాదృశ మని వేఱ చెప్పనక్కఱలేదు గదా! ఇది జరిగిన యచిరకాలముననే మదరాసు దొరతనమువారు తెలుఁగు నిఘంటువునకై రు 20,000 లు వ్యయపెట్టుదుమని తమ Budget లోఁ బ్రకటించిరి. అది తెలిసి మహారాజావారు నాతో "నిఘంటువునకుఁ గావలసిన ధన మంతయు నేనే యిచ్చెద నని చెప్పియుంటిని గదా! వే ఱొకరిసొమ్ము దానిలోఁ గలియ నేల? ఆసొమ్ము వచ్చినయెడల మఱియొక కార్యముక్రింద వినియోగ పఱుపరాదా?" అని సెలవిచ్చిరి. దొరతనమువా రేకారణముచేత ధన మీయఁదలఁచిరో తెలియదనియు, పరిషత్తువా రడుగ లేదనియు, ఆసొమ్ము నిఘంటువునకై వినియోగింపఁబడ దనియు నేను బదులు చెప్పితిని. పిదపఁ గొలఁదిదినములకే యూరోపు మహాసంగ్రామ మారంభమయ్యెను. దొరతనమువా రాధనము నిచ్చెద మని చెప్పలేదు. మే మడుగనులేదు. నిఘంటువు నిర్మాణవిషయమై మహారాజావారికిఁగల యభినివేశమును సూచించుటకై యీచిన్న విషయము నుదాహరించినాఁడను.

అటుపిమ్మట నిఘంటువును రచియింపవలసిన పద్ధతిని గూర్చి నే నొక వ్యాసమును గూర్చి యది తెలుఁగునను ఇంగ్లీషునను బ్రకటింపఁగాఁ బలువురు పండితులు తమ యభిప్రాయముల నంపిరి. ఆంగ్లేయ భాషా నిఘంటువులను, అందులోను ముఖ్యముగా Oxford Dictionary of English language అను నుత్తమ నిఘంటువును, ఆదర్శముగా నుంచుకొని నే నావ్యాసమును గూర్చినాఁడను. పలువురు పండితులు మొత్తముమీఁద నామార్గము నామోదించిరి.

మఱికొంతకాలమునకు నీ చెన్నపురమందే యాంధ్రసాహిత్యపరిషత్కార్యస్థానమందు నిఘంటునిర్మాణకార్య మారంభమైనది. దానికి, కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రులుగారు సంపాదకులుగా నియమింపఁ

బడిరి. సంస్కృతశబ్దముల నుద్ధరించి వ్రాయుటకు శ్రీమాన్ తంజనగరము తేవప్పెరుమాళ్లయ్యగారు నియమితులైరి. ఓ. సి. దొరసామయ్యగారు సంపాదకులకు సహాయులుగా నేర్పాటయిరి.

ఈరీతిని గొంతకాలము పని జరిగిన పిమ్మట, అనఁగా 1917 వ సంవత్సరము సెప్టెంబరు నెలలో నిఘంటుకార్యము తృప్తికరముగా జరుగుచుండనట్లు తమకుఁ దెలిసిన దనియు నిఁకముం దాపని పిఠాపురములోఁ గాని కాకినాడలోఁ గాని కార్యస్థానముంచి తాము చేయించెదమనియు, నందులకుఁ బరిషత్తువా రంగీకరింపవలయు ననియును శ్రీ మహారాజావారు జాబు వ్రాసిరి. పరిషత్తువా రందుల కంగీకరించిరి. నిఘంటు కార్యస్థానము పిఠాపురములో 1918 వ సంవత్సరములో-అనఁగా, కాళయుక్తి సంవత్సరారంభమునఁ బ్రతిష్ఠింపఁబడినది. తేవప్పెరుమాళ్లయ్యగారు పిఠాపురము వచ్చిరి కాని వేదము వేంకటరాయశాస్త్రులుగారు వచ్చుట కంగీకరింపలేరు. వేఱొక సంపాదకుని నియమింపవలసి యుండెను. నే నంతకుఁ బూర్వము కొలఁదికాలమునందె రాజకీయోద్యోగమునుండి విరమించి యుండుటచేతఁ గాఁబోలు నిఘంటుసంపాదకత్వము వహించి కార్యనిర్వహణము చేయవలయునని మహారాజావారు నాకొకజాబు వ్రాసిరి. ఇట్టి జాబువచ్చునని నేనెన్నఁడునుదలఁచియుండలేదు. తలవని తలంపుగాఁ బైబడనున్న యీ కార్యభారము భరింపఁజాలనను భీతి పొడమినది. ఈభారమును దప్పించుకొనుటకు వేఱొక సంపాదకుని శ్రీవారికిఁ గనఁబఱచుట తప్ప నుపాయాంతరము కనఁబడలేదు. కార్యము నిర్వహించుటకు సమర్థులైనవారును, పిఠాపురములో నివాసముగా నుండుట కిష్టపడువారును నాకెవ్వరు నప్పుడు స్ఫురింపలేదు. ఉపాయాంతరమును సూచింపకయే నేను దప్పించుకొన్నచోఁ గార్యభంగమగు నని తోఁచినది. ఇంతధన మిచ్చి పుచ్చుకొమ్మనెడు దాత యుండఁగా దానిని బ్రతిగ్రహింపక పోవుట "సిరి రా మోఁకా లొడ్డినభంగి" నుండు నని భీతికలిగినది. ఇప్పుడే పూనుకొననిచో నిఁకముం దీపని సాధ్యమగునో కాదో! కావున సర్వవిధములఁ గార్యారంభము చేయుటయే కార్యముగాఁ గనఁబడినది. నాశక్తి సామర్థ్యములు తలంచుకొన్నప్పుడు "నృహరీ వాదము లేల లేదె యితరుల్ నీలీల

కుంబాత్రముల్' అను విష్ణుచిత్తునివాక్యము స్ఫురించి సంకోచించు చుండఁగా నా విష్ణుచిత్తునకే మహావిష్ణువు ప్రసాదించిన—

"నీ యిచ్చయె మిన్నక పో
వోయి మునిప్రవర నిన్ను నొప్పింతును భూ
నాయకుసభ నింములకై
నీయత్నము వలవ దవల నే నున్నాఁడన్".

అను ప్రత్యుత్తరము కూడ మదికిఁ దట్టి కొంతధైర్యము గలుగఁ జేసినది. ఆంధ్రభారతియే మహారాజావారిముఖమున న న్నీ కార్యమునకుఁ బురికొల్పుచున్నదనియు నాభారతియే నన్ను నిమిత్తమాత్రముగా నుంచుకొని కార్యము నిర్వహించుకొను ననియుఁ, బండిత సహాయమునఁ గార్యము సాధ్యము కాకపోవ దనియు, దృఢసంకల్ప మున్నచోఁ గ్రియాసిద్ధి తప్పక తనంతటఁ దానే వచ్చునను నార్యోక్తి సత్యము కాకపో దనియు నమ్మి యాంధ్రభారతీసేవయే పరమ ధనముగా గ్రహించి తమసెలవు ప్రకారము చేసెదనని మహారాజావారికిఁ బ్రత్యుత్తరము వ్రాసినాఁడను.

పనిలోఁబ్రవేశించి చెన్నపట్టణములోఁ బనియెంతవఱకు జరిగినదో చూతమని యక్కడనుండి వచ్చిన కాగితములు పరిశీలింపఁగా సంస్కృతపదములవిషయమై జరిగిన పనితప్పఁ దక్కిన పని యంతయు మొదటినుండియుఁ జేయవలసినట్లుగఁ గనఁబడినది. ప్రమాణములుగా గ్రహించిన గ్రంథము లన్నియుఁ బండితులకుఁ బంచిపెట్టి యందుఁ గల తత్సమేతరశబ్దముల నొక్కొకటి నొక్కొక్క కాగితపుముక్కమీఁద వ్రాయించి యాముక్కమీఁదనే యాపదమున కాసందర్భమునఁ గలయర్థమును సంగ్రహముగాఁ బ్రమాణవాక్యములను వ్రాయించితిమి. ఇట్లు వ్రాయుట యైనపిదప నొక్కొక్కపదమునకు సంబంధించిన కాకితపుముక్కలన్నియు నొక్కొక్కగుదిగాఁ గూర్చి పిదప నాగుదు లన్నియు నకారక్రమముగా నేర్పాటుచేసి యనంతర మాయర్థాదులను బరిశీలించి సిద్ధాంతీకరించుట యైనది. ఈవిధాన మంతయు నిఘంటు పీఠికలో వివరింపఁ బడినది. పైనుదాహరించిన పని యంతయుఁ దత్సమేతరపదములవిషయమైనదే.

తత్సమశబ్దముల విధానము వేఱు. ఆప్టే (Apte) సంస్కృ తాంగ్లేయ నిఘంటువులోని పదజాల మధికముగా నున్నట్లు తోఁచి యా పదములను, వానికి నిఘంటువునందుఁ జూపఁబడినయర్థములకుఁ దెనుఁగు ను వ్రాసినఁ జాలునని తొలుత నెంచితిమి. కాని, కొన్ని దినములు పనిజరిగిన పిదప "ఆప్టే"లోని యర్థములు కొన్ని సరిగా లేనట్లు కనఁబడినది. అంతటి నుండి యితర సంస్కృతనిఘంటువులను బట్టియు నావశ్యక మయినప్పు డు కావ్యాది మూలగ్రంథములను బట్టియుఁ గూడ నర్థముల సిద్ధాంతపఱుప వలసివచ్చినది. ఈవిషయముగూడ నిఘంటు పీఠికలో వివరింపఁబడినది.

ఈ ప్రకారము పాటుపడి యజాదిపదజాలము గల 1000 పుటల ప్రథమ సంపుటమును నేఁటికిఁ బ్రకటింపఁ గంటిమి. మిగిలిన సంపుటముల నచిరకాలమందే ప్రకటించు యత్నములు జరుగుచున్నవి. ప్రతి సంపుట మునకుఁ నీమొదటి సంపుటమునకుఁ బట్టినంతకాలము పట్టు ననుకొన నక్కఱలేదు. వానికిఁ గావలసిన శబ్దాది సాధన సామగ్రి సిద్ధముగ నుండు టచేత నింతకాల మావశ్యకము కాదు. సంస్కృతపదవిమర్శనము చాల వఱకు ముగిసినది. ముఖ్యముగా నచ్చతెనుఁగుపదముల విమర్శనమే ముందుఁగావలసియున్నది.

ఇంతవఱకుఁ బూర్తియైనగ్రంథము ప్రకటించుచున్నారము. అంద లి గుణదోషముల విచారము సహృదయ విద్వదధీనము.

"ప్రకటిత మగుదాఁకన కృతి కర్తధనము
పిదప నద్ది సారవిమలధనము
కన్నె యైనకాంత కన్నవారల సొమ్ము
పెండ్లియైనపిదపఁ బ్రియుని సొమ్ము."

తద్జ్ఞులు సమబుద్ధితోఁ జేయు నిర్ణయము శిరసావహింపఁ దగిన దే యగునుగదా!

అర్థములు, వివరణములు మొదలగునవి తెనుఁగులో నుండవల యునా లేక యాంగ్లేయభాషలో నుండవలయునా యను విషయమును విమర్శించి తెనుఁగులోనే యుండవలయు నని పరిషత్తువారు నిర్ణయించి రి. ఈవిషయము లాంగ్లభాషలోనున్నచో ద్రావిడభాషలకుఁ గల పరస్ప

ర సంబంధమును నిర్ణయింప యత్నించుచున్నట్టియు, నాంధ్రభాషాప్రవేశ మంతగా లేనట్టియు విద్వాంసుల కుపయోగముగా నుండవచ్చును, గాని, యాంగ్లభాషాపరిచయము లేని తెలుఁగువారల కెంతమాత్రమునుప యోగింపదు. ఆంగ్లులు రచించు నాంధ్రభాషానిఘంటు వాంధ్రులకుఁ బనికిరాకున్నచో నది తనకుమాలినధర్మ మగును. భాషాతత్త్వపరిశోధకులు తెనుఁగుశబ్దముల యర్థాకృతులఁ జక్కగాఁ దెలిసికొనఁ గోరినచో వారు ముందుగాఁ దెలుఁగుభాషను గొంతవఱకైన నభ్యసింపవలయును. అట్లు కానియెడల శబ్దార్థముల సాధించుటకై గ్రంథములనుండి యుదాహరింపఁబడు వాక్యములభావము వారి కెట్లు బోధ పడఁగలదు ? ఈహేతువుల నన్నింటినిబట్టి యీ నిఘంటువు తెనుఁగునందే యుండవలయు నని పరిషత్తువారు నిర్ణయించిరి.

ఈనిఘంటునిర్మాణ కార్యనిర్వహణమందు నాకు సహాయులై యత్యంతశ్రద్ధతోఁ బనిచేసి నామమాట దక్కించినట్టియుఁ దక్కించుచున్నట్టియుఁ బండితుల నామముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

1. తంజనగరము తేవప్పెరుమాళ్లయ్యగారు
2. పురాణపండ మల్లయ్యశాస్త్రులుగారు
3. పేరి పేరయ్యశాస్త్రులుగారు
4. శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రులుగారు
5. శ్రీపాద పాపయ్యశాస్త్రులుగారు
6. కూచి నరసింహముగారు, బి. ఎ.
7. చర్ల నారాయణశాస్త్రులుగారు
8. పిసుపాటి చిదంబరశాస్త్రులుగారు
9. వెంపరాల సూర్యనారాయణశాస్త్రులుగారు
10. దర్భా సర్వేశ్వరశాస్త్రులుగారు

మొదటి ముగ్గురును సర్వేశ్వరశాస్త్రులుగారును గేవలము సంస్కృతపదముల పని చేసిరి. కూచి నరసింహముగారు కేవల మాచ్ఛికపదముల పనిచేయుచున్నారు. మిగిలినవారు సమయానుకూలముగా రెండు పనులును జేసిరి. తేవప్పెరుమాళ్లయ్యగారు, మల్లయ్యశాస్త్రులు

గారును దివంగతులైరి. పేరయ్యశాస్త్రులుగారును, లక్ష్మీపతిశాస్త్రులు గారును, పాపయ్యశాస్త్రులుగారును నిప్పుడీపనిలోనుండి విరమించినారు.

రావు సర్వజ్ఞసింగమహీపాలుని కాలమునాఁటికే వీరి వంశములో సుప్రతిష్ఠితమై యున్న సరస్వతీపీఠము నేఁటివఱకును విరాజిల్లుచున్నది. మహారాజా శ్రీ సూర్యారావు బహద్దరువారి యాంధ్రభాషాభిలాష యనన్యాదృశము. చదువఁదగిన తెలుఁగుపుస్తకములలో వీరు చదువనివి పెక్కు లున్న వని నేను దలంపను. వీరి పాండిత్యము చదువున కనుగుణముగానే యున్నది. కాని వీరికిఁ బాండిత్య మెంతయున్నదో దానిని గుప్తముగా నుంచునేర్పును నంతయున్నది. సన్నిధానవర్తులకుఁ గాని యది పూర్తిగా గోచరింపదు. వీరి పెద్దకుమారుఁడు మా గంగాధర రామారావు బహద్దరుగారు పాండిత్యముతో సమానముగ లలిత కవితాశక్తికూడ నలవఱుచుకొనుచున్నారు. రెండవకుమారుఁడు సూర్యారావు బహద్దరుగారు తెలుఁగు లిపికి Type Writer ఒకటి నిర్మించినారు. ఇది యపూర్వసృష్టి. శ్రీవారికుటుంబము దినదినప్రవర్ధమానమై యాంధ్రభాషాపోషకు నిత్యాశ్రయమై యుండుఁగాత.

మహారాజా !

మీయానతి ననుసరించి యీ కార్యమునకుఁ బూనుకొన్నప్పుడు నేను మీకు ఋణగ్రస్తుఁడ నైతిని. నాఁటినుండియు నప్పు పెరుఁగుచునే యున్నది. నేఁటికిదే మొదటి 'వాయిదా' సొమ్ము చెల్లింపఁగలిగితిని. శేషము రెండుమూఁడు 'వాయిదా'లలో నేనే తీర్చెదను. నేను దీర్పలేకపోయినచో నాతరువాతివారు తీర్చెదరు. మీసొమ్మునకు భంగమురాదు.-"

ఇందులకు శ్రీ మహారాజుగారు ప్రత్యుత్తర మిచ్చుచు నిటులు చెప్పిరి.

— శ్రీ మహారాజాగారి ప్రత్యుత్తరము. —

"సభాధ్యక్షా ! సభ్యులారా !!

శ్రీయుత జయంతి రామయ్య పంతులుగారు నన్నుగుఱించి విశేషమైన వాత్సల్యాతిశయములతో వాక్రుచ్చిన వాక్యములకై వారికి నాకృతజ్ఞతాపూర్వక నమస్కృతులు. నేనీస్తుతికిఁ బాత్రుఁడను గానని నవిన

యము గ విన్నవించుచున్నాను. ఆంధ్రభాషాభిలాష నాకొకింత కలదని యొప్పుకొనక తప్పదు. కాని మాతృభాషాభిలాష యున్నంత మాత్రమున నది యొక విశేషముగఁ జెప్పనొప్పదు. మఱియు నీయభిరుచి మాకు వంశపరంపరగా వచ్చుచున్న దగుటచే నిందులో వింత యావంతయు లేదు.

ప్రాపంచికవ్యావహారికవిషయ మైన విచారమునుండి యించుక సేపైన మనస్సును దొలఁగించి చదువరుల నమందానందకందళితహృదయారవిందులఁ జేయుచు, మానవస్వభావము మొదలైన విషయముల ను వ్యక్తపఱచుచు, నుపనిషత్తు లాదిగాఁ గల యుత్తమ వేదాంతగ్రంథములందలి సత్యముల విశదీకరించు పుస్తకము లనేకములు మన తెలుఁగునఁగలవు. ఇట్టి సద్గ్రంథముల పఠన మకుంఠితముగ జరుగుటకై సమగ్రమైన నిఘంటు వుండుట యవసర మని తోఁచినది. ఇందులకై దైవదత్తమైన ద్రవ్యము నొకింత వ్యయపఱచుట భావ్యముగాఁ దలంచి యాలాగునఁ గావించుచున్నాను. అత్యంతాదరమున నవలోకించు నుదారస్వభావులకు గొప్పకార్యముగాఁ దోఁచవచ్చును గావునఁ బరమపూజ్యులైన మజ్జనకులనాఁటినుండి నేటివఱకు మాయందు మిత్రత్వముతో మెలఁగుచుండిన మా రామయ్యగారికి నేఁజేయునది గోరంత యైనఁ గొండంతగాఁ దోఁచుటసహజమే గదా?

నే నెంత వల దని విన్నవించినను వినక యీ యుద్గ్రంథమునకు నాపేరు పెట్టి, నాకు గొప్పగౌరవమును గలిగించిరి. నా యెడల నిట్టి యాదరముఁ జూపిన యాంధ్రసాహిత్యపరిషత్తువారికి నాకృతజ్ఞతా పూర్వక నమస్కార సహస్రము లర్పించుచున్నాను.

శ్రీ రామయ్యగారు చిరకాలమునుండి యీ గ్రంథమునకుఁ బ్రధాన సంపాదకులుగా నున్నారు. మనమార్గములను మఱవక యితరదేశభాషారీతులుగూడ బాగుగఁ బరిశీలించి నిఘంటునిర్మాణపద్ధతులు నిర్ధారించియున్నారు. కడుంగడువృద్ధులును, అనారోగ్యవంతులు నయ్యు, వీ రీవిషయమున విశేషముగ శ్రమపడుట శ్లాఘనీయమైన యంశము. దీనికై వీరు వేతన మిసుమంతయైనఁ గైకొనుట లేదు. ఈపగిదిని భాషాసే

వ చేయుచున్న వీరు, నాయొక్కయు సాహిత్యపరిషత్తుయొక్కయు నాంధ్రలోకముయొక్కయుఁ గృతజ్ఞతకుఁ బాత్రు లగుచున్నారు. వీరి, కీశ్వరుఁ డాయురారోగ్యైశ్వర్యము లొసంగుఁ గాత !

ఈ నిఘంటురచనా కార్యనిర్వహణమునకు, ఆంధ్రలోకవిఖ్యాతులైన యుద్దండపండితుల సాహాయ్యభాగ్యము మాకు లభించుచున్నది. ఇది యమూల్యమైన సంగతి యగుటకు సందియము లేదు.

ఈ కార్య మారంభించి విశేషకాల మైనదనియు విలంబ మైనదనియుఁ, గొంద ఱందురుగాక; కాని, యీనిఘంటు నిర్మాణము దుర్ఘటమైనకార్యము. తేలికగాఁ దేలునది కాదు. ఇది సాధ్యమైనంతవఱకు సమగ్రముగను నిర్దుష్టముగను, నుండుట మాయుద్దేశము; కావున నాలస్యమనివార్యమైనది. మాయుద్యమమునందలికష్టమును దయార్ద్రదృష్టితోఁ దిలకించి, మమ్ము మన్నింపవలయునని మనవి చేయుచున్నాను.

ఇపు డీమొదటిసంపుటము సంపూర్ణమైనది. మిగిలిన భాగములు కొలఁదికాలములోనే వెలువడఁగల వని నమ్ముచున్నాము. దైవము మా యత్నమునకుఁ దోడుపడుఁ గాత !"

— అధ్యక్షులు. —

శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యగారు ప్రప్రథమమున నుపన్యసించుచు సంస్కృతాంధ్రములయం దాఱితేరిన పండితవంశమునకుఁ దాము చేరినవారగుటచేత, నుద్దండులగు పండితు లనేకు లలంకరించిన నాఁటిసభయందుఁ దమకును స్థానముండవచ్చునని తమ మనస్సును తాముసంతృప్తిచేసికొంటిమనిరి. తెలుఁగు పండితులలో నగ్రగణ్యులలో నొకరైన స్వర్గీయ, వేదము వేంకటరాయశాస్త్రిలవారీ నిఘంటునిర్మాణ విషయములో నాదియందుఁ గొంత సంబంధము కలిగియుండి రనియు, నుభయభాషల యందును వారికిఁగల ప్రజ్ఞావిశేషము లనుపమానము లనియు, మద్రాసు క్రైస్తవ కళాశాలయందు వారియొద్దశిష్యులుగ విద్యనభ్యసించు భాగ్యము తమకబ్బెననియు శాస్త్రులవారు జీవమున్న నిఘంటువేయుని చెప్పఁదగుననియు, వారితరువాత సంస్కృతభాషయం దంతటి ప్రతిభగలవా రిప్పటిలో శ్రీ కుప్పుస్వామిశాస్త్రిగా రనియును, వేంకటరాయశాస్త్రులువారు రచియిం

చిన యాంధ్రగ్రంథములు జగత్ప్రసిద్ధములే ననియుఁ బల్కిరి. తెలుఁగుభాషయందు తమకంతటి యభినివేశము లేకున్నను, ఆభాషయెడలఁ దమకుండు శ్రద్ధ యత్యంతమైన దగుటచేతను, మీఁదుమిక్కిలి శ్రీ పీఠికాపురాధీశ్వరులను భాషాపోషకులుగను, మహోదారులుగను, తామెఱింగి యుండుటచేతను నాఁటిసభ కధ్యక్షత వహించుట కంగీకరించితి మనిరి.

శ్రీనాథాది మహాకవులు రాజపోషణముననే వర్ధిల్లిరి. తెలుఁగులో ననేకమైన యుత్తమ కృతులు ప్రభువులకంకిత మొనర్పఁబడి, ప్రభువుల యాదరణచే లోకమున వెలసియున్నవి. అట్టిరాజకుటుంబమునకుఁ జెందినవారు పీఠికాపురాధీశ్వరులు. రాజులు, జమీందారులు మొదలైన పాలక జాతులు గాని, తదితర శ్రీమంతులు గాని తమతమ ధనము నిట్టి సదుద్యమములకుఁ, బ్రజాసేవకు వినియోగించునంతవఱకే వారి ధనసంపదలును సార్థకము లగును. శ్రీ పిఠాపురము మహారాజులవారెన్నెన్నో దానధర్మములను గావించుచున్నారు. కాని లోకమున కవి యంతగా వెల్లడియగుట లేదు. శ్రీవారిది గుప్తదానము. నేఁటికిని 'దశరా' యుత్సవములయందు నేఁడేఁట వారు పండితసత్కారము కావింతు రని విందుము. ఇట్టి విద్వత్సన్మానములవలననే పూర్వపు రాజు లెల్లరు వాఙ్మయపోషణము కావించిరి. వివిధ శాఖలయందును బ్రజాస్వామ్య సూత్రములకు ప్రాబల్యమేర్పడుటచేతను, తదితర బలవత్తర కారణములచేతను వర్తమానకాలమునం దట్టిస్థితి మాఱిపోయినది. రాజులు, శ్రీమంతులును, మొదలైనవారు తమ ద్రవ్యము నిట్టి సత్కార్యములకు వినియోగింపకుందురేని తమ స్వప్రయోజనములకు ముప్పువాటిల్లునను విషయమును మఱవరాదు. ఇంగ్లండు మొదలైన దేశములలోఁ బ్రభువులు, ధనాఢ్యులుఁ బ్రజోపయోగకరములయిన కార్యములకుఁ దమ ద్రవ్యమును వినియోగించుట విధ్యుక్త ధర్మముగాఁ బరిగణింతురు. ఈసందర్భములో పిఠాపురముమహారాజావా రాదర్శప్రాయు లనుట నిస్సంశయము. "దశరా" యుత్సవాదికములందు, పండితపోషణము, విద్వత్సభలు మొదలైనవానిని నిర్వహించి, ఇతరరాష్ట్రములందలి ప్రభుసత్తములు, శ్రీమంతులు, తదితరులును సార్థ

స్వతకళాసేవను జేయుదురు గాక యని కోరుచున్నాను. అట్లు జరుగని చోఁ బ్రభుత్వము లెన్ని మార్పులకు లోనైనను గాని ప్రయోజన మంతగా నుండఁబోదు. సారస్వతము, కళలు, పరిశ్రమలు మొదలయినవాని యందు ప్రజాశయముల నెంతవఱకు నెఱవేర్చునో యంతవఱకే ప్రభుత్వము దేశాభ్యుదయకారక మగును. ఈరాష్ట్రమందున్న తక్కిన జమీందారులెల్లరును, పిఠాపురాధీశ్వరుల యాదర్శము ననుసరింతు రని యాశించుచున్నాను" అనిరి.

సర్ వేపా రామేశం పంతులుగారు-వీరు మాటలాడుచు 1911 సం॥ లో నాంధ్రసాహిత్యపరిషత్సభ మదరాసులో నెలకొల్పఁబడుటయు, నప్పటిలోఁ దామాసభకు, కోశాధిపతులుగానుండుటయు నాదిగ నీవలివృత్తాంతమును సంగ్రహముగ నెఱుకపఱిచిరి. పరిషత్తువారు, అతి ప్రయాసతోఁ బ్రకటింపఁ జాలిన యీయాంధ్ర నిఘంటువు కేవలము తెలుఁగువారలకే గాక సంస్కృతభాషావేత్తలందఱకును బ్రయోజనకారియగుట నిర్వివాదమనిరి. అందుల కుదాహరణములను గొన్నింటిని చూపిరి. ఒక్కొక్క పదమునకుఁగల వివిధ ప్రయోగములును, వానియర్థభేదము లెల్ల సప్రమాణముగ నీనిఘంటువునందు సేకరింపఁబడిన వనియు నీనిఘంటువును రచించుటకై సర్వభారము తలపై నిడుకొని యనల్పమైన భాషాసేవ చేసిన శ్రీ జయంతి రామయ్య పంతులుగారు కేవలము పండితు లగుటయే గాక భాషా తత్త్వవిశారదు లగుటయుఁ, బరిశోధకు లగుటయును, ఆంధ్రుల భాగ్య మనియుఁ, గడచిన యెనిమిది శతాబ్దములనుండి యాంధ్రభాష యేయేపరిణామములకు లోనయ్యెనో శ్రీ రామయ్య పంతులుగారు తఱచి, పరిశీలించినవా రనియు, నట్టివారి కార్యమునకుఁ గడంగుటయు, శ్రీ పిఠాపురము మహారాజావారి సంస్థకుఁ బోషకులుగ నుండుటయును నాంధ్రభాష కదృష్టమనియుఁ బల్కిరి.

శ్రీమతి బెంగుళూరు నాగరత్నముగారు సందర్భోచితముగ నిఘంటుకావ్య నిర్మాణమును గూర్చియు, పిఠాపురము మహారాజులవారు కృతి నందుటను గుఱించియు సహజవాక్చమత్కృతి మెఱయునట్లుగా మాటలాడిరి. నిఘంటుపుత్రిక దీర్ఘసుమంగళి యగుఁగాక యని యాశీర్వదించిరి.

కృతిభర్తయగు మహారాజులవారిని సూర్యునితోఁ బోల్చి, వారి దాతృత్వ మును, సాహసౌదార్యములను సంస్తుతించిరి.

— ఉపసంహారవాక్యములు. —

శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యగారు కడపట మరల నాంగ్లమునసే యుపన్యసించుచు, నిఘంటు రచన సులభముగా నిర్వహింపఁజాలిన కా ర్యము కాదనిరి.

భాష, వాఙ్మయము నెల్లప్పుడును వృద్ధియగుచు, వికాసమునందు చు, నుండునేగాని యొకస్థితిలోనే నిలిచిపోవు. భాషయొక్క సంప్రదాయ మును, ప్రామాణ్యములను భేదించి, భాషను నీచస్థితికిఁ దెచ్చుటకుఁ బ్రయ త్నించువారు కొందఱుందురు. భాషావికసనమునకుఁ బ్రతిబంధకము కలుగఁజేయు పూర్వాచారప్రియులు కొందఱుందురు. ఈ యుభయుల మధ్యమునను రెండతివాదములకుఁ జెందని మితవాద మార్గమును నిఘం టుకర్త లవలంబింపవలసియుండును. భాషయొక్క యభివృద్ధి నరికట్ట నెవ్వ రితరము కా దనిరి. తెలుఁగునకును, సంస్కృతమునకును వైరుధ్య మెన్నఁ డుగానియేర్పడియుండుట లేదు. సంస్కృతాంధ్రముల కవినాభావసంబంధ మేర్పడియున్నది. అంతయేల? మొన్న మొన్నటివఱకు సంస్కృతభాషాభి జ్ఞతలేనివార లాంధ్రభాషయందు పండితు లనిపించుకొనఁజాల కుండిరి. మాతృభాష తక్కఁ దదితరభాష నభ్యసించి, యా భాషా సంప్రదాయ మును స్వభాషయం దలవఱచుకొనినచో నయ్యది పరభాషకు దాసుల గుట యనెడి వాదము తెలుఁగువారి కెన్నఁడు గాని నచ్చలేదు. ఆంగ్ల భాష తన వ్యక్తిత్వమును బాపుకొనకుండఁగనే, తదితర ఐరోపియను భాషలలో ననేకపదములను దనలో నిముడ్చుకొనఁ జాలినది. ఆపరిణా మము భాషకు సహజమె.

సమగ్రమగు భాషానిఘంటువును రచియించుట సామాన్య విష యము కాదు. భాషా తత్త్వమును, భాషాసంప్రదాయమును, భాషయొ క్క జాతీయతను, విశిష్టగుణములనెల్ల నెఱింగియున్నవారే యీకార్యము నకు సమర్థులు. వాడుకలోనికివచ్చిన యాధునికమైన పదములను, ఈని ఘంటువులోఁ జేర్చుటెంత యావశ్యకమో ప్రస్తుతము వాడుకలో లేన

ప్పటికిని నొకప్పుడు ప్రయోగింపఁబడుచుండెడి పదములనిందు చేర్చుట యు నంతటి యావశ్యకమే. వానివలన భాషాచరిత్ర తెలియఁగలదు. భాష యనుదినము వర్ధిల్లునట్టిది. ఈవిషయము పట్ల తెలుఁగుభాష మఱి యేభాషకుఁ గాని తీసిపోదు.

నిఘంటువు త్వరగా రచింపఁబడకపోయెనే యనెడి భావము కొందఱకుండవచ్చును. ఇంతటి మహోత్కృష్టగ్రంథ మొక్కనాఁటిలో నయ్యెడిది గాదు.

ఆక్సుఫర్డు నిఘంటువును రచించుటకెందఱు సమర్థుల సాయముతో, నెంతటి ధనసౌకర్యములతో ప్రొఫసర్ మర్రెప్రభృతు లెంతకాలము కష్టించిరో యందఱకుఁ దెలిసినవిషయమే. కావున- నిట్టిపనులకుఁ గొంత కాలవిలంబనము సహజమే ఈవిషయమై శ్రీ జయంతి రామయ్య పంతులుగా రొనర్చిన కృషి ప్రశంసార్హము. ఉద్యోగములనుండి విరమించు కొని, పెన్షనులను బుచ్చుకొని విశ్రాంతిఁబడయువా రెల్లరు వీరిని మార్గ దర్శకులుగా గ్రహింపనగు ననిరి.

శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు:—అధ్యక్షులకు, శ్రీ మహారాజావారికి, సభ్యవర్గమునకు వందనము లర్పించుచు నాఁడే లాహోరు నుండివచ్చి కాకతాళీయన్యాయముగ, తా మీసభ కేతెంచితి మనియు, నీమహోత్సవమందు పాల్గొనుటకుఁ దమ కవకాశము కలుఁగజేసినందులకు సంతసించుచున్నార మనియును, సాహిత్యపరిషత్తు ప్రారంభము చేసిననాఁటనుండి శ్రీ జయంతి రామయ్యపంతులుగారిని తా మెఱింగియుంటి మనియు, నీనిఘంటురచనకై వారు పడుశ్రమ యంతయుఁ దమ కెఱుకయేయనియుఁ బల్కిరి.

"దైవదత్తమైన ద్రవ్యమును ఇందులకై కొంతవ్యయపఱుప నెంచితి" మని శ్రీ మహారాజుగా రనిరి. ద్రవ్యము వ్యయముచేయు టందఱకును సాధ్యమే. దైవదత్తమైన బుద్ధిని వినియోగించుటమాత్రము చాల గొప్పవిషయము. కావున నింతటి మహోత్కృష్టకార్యమునకుఁ బూని కొనినందులకు పిఠాపురము మహారాజుగారికి మనమందఱమును ఋణపడియున్నాము. వారొనర్చుచున్న సత్కార్యములనన్నింటిని, ఆంధ్రులందఱుఁ

గని, విని, యానందించుచు నేయున్నారు. నిఘంటు వనతికాలములో ముగి యలేదని యాంధ్రదేశములోని పండితులు కొందఱు శేయుం బవళ్లు నెప ములెన్నుట నేను విని యున్నాను. ఇంతటి గొప్పకార్యమును నిర్వహించు నప్పుడు, ఆకార్యమును సమర్థించుటయందలి కష్టము నిర్వాహకులకు మాత్రమే తెలియునుగాని యన్యు లంతసులభముగాఁ దెలిసికొనఁజాలరు.

వర్తమానకాలము పరివర్తనయుగము. భాష యొకస్థితిలో నిలుచు నట్టిదిగాదు. అట్టిస్థితిలో, కాలానుగుణమైన మార్పులను గమనించి యిట్టి యుద్గ్రంథ రచనకుఁ బూనుకొనవలెను. శ్రీ పిఠాపురము మహారాజుగా రట్టి యుత్తమకార్యమునకుఁ బూనుకొనియున్నారు. కావున నాంధ్రదేశ మంతటిపక్షమునను వారికి వందనము లర్పించుచున్నాను.

శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యగారు తమ ప్రతిభా సంపదచే నేమి, దా నధర్మములచే నేమి యాంధ్రుల కీర్తిని వెలయింపఁజేసినవారు, నేఁటిసభకధ్య క్షత వహించినందులకు వారికిని, సభ్యవర్గమునకును వందనములు" అనిరి.

—పండితులపద్యములు—

శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రులుగారు రచించిన పద్యములు.

—: శ్రీ మహారాజావారినిగూర్చి :—

శ్లో. శ్రీరావు గంగాధరరామరాయ
మంగాంబికాగర్భసముద్భవోఽయమ్;
శ్రీ సూర్యరాయః సహ పుత్రపౌత్రైః
శతాయురారోగ్యసుఖాని విన్ద్యాత్.

గీ. ఆంధ్రసాహిత్యపరిషదధ్యక్ష, పీఠ
పురమహారాజ! సూర్యరాడ్వరగుణాఢ్య
నీదుభాషాభిమానంబు నిజము దెలుప,
గాఢగూఢాంధ్రపాండిత్య ఘనతగాదె.

గీ. సంస్కృత ప్రసృతపాండిత్యశాలి వీవు;
ఆంధ్రభారతమన్న నీకమృతరసము
నైషధౌషధసేవ నీనాల్కగోరు,
కృష్ణరాయప్రబంధంబు ప్రియము నీకు.

గీ. కవిచరిత్త్రంబు కృతినందు ఘనుఁడ వీవు,
రామయాఖ్యుఁడుఁ బండితుల్ రచనసేయు
సూర్యరాయనిఘంటువు సూర్యరాయ,
స్వీకరింపుము పండితాశీస్సుతోడ.

గీ. నీవు పెట్టిన భిక్షయే నిపుణరచన,
శ్రీసరస్వతి దేవతా శ్రీప్రసాద
మయ్యె రుచిమూడు సరసపదార్థయుతము,
సూర్యరాయ నిఘంటువు సూర్యరాయ!

గీ. ఈప్రసాదంబు నెల్లరు నీప్రసాద
మున భుజింతురు పరిపూర్ణమోద మొంది
యవని నాంధ్రాక్షరం బున్నయంతదనుక,
ధాతృచైత్త్రంబు సితచతుర్దశియె మొదలు.

—: లోకమునుగూర్చి :—

చ. ఉచితపదార్థదాతలము నుత్తమకోశవిశేషసాధన
ప్రచితయశోవిశాలులము ప్రాజ్ఞజనోద్ధృతభావగర్భవాక్
ఖచితమహాప్రబంధులము గావున రాజులు మేము నొక్కకై
రచనముచేసి తెచ్చితిమి రాజనిఘంటువు రండు గైకొనన్.

— దైవప్రార్థనము. —

శతావధాని, ఓలేటి వేంకటరామశాస్త్రులుగారు.

ఉ. ఆదియు నంతమున్ దెలియనట్టి మహాద్భుతశక్తి వేదశా
స్త్రాదినిరూపణంబులకు నందనిరూపగుణక్రియాప్రభా
వాదులనొప్పు తేజము, మహామహిమాఢ్యము నిర్వికల్పని
ర్భేదనిరంజనాత్మకము విశ్వమయంబు భజింతునాత్మలోన్.

శా. శ్రీకల్యాణగుణాకరుం డయి జగత్క్షేమక్రియోద్యత్కృపా
లోకుండై నిజభక్తరక్షణసుశీలుండై యమేయ ప్రభా
వైకావాసముగా నుతింపఁబడు విశ్వేశుండు వాత్సల్యల
క్ష్మీకల్యం బగు చూడ్కిఁగన్గొనుచు, నెమ్మిన్ మిమ్ము రక్షించుతన్.

గీ. ఆర్యలోకమునకు, నధ్యక్షునకు, మహా
రాజునకుఁ గుమారరత్నములకు
నఖిలసభ్యజనుల కాపరమేశ్వరుం
డీప్సితంబు లిచ్చి యేలుఁగాత.

— కవిశేఖర, వడ్డాది సుబ్బారాయఁడుగారు. —

సీ. బ్రాహ్మణు లింట సంభాషించు తెలుఁగు గ్రా
మ్యంబు నాఁ జన' దని యనెద రొకరు
'బాఁపల యింటిలోపలఁ దూఱినంతఁ గు
క్కనుగో వనం జన' దనెద రొకరు;
'స్వచ్ఛమౌభాష నభ్యాసం బొనర్చుట
మనపిల్లలకుఁ గష్ట' మనెద రొకరు;
'శ్రమ మటంచును బ్రాలు సలిపి వండక వడ్లు
తినరు మానవు' లంచు ననెద రొకరు

బడుల నెట్లొ వచ్చి పడె బల్మి గ్రామ్య; సా
హిత్యసమితి వాని కెడపె దాని;
గిడుగు రామమూర్తి నుడుగు నిల్వకపోయె;
నొగిఁ జయంతి రామయోక్తి గెల్చె.

ఉ. శ్రీనరసింహకృష్ణనృపశేఖరుఁ డేలెడునాళ్ల నుండి కా
సీనసమాను భోజనిభునిన్ సభ నవ్విభుఁ జూడఁగన్నవ
ర్ణానను లెంతధన్యులొ యటన్ వగ మాకిట మానె నిన్గనన్;
మానిత రావు వేంకటకుమారమహీపతిసూర్యరాట్ప్రభూ.

సీ. గ్రామ్యసంపర్కదౌర్భాగ్య మాంధ్రమునకు
బడులఁ జేకుఱ నిష్టపడని సుమతి,
రాజమహేంద్రమున విభ్రాజితసౌధంబు
గట్టించి బడి కిచ్చినట్టి దాత,
కాకినాడను బీఠికాపురంబునఁ దన
కాలేజిహైస్కూలు గలవలంతి,

యువబిడ్డలకు విద్యాబుద్ధు లబ్బఁగా
శరణాలయం బిడ్డ సదయహృదయుఁ
డాంధ్రసాహిత్యపరిషదధ్యక్షుఁ డాంధ్ర
కోశరచనాదికప్రేరకుండు రావు
వేంకటకుమార మహిపసూర్యాంకుఁ డెల్లు
కృష్ణరాయప్రశంస స్ఫురింపకుండు !

— శర్మా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. —

క. చిరకాలవాంఛితం బిది,
నెఱవేఱెను నేఁటి కనుచు నిర్భరహర్ష
స్ఫారితమతు లైరి ప్రాజ్ఞులు
వరివస్యిత యయ్యె నాంధ్రవాగ్దేవతయున్.

శా. సూర్యారాయధరాధినాయకయశస్సూర్యారవారంభమై
సూర్యాబ్జగ్రహతారకానికరవిస్ఫూర్తిన్ జిరస్థాయియై
సూర్యానందదమై కవ్యర్థులకు నెచ్చోఁ గల్పకక్ష్మాజమై
సూర్యారాయనిఘంటు వాంధ్రజగతిన్ శోభిల్లెడుం గావుతన్.

క. జ్ఞానవయోవృద్ధుఁడు వి
ద్యానుతుఁడు "జయంతి రామ"యామాత్యవను
ధ్యానంబునఁ "బరిషత్తి" ది
ప్రాని యుత్తోధికయశంబు పొందును గాతన్.

— పురాణము సూర్యనారాయణతీర్థులుగారు. —

అ ప్ప గిం త లు.

సీ. వావిళ్ల వేంకటేశ్వరప్రయత్నాస్య
కారత్నజనికిఁ దాఁ బ్రేరకుండు,
అపరవిశ్వామిత్రుఁ డైన యీతీర్థ తే
బిడ్డపుట్టున కాదిబీజపత్ర,
గీ. నాగిరత్నాఖ్య మేసక యేముగుఁ
గొమిరెకుఁ బేర్కొసి కొన్నతల్లి,

గోటేటి కనకరాజాటోప మది యేకు
మారి వెల్వడఁజేయు మంత్రసాని

తే. గీ. కడఁగి రామయ్యపంతులు లకా కణ్వమౌని
దేనిఁ బెంచుచు వృద్ధిఁ బొందించు నట్టి
యాంధ్రపరిషచ్ఛకుంతల యనెడి కన్య
తనర మనుఁగాత యాచంద్రతారకమ్ము.

తే. గీ. రాధికాసాంత్వనపు మంచిప్రతియె యాది
బీజమై ముద్రణమ్మె గర్భీకృత మయి,
పెద్దగాలంబు లోలోనఁ బెరిఁగి పెరిఁగి
యాంధ్రపరిషత్తు మారియై యవతరించె.

ఉ. మేము నిదానమై గుణసమృద్ధికిఁ బట్టగు నిట్టిపట్టి శ్రీ
రామయపంతులింద్రుని కరమ్మునఁబడ్డది గాన నెట్టులో
ప్రేమను బెంచు చెంతయును బెద్దగఁ జేయుముఁ గీర్తిఁ దెచ్చినాఁ
డామహనీయు నింకను శతాయుకుపేతుని జేయు మంబరో!

గీతమాలిక.

అల శకుంతల మున్ను దుష్యంతవిభుని
దయకు భాజన మయి సర్వదముఁడైన
భరతుని గని; తనుఁ బుత్రికరణిఁ బెంచు
జనకుచేతను దగుకీర్తి సంస్కృతుఁ డయి
పరఁగువానిని సభలోన భర్తచేతి
కప్పగించినయట్టులే యట్టిద యగు
నాంధ్రసాహిత్యపరిషత్సమాఖ్యసతియు
నట్టివాఁడైన సూర్యరాయక్షితీంద్రు
దయకు భాజన మయి సర్వదమన మగు ని
ఘంటు వను పుత్త్రుఁ దాతసంస్కరణ గన్న
వాని గొనివచ్చి సభలోన భర్తచేతి
కప్పగించెను విద్వత్సమక్షమందు,

* * * *

శ్రీపిఠాపురరాజ్యలక్ష్మివిభుండు
దానకర్ణుండు నిత్యసత్యవ్రతుండు
దీనవత్సలుఁ డఖిలాంధ్రమాననీయుఁ
డాంధ్రభోజుండు వేదశాస్త్రాశ్రయుండు
వినుతసదయుండు సతతపవిత్రహృదయుఁ
దర్థికల్పుండు సూర్యరాయప్రభుండు
ప్రథితసత్కీర్తి శుద్ధసత్త్వగుణమూర్తి
యాయురారోగ్యములు గల్గి యలరుఁగాత
మంచు దీవించు నీతీర్థు లనుదినమును. *

---

# భక్తిప్రబోధిని.

—ః భక్తిప్రచారమును జేయు మాసపత్రిక. ః—

భగవాన్ శ్రీ రామకృష్ణపరమహంస, శ్రీ మద్వివేకానంద, రామతీర్థ, శ్రీహరనాథ్‌ఠాకూర్, శ్రీ చైతన్యమహాప్రభువు మొదలగు వారు బోధించిన భక్తివిశేషములను తెల్పుచుండుటయే దీని ప్రత్యేక లక్షణము.

☛ కడచిన నాలుగు వత్సరములనుండి ప్రచురింపఁబడుచున్నది.
సం॥ చందా॥ పోస్టేజితో రు 1—0—0.

శ్రీరామకృష్ణ పూజామందిరము,
కొత్తపేట, గుంటూరు.

---

*ఇది యాంధ్రపత్రికలోఁ దొలుతఁ బ్రకటింపఁబడినది.

# సంధి.

(ఆంధ్రభాషాసంధినియమముల చారిత్రకపరిశీలనము) మదరాసు విశ్వవిద్యాలయప్రాచ్యపరిశోధనాశాఖయం దాంధ్రప్రధానోపన్యాసకు లగు బ్రహ్మశ్రీ కోరాడ రామకృష్ణయ్య ఎం.ఏ. గారిచే రచియింపఁబడి విశ్వవిద్యాలయమువారిచే నాంధ్రశాఖయం దైదవగ్రంథముగఁ బ్రకటింపఁబడినది. (వెల రు. 1-8-0) గ్రంథరచయిత లగు రామకృష్ణయ్యగారు సుప్రసిద్ధభాషాశాస్త్రపరిశోధకులు. భాషాశాస్త్రసంబంధములగు పెక్కు వ్యాసములఁ బత్రికలయందు వ్రాసి యున్నారు. విశ్వవిద్యాలయమున నిటీవల ద్రావిడభాషాశాస్త్రమును (Dravidian Philology)నొక్క గ్రంథమును వీరు ప్రకటించియున్నారు. భాషాశాస్త్రపరిశోధన మనునది వాఙ్మయప్రపంచమున నూతనవిషయము. పాశ్చాత్యపండితులు సంస్కృతభాష నభ్యసించుచు దానిని దమభాషలతోడను లాటిను, గ్రీకు, మున్నగుభాషలతోడను బోల్చి యందలివిశేషముల గ్రహించి యీశాస్త్రవిషయములఁ జర్చించుచున్నారు. ఇంకను బెక్కువిషయములు వివాదగ్రస్తములైయున్నవి. ఆంధ్రభాష సంస్కృతప్రాకృతభాషలలోని పదములఁ గైకొనినను, ఆయాభాషలతో జన్యజనకసంబంధము లేని దనియు, ద్రావిడభాషలగు తమిళ, కన్నడ, మళయాళములతో సాజాత్యము కలిగి ద్రావిడభాషాకుటుంబమునకుఁ జెందిన దనియు భాషాపరిశోధకులు మనకు నిర్ధారణమొనర్చి యున్నారు. అందు ముఖ్యముగ, కాల్డ్వెల్ మొదలగు భాషాశాస్త్రజ్ఞు లేర్పఱచిన మార్గముల నేఁటిపరిశోధకులు భాషాశాస్త్రవిషయములఁ జర్చించుచు నాంధ్రమున కితరద్రావిడభాషలతోడ నెట్టిసంబంధము గలదో నిర్ణయ మొనర్ప యత్నించుచున్నారు. అందుల కాంధ్రు లందఱుఁ గృతజ్ఞులై వీరిపరిశోధనాఫలితములను గ్రహింపవలసి యున్నది.

సంధిస్వరూపము, లోపాగమాదేశములు, అత్వ, ఇత్వ, ఉత్వసంధుల లక్షణములు మున్నగునవి యీగ్రంథమున నూతనదృక్పథము ననుసరించి వివరింపఁబడినవి. కాని యిందు నిర్ణయమొనర్పఁబడిన విషయ

ములు సర్వజనాంగీకారముం బడయఁజాలవు. ‘వ్యాక్రియంతే వివిచ్య ప్రదర్శ్యంతే అనేన శబ్దాః ఇతి వ్యాకరణ’మ్మని పెద్దలువచింతురు. అట్టియుద్దేశముతో రచింపఁబడినవ్యాకరణములు వేఱు. భాషాశాస్త్రపరిశోధనావిషయములఁ దెలుపు గ్రంథములు వేఱు. వానికిఁ బరస్పరసంబంధము కలదు గాని వానిమార్గములుఁ బద్ధతులు భిన్నములు. ఈవిషయమును గ్రంథకర్తలు గుర్తెఱింగినచో గ్రంథమునందుఁ బ్రాచీనవైయాకరణనిరసనప్రధానము లగు వాక్యముల వ్రాసియుండరు. వివిధభాషలఁ బరిశోధించి వానితారతమ్యముల గ్రహియించి యందలి సామ్యభేదముల నేర్పఱుప యత్నించుట యాధునికప్రయత్నము. అట్టిపద్ధతులు తొల్కాప్పియము, శబ్దమణిదర్పణానుశాసనములు, చింతామణి, బాలవ్యాకరణము మున్నగు గ్రంథములఁ గానరావు. వీరి పరిశోధనలవలన వ్యాకరణసూత్రములు మాఱనేరవు. ఆయాసూత్రముల వివరింపఁబడిన విధానముల యుద్దేశమును మాత్రమే స్పష్టపఱచును. ‘కలన్వాపుల నువర్ణంబునకుఙ్గు’ అను బాలవ్యాకరణసూత్రముపై వీరివిమర్శనమును జూతుఁడు. ద్రావిడభాషాసాహచర్యమున కలను, కొలను, ప్రాను మున్నగుపదములు బహువచనప్రత్యయములగు కళ్, గళ్ యనువానిలోని కకారగకారముల గ్రహించినవనియు నందువలన ‘కుఙ్’ విధానము నాంధ్రభాషా ప్రాచీనచారిత్రకచిహ్నమనియు (Historic Survival) ననవమంగీకరించినను, భాషయందు బహువచనమున కొలఁకులు, యేకవచనమునఁ గొలను కానవచ్చుటచేఁ జిన్నయసూరిగారి సూత్ర మిసుమంతయును మాఱనేరదు. ఈవిమర్శనము ‘కొలఁకులు’ అను శబ్దస్వరూప మెట్లుకలిగెనను విషయమునుమాత్రమేనిశ్చయింప యత్నించుచున్నయది.’ ‘భాషయొక్క ప్రస్తుతస్థితిని గ్రహించి వ్యాకరించి లక్షణమును లాక్షణికుఁడొకవేళఁ జెప్పినఁ జెప్పవచ్చు న’ని వీ రంగీకరించియే యున్నారు. ఎలి, గిళి, నరి యనునవి ఎలుక, చిలుక, నక్క యనువాని ప్రాచీనరూపములనియు నవి యంతరించినవనియు వీ రూహించుట ప్రమాణరహితము. (పు. 13) ఆసందర్భముననే వీరు ‘కొండఱు ప్రయోగించినను విశేషప్రచారములోనికి వచ్చిన రెండవరూపమున కనుగుణముగా తరువాతి

కాలపు వైయాకరణులచే నవి దిద్దివేయబడుటచేతనో...' అని వ్రాయు
ట వీరికాంధ్రవైయాకరణులపైఁ గలయాగ్రహమును వ్యక్తీకరించుచున్న
ది. ప్రమాణములఁ జూపక, ఎలిక, చిలిక యను ప్రయోగములు గల
వని వ్రాయఁ జెల్లదు. నేటివిమర్శకబృందముతోపాటు వీరికిని జిన్నయ
సూరిపై ననభిమానము హెచ్చు. ' మనలాక్షణికులకు నన్నయాదుల
యందును వారురచించిన భారతాదిగ్రంథములందును గలగౌరవాతిశయ
ముచే వారాకాలమునఁ బ్రయోగించినభాషయే గాని వేఱుభాష సత్కా
వ్యంబులఁ జెప్పరాదని శాసించుటంజేసి తత్ప్రయోగప్రామాణ్యమును
గుడిగట్టుచు దగిలించుకొని మనభాషకు మార్పులేదని కొందరు తలంచు
చున్నా' రని వీరువ్రాసిరి. వైయాకరణులగు అథర్వణుఁడు, కేతన, పెద్దన,
రామన, అహోబలుఁడు, అప్పకవి మున్నగువారు కవులప్రయోగముల
విమర్శించుచు, వానిసాధుత్వాసాధుత్వములవిషయమునఁ బడినపాటును
వీరు తిలకించినచో నిట్లు వ్రాసియుండరు. వైయాకరణులు ప్రయోగ
ముల దిద్దివైచినచో వారిగ్రంథముల నట్టిచర్చల కవకాశమే యుండదు.
భాషయును నియమరహితము గాదు. తమిళమున తొల్కాప్పియమ్, కన్న
డమున శబ్దమణిదర్పణము, శబ్దానుశాసనము మున్నగు ప్రాచీనవ్యాకణ
ములు గలవు. అట్టియెడఁ గవులు స్వతంత్రులై కొన్నితావుల భిన్నమా
ర్గమును గైకొనుచుందురు. ఆభిన్నమార్గమే కొంతకాల మయినపిదప
నూతననియమము నేర్పఱుపవచ్చును. ప్రాచీనాధునికతమిళభాషలను,
హొసగన్నడ హల్గన్నడములను జూచినచో నట్టిదురవస్థ యాంధ్రమున
కిఁకను వాటిల్లలేదని సంతసింపవలసియున్నది. కొన్ని ప్రయోగముల
విషయమై గ్రామ్యగ్రాంథికవాదులు భిన్నాభిప్రాయులై యున్నారు గాని
నన్నయ తిక్కనలనాఁటి భాషకును నేఁటిభాషకును భేదములు విశేష
ముగ లేవని సహృదయులు గమనింపకమానరు. వ్యాకరణములను సత్కా
వ్యప్రయోగప్రామాణ్యమును గుడిగట్టుటగ నెంచుచు విశృంఖలులమై
చరింతు మను నాధునికులకుఁ జెప్పవలసిన దేదియులేదు. (పు. 5) అట్టి
యడ్డంకులు లేనిచోఁ 'దాత్కాలిక భాషావిశేషముల సూచించు రెండు
మూఁడువ్యాకరణము లైనను బయలుదేరియుండు' నని వీరూహించుచు

న్నారు. పైనిఁ దెలిపిన యాంధ్రవ్యాకరణములు తాత్కాలికకవిప్రయోగ
విమర్శనములతోఁ గూడియున్న వని తెలిపియున్నాము. ఇంకను వ్యాక
రణములు బయలుదేఱిన మనభాషయొక్క పరిస్థితు లెట్లుండునో తెలియు
టకై సమగ్రవ్యాకరణముల రచించుకొనుటకు నాధునికయుగమునఁ నెంద
ఱు పండితు లెన్నివిధములఁ బ్రయత్నించిరో వారి ప్రయత్నఫలితము
లెట్టివో, ప్రామాణ్యము లెట్టివో వీరు గమనించినయెడ బాగుగ నుండి
యుండును.

సంధిస్వరూపము విమర్శించుచు వీరు 'పూర్వాపరాచ్చులనడుమ
నాగమాదులు వచ్చి చేరు ననుట సహజస్థితి కా దనియు నీయాగమా
దులు ... ప్రాచీనాఖండవాక్యస్వరూపమును గ్రహించి దానినిబట్టి పరిశీ
లించి తెలిసికొనవలయు ననియు' వ్రాసియున్నారు. తారిపోరివాలా
గారు (పు. 27) చెప్పినటులు భాషాశాస్త్రమునఁ బదమునుగాక వాక్య
మునే ప్రధానముగఁ గైకొనవలెనని యు, నాప్రధానవిషయమును స్మరిం
చియే వ్యాకరణశాస్త్రముల రచియింపవలె ననియు మన మంగీకరింపవ
చ్చును. కాని 'వెలయాలు, ధీరురాలు మున్నగుచోటుల యకారరేఫ
ములు సహజముగఁ బూర్వశబ్దగతములై యనుచితవిభాగమువలనఁ గాని
శబ్దస్వరూపము మాఱుటవలనఁ గాని యాగమములు గా గ్రహింపఁబ
డిన వనుట సరికాదు. తలై, మలై, యను తమిళపదములవలెనే ప్రాచీ
నాంధ్రమున విలైమున్నగునవి గల వనుట ప్రమాణరహితము. తమిళపద
ములయందలి 'ఐ' కారమే యడాగమమున కాధార మనుట యసమం
జసము. పూర్వపదస్వరూపములకు హానికలుగకుండుటయు, నర్థస్ఫురణ
ము నుచ్చారణసౌకర్యమును సంధికిఁ బ్రయోజనము లని వీరు గ్రహిం
చియున్నారు. సంస్కృతభాషయందు యణాదేశము కలదు. సుధ్యుపా
స్యః, మధ్వరిః మున్నగునవి. తమిళ, కన్నడభాషల నీయడాగమ, వడా
గమములు గల వని వీరిచ్చినయుదాహరణములే కలవుగదా. వీనినన్నియు
నఖండవాక్యములఁ గలపదములభేదించి, కాలక్రమమును శబ్దస్వరూపము
నెఱుఁగమి యాగమములుగఁ గైకొనిరనుట యుక్తియుక్తముగాదు. 'స్వరే
స్వరస్య లోపః; న నామభాగ ప్రధ్వంసే' యను కర్ణాటభాషాభూషణ

మునఁ దెలుపఁబడినటులు హరి + అతఁడు, రాముఁడా + ఎక్కడ మున్నగు స్థలముల నర్థస్ఫురణమునకై నామరూఢి చెడకుండునటులు యడాగమము కలిగిన దని తోఁపకమానదు. అర్థము చెడని తావుల వికల్పముగ మేనత్త, మేనయత్త యని ప్రయోగించుటయుఁ గలదు. ఉచ్చారణమున అ, ఇ, ఉ, అనుస్వరములకు యకారవకారములు స్వాభావికముగఁ గల్గును. సంధిలేనియపుడు యకార ముచ్చారణసౌకర్యమునకు వచ్చిచేరు నని గ్రంథకర్తగారు తాటి, మఱ్ఱిశబ్దముల సందర్భమున వ్రాసిరి. (పు. 49.) ద్రవిడభాషల యడాగమ, వడాగమములే దీని నిరూపించుచున్నవి. కొన్ని స్థలములఁ బ్రాచీనశబ్దస్వరూపమువలనఁ గలుగుటయుఁ గలదు. (పొదరిల్లు, పేదరాలు...) ఆగమములు స్వరములమధ్య చేరుట సహజము కాదనియు, భాషలో నిలిచిన 'వెలయాలు' మున్నగుశబ్దముల విడగొట్టినపుడు వాని నాగమములుగా గ్రహించి రనియు మన మంగీకరింపఁజాలము. వెలయాలు మున్నగువానిలో యడాగమసాదృశ్యముచే మాయావు, సీతయడిగెను మొద లగునవి వచ్చె నఁట ! (పు. 32). సంహితయందు, యడాగమ, వడాగమములు సహజములు. అర్థస్ఫురణమునకై సుకరముగ నుచ్చరించుటకై యేర్పడినవి. తమిళ, కన్నడములలో యకార, వకారములు గ్రహింపబడినవి. ఆంధ్రమున యకారముమాత్రమే గైకొనఁబడినది. ఉచ్చారణసౌకర్యమున కట్టివి గలుగుటగలదు. వానినే పాశ్చాత్యులు Glides అందురు.

పొదరిల్లు మొదలగువానియందు రేఫాగమ మెట్లు కలిగె నను విషయమున, పొదరు ప్రాచీనపద మనియు, పొదరు + ఇల్లు = పొదరిల్లు అయిన దనియు, కాలక్రమమున పొదరుశబ్దమునందలి రు కారము నశింపఁగా, సంధియందు రేఫాగమము గైకొనఁబడిన దనియు వీరు వ్రాసియున్నారు (పు. 23). చిన్నయసూరిగూడఁ బొదరుశబ్దము గలదని గ్రహించియేయున్నాఁడు. సంధిస్వరూపమును కేతన, పెద్దనాదులు సరిగ నిర్వచించి రనియుఁ, జిన్నయసూరి సంస్కృతవ్యాకరణభక్తిని నథర్వణుని ననుసరించి భిన్నమార్గమును ద్రొక్కె ననియు వీరువ్రాసిరి. తమిళ, కన్నడ సంధిస్వరూపమునకును, అథర్వణకారికకును భేదములేదు.

"ఆద్యంతవర్ణయో రైక్యం సన్ధి రిత్యుచ్యతే బుధైః" అని యథర్వణుఁడు. శబ్దమణిదర్పణ, తొల్కాప్పియముల నదియే గలదు. కాని యాంధ్రమునఁ బూర్వరూపసంధి లేకపోవుటచే నథర్వణుఁడు 'పూర్వస్య పరరూపత్వ మత్రైవ నియతం భవేత్' అని చెప్పియున్నాఁడు. 'ద్రుతాంతములు తప్ప హలంతములు లే వనియే చెప్పవలయును' (పు. 19). 'ఇచ్చట విశేషముగా సంధికార్య మేమియు లేదు. కావుననే ద్రుతాంతములకు సంధిలే దనుసూత్రమును బాలవ్యాకరణకారుఁడు కల్పించియున్నాఁడు.' (పు. 20). 'ప్రాయికముగా నాంధ్రభాష యజంతభాష' (పు. 18,19). పై విషయముల నంగీకరించిన గ్రంథకర్తలు చిన్నయసూరి 'పూర్వపరస్వరంబులకుఁ బరస్వరం బేకాదేశం బగుట సంధినాఁబడు' అనిన బాలవ్యాకరణసూత్రము నాక్షేపించుట వింతగా నున్నది. 'లోపాదేశాగమాది కార్యములు సంధికార్యములు కాకపోవచ్చు నను' వీరియాక్షేపము కేవలము పై సంధిస్వరూపనిర్ణయమునకే గాక కన్నడ తమిళ సంధిలక్షణములకుఁ గూడ వర్తించుచున్నది. మఱియు లోపాగమాదేశములు సంహితయందు గలుగు ననినచోఁ జిన్నయసూరి సంధినిర్వచనమున దోషముండదు. సంధి కుపాంగము లనుట దగునేమో కాని యవియే సంధి యనుటయుఁ బొసఁగదు.

మఱియుఁ జిన్నయసూరి సంస్కృతపక్షి ననుసరింపలేదు. యజంతహలంతవిభాగములనుమార్చి, తద్ధిత, ఆచ్ఛిక, కారక, సమాస, క్రియా, ప్రకీర్ణ పరిచ్ఛేదము లని కైకొని యున్నాఁడు. కన్నడవైయాకరణులపద్ధతి తెలుఁగువారిదానివలె సంస్కృతపక్షి ననుసరింపక ద్రావిడభాషాసంప్రదాయమునే యవలంబించుచున్న దని చెప్పవలసియున్నది' అని 26 వ పుటయందును, ద్రావిడభాషలలోని సంధివిధానమునకును, సంస్కృతభాషలోని సంధివిధానమునకును సంబంధ మేమాత్రమును లేన ట్లగపడుచుండుటేగాక యివి భిన్నపద్ధతుల ననుసరించి బయలుదేరినట్లుకూడ తోఁచెడిని' అని 39 వ పుటయందును గలదు. ఇట్టివాక్యములు పరస్పర విరుద్ధములు.

మూఁడవయధ్యాయమున స్వరసంధినిగూర్చి కొన్ని విషయములు చర్చింపఁబడినవి. ద్రుతతరోచ్చారణమువలన భాషయందు వర్ణలోపము గలుగు ననియు, నుచ్చారణసౌకర్యమే సంధిప్రయోజన మనియు, శబ్ద స్వరూపము నశించుట గాని యర్థస్ఫురణము కలుగకుండుట గాని యున్నచో సంధి యుండనేర దనియు వీరు గ్రహించియేయున్నారు. కవులు నిరంకుశులై గాని ఛందస్సౌకర్యమునకుఁ గానిలక్షణవిరుద్ధముగఁ బ్రయోగించుట గల దనియు నంగీకరించిరి. కాని తత్సమసంధి, క్త్వార్థకేకార సంధి మున్నగువానినిగూర్చి ముచ్చటించుచు, వ్యవహారమున సంధిగత రూపము వ్యాప్తిగాంచి యుండుటచే నొకానొకకవి తననిరంకుశత్వబలముచే పూర్వలక్షణములశాసనము నతిక్రమించి యీరూపమును శిష్టకవితలోఁ బ్రయోగింపగలిగినాఁడు' అని లిఖించియున్నారు. (పు. 43) కవు లీలక్షణవిరుద్ధప్రయోగములను గ్వాచిత్కముగ నుపయోగించియున్నారు. తత్సమసంధిం జూడుఁడు. 'గంగనుకాసె' 'చేష్టుడిగె,' 'శ్రీరంగ భర్తంచు' నివి మూఁడు నాముక్తమాల్యదయందే గలవు. కృష్ణరాయల కాలమునాఁటి మఱేగ్రంథమున నిట్టిప్రయోగములఁ గానము. భారతాదులవిషయముఁ జెప్పనేల ? మఱియు సూక్ష్మదృష్టి నరసినచో నవి లాక్షణికములే యగునేమో ? అథర్వణకారికలఁ గల 'కుత్రచి త్సంస్కృతీయోపి ప్రాణో హ్యత్ర చ్యుతో భవేత్' (సంధి-3) అనుకారిక ప్రకారము పైప్రయోగములు లాక్షణికములే. "సంధి ర్నా చో చ్యనుతః, వాఽతః" అను చింతామణిసూత్రములును బైప్రయోగముల నిరసించుటలేదు. భారతమునం దట్టిప్రయోగములు గానరాకపోవుటచేఁ దత్సమాదిసంధుల నిరసించి రని మన మనినను, అథర్వణమతము ననుసరించుటచే లక్షణవిరుద్ధము లన సాహసింపఁజాలము.

సంధి యుచ్చారణసౌకర్యమే ప్రయోజనముగాఁ గలదగుటచే, నర్థము చెడని పట్టుల భిన్నమతము లుద్భవించినవి. శ్రుతికటువుగ నుండని స్థలముల క్త్వార్థకేకారసంధిని ప్రథమమునుండియుఁ గవు లంగీకరించి నటులఁ గన్పడుచున్నది. అందుననే వైకల్పికబహుళనియమాదులు వచ్చినవి కాని యొకకాలమున నొకప్రయోగమును మఱియొకకాలమున

మఱి యొకప్రయోగము నుండుటచే నిటీవలికవులు వ్యవహారమునుండి యాయాప్రయోగములఁ గైకొని రనుట సహేతుకము గాదు: అట్లే 'ఆకు, అంత, అయ్యా, అక్క మొదలగు శబ్దములు, పరమగుచో నిత్య సంధిని కొందఱు విధించి రనిన నట్టిస్థలముల యడాగమము శ్రుతికటు వుగ నుండుటయే కారణ మని గ్రహింపవలసియున్నది. అందులకుఁ గూడ నథర్వణుని 'భవంతి కేచి చ్ఛబ్దాస్తు సాంగత్యే నైవ సాధవః' అనుసూక్తియే ప్రమాణ మగుచున్నది. కవు లేయేకాలమున నిట్టిప్రయోగముల గ్రహించిరో, యెన్నియోపర్యాయములు లక్షణము ననుసరించి రచించిన కవులు కొలఁదిస్థలముల నేల లక్షణవిరుద్ధములగు శబ్దముల వాడిరో విచారించిన వీరివ్యవహారవాద మప్రాస్తమగును.

ఏమ్యాగులసంధిని గూర్చి వ్రాయుచు నాశబ్దము లన్నియుఁ బ్రథమమున హలంతము లనియు, ఏమ్ మున్నగునవి వానిప్రాచీనరూపము లనియు, మఱి, తెలివి యనుపదముల ఇకార మసహజ మనియు, మఱు, తెలివు అనునవే వాని ప్రాచీనరూపము లనియు, మఱియేని అను యడాగమరూపము మఱి యవ్యయముగా వాడుకకు వచ్చిన తరువాత కలిగిన దనియు 58-61 పుటల వివరింపఁబడినది. తమిళ కన్నడ భాషలలో హలంతములు పెక్కులు గలవు. ఆయారూపములఁ గైకొని యాంధ్రభాషయందును ప్రాచీనరూపము లన్నియు హలంతములుగ భావించుట సరి కాదేమో ? భాష నైసర్గికముగ నజంత మగుటచేఁ దత్సమముల 'ధేనువు, మరుత్తు' అను పదముల నుకారము చేర్పఁబడినది. ఒకవేళ ప్రథమముననే యన్యభాషాపదముల హలంతములుగ నుండువానిని దమభాషాసంప్రదాయానుసార మజంతములుగ మార్చుకొని రనినను వీరివాదము నిలువదు. ప్రథమమున నాంధ్రమున నన్నియు హలంతములనుటకుఁ దగినప్రమాణమును మృగ్యము.

'కూర్చుండిరి యొండొరుం గదిసి' యను శ్రీనాథప్రయోగము నప్పకవి 'పరపురుషక్రియల ప్రకృతిభావము కలదే' యని యాక్షేపించుట సరి యనియు, నప్పకవి నందుల కధిక్షేపించు టసమంజసం బనియు వీరు వ్రాసిరి. "ప్రయోగశరణాః వైయాకరణాః" అను భావము వదలి

శాస్త్రము బలవత్తర మని గ్రహించువారల యాక్షేపములకు హద్దులే దనిరి. ఈసందర్భమున గ్రంథకర్తలు,

'ప్రథమే చోత్తమే చైవ క్రియేతో వా భవే చ్చ్యుతిః
నిత్య మన్యస్య వికృతౌ క్త్వార్థేతో న భవే త్సదా.'

అను నథర్వణకారికను స్మరించిన (సంధి-6) యప్పకవి శ్రీనాథుని నిరసించుట తగ దని యంగీకరించి యుందురు. ఒకవేళ నప్పకవి చింతామణి ప్రామాణ్యమునే యంగీకరించె నన్నను, అథర్వణమతము సరి కాదని వ్రాయవలెను గాని 'పరచించెను, శ్రీనాథుఁడు......గానక' యని వ్రాయుట, సమంజసము కాదు గదా. ఈసందర్భమున 'దనుగానక శ్రీనాథుని గానఁడనియన్నందుకు మిగులనచ్చెరువగుచున్నది' యను ద్వితింత్రిణే సీతారామకవిగారి యథర్వణకారికా వ్యాఖ్యను, 'కాకునూ ర్యప్పకవిస్తు ఏత ద్గ్రంథసంపాదనవైధుర్యేణ శ్రీనాథస్య భ్రాంతత్వ మాహ' యను నహోబలపండితుని వ్యాఖ్యానమును స్మరింపవలసియున్నది. మఱియు 'నిత్య మను త్తమపురుషక్రియాస్వితః' అను నన్నయసూత్రమున పురుషశబ్దము వలనఁ బ్రథమపురుషము వివక్షితమైన దని కొందఱును, పూర్వసూత్రము నుండి 'అనాదిషు' అను మాటల ననువర్తింపఁ జేయవలయు నని కొందఱును వ్రాయుచున్నారు. అపుడు రెండుమతము లుండకపోవుటయే గాక యప్పకవి యాక్షేపణమున కెట్టిప్రసంగమును నుండదు. ఉకారసంధిని (పు 64-86) గూర్చి వ్రాయుచు గ్రంథకర్తలు ప్రథమమున నాంధ్రభాష లో హలంతములే యుండె ననియు, ను కార ముచ్చారణసౌకర్యమునకై వచ్చిచేరిన దనియు, నిర్ధారణ మొనర్చి ఉకారసంధిని హలంతములగు పదములపై వచ్చినసంధి యని గ్రహించియున్నారు. ఆంధ్రమహాభారతము మున్నగు ప్రాచీనగ్రంథములఁ గాని యంతకుఁబూర్వమున గలశాసనాదులయందుగాని హలంతరూపములు గాన వచ్చుటలేదు. ఒండురెం డున్నవని భాష హలంతమని నిర్ధారణమొనర్పను. (పట్టణంబుల్, వారల్) మనకు శాసనములు 7, 8 శతాబ్దములనుండి దొరకినవి. అంతకుఁ బూర్వమున హలంతములు గల వని గాని కొందఱుభాషావేత్తల మతమున న్నొక్కశే ద్రావిడభాష గల దని గాని మన మూహించిన నట్టివాదము భాషాస్వా

మ్యవాదముపై మాత్రమే యాధారపడియుండును. మఱియు వీరు ప్రాం తాదులను గూర్చి వ్రాయుచుఁ బ్రాంత మున్నగు శబ్దములపై సంధి రాలే దనియు, హలంతప్రాచీనరూపములగు, పరమ్, ఎళ్, మిాం, కొరమ్, కీఱ్, వణ్, నిఱ్ నుండి ప్రాఁగెంపు మొదలగుపదములు కల్గిన వనియు, నందలి యనునాసికములు తరువాత వచ్చిన వనియు, బ్రాంతాదులపై సంధి యనుట వైయాకరణుల మాథ్య మనియు వ్రాసిరి. అటులనే యామ్రేడితములగు అందదుకులు, ఇట్టింకులు, ఇల్లిగ్గులు, చెల్లాచెదరు మున్నగుపదముల విడదీసి మొదటిపదమగు ప్రాచీన హలంతరూపమునకును రెండవపద మగు యజంతరూపమునకును సంధి యొనర్చిరి. వీరివాదమును జూడఁ బ్రాచీనకాలమున హలంతాజంతరూపములు రెండు నొకకాలముననే యున్నవనుట స్పష్టము. ప్రాఁగెంపు అని సంధికలిగినకాలమునఁ బ్రాంతశబ్దముకలదా లేదా? అట్లు భాషయందున్నచో 'పరమ్' శబ్దముకూడ నాంధ్రమునఁ గలదా ? అటు లొకవేళ నున్న దనుకొనినను ప్రాంత, క్రొత్త, చెన్ను మున్నగునవి వదలి ప్రాచీన హలంతరూపములతో సంధి నొనర్పఁ గారణ మేమి ? సంస్కృతపదంబులకుఁ గూడ డు, ము, వు, లఁ జేర్చి కైకొనిన ప్రాచీనాంధ్రులు ప్రాంతాదుల యొక్క హలంతరూపములకు సంధినొనర్చి రనిన నమ్ముటకు వీలులేకున్నది. ఈ వాదమును భాషాశాస్త్రవేత్తలు విమర్శింతురుగాక. అయిదాఱధ్యాయముల గసడదవ సరళాదేశములను, గళాద్రుతప్రకృతికవిభాగమును గూర్చియు ముచ్చటింపఁబడినది. మిగిలిన ద్రావిడభాషలలోని నియమములు సూచింపఁ బడినవి.

ద్రుతములనుగూర్చి వ్రాయుచు 'లిడ్లాటుల డుఙ్జున కెను నువర్ణంబులగు'(బాల-క్రియా-16) నను సూత్రమును విమర్శించుచు 'పోయెన్, తడవాయెన్' మున్నగురూపములు శిష్టవ్యవహారమునకు వచ్చిన వనియు నవి యంగీకరింపవలయు ననియు గ్రంథకర్తలు వ్రాసియున్నారు. కాని వీ రుదాహరించిన ప్రయోగములు మూఁడును వేంకటనాథకవి పంచతంత్రములోనివి. కేవల మొకటిరెండు ప్రయోగములపై నాధారపడి భాషాశాస్త్రనియమముల మార్చుటయుఁ బ్రాచీనశబ్దస్వరూపము నేర్పఱచు

టయు లోకవిరుద్ధము. మఱేకవియును నిట్టి ప్రయోగములను జేసినటులు గానరాదు. ఈగ్రంథమును భాషాశాస్త్రపరిశోధనల ననుసరించి నూతన దృక్పథముతోఁ బెక్కువిషయములు చర్చింపఁబడినవి. వివాదాంశములు చాలఁగలవు. పాఠకులు స విమర్శకులై క్షీరోదకన్యాయమున నందలి గుణమునే గ్రహింతురు గాక.

## తాతాచరిత్రము.

ఇది కాకినాడనివాసులు కొమాండూరి శఠకోపాచార్యులు ఎం.ఏ; బి.యల్. గారిచే రచింపఁబడినది. భారతదేశమున సుప్రసిద్ధపురుషులలోఁ బరిగణింపఁబడిన జంషడ్జీ నస్సర్వాంజీతాతాగారి జీవితచరిత్రమును సులభశైలినాంధ్రమున రచియించియీగ్రంథకర్తలాంధ్రయువకులకు మహోపకార మొనర్చియున్నారు. జీవితచరిత్రములు (Biographies) మన భాషయందు విరళముగఁ గలవు. మహాపురుషుల జీవితచరిత్రము లితిహాసమున కాధార మగుటయే గాక యట్టివాని కలయికయే యితిహాస మగుచున్న దని పాశ్చాత్యవిమర్శకు లిటీవల గ్రహించియున్నారు. అటులగుచో నిట్టి జీవితచరిత్రము లితిహాసభాగములే యనం దగి, యువకులహృదయముల నుదారభావము లుద్భవింపఁజేయుచు, వారిభావిజీవితమునకును, దేశోద్ధరణమునకును మార్గదర్శకము లగుచున్నవి. తాతాగారి నిరాడంబరజీవితము, దేశసేవయు, వ్యాపారదక్షతయు, దాతృత్వము, కార్యదీక్ష మున్నగు సద్గుణములు మనకనులకుఁ గట్టునటులుగ వారిజీవితచరిత్రము వ్రాయఁబడినది. గ్రంథకర్తలాంగ్లభాషయందు, హారిసు, వాచా, మొదలగువారు రచించిన గ్రంథముల యొక్కయు వ్యాసములయొక్కయు సారమును గ్రహించి మొదట 1921 సంవత్సరమునఁ బ్రకటించిన తమగ్రంథమును బహువిషయముల మార్చి నూతనముగఁ బ్రకటించిరి. పాశ్చాత్యులలో ఫ్రేజరు, జంకిన్సు మొదలగువారు తాతాను గూర్చి వ్రాసిన ప్రశంసావాక్యములే యాతనిఘనతను ఘోషించుచున్నవి. ఇట్టిగ్రంథములాంధ్రాభ్యుదయమునకు వికాసమును గూర్చునవుటలో నెట్టిసందియము నుండదు. వెల పదియణాలు. గ్రంథకర్తలయొద్ద దొరకును.

---

# కావ్యాత్మ.

రచయిత శ్రీమాన్ శేట్టలూరి వేంకటరాఘవఅయ్యంగారు- బెజవాడ.

ప్రకాశకులు:-ఆంధ్రగ్రంథమాల చెన్నపురి, ఇరువదియాఱవ ప్రచురణము, వెల. 2 రూపాయిలు. పుటలు 4-327.

భరతముని మొదలు పండితరాయజగన్నాథునివఱకు సంస్కృతాలంకారశాస్త్రమెట్టిపరిణామమునుం జెందినదియునుం దెలుపుటయే యిందలి ప్రధానాంశము. విశ్వజనీన మగు గీర్వాణభాషావాఙ్మయమునకు నికషోపల మనందగిన యలంకారశాస్త్రతత్త్వమును జరిత్రాత్మకముగం దెలుపుగ్రంథము లాంధ్రభాషలో లేవు. శ్రీవేంకటరాఘవయ్యంగా రిట్టి కొఱతం దీర్చినందునం బ్రశంస్యులు-

ఈగ్రంథమునకు మాతృక యాంగ్లమునంగల సుశీలకుమారసుధీగారి 'సంస్కృతాలంకారశాస్త్రచరిత్ర' ద్వితీయభాగము- గ్రంథకర్తలు పీఠికయందు పాండురంగవామనకాణే, శంకరను మొదలగు విద్వాంసు లాంగ్లమున రచియించిన గ్రంథములు పరిశీలించినట్లు వ్రాసినను పైసుశీలకుమారసుధీగారి గ్రంథమునకే యిది యనువాద మని చెప్పనొప్పును- అయినను శ్రీవేంకటరాఘవ అయ్యంగారు మూలగ్రంథాభిప్రాయానుసారముగ, నాంగ్లమురాని సంస్కృతాంధ్రపండితుల కుపయోగించునట్లుదీనిని రచియించియుంచుట శ్లాఘాపాత్రము.

శాస్త్రతత్త్వరచనమును గావింపంబూనునట్టి గ్రంథకర్తలు, కేవలానువాదములపై నాధారపడక, యనువాదములకు మూలము లగుగ్రంథపరంపరను లెస్సగం బరిశోధించి రచియించుట శాస్త్రీయవాఙ్మయాభివృద్ధికి నత్యావశ్యకము. కావ్యాత్మగ్రంథకర్త కేవలము 'డే' గారి సిద్ధాంతము లనువదించుటచే నచ్చటచ్చట ప్రమాదములు దొరలినవి. గ్రంథరచనాపథకము మనకు నూతనమైనను గ్రంథమున కాధారములగు నలంకారగ్రంథములలోని విషయములు, విమర్శనములు సిద్ధాంతములు మనకుం గ్రొత్తవిగావు. 'డే' గారి గ్రంథము ప్రకటింపంబడిననాంటినుండి, వారి సిద్ధాంతములే పెక్కుతారుమారైనవి. పరిశోధకుల కవి తెలిసినయవియే. కావున గ్రంథకర్తగారు, మూలగ్రంథములను గూడం బరిశీలించి నూతనపద్ధతులపై, నిట్టి గ్రంథము లింకను సులభశైలితో రచియించి భాషాసేవ సేయుదురుగాత !

# భాసుఁడు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఎ., బి. ఎల్. కాకినాడ.

---

7. భామహుఁడు (7 వ శతాబ్దము) తనకావ్యాలంకారమున న్యాయవిరోధమున కుదాహరణ మొసంగుచు, ప్రతిజ్ఞాయౌగంధరాయణము నందలి కథను విమర్శించియున్నాఁడు. (పరిచ్ఛేద. 4- శ్లో. 40-47)

విజిగీషు ముపన్యస్య వత్సేశం వృద్ధదర్శనమ్
తస్యైవ కృతినం పశ్చా దభ్యధా చ్చారశూన్యతామ్. 40
అంతర్యోధశతాకీర్ణం సాలంకాయననేతృకమ్-
తథావిధం గజచ్ఛద్మ నాజ్ఞాసీ త్సస్వభూగతమ్. 41
యదివోపేక్షితం తస్య సచివైః స్వార్థసిద్ధయే
అహోనుమందిమా తేషాం భక్తిర్వా నాస్తి భర్తరి. 42
శరా దృఢధనుర్ముక్తా మన్యుముద్భి రరాతిభిః
మర్మాణి పరిహృత్యాస్య పతిష్యంతీతి కానుమా. 43
హతోఽనేన మమభ్రాతా మమపుత్రః పితా మమ
మాతులో భాగినేయశ్చ రుషా సంరబ్ధచేతసః. 44

.......................................

సచేతసో వనేభస్య చర్మణా నిర్మితస్య చ
విశేషం వేద బాలోపి కష్టం కిము కథంను తత్. 47

ఇందుఁ బ్రతిజ్ఞాయౌగంధరాయణమని స్పష్టముగఁ దెలుపకున్నను, భామహుఁడు దానినే ముందిడుకొనెనని 'హతోఽనేన మమభ్రాతా' అనుశ్లోకము సూచించుచున్నది. ప్రథమాంకమున హంసుని ప్రాకృత వాక్యముల 'అణేణ మమ బాదా హదో, అణేణ మమపిదా, అణేణ మమ సుదో, మమవయస్సత్తి...' భామహుఁడు సంస్కృతీకరించెనని తోఁచుచున్నది. కొందఱు విమర్శకులు భామహుఁడు బృహత్కథను విమర్శించెను గాని ప్రతిజ్ఞాయౌగంధరాయణమును గాదని వ్రాసిరి. అది యుక్తియుక్తముకాదు. బృహత్కథాస్వరూపమే మన కుపలబ్ధము కానపుడు దానియందు 'హతోనేన...' అనునది కల దని యెట్లు విశ్వసింపఁగల

ము? అది కథాసరిత్సాగరమున లేదు. ఉపలబ్ధమగు ప్రతిజ్ఞాయౌగంధరాయణమును ద్రోసిపుచ్చి బృహత్కథయందుఁ గల దనుట వింతగనున్నది. మఱియు నలంకారగ్రంథములఁ దత్కర్తలు విమర్శనముకొఱకుఁ బ్రకటింపఁబడిన నాటకాదుల నుదాహరణముగఁగొనుట స్వాభావికము. భామహుని ప్రతిజ్ఞాయౌగంధరాయణకర్తయే యనుసరించి 'హతోఽనేన మమభ్రాతా...' యనుదానిని దననాటకమునం జేర్చికొనె ననుటకుఁ దగిన యాధారములు మృగ్యము.

8. వామనుని కావ్యాలంకార సూత్రములందు (క్రీ. శ. 8, 9 శతాబ్దములు).

'శరచ్చంద్రాంశుగౌరేణ వాతావిద్ధేన భామిని
కాశపుష్పలవే నేదం సాశ్రుపాతం ముఖం మమ'

అను స్వప్నవాసవదత్తమునందలి శ్లోకము (అంకము IV శ్లో. 7) వ్యాజోక్తి కుదాహరణముగ నొసంగఁబడినది.

'యాసాం బలి ర్భవతి మద్గృహదేహళీనాం' అను చారుదత్తశ్లోకము (అంక. I శ్లో. 2) 'యో భర్తృపిండస్యకృతే న యుధ్యేత్' అను ప్రతిజ్ఞాయౌగంధరాయణములోని శ్లోకపాదమును (అంక. IV శ్లో. 3) గూడ నుదాహరింపఁబడినవి.[1] తిరువనంతపురనాటకములలో నివి యన్నియుఁ గలవు. ఇదియే చారుదత్త, వాసవదత్త, ప్రతిజ్ఞాయౌగంధరాయణముల ప్రాచీనతను నిరూపించుచున్నది.[2] హీరానందశాస్త్రిగా రూహించినటు లివియన్నియు లోకోక్తులవంటివి గావు.[3]

9. బాణుని హర్షచరితములోని 'సూత్రధారకృతారమ్భైః' అను శ్లోకము పైని సూచింపఁబడినది. భాసునినాటకములు సూత్రధారప్రవేశానంతర మంగళశ్లోకముతోఁ బ్రారంభింపఁబడుటచే బాణుఁడు భాసనాటకముల కది ముఖ్యవిషయముగ నిరూపించియున్నాఁడు. భాసుఁ

1. నిర్ణయసాగరప్రతి పు. 57.
2. ,, పు. 60, 69.
3. 'Bhasa and the authorship of the thirteen Trivendrum plays — Memoirs *of Archaeological Survey No. 28.*

డనుకవి నాట్యశాస్త్ర మొకదానిని రచించినటుల రాఘవభట్టు వ్యాఖ్యానమునఁ గలదుగదా! భరతుని నాట్యశాస్త్రమునకు విరుద్ధముగ మఱియొకశాస్త్రమును రచించి యందులకు నిదర్శనముగ నీనాటకముల వ్రాసియుండెనా? నాట్యశాస్త్రము భాసునకుఁ దెలియ దనుట యొప్పదు. అవిమారకమున (అంక. II) 'అత్థి రామాఅణం ణామ ణట్టసత్థం-(అస్తి రామాయణంనామ నాట్యశాస్త్రం)-అని నాట్యశాస్త్రము ప్రశంసింపఁబడినది. అది పాణిని కాలమునాఁటి నటసూత్రములనుగూర్చి వ్రాయఁబడియుండ లేదు. మఱియు మిగిలిన నాటకములయందు- ప్రకరణ, విష్కంభక, మిశ్ర విష్కంభక, ప్రవేశ, ప్రస్తావనాదులు వాడఁబడినవి. పంచరాత్రమున[1] బృహన్నల ప్రాకృతమున విరాటరాజుతో సంభాషింపఁబోవ, నతఁడు 'ఊర్జితంకర్మ; సంస్కృత మభిధీయతామ్' అని పలుకును. కావున భాసునికి నాట్యశాస్త్రజ్ఞానము గల దనుట స్పష్టము.

భరతశాస్త్రవిరుద్ధముగ నూరుభంగమున దుర్యోధనుఁడును, ప్రతిమానాటకమున దశరథుఁడును, నభిషేకనాటకమున వాలియు, బాలచరితమునఁ జాణూరముష్టికకంసులును నాట్యరంగమున మృతిఁజెందుదురు. దీనివలనఁ గవి భరతునికంటెఁ బ్రాచీనుఁ డనరాదు. భరతనాట్యశాస్త్రనురోధముగ, కళ్యాణసౌగంధిక, ఆశ్చర్యచూడామణులయందు రంగమున యుద్ధము ప్రదర్శింపఁబడినది. విద్ధసాలభంజికయందు 'తతః ప్రవిశతి విబుద్ధో విదూషకః సుప్తాచ బ్రాహ్మణీ; బ్రాహ్మణీ ఉత్స్వప్నాయతే' అనియుఁ గలదు. పార్వతీపరిణయవిద్ధసాలభంజికాదుల వివాహమంగళము రంగస్థలమున జరుపఁబడినది. గవినామము ప్రస్తావనయందుఁ దెలుపఁబడవలయు నని నాట్యశాస్త్రము ఘోషించుచుండఁ (V-154) బెక్కు నాటకములయందును భాణములయందును కవినామము గానరాదు. ఇట్టివిషయములు కవియొక్క స్వతంత్రతను సూచించును, లేనిచో నతఁడు మఱియొకనాట్యశాస్త్రపద్ధతి నవలంబించె ననవలయును.

బాణుఁడు 'సూత్రధారకృతారమ్భైః' అని వ్యర్థముగఁ బలికె ననరాదు. భాసుఁ డవలంబించిన పద్ధతినే కాలక్రమమున దాక్షిణాత్యు

1. పుట. 34.

లగుశక్తిభద్రాదు లనుసరించి రనఁదగును. ఇఁకఁ బతాకభూమికాయుతము లని బాణుఁడు వ్రాసినది మననాటకచక్రమునఁ గననగునా ?

"...నాటకై ర్బహుభూమికైః । సపతాకై ర్యశో లేభే భాసో దేవకులైరివ"॥ అనికదా బాణుఁడు వ్రాసెను. భాసుఁడు తననాటకముల యందుఁ బాత్రములను విశేషముగఁ జేర్చియున్నాఁడు. స్వప్నవాసవదత్త ప్రతిజ్ఞాయౌగంధరాయణముల 16 పాత్రములును, అవిమారకమున 21, అభిషేకమున 17, బాలచరితమున 37, పంచరాత్రమున 19, ప్రతిమా నాటకమున 21 పాత్రములును గలవు. 'నాటకై ర్బహుభూమికైః' అను బాణవచన మీనాటకములను వర్ణించుచున్నది.

సపతాకైః :—బీజబిందుపతాకప్రకరీకార్యలక్షణము లర్థప్రకృతు లని నాట్యశాస్త్రములు దెల్పుచున్నవి. అందు పతాక యనునది-

'య ద్వృత్తం హి పరార్థ్యం స్యా త్ప్రధాన స్యోపకారకమ్ । ప్రధానవచ్చ కల్ప్యేత సా పతాకేతి కీర్తితా'॥ అని భరతునిచే (19-23) నిర్వచింపఁబడినది. 'సానుబంధం పతాకాఖ్యం ప్రకరీచ ప్రదేశభాక్' అనిదశరూపకమునఁ గలదు. 'దూరం య దనువర్తతే ప్రాసంగికం సా పతాకా । సుగ్రీవాదివృత్తాంతవత్ । పతాకే వాసాధారణనాయకచిహ్నవ త్తదుపకారికత్వాత్' అని ధనికుని వ్యాఖ్య. సాహిత్యదర్పణకారుఁడును 'వ్యాపి ప్రాసంగికం, వృత్తం పతాకే త్యభిధీయతే' అని వ్రాసియున్నాఁడు. ప్రధానేతివృత్తమునకు సహకారియై గ్రంథాంతమువఱకుండునది పతాక యని వీరియభిప్రాయము. (An episode which has no purpose in itself but is put in by the author for serving as a foil to the principal theme-Professor P. V. Kane in his edition of the Harsha Charita notes P. 12). అట్టివి తిరువనంతపురనాటకములఁ గల వని పలువు రూహించుచున్నారు. స్వప్నవాసవదత్తమునఁ బద్మావతియొక్కయు, అభిషేకనాటకమున సుగ్రీవుని యొక్కయు, ప్రతిమానాటకమున భరతుని

యొక్కయును, బాలచరితమున సంకర్షణునియొక్కయు వృత్తాంతములును బతాక కుదాహరణములుగ వీరు గైకొనుచున్నారు. అందువలన బాణ వచనము సంపూర్ణముగ నీనాటకములకు వర్తించుచున్న దని మనము దెలిసికొనవలసియున్నది.

తిరువనంతపురనాటకముల నాట్యశాస్త్రవిశేషములు మఱికొన్ని గలవు. ఆకాశభాషితము పెక్కుతావుల వాడఁబడినది. నాటకేతివృత్తము త్వరగ నడచుటకై వార్తాహారణమునకుఁ బోయినభటులు తత్క్షణమే తిరుగఁ బ్రవేశించి రని వర్ణింపఁబడినది. 'నిష్క్రమ్య ప్రవిశ్య' అని పెక్కునాటకములఁ గలదు. తగినయవకాశ మీయక పాత్రముల నిట్లు ప్రవేశనమొనర్చుట కాళిదాసాదులనాటకములయందు గానరాదు. అభిషేకనాటకమున రామరావణయుద్ధమును విద్యాధరత్రయము వర్ణించుటయుఁ, బంచరాత్రమున దుర్యోధనుని యజ్ఞమును బ్రాహ్మణత్రయము ప్రశంసించుటయు, నూరుభంగమున గదాయుద్ధమును చారత్రయము వర్ణించుటయు నేకకర్తృత్వమునే సూచించుచున్న దనియును వింటర్నిట్జ (Winternitz) గా రభిప్రాయపడుచున్నారు.

10 దండికావ్యాదర్శమున (2-226).

'లింపతీవ తమోఙ్గాని వర్షతీవాం జనంనభః' అను శ్లోకపాదమునందలి యలంకారములు విమర్శింపఁబడినవి. ఇది కొందఱుపండితు లూహించినటులు సుభాషితముకాదు. ఆలంకారికులు కావ్యనాటకకర్తలను విమర్శించుటయే సహజము కాని యాలంకారికగ్రంథములనుండి కావ్యనాటకకర్తలు శ్లోకములఁ గైకొందు రనుట యుక్తియుక్తముకాదు. పైశ్లోకపాదము బాలచరిత చారుదత్తములందుఁ గన్పట్టుచున్నది. అందువలన బాలచరితచారుదత్తముల రచించిన కవియు దండిమహాకవికిఁ బూర్వుఁడనుట నిస్సంశయము. వల్లభదేవ శార్ఙ్గధరు లీశ్లోకమును విక్రమాదిత్య మేంఠుల కంటఁగట్టిరి. అది ప్రమాణరహితము. మృచ్ఛకటికమునందును గల దనిన మృచ్ఛకటికాచారుదత్తములకుఁ గలసంబంధము ముందు విమ

ర్శించి చారుదత్తమే మృచ్ఛకటికమున కాధార మని నిరూపింపఁబడును.

మఱియుఁ గావ్యాదర్శము (II- 267) నందలి యీశ్లోకమును స్వప్నవాసవదత్తమునఁ గల శరచ్చంద్రాంశుగౌరేణ (IV- 7) యను దానితోఁ బోల్చి చూడుఁడు.

ఆనందాశ్రు ప్రవృత్తం మే కథం దృష్ట్వైవ కన్యకామ్ ।
అక్షి మే పుష్పరజసా వాతోద్ధూతేన దూషితమ్.

కావ్యా—II-267.

ఇందలి భావసాదృశ్యమును గమనించినచో స్వప్నవాసవదత్త కర్త యగు భాసుఁడు దండికిఁ బూర్వుఁ డనుట నిర్వివాదాంశముకదా ? దండిమహాకవి క్రీ. శ. ఏడవశతాబ్దమునఁ గలఁ డని విమర్శకులు గైకొనుచున్నారు. బాలచరితచారుదత్తస్వప్నవాసవదత్తముల రచియించినభాసుఁడాతనికిఁ బూర్వుఁ డగుటవలన నేడవశతాబ్దమునకు ముందుండె ననుటయే యుక్తము.

11. దిఙ్నాగాచార్యవిరచిత మగు 'కుందమాల' యను నాటకమున 'శుశ్రూషితవ్యః ప్రతిమాగతో మహారాజః' అని కలదు. (అంక-1-పుట10).[1] కవి దిఙ్నాగుఁడా ధీరనాగుఁడా,వీరనాగుఁడా యనువిషయ మింకను సంశయగ్రస్తమై యున్నది. దిఙ్నాగకవి క్రీ. శ. 5, 6 శతాబ్దములవాఁ డనియును, 'దిఙ్నాగానాం పథిపరిహరన్' అను మేఘసందేశశ్లోకభాగము కాళిదాసుని కతఁడు సమకాలికుఁ డని సూచించుచున్న దనియునుఁ గొందఱు వ్రాయుచున్నారు. ఆశ్లోకము ప్రక్షిప్త మనియును, నొకవేళ నది మేఘసందేశములోని దయినను దానియం దట్టిగాథ లేమియును ధ్వనించుట లేదనియును మఱికొందఱ మతము. కుందమాలాప్రకాశకులు దమ యుపోద్ఘాతమున నీగ్రంథ మయిదవశతాబ్దాదియందు రచింపఁబడియుండు నని యూహించుచున్నారు.

'ప్రతిమాగతో మహారాజః' అను కుందమాలావాక్యమువలన దిఙ్నాగుఁడు భాసుని ప్రతిమానాటకమును స్మరించియే యటులు వ్రాసి

1. ఈ గ్రంథము దక్షిణభారతీగ్రంథమాలయందుఁ బ్రకటింపఁబడినది.

యుండునని తోఁచుచున్నది. ప్రతిమానాటకకర్తయు దిఙ్నాగునికిఁ బూర్వుఁడై యుండును. భాసమహాకవినాటకమునఁ దక్క మఱి యెచ్చటను బ్రతిమాగృహనిర్మాణము గానరాదు. తమ పూర్వులకుఁ బ్రతిమాగృహనిర్మాణ మొనర్చి వారిని బూజించుట ప్రాచీన హైందవసంప్రదాయమై యుండవచ్చును.

ఈవిషయమువలన శ్రీహర్షునికాలమునఁ గలధావకుఁడే భాసుఁడనువాద మసాస్త మయిన దనియుఁ బ్రతిమానాటకకర్త యగు భాసుఁడయిదవశతాబ్దమునకుఁ బూర్వుఁడై యుండు ననియు భాసవాదు లగు మంకడ్ గారు వ్రాయుచున్నారు.[1] వీరివాదమును విమర్శించుచు కాణే, చింతామణిగార్లు భండార్కరుప్రాచ్య పరిశోధకసంఘపత్రికయందే వ్యాసములను వ్రాసియున్నారు. ప్రతిమాశబ్దమునుబట్టి ప్రతిమానాటకము దిఙ్నాగునికిఁ దెలియు ననుట సరి కా దని వీరియాశయము.[2] వీరివాద మసమంజసము. ప్రాచీనహైందవులు తమపూర్వులను బ్రతిమారూపముగ నర్చించుచుండి రని మనకుఁ బ్రతిమానాటకమునుండియే తెలియుచున్నది. అట్టి సంప్రదాయమును దిఙ్నాగుఁడు ప్రతిమానాటకమునుండి గైకొని తనగ్రంథమునఁ జేర్చికొని యుండు నని మన మూహింపనగును. మహాకవి కాళిదాసుఁడును దనరఘువంశమున (సర్గ 14-శ్లో 15.) 'బాష్పాయమాణో బలిమన్నికేత మాలేఖ్యశేషస్య పితు ర్వివేశ' అని వర్ణించి యున్నాఁడు. ప్రతిమారూపమునకు మాఱుగ నిట నాలేఖ్యమునే కవి వర్ణించినను, నిదియుఁ బై సంప్రదాయమునే స్మరియింపఁజేయుచున్నది.

12. ప్రతిజ్ఞాయౌగంధరాయణములోని (అంక. 4- శ్లో. 3).

నవం శరావం సలిలస్యపూర్ణం
సుసంస్కృతం దర్భకృతోత్తరీయమ్
తత్తస్య మాభూ న్నరకంచ గచ్ఛేత్
యో భర్తృపిండస్య కృతే న యుధ్యేత్.

---

1. Annals of the Bhandarkar Oriental Research Institute Vol. IX-P. 333-334.
2. Do. Vol X-P. 155 & P. 157.

అనుశ్లోకము కౌటిల్యునియర్థశాస్త్రమునఁ గననగుచున్నది. (అధి 10. అధ్యాయ. 3) అర్థశాస్త్రము క్రీ. పూ. 3 శతాబ్దమున రచియింపఁ బడెననియు, భాసునిశ్లోకమును గౌటిల్యుఁ డుదాహరించె ననియు గణపతిశాస్త్రిగారు వ్రాసియున్నారు. పాశ్చాత్యవిమర్శకు లగువింటర్నిట్జ (Winternitz), జాలీ (Jolly), కీత్ (Keith) మొదలగువారు క్రీ. శ. 3, 4 శతాబ్దములలో నాగ్రంథము రచియింపఁబడి యుండవచ్చు నని తలంచుచున్నారు. అది మన మంగీకరించినచో భాసుఁడు క్రీ. శ. 3, 4 శతాబ్దములకుఁ బూర్వమున నుండియుండును. వామనుఁ డీశ్లోకము నందలి నాల్గవపాదమును తనగ్రంథమున నుదాహరించెనని యిదివఱలో గ్రహించియున్నాము. పైశ్లోకసందర్భమును బరిశీలించినచో భాసుఁడు కౌటిల్యునిగ్రంథమునుండి యాశ్లోకమునుఁ గైకొనియె ననుట సమంజసముగఁ గన్పట్టదు. ప్రతిజ్ఞానాటకకర్తయు, కౌటిల్యుఁడును మఱియొకగ్రంథమునుండి గైకొని రనుటయును యుక్తము కాదు. అర్థశాస్త్రకర్తయే భాసునిశ్లోకమును గైకొనియె నని 'అపీహశ్లోకో భవతః' అను నర్థశాస్త్రవాక్యము సూచించుచున్నది. ఈశ్లోకము మనునీతియను గ్రంథమున గూడఁ గల దని మానవల్లి రామకృష్ణకవిగారు వ్రాయుచున్నారు.[1] అది మనకు లభించియుండ లేదు.

13. సోమప్రభాచార్యుఁడు (12 వ శతాబ్దము) తనకుమారపాల ప్రతిబోధ[2]మనుప్రాకృతకావ్యమునఁ బ్రతిజ్ఞాయౌగంధరాయణమునందలి యుదయనకథను వర్ణించుచు నందలిశ్లోకము (III-9) నొకదానినిఁగైకొని సంస్కృతముననే తనగ్రంథమునఁ జేర్చియున్నాఁడు.

యది తాం చైవ తాం చైవ తాం చై వాయతలోచనామ్
న హరామి నృపస్యార్థే నాహం యౌగంధరాయణః॥

1. Third Oriental Conference Madras - Summary of Papers Page 4.

2. బరోడాప్రతి పుట - 81.

శ్రీరస్తు.

# రఘునాథరామాయణము.

(శ్రీమద్రామాయణము.)

## బాలకాండము.

### —: ప్రథమాశ్వాసము. :—

కృత్యాదిమంగళాచరణాదికము.

శా. శ్రీసీతాలలితాంగి యంకమున రంజిల్లంగ నంగాంగళీ
లాసంగంబునఁ జెంగలించుచును గల్పద్రుమస్ఫురచ్ఛాయ ను
ద్భాసిప్రోన్నతరత్నపీఠమున మోదం బొప్పఁగా నుండు నా
కౌసల్యాసుతుఁ డిచ్చు మాకు నెపుడుం గళ్యాణసాకల్యముల్. ౧

సీ. అనివార్యమహార్ఘ్యహారిరత్నాకర
కాంచీమతల్లి యా కాంతతల్లి
మానిసమ్మానితానూనతత్త్వజ్ఞాన
వాసనోత్కంఠి యే వనితతండ్రి
పౌలస్త్యజయపటుప్రౌఢబాహాటోప
విశ్వోపకర్త యే వెలఁదిభర్త
సురనాథసాహాయ్యకరణసముద్దామ
భుజధామసీమ యే పొలఁతిమామ
యాపరమమంగళైకవిఖ్యాతచరిత
జగదభిష్టుతపావనసుగుణజాత
సీత శీతలదృష్టివిశేషలీల
చేత రంజిల్ల మమ్ముఁ బోషించుఁగాత. ౨

ఉ. రామునియాజ్ఞ చేకొని తరంగకులాకులసత్త్వసంకులో
ద్దామగభీరసాగరము దాఁటె జవం బలరంగ నేఘనుం
డామరుదాత్మజాతుఁ డసహాయబలుండు సహాయ మై మము
న్రామకథాపయోధి జలనంబున దాఁటఁగఁ జేయుఁగావుతన్. 3

మ. పదమంజీరఝళంఝళార్భటి జటాబంధామృతాంధస్స్రవ
న్మదయద్భృంగఘుమంఘుమస్వనము తండూద్యన్మృదంగధ్వనిం
బొదలింపంగ నటించు నాఁటినటుఁ డింపుల్మీఱ నాడించుఁగా
త దయ న్రుద్రసనాగ్రరంగమున వాగ్ధాటీనటి న్మాటికిన్. ౩

చ. తనతనుకాంతిరేఖ నిది దాల్చు నటంచుఁ దలంచి సంతసం
బొనర హరిన్మణిప్రభల నొప్పుశుకంబును బూని దానికి
న్నెనరు సెలంగ సత్కళల నేర్పుచునుండు ధరాధరేంద్రనం
దన ఘనవాగ్విశేషకలన న్వెలనొప్పఁగ మాకు నీవుతన్. ౪

మ. వదనాంభోజవిహారివాగ్వరతనూవ్యావల్గదంఘ్రిద్వయాం
గదనాదంబులభంగి వేదములు వక్కాణించుచుం బ్రేమ నా
రదవీణాంచితసామగానముల యొరల్దిద్దుపెన్వేల్పు భూ
రిదయ న్మాకుఁ జిరాయురభ్యుదయసుశ్రీసంభ్రమం బీవుతన్. ౫

చ. చదివినయాకులం జిలుక చక్కఁగ ముక్కున డిగ్గఁద్రోయుఁగాఁ
బొదలుసువర్ణశోభఁ దగుపుస్తకముం గమనీయశయ్యచేఁ
జదువును దివ్యమానులకు శాస్త్రము లన్నియు సర్థసంపదం
బదరఁ దెల్పుభారతి యభంగురవాఙ్మయభంగు లీవుతన్. ౬

క. ఛందోమయభారతి భువి
ముందుగ నెవ్వనిముఖాబ్జమున విలసిల్లెం
బొందుగ నయ్యాదికవి
స్పందనములు చేసి తలఁతు వాక్సిద్ధికినై. ౭

క. వేదములచిక్కు లెడలిచి
వేదార్థములే పురాణవితతులుగా ను
త్పాదించి కీర్తి మించిన
వేదవ్యాసులఁ దలంచి వినుతింతు మదిన్. ౮

సీ. కాళికాముఖపీఠికాసారభోర్మిళ
కవితారసోల్లాసుఁ గాళిదాసు
శ్లాఘనీయశ్లోకశతహృద్యదర్థసం
ప్రాప్తదీప్తశరీరు నలమయూరు

ననవద్యగద్యవిద్యాసముద్ద్యోతిత
విస్తరకవనప్రవీణు బాణు
సౌశబ్ద్యగుణహృద్యసందర్భరసలుబ్ధ
లబ్ధవర్ణార్పితశ్లాఘు మాఘు
నవరసాంచితనాటకనటిత వాగ్వి
భూతి భవభూతి సాహితీరీతి గలుగు
దండి పొగడిత కెక్కిన దండిఁ బొగడి
వెండి గలపూర్వసుకవుల వినుతిసేసి. ౧౦

ఉ. పంచమవేద మైపరఁగు భారత మంధ్రవచోవిలాసము
ల్మించఁ బ్రబంధము ల్నొడివి మే లని సత్కవు లెల్లఁ దమ్ముఁ బూ
జించఁ గవిత్రయం బను ప్రసిద్ధి వహించి యశస్సమృద్ధి వ
ర్ధించి చెలంగు నన్నఘనుఁ దిక్కన నెఱ్ఱమనీషిఁ గొల్చెదన్. ౧౧

క. నానాశాస్త్రపురాణ
జ్ఞానము సందర్భమునఁ బొసంగఁగఁ గృతు లె
న్నని యొనరించి మించిన
శ్రీనాథునివచనవైఖరి న్మదిఁ దలఁతున్. ౧౨

ఉ. శ్రీకరవాగ్విశుద్ధి విలసిల్లుకవు ల్రసనిర్ఝరీపరీ
పాకము మించఁ బల్కువగఁ బల్కఁగనేర్తురె యొండు దుష్టపు
ల్గోకిలసంఘము ల్మధురకోమలలీలలఁ బల్కఁ గాకలీ
కాకువిశేషసుస్వరము కాకులమూఁకలు పల్కనేర్చునే. ౧౩

సీ. మృదుశబ్దపారంపరీపరీపాకంబు
లోకంబు నవసుధాప్లుతము సేయఁ
గందళద్రసగర్భసందర్భసంశుద్ధి
బుద్ధిమంతులతలంపులు గరంప
భంగ్యంతరధ్వనివ్యంగ్యవైభవరీతి
నాతియుఁ బోలె నానంద మొసఁగ
నుల్లసద్బహువిధార్థోల్లేఖివైచిత్ర్య
చిత్రితప్రతిమలు శిరసు లూఁపఁ

కవిత చెప్పంగనేర్చు సత్కవులకైనఁ
బ్రణుతు లొనరింతు, శంకాకరమ్ము లైన
పెళుకుఁగబ్బపుదబ్బఱుండులను జెవులు
వాడుచువారలపే రైన నోడువఁజాల. ౧౪

మహాస్రగ్ధర. కణభుగ్గ్రంథాధ్వనీనుల్ ఘనపదపదవీగాఢసద్రూఢలీలా
ఫణభృద్భర్తల్, ప్రకుప్యత్ప్రతిభటకవిహృద్భల్లవాగ్ఝల్లరు ల్లా
క్షణికాలంకారికాగ్రేసరులు నగుబుధుల్ సత్కృతు ల్సేయుచోటన్
గణనామాత్రాతిగర్వగ్రహిళకుకవిసంఘంబు లేమూల నుండున్. ౧౫

క. పలుకఁగవలె నవరసములు
గులుకం బద్యములు చెవులకున్ హృద్యముగా
నళుకక యటు గాకున్నం
బలుకక యుండుటయె మేలు బహుమానముగన్. ౧౬

క. సందర్భము నవరసని
ష్యంది యగుచుఁ గవులచెవులఁ జవులుదవుల నిం
పొందినఁ దగుఁగా కూరక
యందఱకులు గూర్చుకవిత యందం బగునే. ౧౭

క. మాటికి రసపరిపాటికి
మేటికవులు మెచ్చి మేలు మే లనఁ గూర్తుం
దేటగ రామాయణకథ
మాటలపొందికలు గుమగుమఁ బిసాళింపన్. ౧౮

వ. అని యిష్టదేవతానమస్కారంబును బురాతనాధునాతనమహాకవిపుర
స్కారంబును గుకవితిరస్కారంబునుం గావించి యే నొక్క ప్రబంధంబు
విద్వత్కవిహృద్యసౌశబ్ద్యగుణబంధబంధురనవరసాస్పదపదనిబంధంబు
గాఁ జేయ నూహించి యున్నచో నొక్కనాఁటివేకువ నద్భుతంబుగ
మద్భాగ్యవశంబున. ౧౯

సీ. శ్రవణకుండలములు చంద్రు గెల్చిన నెమ్మొ
గమునకు నీరాజనము లొసంగ

మొలకన వ్వద్దాల గెలిచిన చెక్కుల
    కడలకుఁ దెల్లపాపడలు వీవ
బంగరువిలు వైరిఁ బరిమార్చు కేలికిఁ
    గనకాభిషేకంబు నొసరఁజేయ
మంజీరరవము పద్మములభంగించిన
    పదముల బిరుదసంపదలు పొగడ
వెంట జయలక్ష్మివలె మచ్చెకంటి యొర్తు
నీడవలె నొక్క కొమరుండుఁ గూడి నడువఁ
గన్నుల దయారసంబు చిల్కంగ నొక్క
నీలవర్ణుండు నామ్రోల నిలిచె లీల. ౧౦

క. నిలిచి ననుఁ బ్రేమఁ బేర్కొని
పిలిచి కృపారసము నిండి బెడఁగొందెడుచూ
పులఁ జూచి వేడ్క నవ్వుచుఁ
బలికె మృదుగభీరమధురబంధురఫణితిన్. ౧౧

క. నీ విష్ణు డొకప్రబంధము
గావింపం దలఁచు టెఱిఁగి కౌతుక మొప్పం
గా వచ్చితి నిను మెచ్చితి
భావంబున నేను రామభద్రుఁడఁ జుమ్మీ. ౧౨

క. మామది సమ్మద మొదవఁగ
రామాయణకథయు నుడువు రఘునాథనృపా
నీమహితవాగ్విలాసము
భూమిం బొగడొందు సుకృతములు చేకూరున్. ౧౩

క. నీమృదులవాగ్విలాసము
రామాయణకథయు శర్కరయుఁ బాలు బలెన్
ధీమత్కవిజిహ్వల నెం
తె మధురిమ పొదలుచుండ నెలకొనియుండున్. ౧౪

గీ. అచ్యుతాభ్యుదయాదిమహాప్రబంధ

జాలఁ జెప్పితి వవి మాకు సమ్మదంబుఁ
దెచ్చె హెచ్చుగ నచ్యుతాధిపకుమార. ౨౫

క. కావున రామాయణకృతిఁ
గావింపు మదంకితమ్ముగా నవరసముల్
వేవేలువగలఁ దగ నా
నావిధసందర్భమార్గనై పుణి మెఱయన్. ౨౬

ఉ. శ్రీయొసఁగు న్యశోగరిమ చేకుఱుఁ బుణ్యఫలంబు లబ్బు దీ
ర్ఘాయువుగల్గు సంతతజయాభ్యుదయంబులు మించు సంపదం
బాయకపుత్త్రపౌత్త్రపరిపాటి ఘటిల్లుచు నుండు నెప్డు రా
మాయణసత్కథామహిమ నచ్యుతుశ్రీరఘునాథభూవరా. ౨౭

క. అని యానతిచ్చి చన నం
తన మేల్గని వేడ్క నెంతధన్యుఁడనో యేఁ
గనుఁగొంటిం గలలోపల
ఘను రఘువల్లభు నటంచుఁ గౌతుకమొప్పన్. ౨౮

ఉ. వెండియు నారఘూద్వహు నవీనకృపాఘువవీక్షణంబు లా
ఖండలరత్నకాంతిమదఖండనపండితవిగ్రహప్రభా
మండలము న్మనోజ్ఞహాసమండితగండయుగంబుఁ గాండకో
దండవిరాజమానభుజదండములు న్మదిలోఁ దలంచుచున్. ౨౯

క. చొక్కుచు నతనికి వేమఱు
మ్రొక్కుచుఁ గనుఁగవ యొకింత మూయుచు వేడ్కల్
నెక్కొనఁగ నెట్టకేలకుఁ
జక్కఁగఁ గనుదెఱచి హర్షసంయుక్తుఁడనై. ౩౦

వ. కొలువుకూటంబున కేతెంచి కవిబుధోత్తములం బిలిపించి వారలతోని ట్లంటి. ౩౧

సీ. నాపాలిపెన్నిధి నాకులదైవంబు
నను గన్నతండ్రి న న్మనుచునేత
నాముంగిట నటించు కామధుగ్ధేనువు
నాదండనుండు కుందనపుఁగొండ

నను నెల్లెడలఁ గాచికొను మేటివిలుకాఁడు
నను( గృపారసముచేఁ దనుపుఘనుఁడు
... ... ... ... ...
నాదుసారస్వతాబ్ధి యానంద మొదఁ
జలుపుచంద్రుండు శ్రీరామచంద్రుఁ డెలమి
నాదుకలలోనఁ బొడకట్టి మోద మొదరఁ
బలికెఁ గృతిసేయు మని కవిప్రవరులార. 3౨

గీ. అనిన విని వారు ప్రమదంబు నద్భుతంబు
నడర నీవెంతధన్యుండ వచ్యుతేంద్ర
వరకుమారక నీభాగ్యవైభవంబుఁ
బొగడఁ దర మయ్యె యల శేషభోగి కైన. 33

క. అలఘుకరుణ శ్రీరఘుపతి
కలలోపల వచ్చి తనదు కథఁ గావ్యముగా
నిల నిలువఁజేయు మనుచుం
బలుకుట యరయంగ మిగుల భాగ్యము గాదే. 3౪

క. దేవునియందలిభక్తియు
భావింప నపూర్వ మెందు భక్తిమహిమచే
దేవుఁడె తోడుతఁ బలికిన
దేవరభాగ్యంబు సన్నుతింపం దరమే. 3౫

క. తోయధు లన్నియు నొక్కటఁ
జేయిూతగ నీఁదఁ దలఁపు సేయుట గద రా
మాయణకథ యింతయుఁ గృతి
సేయఁగఁ బూను టిది నీక చెల్లు నృపమణీ. 3౬

వ. భక్తసులభుం డగురఘువల్లభుండు నీకు శుభంబు లొనగూర్ప స్వప్నంబునం గనిపించి రామాయణంబుఁ గృతిసేయు మని యానతిచ్చెం గావున నీసుకృతంబు ఫలియించె నీకవిత్వమహిమయు మహీమండలంబునం బ్రసిద్ధం బగు నట్లన జగత్పవిత్రంబును విచిత్రోపకథాసంవి

ధానపాత్రంబును నగు రామచరిత్రం బుభయభాషాధురంధరులు మెచ్చం బ్రబంధంబుగా నిబంధింపు మని పలుక నేను నాబుద్ధో త్తములవాక్యంబులు నిష్టదేవతావాక్యంబులు నైక్యంబు నొందుటకు నానందంబు నొందించు తత్ప్రసాదలబ్ధం బగు కవిత్వంబుఁ దనుప యుక్తంబుగాఁ జేయుట యుచితం బని విచారించి యాదేవతాసార్వ భౌమునకును- ౩౭

షష్ఠ్యంతములు.

క. శ్రీరామచంద్రునకుఁ గరు
ణారసపూర్ణునకు నతజనవ్రజశుభవి
స్తారణనిస్తంద్రునకుం
జారణగణవినుతఘనయశస్సాంద్రునకున్. ౩౮

క. ఖండపరశుకాండాసన
ఖండనపాండిత్యలసదఖండయశశ్శ్రీ
మండితదిఙ్మండలునకు
దండితశత్రునకు సురకృతస్తోత్రునకున్. ౩౯

క. దినకరవంశోత్తమునకుఁ
గనకమృగమృగవ్యకేళికాచతురునకున్
... ... ... ...
జనకక్ష్మాహరణచిత్రచారిత్రునకున్. ౪౦

క. సూత్రామణమణిసురుచిర
గాత్రునకుఁ గృపారసార్ద్రకందళవిలస
న్నేత్రునకు నలంకృతరవి
గోత్రునకున్ ధైర్యవిజితకులగోత్రునకున్. ౪౧

క. కౌసల్యానందనునకు
వాసవకృతవందనునకు వరమానిమనో
వాసునకు గండయుగళో
ద్భాసితసితమృదువిలాసదరహాసునకున్. ౪౨

శ్రీరస్తు.

# లక్షణసారసంగ్రహము.

## ప్రథమాశ్వాసము.

---

శా. శ్రీరామాధిపపాదపద్మయుగసంసేవామనీషాతిభూ
షారేఖోజ్జ్వలదివ్యమూర్తి వటుకాచారుండు శౌర్యక్రియా
మారారాతికుమారవర్యుఁడు హనూమంతుండు మా కిచ్చు గం
భీరశ్రీకరకావ్యగుంఫనవచోభీష్టార్థముల్ సత్కృపన్. ౧

చ. సతతముఁ నేఁ ద్రిమూర్తులఁ ద్రిశక్తులఁ గొల్చి వినాయకప్రభు
న్నుతులను దేల్చి వ్యాసుల మనంబున నుంచుక కాళిదాసు నెం
చి తెలుఁగుగాఁగ భారతము సేసినయట్టి కవిత్రయంబు సం
స్తుతు లొనరించి యాధునికసూరికవీంద్రతతిని న్నుతించుచున్. ౨

ఉ. త్ర్యక్షవరప్రసాదకవితాఢ్యుని వేములవాడభీము, న
వ్యక్షతభక్తివిస్ఫురదనంతు ననంతుఁ, గవిత్వలక్షణా
ధ్యక్షులఁ గాచిరాజు బసవాఖ్యుని, భైరవు, నాత్మదండి, వా
గ్వీక్షణకర్ణనేత యగు వెల్లఁకి తాతబుధేంద్రు నెన్నుచున్. ౩

క. లక్షణ మెఱుఁగక కావ్యము
లీక్షణమునఁ గూర్తు మనుచు నెగురాడు కుక
వ్యక్షకుమారుల నదలిచి
లాక్షణికులు మెదిచి వారి లావడఁతు రిలన్. ౪

వ. అని యిష్టదేవతాస్తుతిభాషణంబును, సుకవీశ్వరభూషణంబును, కు
కవిదూషణంబునుం, జేసి "లక్షణసారసంగ్రహంబు" నుపక్రమించిన
వాఁడ నై. ౫

సీ. శ్రీహనుమద్వరస్థిరసత్కవిత్వద
క్షుండ భారద్వాజగోత్రజుండ
శుభకరశుక్లయజుశ్శాఖికాప్రభా
సురుఁడఁ గాత్యాయనసూత్రయుతుఁడ

మహిని బొర్సుంచాల మంచిరాజేంద్రుని
కాచధీమణిచెన్నఘనుని పౌత్రుఁ
డను సర్వశీరునందనుఁడఁ గాస్యపగోత్ర
కలితుఁడై తగు నల్లగట్ట వైల
యార్య దౌహిత్రుఁడను లక్ష్మమాంబికాత్మ
గర్భజలధిచంద్రుఁడఁ జిత్రకావ్యధనుఁడ
ధారుణీశమాన్యుఁడను గందాళ యన్న
గారి శిష్యుఁడఁ బెద్దనకవివరుండ. ౭

వ. అయిననే నొక్కనాఁడు నిద్రించు సమయంబున- ౭

సీ. మకరకుండలకాంతినికరంబు జిగిమీఱు
చెక్కుల నటియింపఁ జెలఁగువాఁడు
కాంచనప్రభమించు కాయసమున్నతి
నమరాద్రిఁ బోల్పఁగా నమరువాఁడు
వాలజాతశుగమున వైరిదైత్యాబ్ధిని
కాయఁబు విప్పఁగాఁ జేయువాఁడు
కౌపీన మేఖలాకటిసూత్రయజ్ఞోప
వీతచిహ్నములచే వెలయువాఁడు
భక్తజనపారిజాతమై పరఁగునెవ్వఁ
డట్టిహనుమంతుఁ డతిశాంతుఁ డధికకరుణఁ
గలను నను జేరవచ్చి సాక్షాత్కరించి
యాదరంబున నిట్లని యానతిచ్చె. ౮

క. ము న్నొకశతకము మాకుం
జిన్నపుడె సమర్పణంబు చేసితి వింకన్
సన్నుతలక్షణకృతి య
స్మన్నామాంకితముసేయుమా యిపు డనినన్. ౯

వ. ఏనునుం గృతార్థుండ నైతి నని యాశ్రీరామచంద్రుదాసచంద్రునకు భక్తిపూర్వకంబున ననేకసాష్టాంగదండంబులు సమర్పించి. ౧౦

క. నీపేర నంకితంబుగ
దీపితమతి ఛంద మొకటి తెనుఁగునఁ గడుసం
క్షేపమునఁ జేతు నీకృప
ప్రాపున నని విన్నవించి యట మేల్కాంటిన్. ౧౧

వ. ఇట్లు కల గాంచి మేల్కొని యేతదర్థంబును గురువిద్వత్కవీంద్రు లగు
పెద్దలకు విన్నవించి తదీయానుగ్రహంబున భక్తియుక్తచిత్తుండనై. ౧౨

— షష్ఠ్యంతములు —

క. నలినజకుమారమానస
కలితేక్షణహేతుభూతకదనధరణికిన్
లలితపరిపక్వఫలమతి
గిళితామరమార్గమణికిఁ గీశాగ్రణికిన్. ౧౩

క. భూమిసుతమతికి రామ
క్ష్మానాయకదత్తముద్రికామణిభాస్వ
ద్భూమాదయపరిహృతసీ
తానలినముఖీమనోవ్యథాహిమతతికిన్. ౧౪

క. మదసంయుతపౌలస్త్య
త్రిదశరిపూత్తమ ... పురీభర్గునకున్
విదితమనోజవగతిగో
ష్పదీకృతనదీహృదీశపటుమార్గునకున్. ౧౫

క. ఆమార్జునాదినగహృత
ధూమ్రాక్షమహాసురేంద్రధూర్తాక్షునకుం
దామ్రాననలక్ష్యునకుం
గ్రామాయతశౌర్యధుర్యకపిదక్షునకున్. ౧౬

క. అతులితగుణవంతున కా
నతజనతరుతతివసంతునకు మాణవక
వ్రతజితకంతునకు ధరా
నుత వెలఁబాఁపురిహనూమంతునకున్. ౧౭

వ. అంకితం బొనరించి సమర్పింప నొనర్పంబూనిన లక్షణసారసంగ్రహం
బునకు సంవిధానం బెట్టి దనిన. ౧౮

సీ. అక్షరజాత్యాదిలక్షణంబును గురు
లఘుసంజ్ఞగణములు లాగుఁ గావ్య
రూపంబుఁ గవినేతృసంహవముల్ ప్రాసభే
దాన లండకలు యతులగతులు
సరవితో నుక్తాదిషడ్వింశతిచ్ఛంద
ములఁగల సమవృత్తములవిధములు
నం దర్ధసమవిషమాఖ్యవృత్తంబులు
షట్ప్రత్యయంబులచందములును
జాడవృష్టిముఖ్యదండకంబులు లయ
గ్రాహు లార్య లందుఁ గందములును
గీతు లక్కరలకు రీతి వైతాళీయ
ములు రగడలు సీసములుఁ దెలుపుదు. ౧౯

వ. అం దక్షరక్రమం బెట్టు లనిన. ౨౦

సీ. ఆదులు పదియాఱు నచ్చులు స్వరము లౌఁ
గాదుల్లు షట్త్రింశదక్షరములు
వ్యంజనములు హల్లు లనఁ దగు నివి యెన్న
నయ్యె నేఁబదియు రెం డైనసంఖ్య
నందు వర్గములయ్యె నైదు కచటతపల్
స్పర్శచిహ్నల నవి పరఁగి యుండు
యరలవ లంతస్థ లనఁ బొల్పుమీఱును
శషసహ లూష్మలన్ సంజ్ఞ మెఱయు
నమరు ననునాసికాఖ్యల ఙమఞణనలు
జనునికంఠతాల్వాదికస్థలము లెన్ని
దిటను నాదరూపమున వర్తిల్లి వెలయు
నక్షరప్రపంచ మిది యహాహా యక్షవైరి. ౨౧

శా. దీనం దారలు బీజము ల్కులము సద్వృత్తు ల్విభు ల్లింగముల్
నానావర్ణ ఫలగ్రహామృత విషాల్పప్రాణసంజ్ఞా మహా
ప్రాణస్నిగ్ధలు రూక్షలు న్సురనృతిర్యగ్గౌరవోద్యద్గతుల్
గానంగావలె మాతృకార్చకలుఁ జక్రస్థార్ణము ల్గానఁగన్. ౨౨

— ఇఁక నక్షత్రక్రమంబు. —

సీ. అద్వయ మశ్విని ఇద్వయి భరణి ఉ
ద్వయి బుచతుష్క మగ్నియును బ్రహ్మ
ఏ చంద్రుఁ డైకార మీశుఁ డోఔ లది
తి కకార మమరదేశికుఁడు ఖగలు
ఫణి ఘుజల్ మఘుచ పుబ్బఛజ లుత్తర ఝఞల్
హస్త టఠల్ చిత్త యాడ యాశు
గము ధణద్వయి విశాఖ తథదల్ధయును ప
ఫలు మైత్ర శక్ర మూలలు బభమలు
సలిల విశ్వశ్రవణముల్ యరలు ధనిష్ఠ
యగు లకారంబు శతభిషగాఖ్య వశలు
పూర్వభాద్ర షసహ లహిర్బుధ్న్యతార
ళక్షఅల్ రేవతి యనెడి ఋక్ష మగును. ౨౩

క. కృతిమొదల నున్నవర్ణ
ద్వితయమునకుఁ బొందవలయు విభుపేరికిఁ ద
త్ప్రతిముఖవర్ణమునఁ గూ
ర్చుతెఱఁగెఱుఁగవలె వధూవరులకుంబోలెన్. ౨౪

— భూతబీజాక్షరములు. —

సీ. అఇఉఋల్ పంక్తిగా నైదిడి యాక్రింద
నాదీర్ఘవర్ణంబు లైదు వ్రాసి
యట్ల నెకారాదు లాక్రింద నైదిడి
కాదివర్ణము లేను నట్ల వ్రాసి
నిడుచాలు లైదింట నిల్చు పదేసియు
కాగ్నిభూదకఖబీజాక్షరములు

ఖేదంబు మృతియు శ్రీ మోదంబు దారిద్ర్య
మును జేయుఁ గ్రమమున ననుచుఁ దెలిసి
భూతబీజాక్షరఫల మీరీతిఁ దెలిసి
యిందులో హర్ష సంపద లిచ్చునెద్ది
యట్టి వర్ణంబె కృత్యాదిఁ బెట్టు సుకవి
సమరహృతదైత్యవీర కేసరికుమార. ౧౭

—కులంబులు.—

క. స్వరకచటవర్గములు భూ
సురు లగుఁ దపవర్గరవలు క్షోణిపతులు వి
డ్వరులు యలోష్మలు పాదజు
లరయఁగ ళక్షలు కృతుల నాది నిడఁగన్. ౧౮

—అధిదేవతలు.—

సీ. బ్రహ్మానలగణాధిపతియుగ్రనరసింహ
వామనషణ్ముఖహైమవతులు
భైరవజినయమనైరృతీశ్వరయుగ్మ
వాక్పైషయుగనందివనజహితులు
వరశివవీరేశవాసుదేవాశ్వినుల్
భద్రకాళీరుద్రపవనశిఖులు
సితకరివరుణలక్ష్మీసూర్యవాణిశ
భూతనృసింహు లొప్పంగ హాలాధ్యు
లరయ హరి భూమి కాముఁడు సిరియుఁ గాళి
యదితి కౌమారి వారాహి యష్టవసువు
లశ్వినులు వసంతుఁడు శంబరారి దుర్గ
యమరచాముండి హరుఁడు స్వరాదిపతులు. ౧౯

—స్త్రీలింగపుంలింగనపుంసకలింగములు.—

క. స్వరయుతములైన హల్లులు
పరఁగును స్త్రీలింగసంజ్ఞఁ బదిమూఁడిమ్ముల్

ధరఁ బుంలింగము లచ్చులఁ
బొరయని వర్ణములు క్లీబములు శుభచరితా. ౨౮

—వన్నెలు.—

సీ. ఎఱుపు గౌరము నల్పు నెఱపసిమియు నల్పు
న ల్పాదిషట్కంబునకుఁ దనర్పు
గౌరంబు నల్పును గౌరరాగంబులు
బుచతుష్కమునకు వర్తిలుచునుండు
ఏచ్చులు గౌరవం బెఱుపు కవర్గంబు
నల్పు తెల్పెఱుపును దెల్పు నల్పు
చఛఝఞల్ నల్పెర్పు జాటవర్గ మెఱుపుఁ
తెల్పును బసిమియు నల్పునెఱుపు
తెల్పుఁ దథ లవి దధనలు నల్పు పసిమి
గౌర మగును పవర్గంబు గౌరనీల
గౌరశోణమేచకకాంతి గలవి యరలు
నల్పెఱుపు లవల్ పసిమియుఁ దెల్పు నగును. ౨౯

వ. మఱియును. 30

గీ. పసిమి యెఱుపు నెఱుపుఁ బటుగౌర మూష్మలు
గౌరధవళకాంతి గలవి ళక్ష
లిన్నివర్ణములకు నీరీతి వన్నెల
పొంక మెఱిఁగి మొదలఁ బూన్చు సుకవి. 31

—అక్షరఫలవర్ణనియమము.—

సీ. సిరు లాదిషట్క మ్మిడుఁ బుచతుష్కంబు కీ
డేచ్చులు ను కవర్గమిచ్చు శుభము
చెడుఁకీర్తులు చకార మిడు ఛజల్ మంచివి
ఝఞలు సంపు టఠల్ వొసఁగవు డఢలు
శుభము నశుభ మొనర్చును వస్తుదము ణకా
రము తథల్ గతవిఘ్న మమరి యానున

దధ లిడు ధృతి తాపదము నవర్ణము పవ
ర్గము మదభ్యారోగ్యకాంత్యఘదము
యరలవల్ శ్రీప్రదాహజాడ్యవిభవములు
సౌఖ్యఖేదమోముక్తులు శషసహలిడు
శక్షుల జాడ్యసంపత్కళల్ ఘటించు
నని ఫలమెఱింగి కృతినిల్పవలెఁను సుకవి. ౩౨

క. భువి నకచటతపయలు స
ప్తవర్గములు వానికిని ప్రభంజనతేజయో
రవిభౌమసౌమ్యభార్గవ
సవభుగ్వరమంత్రిసౌరిచంద్రులు గ్రహముల్. ౩౩

—అమృతవిషాక్షరములు—

గీ. అమృతవర్ణము లఘువులైనట్టి లిపులు
వీని దీర్ఘము లగ్గిన విషము లయ్యె
నట్టి దీర్ఘాక్షరము లాక యలరఁ గృతుల
మొదల ఋజువర్ణములు కూర్పఁ గదియు శుభము. ౩౪

—అల్పప్రాణమహాప్రాణములు.—

క. అలవర్గసమూహ మ్మటవ
ర్గలవి మహాప్రాణము లవి గాక మిగిలియు
న్న లిపులె యల్పప్రాణం
బు లిందులో నిడు నివి శుభములు కృతిమొదలన్. ౩౫

—స్నిగ్ధరూక్షలు.—

గీ. మొదల నిట్టి యల్పప్రాణములె సజాతి
యుతము లై స్నిగ్ధ లౌ శుభ మొసరఁ జేయు
నల మహాప్రాణములు స్వపరాక్షరయుత
ము లయి రూక్ష లౌ నివి యాది నిలుపఁదగదు ౩౬

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురముమహా రాజావారు; పరిషద్వ్యవస్థాపకాధ్యక్షులు.
కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.
కీ. శే. శ్రీ బొబ్బిలిమహారాజావారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.
వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయఁడుగారు, (కోశాధ్యక్షులు).
పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ. ,,
చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.
కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.
శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., ఎల్. టి.
దర్భా వేంకటశివరామరాజుగారు, బి. ఏ., బి. యల్.
ఆళక్కి వేంకట్రామయ్యగారు.
కేశవరపు కామరాజుగారు.
కోకా వేంకటసుబ్బారావునాయఁడుగారు.
ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.
పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.
పిళ్ళారిశెట్టి రంగబ్రహ్మారావునాయఁడుగారు.

## కాకినాడ-ఆంధ్రసాహిత్యపరిషత్తులో వెలకుదొరకు గ్రంథములు.

| | | | రు | |
|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయ్యకవి | | 0 | 8 |
| 2 | జైమినిభారతము-వచనము-సముఖము వేంకటకృష్ణప్పనాయఁకుఁడు | ... | 0 | 12 |
| 3 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి | ... | 0 | 10 |
| 4 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | ... | 1 | 0 |
| 5 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము-జ.రా. పంతులుగారు బి.ఏ. బి.ఎల్. | | 0 | 8 |
| 6 | జ్యోతిశ్శాస్త్రసారము- కపిస్థళం కృష్ణమాచార్యులుగారు | ... | 0 | 8 |
| 7 | అకారాద్యముద్రితగ్రంథసూచిక | ... | 0 | 8 |
| 8 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | | 0 | 12 |
| 9 | శివతత్త్వసారము-మల్లికార్జునపండితారాధ్యులు | ... | 0 | 12 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లన్నకవి | ... | 1 | 0 |
| 11 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి | ... | 0 | 12 |
| 12 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | | 0 | 8 |
| 13 | హరిస్వరంగములు-క్రొత్తపల్లి సూర్యరావుగారు | ... | 0 | 8 |
| 14 | నారసింహపురాణము-ఉత్తరభాగము-హరిభట్టు | ... | 1 | 0 |
| 15 | మన్నారుదాసవిలాసనాటకము-రంగాజమ్మ | ... | 0 | 8 |
| 16-17 | కాళిందీకన్యాపరిణయము (రెండుభాగములు) అహోబలపతి | ... | 1 | 4 |
| 18 | ఆంధ్రధాతుమాల-చిన్నయసూరి | ... | 0 | 12 |
| 19 | శాసనపద్యమంజరి | ... | 0 | 12 |
| 20 | శతకసముచ్చయము (ప్రథమభాగము) | ... | 0 | 12 |
| 21 | పరిషత్పుస్తకభాండాగారము. (ద్వితీయభాగము) | ... | 0 | 8 |
| 22 | సూత్రాంధ్రవ్యాకరణములు-చిన్నయసూరి | ... | 0 | 8 |
| 23 | రసాభరణము-అనంతకవి. | ... | 0 | 8 |
| 24 | ఆంధ్రశబ్దచింతామణి-బాలసరస్వతీకృతాంధ్రటీకోపేతము | ... | 0 | 8 |
| 25 | షోడశకుమారచరిత్రము-వెన్నెలకంటి అన్నయ్య | ... | 0 | 8 |
| 26 | శతకసముచ్చయము (ద్వితీయభాగము) | ... | 0 | 10 |
| 27 | రాయవాచకము-విశ్వనాథనాయని స్థానాపతి | ... | 0 | 8 |
| 28 | సింహాసనద్వాత్రింశిక-ద్వితీయభాగము-కొఱవి గోపరాజకవి | ... | 0 | 12 |
| 29 | ఆంధ్రకౌముది-గణపవరపు వేంకటపతికవి | ... | 0 | 8 |
| 30 | బాలభారతము-(అగస్త్యకృతమునకుఁ దెనుఁగు) క్రొత్తపల్లి సూర్యరావుగారు | | 0 | 12 |
| 31 | సింహాసనద్వాత్రింశిక- (ప్రథమభాగము) కొఱవి గోపరాజకవి | ... | 0 | 12 |
| 32 | Defence of Literary Telugu జ. రా. పంతులుగారు ,, | ... | 0 | 8 |
| 33 | చాటుధారాచమత్కారసారః-(సంస్కృతము) | ... | 0 | 8 |
| 34 | సాంబోపాఖ్యానము- రామరాజురంగప్పరాజు | ... | 1 | 0 |
| 35 | ఉత్తరరామచరిత్రము-జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ. బి. ఎల్. | | 1 | 0 |
| 36 | అమరుకము-సాంధ్రము-జయంతి రామయ్యపంతులుగారు ,, | ... | 1 | 0 |

(గ్రంథములపట్టికకై వ్రాయుఁడు.)

Printed by N.Achutaramiah at the Cocanada Printing Works, Cocanada

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౨౫. { ధాతృనామసంవత్సరము. జ్యేష్ఠాషాఢమాసములు. } సంచిక ౨.





కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచే బరిషత్కార్యాలయమునఁ
బ్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

ఆ 1936 సం. జూన్, జూలై మాసములు.

# విషయసూచిక.


1. ఆధునికవంగవాఙ్మయము ... ... ౪౯-౫౦
2. పొగడదండ ... ... ౫౦-౫౨
3. గ్రంథస్వీకారము ... ... ౫౩-౫౬
4. భానుఁడు ... ... ౫౭-౭౨

   కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.
5. శ్రీరాధామాధవము ... ... ౭౩ ౮౧

   నిడదవోలు వేంకటరావుగారు, బి. ఏ.,
6. కీ. శే. వావిలికొలను సుబ్బరావుపంతులు గారు ౮౧-౮౨
7. జనవాణి ... ... ౮౨-౮౩
8. సుపథము ... ... ౮౩-౮౪

   సోంపల్లె కృష్ణమూర్తిగారు.
9. రఘునాథరామాయణము ... ... ?-24

   రఘునాథభూపాలుఁడు.
10. లక్షణసారసంగ్రహము ... ... 9-16

    చిత్రకవి పెద్దనార్యుఁడు.
11. కవిజనోజ్జీవని(సమస్యలు) ... ... 1-8

    కోటి రాయరఘునాథ భూపతి.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

| సంపుటము ౨౫. | ధాతృనామ సంవత్సరము.<br>జ్యేష్ఠాషాఢమాసములు. | సంచిక ౨. |
|---|---|---|

## ఆధునికవంగవాఙ్మయము.

ఆధునికవంగవాఙ్మయమును గూర్చి డాక్టరు కాళిదాస నాగమహాశయు లిట్లు వ్రాయుచున్నారు.

"రవీంద్రనాథుఁడు తన నిసర్గాత్మకళావైదుష్యముచేత వాఙ్మయమున కున్నతస్థానమును గల్పించి 1913 వ సంవత్సరమున నోబెలు బహుమతిని బొందెను. నాఁటి నుండియు వంగవాణికిని బలవత్తరముగ నుండిన ప్రాచీనాంగ్లేయ సారస్వతానుబంధము సడలినయది. స్వభావవర్ణనములకు ప్రాధాన్యము, కల్పనాదుల కప్రాధాన్యమును గుదిరినవి. వానితోపాటు యుద్ధానంతరశైథిల్యము, శృంగారభూయిష్ఠతయు, యూరోపుఖండాంతర్గత సారస్వతవిప్లవమును వచ్చినవి. నూతనపథాన్వేషణ పరిశోధనములతో స్వతంత్రత కొఱకు విశేష పరిశ్రమ మొనర్పఁబడియును, నీతిశాస్త్రనియమోల్లంఘనము, రసైకమూర్ధప్రతిపాదకౌచిత్యధిక్కారమును గన్పడుచున్నవి. నీతిరహితము లగు నీవిధంపుపద్ధతులు తాత్కాలికములై సజీవ నవ్యకవితాసృష్టికి మార్గదర్శకములు గావచ్చును. మేధాసంపన్ను లగు వంగనరనారీమణుల స్వయంకృషి పరిశోధనములచే సాంఘిక, తాత్త్విక, చారిత్రిక, వైజ్ఞానిక సంబంధ మగు స్థిరవాఙ్మయ మభివృద్ధిని గాంచి, భావి వాఙ్మయవికసనమునకుఁ దోడ్పడు నని విశ్వసించుచున్నాము."

పై విషాదసూచకము లగు కాళిదాసనాగమహాశయునివాక్యము లిటీవల మహారాష్ట్రవాఙ్మయమును గూర్చి ప్రొఫెసరు భాగవత్ గారు బొం

బొాయిపట్టణమున నిచ్చిన యుపన్యాసమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నవి. (P. E. N. పత్రిక 7-3-1935).

కర్ణాటకేరళవాఙ్మయముల యాధునికదశను గూర్చి పరిషత్పత్రిక (సంపు. 24 పు. 118-119) యందు ప్రకటించితిమి. నేటిహైందవవాఙ్మయముల స్థితియంతయు నొకరీతిగనే యున్నదనుటకుఁ బైవాక్యములే నిదర్శనములు. ఆంధ్రయువకులు లీపాడితాభిప్రాయములను దిలకించి యాంధ్రభాష నుద్ధరింపవలయును. అన్నివిషయముల వంగదేశమునే యాదర్శముగఁ గైకొను నేటి యాంధ్రకవిబృంద మందలిగుణములు మాత్రమే గ్రహించి దోషములఁ ద్యజించునుగాక.

## పొగడదండ.

శ్రీనాథుని దనిచెప్పఁబడు నొకపద్యములో "కవిరాజుకంఠంబు కౌఁగిలించెనుగదా పురవీథి నెదురెండపొగడదండ" యని కలదు. శ్రీ బండారు తమ్మయ్యగారు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక 24 సంపుటము ౪ వ సంచికలో (౧౩౬ పుట) "శ్రీనాథకవిప్రయోగము" లనువ్యాసములో, నధోక్షాపికలో-"ఈసందర్భములో మఱియొకసంగతి ప్రశంసించుట యప్రస్తుతము కాదు. పయిపద్యములో మొదటిపాదము నుత్తరార్ధములో "ఎదురెండ పొగడదండ" అని కాని "ఎదురెండఁ బొగడదండ" యని కాని పాఠ మెట్లున్నను నందలిభావ మేమో బాగుగ గోచరించుటలేదు. పద్యమందలివిషయము, ఒడ్డెరాజులు పన్నీయఁజాలని శ్రీనాథు నవమానించి బాధపెట్టినవిధము. రెండు, మూఁడు, నాలుగు పాదములలోని "నల్లగుండు, వెదురుగొడియ, నిగళయుగము" అనుశబ్దము లీయవమతి విధానమును బ్రకటించు చుండఁగా గౌరవసూచక మగు "పొగడదండ" మొదటిపాదమునఁ బ్రసక్తి సంగతముగా లేదు. శ్రీనాథుని పాఠము "ఎదురెండఁ బొరకదండ" అని యైయుండు ననియు, పొరక యనఁగా గడ్డిపరక యనియుఁ దత్పరిషత్సభాధ్యక్షులు శ్రీవసురాయకవిశేఖరులు నాతో ముచ్చటించిరి. అది యుచిత మనియే నాతలంపు. విజ్ఞులాలోచింతురుగాక" అని లిఖించిరి.

ఆలోచింపవలసినవిషయమే. అందులకు బొగడదండ యనియే చదివెదరు. పొరకదండయని యెవ్వరును వాడుటలేదు. (నామొకుకలో) ఆలయములకుఁ గొనిపోవునపుడు మేకలకు మెడలో వేఁపాకుతోరణము లు కట్టెదరు. పూలుచుట్టెదరు. గుండములంబడువారు(గిరతఁజూపుటకై) రక్తమాల్యాంబరములం దాల్చు వారని పెద్దలవలన వినికి.

తిమ్మకవి శేషధర్మములు పద్యకావ్యములో—

గీ. బురదగుంటలోఁ ద్రొబ్బియుఁ బొగడదండ
　చుట్టి రాయెత్తి యిల్లడవెట్టి మఱియు
　నెంత బాధించినను ధన మీయఁ డయ్యె-

అని వాడినాఁడు. మూలములో:-

శ్లో. శృంఖలా శతసంయుక్తః కాష్ఠపాషాణపీడితః
　బహుధా భజ్యమానోఽపి తదా నోదత్తవాన్ ధనమ్.

అనికలదు. మూలములో లేని పొగడదండను శ్రీనాథునిదను పద్యమునుబట్టి చేర్చియుండును. పొగడదండ గౌరవస్ఫోరక మనుసందేహమున్నచోఁ 'బూలదండ' యనుకొనుట మంచిది. ఏవో నిర్గంధకుసుమము లని సంతసింపవచ్చును. పూలదండలు వధ్యచిహ్నములలోనివి. పొరక గడ్డిపరక యనుకొనుటకంటెఁ జీఁపురుపొరకయనుకొనిన మఱింత యగౌరవస్ఫోరకముగా నుండును, గాని, యెవ్వరును బొరకను, బొరకదండను వధ్యచిహ్నముగఁ గాని యవమతివిధానముగాఁ గాని వాడుచున్నారా యని వెదకవలయును. పూలదండ వధ్యచిహ్న మని- అభిజ్ఞానశాకుంతలములో షష్ఠాంకమున-

"జాణుఅ ఫుల్లన్తి మేహత్థా ఇమస్స వహస్స సుమణాపిణద్ధుం- తెనుఁగు-జానుకా! తల నరకకముందు పూలదండలు వేయవలెను గదా యీపచ్చెకాఁనికి, నాచేతు లాపనికోసము గులగులలాడుచున్నవిరా.' అని వసురాయకవిగారి తేటతెనిఁగింపు.

- 'Januka, my hands are itching to fasten th garland of flowers for the execution of the mar

రామచంద్రకాళేగారి యాంగ్లము. పువ్వులదండయో, పొవడదండ పొగడదండలక్రింద నానోట నానోట మాఱినదేమో.

ఏకు రెండయనేడు పోగడదండ కంఠమును గౌఁగిలించిన దని చెప్పుకొన్నను నవమతివిషయములోఁ గంఠమునఁ బూలదండలు వేయుట వాడుకయైనట్లు స్ఫురించుచున్నది. పూర్వము వధించుటకే పూలదండలు వేయునాచార ముండఁగా నవమానించుట కుండుట వింత కాఁగూడదు. వధించుట యనఁ జంపుటయే. "వధ్యాః శీర్షచ్ఛేద్యాః"- ముసల్యాః, విష్యాః, మొదలగునవి వధించుట యనఁ జంపుట యనియే యర్థముఁ జెప్పుచున్నవి. ఉంగరము దొంగిలించినాఁ డనుకొనుఁడు. దొంగ కురిశిక్ష,కొఱత యెక్కుడనయిన న్యాయమా: ఈపూర్వన్యాయమునుగూర్చి యాలోచింపఁదగినదియే.

శ్రీనాథునికి ధనమీయనికారణముననే యవమతికై పోగడదండ చుట్టిరి. తిమ్మకవియును ఋణవిమోచనవిషయముననే శేషధర్మములో వివానికిఁ బోగడదండ చుట్టినాఁడు. కాళిదాసాదులు చంపుటకే చుట్టించినారు.

ఏయొడ్డెరాజులైనను శ్రీనాథునంతటికవి నేఁ డనూఱుటంకములు చెల్లింపలే దని చెల్లింపలేకపోయినాఁడని యంతటియవమానము చేసి రనిన నెడ్డెతనముగనే తోఁచుచున్నది. రూపాయకు మూఁడుటంకములు. అనఁగా టంకము రు. 0-5-4. ఈస్వల్పధనమున కంతటిశిక్ష యుచితమా. ఉంగరపుదొంగకు తలసఱికింపా! న్యాయమాలోచింపుఁడు.

విజ్ఞులండఱును బోఁడదండకో పొరకదండకో విమర్శింపుఁడు, నేను మొదట నిశ్రీనాథుని కృషీవలత్వమునకై విచారించెదను. ఇది భారవి, కాళిదాసుల కథలవలెనే కల్పితము- కృష్ణాతీరపు బొడ్డుపల్లె కథకులగు నొడ్డెరాజు లెవ్వరో శ్రీనాథునికాలమునాఁటి రా జెవ్వఁడో చరిత్రము చెప్పునంతకుఁ జారిత్రికులఁ దొందరపెట్టుచున్నాఁడను. ఆచరిత్రము తెలిసినచో గొడ్డేలి, గొడ్డేటిపదములయర్థము విచారింతము. ఉండవలసినచో గొడ్డేఱనియే యుండవలయును. "చెలియలికి నాకు గొడ్డేఱ కలకపుట్టె"- క్రీడా. ఈకట్టుకథ లోకములో లేకున్నను- నేను గాదని వాదించినను భాషకుఁగాని లోకమునకుఁగాని నష్ట ముండదు. కవికి జారత్వ దోషము నారోపించిన లోకము కృషీవలుం జేసిన దనిన వింత లేదు.

విజ్ఞులు పైవిషయములన్నియు విమర్శించునపుడు బిలబిలాక్షులను పదమున కర్థమేమో కూడ నాలోచింతురుగాక,

క్రొ. సూ.

# గ్రంథస్వీకారము.

1. స్పృశ్యాస్పృశ్యవివేకము:—ఏలూరు పవరుపేట నివాసులు బ్రహ్మశ్రీ కలపర్తి వేంకటకృష్ణశర్మపాకయాజిగారు రచించినది. సుమారు 110 పుటల వచనగ్రంథము. ఉపన్యాసరూపము. ఇం దస్పృశ్యత, స్పృశ్యతలును వానిభేదములును మంచిచెడ్డలును జూపఁబడినవి. పంచభూతములయందును మంచిచెడ్డలు గల వని- మన మూహింపను గాని నిక్కముగా మంచిచెడ్డ లందుగల వని యెంచి విడఁదీయవచ్చును. నీరు-మంచిది, చెడ్డది, పవిత్రమైనది; నిప్పు-మంచిది, చెడ్డది, పవిత్రమైనది; భూమి-మంచిది, చెడ్డది, పవిత్రమైనది; గాలి-మంచిది, చెడ్డది, పవిత్రమైనది- ఇట్లు భేదములను గ్రహింపవచ్చును. అట్లే పదార్థములలో-తినుబండములలో, వాడుకొను వస్తువులలో మంచిచెడ్డ లున్నవి. స్పృశింపఁదగినవి యున్నవి. తగనివియున్నవి. స్పృశించిన లాభించునవి గలవు. నష్టమువచ్చునవియుఁ గలవు. ఈరీతిగా మంచిచెడ్డలు లాభాలాభములు విచారించి యుపన్యాసముం గావించిరి. వ్యతిరేకవాదులైనను వాదబలమునకైనను దోషనియుక్తులు నేర్చుటకైనను దీనిని బూర్ణముగ విమర్శదృష్టితోఁ జదువఁదగినది. సాధారణులు తెలిసికొనఁదగు విషయము లింద నేకములుగలవు. వెల రు. 0-8-0 గ్రంథకర్తగారియొద్ద దొరకును.

2. మాఘమాహాత్మ్యము:—గ్రంథకర్త కీ. శే. అబ్బరాజు శేషాచలశర్మగారు. ఆఱాశ్వాసములు. రెండువేలకు మించినపద్యములు. బహువిధోపాఖ్యానములతో, మాహాత్మ్యములతో నీగ్రంథము రచియింపఁబడినది. పద్మపురాణములోనుండి యీమాఘమాసమాహాత్మ్యము కథ గ్రహింపఁబడినది.

కవిత్వము మృదువైనది. పురాణోచితమగు భాషలో నున్న దనవచ్చును. సులభసంస్కృతాంధ్రపదములతోఁ గూడినది, గాని, యపప్రయోగములు, వ్యాకరణదోషములు,ఛందోభంగములు నందందుఁగలవు.

మొదటఁ గొంత కవిగారిజీవితము వ్రాయఁబడినది. కృతజ్ఞతాపూర్వకవిజ్ఞప్తి, పండితాభిప్రాయము మున్నగునవి చేర్పఁబడినవి. చేతి

పొరపా ట్లచ్చటచ్చటఁ గలవు. రెండుపద్యములు కవిత్వరీతికై, గ్రంథ విషయమునకై చూపఁబడును.

సీ. కంచుపాత్రమున భుజించువానికి నాయు
  వును గీర్తి బలమును బుద్ధి చాల
నధికమై కనుపట్టు, నాలుమగఁడు నొక
  పాత్రయందు భుజింపవలయు నన్న
నది నూటయేఁబది యగుఫలములయెత్తు
  కంచుగిన్నియను జేయింపవలయు
నటులుగాకుండిన నాదంపతులు భుజిం
  చుట వేరువేరుగాఁ జూడవలయు
నుపనయనము కాకయుండిన మగవాని
పెండ్లి కాని యాఁడుపిల్లదాని
ప్రౌఢలైన యాఁడువారలపొత్తున
భోజనమును జేయఁ బూనఁగ దెపుడు. 3. 97

సీ. హరిభక్తిలేని బ్రాహ్మణుఁడు దక్షిణలేని
  శ్రాద్ధ మాచారము జరుపనట్టి
వంశము, ద్విజకర్మ వదలిన రాచఱి
  కము వంచన గల ధర్మమును గోష
మునఁ దపంబును గ్రంథముల పరిశీలన
  లేని తెలివి భక్తిహీనమైన
భార్య సీతనులేని బ్రహ్మచర్యవ్రత
  మగ్నిమండక వ్రేల్చినట్టి హోమ
మొంటరిగఁ జేయు భోజన మొకరి ననుస
రించి జీవించువానికి నిచ్చునట్టి
కన్యవిధమున నెరఁడు మాఘమున శీత
జలములను దోఁగకున్న నాశనము నెందు. 5. 177

వెల సాదాప్రతి- రు. 2. క్యాలికో రు. 3. రేపల్లె హైస్కూలులో నాంధ్రోపాధ్యాయులును గవిగారితనయులునునగు బ్ర|| అబ్బరాజు హనుమంతరాయశర్మగారియొద్ద దొరకును.

3. శ్రీ చౌడేశ్వరీ మాహాత్మ్యము:—మైసూరురాజ్యమునందలి కోలారుజిల్లాకుఁ జేరిన గౌనిపల్లె గ్రామవాస్తవ్యులు శ్రీయుత గుమ్మరాజు రామకవిగారిచే రచియింపఁబడిన మైదాశ్వాసముల పద్యకావ్యము. ఆంధ్రభాష నియమవంతమై నిలుకడగలది గావున నేదేశమున నున్నను నిక్కమైనభాషాభిమానముగలవా రేని సర్వజనులకును దెలియు హృదయంగమముగుకీర్తిని నిష్టమ్ముగఁ గవిత్వము చెప్పఁగలరు. బహుభాషావేత్తలయ్యును బరభాషలను గౌరవించి పల్లెత్తును దూలనాడక స్వభాషను గానరకూసరచేయు నాంధ్రులుగల యిక్కాలమున శ్రీవావిలికొలను సుబ్బరావుపంతులుగారు వ్రాసినట్లు సలక్షణభాషాగ్రంథములకు దుర్భిక్షము పట్టినది. శ్రీనాగపూఁడి కుప్పుస్వామయ్యగారు చెప్పినట్లుగాఁ గన్నడభాష ప్రబలముగా నున్న మైసూరురాష్ట్రమున నివసించుచున్నను గవిగారు మాతృభాషయం దింతటి యనుపమానాదరమును నెఱపి యిట్టి మృదుపదసందర్భవిరాజమానం బగు కావ్యంబును రచించుట... వినుతిపాత్రము. కన్నడులకుఁ దెనుఁగుపై నింతవఱకు నరవలవలె దురభిప్రాయ ముదయించుటలేదు. ఉదయించుటకు వలను లేనంతటిసాజాత్యము రెండుభాషలకును గలదు. నియమసహితమై వ్యాపించుచున్న యీయాంధ్రభాషపై సదభిమానము గల మన రామకవిగా రిట్టిగ్రంథమును రచించి రనిన వినుతిసేయందగునుగాని వింతపడనక్కఱలేదు.

ఈగ్రంథమునకుఁ బ్రస్తావన శ్రీమాన్ రాళ్లపల్లె అనంతకృష్ణశర్మగారు లిఖించిరి. వడ్డాది సుబ్బారాయకవిగారు, వావిలికొలను సుబ్బారావుపంతులుగారు, నాగపూఁడి కుప్పుస్వామయ్యగారు, జనమంచి శేషాద్రిశర్మగారు మున్నగు పండితులు తమసదభిప్రాయముల నొసఁగి యున్నారు. మచ్చునకుఁ గొన్నిపద్యములు—

మ. మనవు ల్సెప్పఁగ వచ్చు దేవతలపై మౌనీంద్రబృందంబుపైఁ
దన కిర్వంకలఁ గొల్చు నయ్యుపనిషత్కాంతాళిపై భారతీ
స్తనగుచ్ఛంబులపైఁ జతుర్విధకటాక్షశ్రీల సారించి కొ
ల్వునఁ బొందామరగద్దెపై నెసఁగు వేల్పుం బెద్దఁ బ్రార్థించెదన్. ౧. 2.

చ. ఇతరు లెఱుంగరానిపనియొంటి పను ల్వినరానుగా కిలన్
బతికి నిజార్ధదేహయుగు భార్య యెఱింగిన హానిగల్గునే
సతి కెఱిఁగింపకుండినఁ గుశంకల నొప్పవనుమ్యోహుం గదా
హితమతితో వచింపు మది యెట్టిదొ దాఁపఁగనేల యియ్యెడన్. పు.75

ఉ. ఆయమరారినాయకుఁడు నాదిమశక్తిని గాంచి యిట్లనున్
మాయలకెల్లఁ బుట్టినిలు మాయసురాన్వయ మం చెఱుంగవే
మా మెఱుఁగుం గనంబడమి మాయలు మా కొకలెక్కలోనివే
మాయలమాఱివైన నిను మాయముసేయక మానమా నిసీ. పు. 140

ఇందలివస్తువు నందవరీకబ్రాహ్మణుల కులదేవతయగు శ్రీచాముండేశ్వరి మాహాత్మ్యము. చాముండేశ్వరియును హాదేశ్వరియును నొక్కటే. కథ లోకమున కపరిచితము గావున, ముందు, కొంతసంగ్రహముగఁ గథ చెప్పవలసినది. ఆశ్వాసములు, పుటల పైభాగమునఁ దెల్పినఁ జదువరు లకుఁ గొంతసాయపడి యుండును పద్యసంఖ్యయు నుండుట యవసరమే.

ఈపుస్తకములోని 1-2 ఆశ్వాసములు 1938 సం॥రపు ఇంటరు మీడియేటుపరీక్షకు మద్రాసువిశ్వవిద్యాలయమువారు నిపుణతమెఱయ నిర్ణయించిరి. వెల రు 1. కవిగారియొద్దనే దొరకును.

4. శ్రీభర్గశతకము:—ఇదికూచిమంచి తిమ్మకవిసార్వభౌమ విరచితము. వృత్తశతకము. ప్రకాశకులు తూర్పుగోదావరిజిల్లా పెద్దాపురము తాలూకాలోని గొద్దనాపల్లి (B. O.) లో సముద్రితాంధ్రగీర్వాణగ్రంథమాలకు సంపాదకులగు కూచిమంచి శ్రీరామమూర్తిగారు. వెల 0-4-0. శైలికి-

మ. మిము నొక్కప్పుడుఁ గొల్వనేరక వృథామిథ్యాప్రచారంబులం
గములై వాఁగులయందు నెల్ల మునుఁగంగాఁ బుణ్యము ల్వేసునే
తమి నశ్రాంతము నీటఁ గ్రుంకు లిడి యేధర్మంబు లార్జించె నా
కమఠగ్రాహఝషాలికుంభీరములు భర్గా పార్వతీవల్లభా. 56

# భాసుఁడు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఎ., బి. ఎల్. కాకినాడ.

14. రాజశేఖరుని కవివిమర్శ మను గ్రంథమున—

'కారణం తు కవిత్వస్య న సంపన్న కులీనతా
ధావకోపి హి యద్భాసః కవీనా మగ్రిమో భవత్।
ఆదౌ భాసేన రచితా నాటికా ప్రియదర్శికా।
... ... ... ... ... ... ... ... ... ... ... ... ...
తస్య రత్నావళీ నూనం రత్నమాలేవ రాజతే
దశరూపకకామిన్యా వక్షస్యత్యంత శోభనా।
నాగానందం సమాలోక్య యస్య శ్రీహర్ష విక్రమః
అమందానందభరితః స్వసభ్య మకరోత్కవిం
ఉదాత్తరాఘవం నూనం ఉదాత్తరసగుంఫితమ్
యద్వీక్ష్య భవభూత్యాద్యాః ప్రణిన్యు ర్నాటకాని వై
శోకపర్యవసన్నస్య నవాంక కిరణావళీ
మాకందస్యేవ కస్యాత్ర ప్రదదాతి ననిర్వృతిం
భాసనాటకచక్రేపి ఛేకైః క్షిప్తే పరీక్షితుమ్
స్వప్నవాసవదత్తస్య దాహకోభూన్న పావకః' ...

అనుశ్లోకములు గల వనియు నందువలన భాసుఁడు ప్రథమము న ధావకుఁ డనియు హర్షునియాస్థానకవియై రత్నావళీనాగానందప్రియదర్శికోదాత్తరాఘవముల రచించె ననియు, నాతనికిరణావళీనాటకము శోకపర్యవసాయి యనియు, భాసనాటకచక్రమున స్వప్ననాటక మొక్కటియే యగ్నిచే దహింపఁబడలే దనియు, హర్షునియాస్థానకవి యగు భాసుఁడు కాళిదాసునకు బూర్వుఁ డెట్లగు ననియు గొందఱు విమర్శించియున్నారు. రాజశేఖరుఁడు కావ్యమీమాంసను రచించె ననియే కాని కవివిమర్శమును రచించె నని మన కేగ్రంథమువలననుఁ దెలియుట లేదు. అట్టిగ్రంథ మున్నటులు గల్పింపఁబడిన దని పలువురు పండితుల

యభిప్రాయమై యున్నది.[1] బరోడాలో ముద్రింపఁబడిన కావ్యమీమాంసాపీఠికయు, వాణీవిలాసముద్రాలయమున ముద్రింపఁబడిన ప్రియదర్శికా నాటకపీఠికయుఁ జూడుఁడు. రత్నావళ్యాదినాటకత్రయము హర్షవర్ధన కృతము లని ప్రాచ్యపాశ్చాత్యుల యభిప్రాయము. రత్నావళీప్రియదర్శికలు కాళిదాసునిమాళవికాగ్నిమిత్త్రముపై నాధారపడియున్నవి. భాసుఁడు హర్షవర్ధనుని యాస్థానకవి యనుట కెట్టియాధారమును లేదు. భాసు నిస్తుతించిన బాణుఁడు నట్లు దెలిపియుండ లేదు. భాసధావకవాదమునకుఁ గావ్యప్రకాశికయే మూలకారణము. మమ్మటుని వ్యాఖ్యాతలు నాగోజీభట్టు, విద్యానాథ, మహేశ్వరజయరామ ప్రభృతులు 'శ్రీహర్షాదేర్ధావకాదీనామివ ధనమ్'నియే గ్రహించిరి. కాని పెక్కు కావ్యప్రకాశికా ప్రతుల 'బాణాదీనా మివ,' 'భాసకాదీనా మివ' 'మయూరాదీనా మివ' అనుపాఠాంతరములు గలవు.

ఇట్టియాధారములవలన భాసధావకుల కైక్యతనిర్ణయించుట హాస్యాస్పదము. మఱియు 'శ్రీహర్షాదేర్ధావకాదీనా మివ ధనమ్'ని కావ్య ప్రయోజనమును మమ్మటుఁడు నిర్వచించి యున్నాఁడు. వ్యాఖ్యాతల నటుంచినచో దీనివలన ధావకాదులు గ్రంథముల రచించి హర్షునకంటఁ గట్టి రనుట యెట్లు పొసఁగును. ఉద్గ్రంథముల రచించి కవిపోషకుఁ డగు హర్షవర్ధనునివలనఁ బారితోషికములఁ బడసి రనరాదా? 'అర్థకృతే' అనుచోఁ గావ్యాదులనమ్మి యర్థమునుఁ బడసిరను విపరీతార్థ మేల చెప్పవలయును. పెక్కుకవులఁ దనయాస్థానమున నాదరించి మెప్పువడసిన హర్షవర్ధనుఁడు కాళిదాసాదుల ననుకరించి రత్నావళ్యాదుల రచించె ననరాదా? (ఈసందర్భమున నాంధ్రవాఙ్మయమున నాముక్తమాల్యదను బెద్దనార్యుఁడే రచించెనను వాదమును స్మరింపఁదగును.) రత్నావళ్యాదులు భాసునిచే రచింపఁ బడలే దనియు, భాసుఁడు హర్షవర్ధనుని కాలమునాఁటివాఁడు గాఁడనియు, మాళవికాగ్నిమిత్త్రపీఠికలోఁ దెలుపఁ బడినటుల కాళిదాసునకుఁ బూర్వుఁ డనియుఁ గవివిమర్శ మను గ్రంథ

---

1. Indian Historical Quarterly. Vol. I. Part 2. The Bhasa Problem by K. G. Sesha Iyer.

ము కావ్యప్రకాశికావ్యాఖ్యాతల ననుసరించి సృష్టింపఁబడిన దనియు మనము నిశ్చయింపవచ్చును. కవివిమర్శములోని వనఁబడిన శ్లోకములు సృష్టింపఁబడినవని పలువురు ప్రాచ్యపాశ్చాత్యపండితు లంగీకరించి యున్నారు.

15. అవిమారకకములోని 'ధర్మః ప్రాగేవ చిన్త్యః' (అంక-1 శ్లో 12) అనుశ్లోకము శార్ఙ్గధరపద్ధతియం దుదహరింపఁబడినది. (శ్లో. 1805) కవి నామ మనుదాహృతము. శార్ఙ్గధరునికి (క్రీ. శ. 14 వ శతాబ్దము) యవి మారకము తెలియుననుట కిది నిదర్శనము.

16. వాక్పతిరాజు భాసునిజ్వలనమిత్రుఁ డనుటవలనను సూక్తి ముక్తావళియందు భాసనాటకము లగ్నిం బరీక్షింపఁబడిన వనుటచేతను, జోనరాజువ్యాఖ్యానమువలనను, లావాణకదహనవర్ణనమే గాక భాసుఁడు తననాటకముల నగ్నిని బెక్కుసారులు వర్ణన మొనర్చె ననియు నందు వలన నాతని కగ్నిమిత్రుఁ డనుసార్థకనామము గలిగె ననియు జ్యోతిష చంద్రఘటక్ గారు తమవ్యాసమున నిరూపించియున్నారు. ఆవ్యాసము నందే స్వప్నవాసవదత్తాది తిరువనంతపురనాటకముల నేయేపట్టుల నగ్ని వర్ణింపఁబడియున్నదో యవియన్నియుఁ జూపఁబడినవి.[1] పంచరాత్రము న ప్రథమాంకమునందలి 6 మొదలు 19 శ్లోకముల యజ్ఞశాలాగ్ని సందీపనము వర్ణింపఁబడినది.

17. మదరాసుప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున(RNo 2778) 'శాకుంతలచర్చా' అనువ్యాఖ్యానమునఁ జారుదత్త, పంచరాత్ర, బాల చరిత, దూతఘటోత్కచ, యవిమారక, స్వప్నవాసవదత్తము లుదా హరణములుగఁ గైకొనఁబడినవి.[2] తద్వ్యాఖ్యానకర్త పేరు గాని, కాలము గాని తెలియుట లేదు. ఈవిషయము విపులముగ, పండిత వేంకటరామ శర్మగారివ్యాసమున జర్చింపఁబడినది. త్రైవిక్రమ, భగవదజ్జుక, వీణా

1. Journal of the Department of Letters — Vol. XII Dramas of Bhasa by J. C. Ghatak.
2. Indian Historical Quarterly Vol. V — Part IV.

వాసవదత్తాది నాటకప్రశంసయుఁ గలదు. కవులనామము లుదాహరింపఁబడలేదు.

తిరువనంతరపుర నాటకములకు సంబంధించినంతవఱకు వ్యాఖ్యాన భాగము లిటుఁ జూపుదును.

చారుదత్తే పునః సూత్రధారస్యాపి ప్రాకృతమ్- తచ్చిన్త్యమ్- కర్పూరమంజర్యాంతు యుక్తమ్ సట్టకస్య ప్రాకృతాత్మకత్వాత్ - (పు12).

యథాచారుదత్తే- తత్రహి ఉపవాసపారణానిరత నటీప్రార్థనయా సూత్రధారఆమంత్రణనిమిత్త(బ్రా)హ్మణార్థం కంచిద్బ్రాహ్మణాం విచిన్వన్ సాక్షాచ్చారుదత్తస్యవయస్యాం మైత్రేయం దృష్ట్వా ఉపసృత్యనియన్త్రితవాన్—(పు 23).

తత్ర విక్రమోర్వశీయాదౌ మారిషం ప్రతి అస్య సూత్రధారస్య స్వకార్యవచనమ్। భగవదజ్జుకాదౌ విదూషకం ప్రతి। అత్ర శాకున్తలే నటీం ప్రతి। నను దూతఘటోత్కచాదౌ నటాదిరహితేన సూత్రధారేణ స్థాపనా క్రియతే। ఏకాంకరూపకేష్వేవ మితిచేత్ కథం కల్యాణసౌగంధికాదౌ అనేకాంకేష్వేవం దృశ్యతే కథం పంచరాత్రే ? అనాటక ఏవమితిచేత్ కథం బాలచరితే.........(పు. 14).

దూతఘటోత్కచే స్థాపనాయాం సూత్రధార ఆహ—

యాం త్వర్జునప్రత్యభియానభీతా
య తోఽర్జునస్తాం దిశమీక్షమాణాః
నరాధిపాః స్వాని నివేశనాని
సౌభద్రబాణాంకితనష్టసంజ్ఞాః-

తదేవ (దూతఘటోత్కచే) సూత్రధారస్య నివేద్యతాం నివేద్యతాం ఇతి నైపథ్య భాషితం శ్రుత్వా.........(పు. 28).

నాగానందచూడామణిప్రభృతౌ నట్యాసహ సూత్రధారేణ కృతా సూచనాస్థాపనే త్యుచ్యతే—నతు ఆముఖమితి—క్వచిదేవ ముఖ్యచ్యతే యథా అవిమారక (తపతీ) సంవరణాదౌ— మాలతీమాధవేన పారిపార్శ్వకేన సహకృతా ప్రస్తావనేతి కథ్యతే- పునః స్థాపనేతి కథ్యతే- అన్యత్ర తథాపిచ కథ్యతే- యథావిక్రమోర్వశీయాదిషు క్వచి

త్పునః సూత్రధారేణ కృతా సూచనా స్థాపనే త్యుచ్యతే- యథా బాలచరితస్వప్నవాసవదత్తాదిషు- (పు. 30).

తథాస్వప్నవాసవదత్తాయాం- 'ఏవ మార్యమిశ్రాన్ విజ్ఞాపయామి- అయే కిందు ఖలు మయి విజ్ఞాపనవ్యగ్రే శబ్ద ఇవ శ్రూయతే- అంగ పశ్యామి- (నేపథ్యే)- ఉత్సరహ అం ఆ..........ఇత్యాది- ఉచ్యతే అత్రఖలు విస్మరణస్య కారణం విజ్ఞాపనవ్యగ్ర ఇతిసాక్షాదుక్తమ్- కీదృగిదమ్ విజ్ఞాపనం చేత్ ఉచ్యతే- భోః సభాసదః సాంప్రత మహాం స్వప్నవాసవదత్తాం నామనాటకం ప్రయోక్ష్యే- తదవధానేన అనుగృహ్యతా మితి—

ఈవ్యాఖ్యానభాగములవలనఁ దిరువనంతపురనాటకములు స్పష్టముగ నీవ్యాఖ్యానమున సూచింపఁబడీన వని నిర్ణీత మగుచున్నది.

18. జయదేవుఁడు తన ప్రసన్నరాఘవనాటకమున భాసునికావ్యములం గల ముఖ్యగుణము హాస మని 'భాసో హాసః' అనుటవలన సూచించియున్నాఁడు. తిరువనంతపురనాటకముల నీహాసము చక్కఁగఁ బోషింపఁబడిన దని పలువుర యభిప్రాయము- ప్రతిజ్ఞాయౌగంధరాయణమునఁ జతుర్థాంకమున భటగాత్రసేవకుల ప్రసంగము హాస్యరసపూర్ణమైయున్నది. గాత్రసేవకుఁడు పానమత్తుఁడై

ధన్యా సురాభి ర్మత్తా ధన్యా సురాభి రనులిప్తాః
ధన్యా సురాభి స్స్నాతా ధన్యా సురాభి స్సంజ్ఞాపితాః
అథవా ఆత్మనః పుత్రదారాణాం కష్టం శృణ్వాంతో యేమూఢా
నరాః సుసమృద్ధాః సురాతటాకమ్ న స్మరంతి—

అనుటఁ గేవలహాస్యరసపోషకము. మఱియు మధ్యమవ్యాయోగమున ఘటోత్కచుఁడు, తల్లియగుహిడింబ కాహారముగాఁ భీమునిఁ, గొనివచ్చుటయు, మధ్యముఁడను బ్రాహ్మణబాలకునిఁ బిలువఁ బాండవమధ్యముఁ డగుభీముఁడు వచ్చుటయు హాస్యరసోత్కర్షము. అభిషేకనాటకమున (అంక- 1) రాముఁడు సీతతో 'సుష్టు త్వర్జితమ్- అల్పమ్ తుల్యశీలాని ద్వంద్వాని సృజ్యంతే' అని నర్మోక్తు లాడుటయు నట్టిదే. స్వప్ననాటకమునందలి (అంక, 4 శ్లో- 9).

గుణానాం వా విశాలానాం సత్కారాణాంచ నిత్యశః
కర్తారః సులభా లోకే విజ్ఞాతారస్తు దుర్లభాః—

యనుశ్లోకము హాసమునకుఁ జక్కని యుదాహరణ మని ఘట కుగారు వ్రాసియున్నారు[1] (పు. 19).

మఱియు భాసుని వనబంధు చాటుశ్లోకములలో

కపోతే మార్జారః పయ ఇతి కరా న్లేఢి శశిన
స్తరుచ్ఛిద్రప్రోతాన్ బిసమితి కరీ సంకలయతి
రతాంతే తల్పస్థాన్ హరతి వనితా ప్యంశుక మితి
ప్రభా మత్తశ్చంద్రో జగదిద మహో విప్లవయతి—

ఈశ్లోకము భాసునిహాసముయొక్క నైజస్వరూపమును మనకు దృగ్గోచర మొనర్చుచున్నది. తిరువనంతపురనాటకముల నిట్టిహాసము పలుతావులఁ బ్రదర్శింపఁబడుట, జయదేవశ్లోకానుసార మివియే భాస కృతము లని నిర్ణయింపనగును.

పైవిషయముల నిష్పక్షపాతబుద్ధితో విమర్శించిన యెడలఁ బ్రాచీ నాలంకారికులకుఁ గవులకు స్వప్నవాసవదత్తాదినాటకములు దెలియు ననియు, నందు మనకిపు డుపలబ్ధ మగు స్వప్నవాసవదత్తమునే భాసుని దని వారు విశ్వసించి రనియు, భామహదండివామనుల కాలమునాఁటికే యానాటకములు ప్రచారములోనున్న వనియు, దిఙ్నాగునకుఁ బ్రతిమా నాటకము దెలియు ననియు, బాణుఁ డుదహరించిన భాసనాటకచక్ర మిదియే యనియు దేలుచున్నది. ఆలంకారికులయొక్కయు, సుభాషితా వళ్యాది గ్రంథకర్తలయొక్కయు గ్రంథముల సవిమర్శముగఁ గైకొననిచో నెన్నియో సమస్యలు బయలుదేఱును. గ్రంథకర్తృత్వనిర్ణయ మసాధ్య మగును.

తిరువనంతపురస్వప్నవాసవదత్తము భాసకృత మనియు, బాణో దాహృతభాసనాటకలక్షణము లీనాటకములకు వర్తించు ననియు నిర్ణయ మగుచో, మిగిలిననాటకము లేకకర్తృకవాదముచే భాసునివే యగును. అయిననిటఁ బ్రతిపక్షులు కేరళనాటకచక్రవాదమునుద్ఘోషించుచున్నారు.

1. Journal of the Department of letters Vol. XII.

5. కేరళనాటకచక్రము.

'నాంద్యంతే తతః ప్రవిశతి సూత్రధారః' అనియు, 'స్థాపనా' అనియుఁ గనఁబడు నాటకములు దాక్షిణాత్య(కేరళ)నాటకచక్రమునఁ బెక్కులు గల వనియు నందు విశేషించి, యాశ్చర్యచూడామణి, దామక ప్రహసనము, కల్యాణసౌగంధికము మొదలగునవి శైలియందు భాసనాటకములనుఁ బోలియున్న వనియు, 'అయే కిం ను ఖలు మయి విజ్ఞాపన వ్యగ్రే శబ్ద ఇవ శ్రూయతే అంగ! పశ్యామి' అని కొన్ని నాటకములఁ గన్పట్టుచున్న దనియు, నందువలన భాసుఁడే వాని నన్నిటిని రచించె ననవలసి యున్న దనియు గేరళనాటకచక్రవాదులు వాదించుచున్నారు. కేరళదేశమున నేఁటికిని శాక్యారు లనఁబడు కుశీలవజాతివారిచేఁ బ్రదర్శింపఁబడు నాటకము లిరువదియూఁ డనియు, వానికే కేరళనాటకచక్రమని పేరనియు, తిరువనంతపురనాటకములు భాసునివి కావనియు, భాసనాటకచక్ర మనుటకంటె కేరళనాటకచక్ర మనిన మేలనియు పిష రొటీపండితులు నిర్ధారణ మొనర్పఁ బ్రయత్నించిరి. వీరి వాదానుసారము కేరళనాటకచక్రమునకుఁ జెందిననాటకము లిట జూపఁబడినవి.

1-13 తిరువనంతపురనాటకములు.

14- సుభద్రాధనంజయము - కులశేఖరవర్మకృతము.

15- తపతీసంవరణము - ,,

16- ఆశ్చర్యచూడామణి - శక్తిభద్రవిరచితము.

17- నాగానందము - హర్షకృతము.

18- భగవదజ్జుకము - బోధాయనకవి.

19- మత్తవిలాసప్రహసనము - మహేంద్రవిక్రమవర్మ.

20- కల్యాణసౌగంధికము - నీలకంఠకవి.

21- శ్రీకృష్ణచరితము - (కవిపేరు తెలియదు).

22- విచ్ఛిన్నాభిషేకము - (ఇది ప్రతిమానాటకమునందలి ప్రథమాంకము. క్రీ. శ. 11 వ శతాబ్దమువాఁడగు భాస్కరరవివర్మవిరచిత మని ప్రతీతి).

23- మహానాటకము.

ప్రతిజ్ఞాయౌగంధరాయణములోని తృతీయాంకమును వీరు మంత్రాంకనాటక మని పేరిడి ప్రదర్శించుచున్నా రని గణపతిశాస్త్రిగారు వ్రాసియున్నారు. దామకప్రహసనమున గ్రంథకర్తపేరు గన్పడదు. దానిని విమర్శింపఁ గొంతభాగము కర్ణభారమునుండియుఁ గొంత స్వప్నవాసవదత్తమునుండియుఁ గైకొనఁబడినట్లు స్పష్టము. మఱియు నొకశ్లోకము కుమారసంభవములోనిది. వచనభాగము కొంత శాకుంతలములోఁ గలదు. ఇది స్వతంత్రకృతి యని చెప్పుటకు వీలులేదు. ఇది భాసునిది కాదని జాలీగారు (Jolly) నిర్ణయించియున్నారు.

కల్యాణసౌగంధిక, తపతీసంవరణ, సుభద్రాధనంజయములఁ గవిపేరు స్పష్టముగఁ బ్రస్తావనయందుఁ గానవగును. మొదటిది నీలకంఠవిరచితము. మిగిలినవి కులశేఖరవర్మచేఁ బదునొకండవశతాబ్దమున రచితములు. ఆశ్చర్యచూడామణి శక్తిభద్రకృతము. శక్తిభద్రుఁ డున్మాదవాసవదత్తమునుఁ గూడ రచించె నని ప్రస్తావనయందుఁ గలదు. శూద్రకుని పద్మప్రాభృతికము, ఈశ్వరదత్తుని ధూర్తవిటసంవాదము, శ్యామిలకుని పాదతాడితకము లనునవి గ్రంథకర్తలనామములు గద్యములయందీయఁబడినవి. శ్యామిలకుని గ్రంథమునఁ గవి యుత్తరదేశీయుఁ డనియు విశ్వేశ్వరునిపుత్రుఁ డనియుఁ దెల్పఁబడియున్నది. పైనాటకము లన్నియుఁ గేరళనాటకచక్రములోని వని యొప్పికొనినను, భాసనాటకములకును వీనికిని శైలిలో భేదము గలదు. మంగళశ్లోకముల ముఖ్యపాత్రసూచనయు లేదు. వీనిలో నాశ్చర్యచూడామణి యొక్కటియే భాసనాటకములఁ గొంతవఱకుఁ బోలియున్నది. పండిత హీరానందశాస్త్రిగారీవిషయమును దమగ్రంథమున జర్చించియున్నారు (పు 14, 15, 16).[1] ప్రతిమాభిషేకముల రచించినకవి యాశ్చర్యచూడామణిని రచియింప నవసరము లేదు. కథయు రామాయణము ననుసరింపక పెక్కుమార్పులను జెందియున్నది. కథాసంవిధానము, పాత్రపోషణాదికములఁ గాంచినచో నది తరువాతి గ్రంథ మనక తప్పదు. శక్తిభద్రుఁడు కొంతవఱ కభిషేకనాటకము ననుస

1. Bhasa and the authorship of the thirteen Trivendrum plays — No. 28. Memoirs of Archaelogical Survey of India.

రించెను. రంగమున జటాయుమరణమును, కొన్ని తావుల భాసునిపదజాలమును గైకొనుటయు దీనిని స్పష్టపఱచుచున్నది. శక్తిభద్రుఁడే తిరువనంతపురనాటకముల రచించియుండు ననుకుప్పుస్వామిశాస్త్రి, పిషరోటీగారి వాదములను బాగుగ ఖండించి శైలిని బట్టియుఁ, గథావిధానమును బట్టియుఁ, బ్రస్తావనాభరతవాక్యములను బట్టియు శక్తిభద్రుఁడె వ్నఁటికిని తిరువనంతపురనాటకకర్త గానేరఁడని పరాంజపేగారు తమ వ్యాసమున నిరూపించియున్నారు.[1] ప్రతిమానాటకమునందును నాశ్చర్యచూడామణియందును గలసీతాపహరణవృత్తాంతమును బోల్చిచూచో నిది విస్పష్టమగును. ఆశ్చర్యచూడామణియందలి యంగుళీయకచూడామణుల ప్రభావవృత్తాంతమును దిరువనంతపురనాటకకర్త రచించియుండఁడు. ఇరువుర నాటకరచనాపద్ధతులే వేఱు.

ప్రస్తావనయందుఁ గలసూచనలచే నాశ్చర్యచూడామణి దాక్షిణాత్యకవులచే రచియింపఁబడిన ప్రథమనాటక మేమో యని తోఁచుచున్నది. 'సికతాః తైలము త్పాదయంతి; యది దక్షిణస్యాం దిశో నాటకనిబంధన' మ్మను నటీవాక్యమును, 'గుణాః ప్రమాణం న దిశాం విభాగః' అనుసూత్రధారుని వాక్యమును దీనిని దృఢపఱచుచున్నవి. నీలకంఠకులశేఖరవర్మగ్రంథము లాశ్చర్యచూడామణి యనంతరము రచింపఁబడినవి. శక్తిభద్రుఁడు శ్రీశంకరాచార్యులవారి శిష్యుఁడనియు, నాశ్చర్యచూడామణి యేకారణముచేనో యగ్నిలో నశింప, వారు తమధారణాశక్తివలన, దానిని దిరుగ రచింపఁజేసిరనియు మళయాళదేశమునఁ బ్రతీతి గలదఁట.

మఱియుఁ గులశేఖరవర్మకాలమున- క్రమదీపికా, ఆత్తప్రకారమను గ్రంథములు రచింపఁబడె ననియు, నందు రెండవదానిలోఁ బదునాలుగునాటకములు ప్రదర్శింపఁబడుచుండినటులు సూచింపఁబడె ననియు పిషరోటీగారు వ్రాసియున్నారు. తపతీసంవరణసుభద్రాధనంజయములు, ఆశ్చర్యచూడామణి, కల్యాణసౌగంధికము, నాగానందము, కృష్ణచరిత

1. Bhasa Versus Saktibhadra by S. M. Paranjpe-Annals of the Bhandarkar Institute Vol. IX. P. 9.

ము, భాసుని వనఁబడునాటకములలో నెనిమిదియును చేర్పఁబడినవఁట. శక్తిభద్రుఁ డున్మాదవాసవదత్తమును, ఆశ్చర్యచూడామణిని రచియించిన టులఁ జేర్చాని మిగిలినకృతులనుఁ జేర్చాన మఱచునా? అందును మిన్న యగు స్వప్నవాసవదత్తమునే వదలి యుండునా? నీలకంఠశక్తిభద్రకుల శేఖరవర్మ లీనాటకముల రచించినటులు చెప్పు నాధారము లేమియును గానరావు. అది యసంభవము. భాసనాటకచక్ర మనుటకంటె, కేరళ నాటకచక్ర మని కాని శాక్యారునాటకచక్ర మని కాని యనవలయు నని పిషరొటీ కుప్పుస్వామిశాస్త్రిగార్ల యాశయము. మన మీనాటక ముల నేచక్ర మని పిలిచినను, గ్రంథకర్తృత్వనిర్ణయ మామువలన సిద్ధింపదు. ఉన్మాదవాసవదత్తాస్వరూప ముపలబ్ధముగామి యదినే ప్రతిజ్ఞా యౌగంధరాయణ మై యుండు నని యొకమాఱును, వీణావాసవదత్త[1] మై యుండు నని యొకమాఱును, శ్రీశాస్త్రిగా రూహించుచున్నారు. ఉన్మా దవాసవదత్తాకర్త యగుశక్తిభద్రుఁడు ప్రతిజ్ఞాస్వప్ననాటకముల రచించె ననుట యుక్తియుక్తము గాదు. ఉన్మాదవాసవదత్తమే స్వప్ననాటక మను హీరానందశాస్త్రిగారి యూహయు సహేతుకముగఁ గన్పట్టదు. స్వప్నో న్మాదపదములు సమానార్థకములును గావు.

మనకుఁ దిరువనంతపురనాటకప్రతులు కేరళదేశముననే దొరకిన వగుటఁ గేరళనాటకచక్రమునకుఁ జెందిన వనియు, నాధునికము లనియు ననుట యసమంజసము. కేరళదేశమునకుఁ జెందిన వని నిరూపించుటకు శ్రీకుప్పుస్వామిశాస్త్రిగారు తమ యాశ్చర్యచూడామణిపీఠికయందుఁ గొన్ని వింతవిషయములను వ్రాసిరి. ప్రతిజ్ఞాయౌగంధరాయణమున ద్వితీయాంకమున 'కిం సంబంధో నిశ్చితః' అను దేవివాక్యమును 'ఏవం సంబంధం మన్యతే మహాసేనః' అను యౌగంధరాయణవాక్యమును గేరళసంబంధవివాహముల సూచించు నని వ్రాయుట యొకటి. ఆశ్చర్యచూడామణికర్తయే తిరువనంతపురనాటకముల రచియించె ననుట కున్మాదవాసవ

---

1. ఇది మదరాసు ప్రాచ్యపరిశోధకసంఘమువారిచేఁ బ్రకటింపఁబడినది. గ్రంథకర్తపేరు తెలియదు.

దత్తమే ప్రతిజ్ఞాయౌగంధరాయణ మనుట తేఁటపడయెడి. క్రీ. శ. 10 వ శతాబ్దమునాఁటి నాటకముల భాసుని కంటఁగట్టుచున్నా రని ప్రతిపక్షులయారోపము. అట్టి యుద్దేశముతోడనే వీలయినంత యాధునికత నాపాదించుటకు వీరు యత్నించుచున్నారు. ప్రతిమానాటకమునందు (అంక-5) 'భోః కాశ్యపగోత్రో౽స్మి! సాంగోపాంగం వేద మధీయే, మానవీయం ధర్మశాస్త్రం, మాహేశ్వరమ్ యోగశాస్త్రమ్, బార్హస్పత్య మర్థశాస్త్రమ్, మేధాతిథే ర్న్యాయశాస్త్రమ్, ప్రాచేతసం చ శ్రాద్ధకల్పం చ' అను వాక్యమునందలి మేధాతిథిరచిత మగు న్యాయశాస్త్ర మెద్ది యని విమర్శించుచు, 10, 11, శతాబ్దముల మనుధర్మశాస్త్రమునకు వ్యాఖ్యాన మొనర్చిన మేధాతిథియే యిం దుదహరింపఁబడె నని స్థిరపఱిచిరి. అతఁడు మనుస్మృతికి వ్యాఖ్యాన మొనర్చెను గాని న్యాయశాస్త్రమును రచించియుండలేదు. అదియు నుం గాక కవి శాస్త్రములను వేర్వేఱుగ నిరూపించి వానిని బ్రథమమున రచియించినవారిని జెప్పియున్నాఁడు. అందువలన న్యాయశాస్త్రకర్త యగు మేధాతిథి 10 వ శతాబ్దమువాఁడు కానేరఁడు. ధర్మశాస్త్రరచయిత యగు మనువును స్మరించి యాతని వ్యాఖ్యాత నేల చెప్పవలయును? ఎటులయిన నీనాటకముల కర్వాచీనత నాపాదింప యత్నించుటచే నిట్టివిపరీతములు వ్రాయవలసి వచ్చినది.

భాసపక్షమువారును దమశక్త్యనుసారము భాసుని పాణినికిఁ బూర్వుఁ డని స్థిరపఱుప యత్నించుచున్నారు. కాళిదాసునకుఁ బూర్వుఁ డని మాళవికాగ్నిమిత్రమునఁ గలదే! భరతునికిని బాణినికిని బూర్వుఁ డని యేల స్థిరపఱుప యత్నింపవలయును. ఇదియు నిరాధార మని వాఙ్మయపరిశోధకు లెఱుంగకమానరు.

## 6. భాసపాణినిపతంజలులు.

భాసనాటకములయం దపాణినీయము లగు ప్రయోగములు పెక్కులు గలవు. భరతశాస్త్రవిరుద్ధము లగువిషయము లున్నను, భరతునియమంతర మట్లు కవి స్వాతంత్ర్యుఁడై రచించి యుండవచ్చు నని యిదివఱకే నిరూపింపఁబడినది. ఆర్ష ప్రయోగములు, అపాణినీయములు గల

వనిన ప్రాచీనకవి యనియుఁ బాణినికిఁ బూర్వుఁ డనియు ననరాదు. ఇది యును గవి స్వతంత్రతనే సూచించును. రామాయణమహాభారతములం దును గాళిదాసాదుల గ్రంథములందును నట్టిప్రయోగము లెన్నియేని కలవు. వానిని మహాకవిప్రయోగము లని శిరసావహించుచున్నాము. దుర్ఘటవృత్తియను గ్రంథముల నిట్టివానిని వైయాకరణులు సమర్థింప యత్నించుటయు విశదము.

కాళిదాసుని గ్రంథముల త్రియంబకమ్[1] (కుమారసంభ- 3-44) త్రినయనవృషోత్ఖాత పంకోపమేయామ్ (మేఘ- 1-56 వావిళ్లప్రతి), పాతయాం ప్రథమమాస (రఘు. 9-61), ప్రభ్రంశయాం యో నహుష మ్చకార (రఘు. 13-36), సంయోజయాం విధివదాస (రఘు. 16-86), కతిపయదినస్థాయిహంసాః (మేఘసం- 1-24-) మొదలగు ప్రయోగములు గలవు.

మల్లినాథుఁ డిట్టిప్రయోగముల నెట్లు సమర్థింప యత్నించెనో యాతనివ్యాఖ్యానమునఁ జూడనగును. కాళిదాసాదులవలెనే మహాకవి భాసుఁడును, పాణినీయవిరుద్ధము లగు ప్రయోగముల వాడియున్నాఁడు. వానిలోఁ గొన్నిటి నిటఁ జూపుదును. పలుతావుల నాత్మనేపదమునకుఁ బరస్మైపదమును, బరస్మైపదమున కాత్మనేపదముచుఁ బ్రయోగింపఁబడి నవి. ఆక్రియలు భాసునికాలమున నుభయపదములుగ వాడఁబడుచుండె నని మన మూహింపవలసి యున్నది.

(1) అపరిచయాత్తు న శ్లిష్యతే మే మనసి- స్వప్నవా- అంక. 1
(2) ఆపృచ్ఛామి భవంతౌ- ,,
(3) సాధుజనహస్తగతైషా నోత్కంఠిష్యతి ,,
(4) దైవప్రామాణ్యాద్భ్రశ్యతే వర్ధతే వా- ప్రతిజ్ఞా- అంక. 1
(5) కథ మగణితపూర్వం ద్రక్ష్యతే... శ్రోష్యతే- ,,

1. మేఘసందేశమున (1-62) త్ర్యంబకస్యాట్టహాసః అనియు, రఘువంశమున (13-51) త్ర్యంబకవకాళిమాలామ్ అనియుఁ గూడఁ బ్రయోగింపఁబడినది.

( 6) జితఇతిపునరేనం రుష్యతేవా సుభద్రః- పంచరా- అంక. 2
( 7) స్త్రీగతాం పృచ్ఛసే కథాం-  ,,
( 8) వీజాంతో మలయానిలా అపి- అభిషేక- అంక. 3
(వీజయంతః అని యుండవలయును)
( 9) సీతాం సమాశ్వాసితుం (సమాశ్వాసయితుం)- అభిషేక-
(10) యావదహముచ్ఛ్వసామి (ఉచ్ఛ్వసిమి) ప్రతిజ్ఞా -
(11) హస్త్యశ్వరథపదాతీని విజయాంగాని-  ,,
(12) గృహ్య చాపం కరేణ (గృహీత్వా)- (దూతఘటో)
(13) ఋజ్వాయతాంచముఖతోరణలోలమాలాం (స్వప్న-అంక. 5)
(14) ప్రథమమభికాంక్షేహిమనసా- (ప్రతిజ్ఞా- అంక. 2)

మఱియు, కాళిదాసాది కవులందఱును 'విశ్రామశబ్దము నుపయోగించి యున్నారు. పాణినీయమతానుసార మిది విశ్రమ మనియే ప్రయోగింపవలెను. మల్లినాథుఁడును మేఘసందేశమునందలి (1-26 వావిళ్ల ప్రతి) 'విశ్రామహేతోః' అనుదానికి వ్యాఖ్యాన మొనర్చుచుఁ బాణినీయమున వృద్ధి నిషేధింపఁబడినను జాన్ద్రివ్యాకరణమున వృద్ధి వికల్పముగఁ గలుగు నని సమర్థించి యున్నాఁడు. భాసమహాకవి ప్రాచీనరూపమగు విశ్రమమునే యుపయోగించెను (స్వప్నవా- 1- అథ కస్మిన్ ప్రదేశే విశ్రమయిష్యే...) ఇది భాసునిప్రాచీనత్వమును, జాటుచున్న దని కొందఱ మతము.

గణపతిశాస్త్రిగారు తమస్వప్నవాసవదత్తోపోద్ఘాతమున, భాసుఁడు పాణినికి సమకాలికుఁ డగు ననియు, 'నవం శరావమ్' ను శ్లోకము కౌటిల్యునియర్థశాస్త్రమునఁ గైకొనఁబడుట దానిని విశదీకరించు ననియు వ్రాసిరి. మఱియుఁ బ్రతిజ్ఞాయౌగంధ రాయణమున (అంక- 3).

'ఈహామాత్రకేణ శ్రమణకేనాభయం దీయతే' 'భోః శ్రమణక! భగవన్'...అను ప్రయోగములును, అవిమారకమునందలి (అంక_5) 'యజ్ఞోపవీతేన బ్రాహ్మణః; చీవరేణ రక్తపటః; యది వస్త్రం మపనయామి శ్రమణకో భవామి' అనునదియు బౌద్ధశ్రమణకులఁ గూర్చిన వగు

టచే, క్రీ. పూ. 6 వ శతాబ్దప్రాంతమున నీనాటకములు రచింపఁబడి
యుండ నగునవియు వీరు వాదించుచున్నారు. ఈవాదములు సరి కావు.
అర్థశాస్త్రమునందలి 'నవం శరావమ్మ'ను శ్లోక మిదివఱలో విమర్శింపఁ
బడినది. బౌద్ధమతము క్రీ. శ. 5, 6 శతాబ్దములవఱకు విశేషప్రచా
రము నంది యున్నది. శ్రమణకపదము క్రీ. పూ. 6 వ శతాబ్దమునాఁటి
బౌద్ధమతమునే సూచింపదు. దానిని బట్టి భాసుని కాలనిర్ణయ మొనర్ప
వీలులేదు. భాసుఁడు పాణినికి సమకాలికుఁడని కాని, క్రీ. పూ. 6 వ
శతాబ్దమునఁ గలఁడని కాని నిర్ణయించుటకుఁ దగినయాధారములు గాన
రావు. క్రీ. పూ. 2 వ శతాబ్దమువాఁడగు పతంజలి (150 B. C.) తన
మహాభాష్యమునఁ గంసవధ, బలిబంధ మనునాటకములను, వాసవదత్త
మనునాఖ్యాయికను దెలిపి, భాసుని గాని భాసనాటకములను గాని
పేర్కొని యుండలేదు. అందువలన భాసుఁడు పతంజలి కర్వాచీనుఁడని
మనము నిర్ధారణ మొనర్చుటయే సమంజసము. భాసునినాటకముల
దర్శక, ప్రద్యోత, వత్సరాజులచరితములు గలవు. ఉదయనుఁడు క్రీ. పూ
5, 6 శతాబ్దములవాఁడని చారిత్రవేత్తలు మనకుఁ దెలుపుచున్నారు.
ఇదియు భాసకాలమును నిర్ణయ మొనర్పదు.

7. భాసుఁడు - అశ్వఘోష కాళిదాస హర్షవర్ధనులు.

బుద్ధచరితాదిగ్రంథముల రచియించిన అశ్వఘోషుఁడు బహుప్రా
చీనుఁడనియుఁ గాళిదాసునకుఁ గొన్నిశతాబ్దము లయినను బూర్వుఁ
డయి యుండు ననియుఁ బలువు రభిప్రాయపడుచున్నారు. క్రీ. శ మొదటి
శతాబ్ద మని కొందఱును, క్రీ. పూ. మొదటిశతాబ్ద మని కొందఱును
దలంచుచున్నారు. కాళిదాసున కర్వాచీనుఁడని యు వాదము లేకపో
లేదు. కాని ప్రాచ్యపాశ్చాత్యులలోఁ గాళిదాసునకుఁ బూర్వుఁడను వా
దమే ప్రబలి యున్నది. ఈతఁడు కనిష్కుని (78 A. D) కాలములోని
వాఁడనియు, నాతనికి మతగురువై యుండె ననియు వీరు తలంచు
చున్నారు. ఈతనిచేఁ రచింపఁబడిన బౌద్ధనాటకభాగము లిటీవల దొర
కినవి. ప్రతిజ్ఞాయౌగంధరాయణమున (అంక. 1-18)

కాష్ఠా దగ్ని ర్జాయతే మథ్యమానాత్
భూమి స్తోయం ఖన్యమానా దదాతి
సోత్సాహానాం నా స్త్యసాధ్యం నరాణాం
మార్గారబ్ధాః సర్వయత్నాః ఫలంతి.

అనుశ్లోకము బుద్ధచరితమున (13 సర్గమున)

కాష్ఠం హి మథ్నన్ లభతే హుతాశం
భూమిం ఖనన్ విందతి చాపి తోయమ్
నిర్బంధినః కించన నా స్త్యసాధ్యం
న్యాయేన యుక్తంచ కృతంచ సర్వమ్.

అనుశ్లోకముఁ బోలియున్నది. వీని పౌర్వాపర్యముల నిర్ణయించుచు గణపతిశాస్త్రిగారు భాసునిదే ప్రాచీన మనిరి. మఱికొంద ఱశ్వఘోషుని దనిరి. రెండుశ్లోకములను బరిశీలించినచో నశ్వఘోషుని శ్లోకమునకు భాసుఁడు మెఱుఁగుపెట్టినట్టులు గాన్పించును అశ్వఘోషునికర్వాచీనుఁ డగుట భాసుఁడు క్రీ. శ. 1, 2 శతాబ్దములవాఁడై యుండు నని తోఁచును. వీరినాటకములందు గలప్రాకృతభాషను బరిశీలించి భాసుఁడే యర్వాచీనుఁ డని డాక్టరు వూల్నరు (Woolner) గారు వ్రాసిరి.

ప్రాచీనకవులలో గాళిదాసుఁడు భాససౌమిల్లకకవిపుత్రులను బేర్కొని యున్నాఁడు. కవిపుత్రుఁ డెవరో నిర్ణయింపఁబడలేదు. సౌమిల్లకుఁడే పాదతాడితకకర్త యగుశ్యామిలకుఁ డని కొందఱిమతము. కాని బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు తమచతుర్భాణియుపోద్ఘాతమున శూద్రకకథను విరచించిన సౌమిల్లుఁడు వే ఱనియుఁ బాదతాడితకకర్త యగుశ్యామిలకుఁడు తొమ్మిదవశతాబ్దమువాఁ డనియు నుదీచ్యదేశమువాఁ డనియు విశ్వేశ్వరదత్తునిపుత్రుఁ డనియు వ్రాసియున్నారు. పాదతాడితకశైలియు నాయూహనే బలపఱచుచున్నది. భాసుఁడు పెక్కునాటకముల రచియించి ప్రథితయశస్కుఁ డగుటచే గాళిదాసుఁ డతని ననుకరించెను. భాసనాటకముల శాకుంతలాదులయందువలెఁ బాత్రపోషణకథాసంవిధానము లంతగఁ గానరావు. మృదుమధురమగుశైలితోఁ గథ త్వరి

తముగ నడచుచుండును. దృష్టాంతోపమార్థాంతరన్యాసములు కొలఁదిగ నుండును. ఈక్రిందియనుకరణముల గాంచినచోఁ గాళిదాసుఁడు భాసుని భావముల కెట్టినూతనశోభను ఘటింపఁ జేసెనో విశద మగును.

1. 'ఆకృతిరేవ భర్తృదారికాయా అలంకారఇతి భణామి' అవి- అంక-4.
   సర్వశోభనీయం సురూపం నామ. ప్రతిమా- అంక-1
   సర్వ మలంకారం భవతి సురూపాణాం- అవి- అంక-2
   కి మివ హి మధురాణాం మండనం నాకృతీనాం- శాకుం-1-17

   ఈభావమునే 'సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం' ఇత్యాద్యుపమానములతో విశదీకరించినాఁడు.

2. యోస్యాః కరః శ్రామ్యతి దర్పణేపి
   స నైతి ఖేదం కలశం వహంత్యాః
   కష్టం వనం స్త్రీజనసౌకుమార్యం
   సమం లతాభిః కఠినీకరోతి - ప్రతిమా. 5.3

   ఈభావమునే మాఱ్చి వృక్షసేచన మొనర్చు శకుంతలను గాళిదాసుఁడు చక్కఁగ వర్ణించియున్నాఁడు.

   ఇదం కిలా వ్యాజమనోహరం వపు
   స్తపఃక్షమం సాధయితుం య ఇచ్ఛతి
   ధ్రువం స నీలోత్పలపత్రధారయా
   సమిల్లతాం ఛేత్తు మృషి ర్వ్యవస్యతి- శాకుం-1-16

3. అభిషేకనాటకమునందలి (అంక-4)
   యస్యాం నప్రియమండనాపి మహిషీదేవస్య మండోదరీ
   స్నేహా ల్లుంపతి పల్లవాన్ నచపున ర్వీజంతి యస్యాం భయాత్
   అను శ్లోకభావమునే గైకొని
   నాధత్తే ప్రియమండనాపి భవతాం స్నేహేన యాపల్లవం-
   అనికాళిదాసుఁడు రచించినటుల స్పష్టము-

4. విస్రబ్ధం హరిణ శ్చరం త్యచకితా దేశాగత ప్రత్యయాః-
   స్వప్నవా-1-12
   విశ్వాసోపగమా దభిన్నగతయః శబ్దంసహంతే మృగాః-శాకుం-1-13.

# శ్రీ రాధామాధవము.

(ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమునకు విమర్శనార్థము పంపఁబడినది)

నిడుదవోలు వేంకటరావుగారు, బి. ఎ., కాకినాడ.

---

—: గ్రంథవివరణము :—

ప్రాచీనాంధ్ర ప్రబంధరత్న మగునీరాధామాధవము, రాధామాధవబిరుదాంకిత చింతలపూఁడి యెల్లనార్య ప్రణీతమై, శ్రీకపిలేశ్వరపురాధినాయకులచేఁ బ్రకటితమైనది. ఈప్రబంధము బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రులవారిచేతను, శ్రీపీఠికాపురసంస్థానాస్థానవిద్వత్కవులు ఓలేటి వేంకటరామశాస్త్రులవారిచేతను సంస్కృతమై, విద్యాదర్శక వీరరాజకృత మగునలువదియెనిమిదిపుటల మునిపలుకుతో వెలయుచున్నది.

ఇం దైదాశ్వాసములును 1172 గద్యపద్యములును గలవు. ముద్రితగ్రంథమున మూఁడువందలనలువదియాఱుపుటలు గలవు. గ్రంథము రమణీయముగఁ గాకినాడముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది. మూల్య మొక్కరూపాయయు నెనిమిదణాలుమాత్రమే.

—: గ్రంథప్రకటన ప్రశంస :—

సాహితీసమరాంగణసార్వభౌముఁ డని ప్రఖ్యాతిఁ గాంచిన శ్రీకృష్ణదేవరాయలకాలమున వెలువడిన ప్రౌఢాంధ్రప్రబంధములలో నొకటియై మొన్నమొన్నటిదనుకఁ గాలగర్భమున నడఁగియున్న యీరసవత్ప్రబంధమును నింతరమణీయముగ నచ్చుఁగూర్పించి యాంధ్రవిద్వల్లోకమునకు సమర్పించిన స్వస్థానవేషభాషాభిమానమాననీయులు గావ్యగీతిప్రియులు, విద్వత్ప్రభువులు కపిలేశ్వరపురాధినేతలు నగు శ్రీ బలుసు బుచ్చిసర్వారాయఁడు బహద్దరు జమీందారువారి భాషాపోషకత్వమును రసగ్రహణపారీణతయును మహోదారత్వమును నెంతయేని గొనియాడఁదగి యున్నవి. ఆంధ్రవాఙ్మయచరిత్రమునకును నందు ముఖ్యముగఁ బ్రబంధపరిణామచరిత్రమునకును నిట్టిగ్రంథప్రకటన మెంతయేనియు

నావశ్యకము. ఈగ్రంథప్రకటనమువలన శ్రీజమీందారువారు సాహిత్యోపాసకులకే గాక వాఙ్మయచరిత్రకారులకుఁగూడ నుపకారము గావించి ధన్యులైరి.

—: కవివిషయము :—

రాధామాధవకవి పాఠకలోకమునకుఁ గ్రొత్తవాఁడైనను, పరిశోధకులకుఁ బరిచితుఁడే- ప్రాఁతవాఁడే-

కవిజీవితమునందును, కవులచరిత్రమునందును రాధామాధవకవి శ్రీకృష్ణదేవరాయలను దొలుత దర్శించుసందర్భమున, నల్లసాని పెద్దనార్యుఁడు, రాధామాధవకవిని, 'నగరు, తగరు, తొగరు, వగరు' అను పదములు ప్రాసస్థానములయందుంచి రామాయణపరముగఁ బద్యముఁ జెప్పుమన్నట్లును, నీతఁడు తత్క్షణమే యాశువునఁ బద్యముఁ బూరించినట్లును, నట్లే పిమ్మట భారతభాగవతపరములుగాఁ గూడఁ జెప్పుమన్న నట్లే పూరించినట్లును దెలుపఁబడియున్నది. పయినైదేండ్లకు మున్నింత కంటె రాధామాధవకవిం గూర్చి తెలియలేదు. ఈతరువాత నీతనిగ్రంథములు రాధామాధవము గాక, తారకబ్రహ్మరాజీయము, విష్ణుమాయానాటకము నను మఱి రెండు ప్రబంధములు లభ్యములైనవి. వీనివలన నీకవి. "రాధామాధవ మచ్యుతాంకితముగాఁ బ్రౌఢక్రియంజెప్పి తన్మాధుర్యంబునఁ గృష్ణరాయవిభుఁ గర్ణాటేశు మెప్పించి నానాధాత్రప్రతిమానసత్కృవులలో భూషణశ్రేణితో రాధామాధవనామమందిన జగత్ప్రఖ్యాత చారిత్రుఁ" డనియు, శ్రీవత్సగోత్రుఁ డనియుఁ గామయప్రభుపుత్రుఁ డనియు మదనగోపాలమహామంత్రానుష్ఠానపరుఁ డనియుఁ దెలియుచున్నది.

రాధామాధవకవిగ్రంథములలో నీరాధామాధవము గాక విష్ణుమాయానాటకము గూడ ముద్రితమైనది. ఇయ్యది క్రీ. శ. 1934 సంవత్సరమున మదరాసు విశ్వవిద్యాలయప్రాచ్యపరిశోధనాలయశాఖాప్రచురణములలో మూఁడవదిగఁ దత్పరిశోధనాలయాంధ్రభాషోపన్యాసకులు శ్రీకోరాడ రామకృష్ణయ్య ఎమ్. ఏ. గారి సంపాదకత్వమున వెలువడి

నది. ఇఁక మిగిలినది తారకబ్రహ్మరాజీయము. దీని ప్రతి యాంధ్రసాహిత్య పరిషత్పుస్తకభాండాగారమునఁ గలదు. ఇయ్యది యచ్యుతదేవరాయల యొద్ద కందాచా(వా)ర లేఖకుఁ డగునంజయతిమ్మరుసునకుఁ గృతియై, యచ్యుతదేవరాయల భాషాపోషకత్వమును జారిత్రకవిషయములు గలిగిన యవతారికతో నొప్పుచున్నది. ఇదిగూడ ముద్రితమయ్యెనేని రాధామాధవకవిప్రతిభయు నాంధ్రవాఙ్మయమున నాతనికిఁగల స్థానమును సువ్యక్తము గాఁ గలవు.

రాధామాధవకవి కాలము కులగోత్రములు మున్నగు వానిఁ గూర్చి స్పష్టముగఁ దెలిసికొన వీ లగుచున్నను నాతని నివాసముం గూర్చి స్పష్టముగఁ దెలిసికొన వీలు లేకున్నది.

రాధామాధవకవి యింటిపేరు చింతలపూఁడివా రని తెలియు చుండుటచేతను సాధారణముగ నింటిపేరులు గ్రామనామములుగ నుండుటచేతను చింతలపూఁడి గ్రామము లాంధ్రమండలములలో విశాఖపట్టణము, గోదావరి, కృష్ణ, గుంటూరుమండలములలో నుండుటచేతను నిందేదియు నిర్ధారింప ననువుపడుటలేదు. విష్ణుమాయానాటకపీఠికయం దీతఁడు గోదావరికృష్ణామధ్యదేశమువాఁ డనియు వేఁగీదేశీయుఁడనియు సంపాదకు లూహించినారు. ప్రకృతగ్రంథపీఠికయందు విమర్శాదర్శకు లీతఁడు గుంటూరుమండలమున రేపల్లె తాలూకాలోని చింతలపూఁడి నుండి లేక నెల్లూరిమండలమున దర్శితాలూకాలోని చింతలపూఁడిగ్రామమునుండి రాయల దర్శనప వెడలి కృష్ణామండలమున నెల్లూరితాలూకాయందలి చింతలపూఁడిలో నివసించియుండు నని వ్రాసియున్నారు.

ఈయభిప్రాయము లిట్లుండ నీకవి కళింగదేశవాస్తవ్యుఁ డనియు నందు ముఖ్యముగ విశాఖపట్టణమండలములోని వీరవిల్లితాలూకాయందలి చింతలపూఁడి గ్రామమున నుండువాఁ డనియెడువిషయముఁ గూడ సంప్రదాయసిద్ధమై యున్నది. ఇందుల కుపబలముగా నిప్పటికిని చింతలపూఁడివారు శ్రీవత్సగోత్రకు లాప్రాంతమునఁ గలరు. మఱియు నీ

రాధామాధవకవి తొలుత విశాఖపట్టణమండలాంతర్గత మగు పొట్నూ రునఁ బరిపాలించిన మేదినీరావువారి* యాస్థానమున నుండెడివాఁ డని యు, శ్రీకృష్ణదేవరాయలవారు కళింగమును గజపతులను జయించి పొ ట్నూరున జయస్తంభము నిలిపి నగరమున కేగినపిదప గజపతులయా స్థానమున నున్న లొల్ల లక్ష్మీధరుఁడు దివాకరుఁడు మున్నగుప్రసిద్ధకవు లు మహావిద్వాంసులు తమయాస్థానములను విడచి విజయనగరమున నివాసమేర్పఱుచుకొని రాయలయాస్థానమున నున్నట్లే యీయాంధ్రక వియగురాధామాధవకవి కృష్ణదేవరాయలు పొట్నూరుజయించినవెనుక శ్రీకృష్ణదేవరాయని యాస్థానమున కేఁగి, యాతనిని గవితాశక్తిచే మెప్పించి పేర్వడసె ననియుఁ 'గవికావ్యప్రశంసాచంద్రిక' యందు వ్రాయఁబడియెను. కావుననే కళింగకవి యగుతిరుమలరాజు సూరపరాజకవి-తనద్రౌపదీపరిణ యకావ్యమునఁ బ్రాచీనకవుల స్తుతించు సందర్భమున రాధా మాధవునిఁ గూడఁ జేర్చొనినాఁడు.

శ్రీనాథాఖ్యునిఁ బోతరాజకవిఁ జెర్రెన్ సోమునిన్ భీమునిన్
ధీనిస్తంద్రు ననంతు భాస్కరు వచోధిన్ బెద్దయామాత్యు ని
త్యానందంబున ముక్కుతిమ్మఘను రాధామాధవున్ మున్నుగా
నీనానావనిఁ గల్గు నాంధ్రకవితాహేలాఢ్యులం గొల్చెదన్.

రాధామాధవకవి రాధామాధవము, పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నమునకు మార్గదర్శక మైనట్లును, విష్ణుమాయానాటకము రొసనూరి వేంకటపతి విష్ణుమాయానాటకము, ఎరగుడిపాటి వేంకటకవి విష్ణుమాయానాటకము, కంకంటి పాపరాజకృత విష్ణుమాయావిలాసము మొదలగు కృతులకు నాధారమైనట్లును నీతనితారకబ్రహ్మరాజీయము, పలువురుకళింగాంధ్రకవుల కుపజీవ్య మైనది. తారకబ్రహ్మరాజీయము

*మనుచరిత్రమున, 'అభిరతిఁగృష్ణరాయలు' అనుపద్యములోఁ గళింగమేదినీ విభుఁ డనఁగా. "కళింగరా"జని కాదు. మేదినీరావువారను నింటిపేరుగల రాజని యర్థము. మనుచరిత్రమనుచరిత్రముల నీయర్థము వ్రాయఁబడియుండలేదు. 'మేదినీరాయ మృగవేఁట కాఁడు' అననది భూసపాటిశాస్త్రి శిరుశ్రమములలో నొకటి.

రాధామాధవకవి వ్రాసినవెనుక కళింగకవులగు కొటికలపూడి వేంకటకృష్ణసోమయాజి, ఆతనిపుత్త్రుఁడు కోదండరామయజ్వ, అనుమంచి జగన్నాథకవి మొదలగువారీగ్రంథవిషయమును దిగిగి పద్యకావ్యములు వ్రాసి యున్నారు. రాధామాధవకవిని కవిస్తుతులయందు స్తుతించినకవి పై కళింగకవి యొకఁడే కానఁబడుచున్నాఁడు. ఎట్లున్న నీతఁడు హంపీవిజయనగరప్రాంతవాస్తవ్యుఁడు మాత్రము కాఁడనియు, నీతఁడు పైనుండివచ్చినవాఁడగుటచేతను క్రొత్తవాఁడగుటచేతను రాజాస్థానప్రవేశమున నీతనిపరీక్షింప వలసివచ్చుటసమంజసముగనే యున్నది. దీనికి పెద్దనార్యుఁడే పరీక్షకుఁడుగనుండెనని తెలియుటచేఁ బైయూహ మఱియు బలపడుచున్నది. అందుచే నీతఁడు కళింగదేశకవియను నభిప్రాయముఁ గూడ వాఙ్మయచరిత్రకారులు గమనింపఁదగినవిషయము.

—: రాధామాధవకావ్యము :—

ఆంధ్రవాఙ్మయమున రాధామాధవుల పరస్పరప్రేమను వర్ణించు గ్రంథములలో నెల్ల నిదియే మొదటిది. దీనివెనుక కృష్ణదాసు రాధామాధవవిలాసము, ఎడవల్లి వేంకటపతి రాధామాధవసమాగమము, వెలిదండ్ల వేంకటపతిరాధామాధవసంవాదము, సముఖము వేంకటకృష్ణప్పనాయని రాధికాసాంత్వనము, ముద్దుపళని రాధికాసాంత్వనము, శ్రీగోపీనాథము వేంకటకవి రాధికాపరిణయము మున్నగునవి పెక్కులు గలవు. కాని వానికిని నీరాధామాధవమునకును గథావస్తుతత్త్వమునందే భేదముగలదు. రాధామాధవకవి రాధను, కేవల మాదిలక్ష్మియవతారముగను శ్రీమహావిష్ణువును మాధవునిగాను బ్రతిపాదించి యున్నాఁడు. ఇతరగ్రంథములయందు రాధ శ్రీకృష్ణునిమేనయత్త యైనట్లు శ్రీకృష్ణునియందు మరులుగొని యామె తనకన్న చిన్నవాఁడగుకృష్ణుని బ్రేమించెననియుఁ బ్రతిపాదింపఁబడి యున్నది. ఇట్టివానిచేఁ గాఁబోలు నధునాతనకవులకు 'మేనత్తమే నత్తఁ'గానని శ్లేషించుటకు సందు దొరకినది. దేవీభాగవతమునను, బ్రహ్మకైవర్తపురాణమున రాధపరాశక్తిరూప మని రాధ

మహామహిమోత్కృష్టత విశేషముగా వర్ణింపఁబడినది. రాధామాధవకవి కిదియే యాధారమైనను నాతఁడు కొన్ని మార్పులు కావించి, యుత్తమోత్తమముగ రాధామాధవపాత్రపోషణము గావించి, భక్తిశృంగారరస బంధుర మగు ప్రబంధముగ రచియించి ధన్యుఁడైనాఁడు.

—: కవితావైశద్యము :—

వీరరాజప్రణీత మగు మునిపలుకను విమర్శాదర్శమున రాధామాధవకవి ప్రతిభయుఁ గవితావైదుష్యమునుఁ బూర్ణముగఁ బ్రతిబింబించుచున్నవి. రాధామాధవకవికిఁ బ్రకృతగ్రంథము ననుసరించిచూడ శ్రీనాథునికవితయందు మక్కువ పెక్కువగాఁ గానఁబడుచున్నది.

'డెందమునకును వాక్కున కందరాని యానందము, 'త్రిజగతీవిజయసిద్ధి' 'నిండారవిరిసిన పుండరీకశ్రేణి' 'తేఁగెనవ్వు' మొదలగుపదముల కుదిరిక యీతఁడు నైషధమును బలుమాఱు పఠించినట్లు తెలుపుచున్నవి. మఱియు నైషధమున దమయంతి దూతయైన హంసతో—

అనలసంబాధవాంఛ నా కగునయేని
అనలసంబంధవాంఛ నాకగునుజువ్వె

యని ప్రతినపలికినట్లే- రాధామాధవమున రాధ మధురవాణితో

కృష్ణవర్త్మాభిముఖతఁ దక్కించిరేని
కృష్ణవర్త్మాభిముఖతఁ దక్కింపఁగలరె.

అని చెప్పినది. మఱియుఁ జతుర్థాశ్వాసము స్వయంవరరాజవర్ణనము నైషధమునందలి రాజవర్ణనముఁ దలపించుచున్నది. అవతారికయందుఁ గవిస్తుతి సందర్భమున శ్రీనాథుని వేఱుగా స్తుతించుటచే నీకవికి శ్రీనాథుని యందుఁ గలగౌరవభావము వ్యక్తమగుచున్నది.

నన్నెచోడఁడు, బమ్మెరపోతన మొదలగుమహాకవుల పద్యములకుఁ బోలిక లిందుఁ గలవు—

'వీఁడటే చిటికినవ్రేలిపై నాలకుఁ గొండయెత్తినసముద్దండభుజుఁడు-' 4. ఆ. 61 అను సీసపద్యము, పూరించెన్ హరిపాంచజన్యము!-4.ఆ.31

అనుమత్తేభమును, పోతనామాత్యుని యామాయాయిపదములతో మొదలి
డిన పద్యములనుఁ దలఁపునకుఁ దెచ్చుచున్నవి.——'తీఁగెనవ్వు'- ఈప
దము శ్రీనాథునిది. రాధామాధవకవి యనుకరించె నని క్రీడాభిరామపీ
ఠిక తెలుపుచున్నది.

ఇందలి, చంద్రికావర్ణనము, చకోరవర్ణనము నతివిపులముగ రస
వత్తరముగఁ గావింపఁబడినవి. అయిన నిందు సమకాలికుల భావములు లేక
పోలేదు.——(చ. ఆ. 196-200 పుటలు).

సీ. మొలకవెన్నెలచాలు గలసి నెచ్చెలులకు సూడిదగానిచ్చి యామ నొకటి
గుజ్జువెన్నెల గ్రొచ్చుకొనితెచ్చి చుట్టాలఁ బిలిచి విందులుపెట్టి మలయు నొకటి
తీఁగవెన్నెలతీఁగె దిగిచి వేతురుకలు చేసి వల్లభుకిచ్చి చెలఁగునొకటి
చిగురువెన్నెలఁ గ్రుంచి మగనికుత్తుక క్రేపుఁ గూర్చొని గూర్చొని గునియు నొకటి
తే. లప్పవెన్నెలకుప్ప బాలలకుఁ జూపి, మేఁతవెట్టించి కెలఁకుల మెలఁగు నొకటి
కేలి చంద్రోదయోత్సవ శ్రీలఁబొదలెఁ, గోరికలు మిన్నుముట్టఁజకోరకములు-రాధా.
సీ. కొమరువెన్నెలమోసు నమలి ప్రాణేశ్వరు కొసఁగి యుంపొనరించు నొకచకోరి
పసపువెన్నెలగుజ్జు బంతెనగూర్చొను నోలి నెచ్చెలులతో నొకచకోరి
పాకైన వెన్నెలతేట కేళాకూళి నోలలాడుచుచుండు నొకచకోరి
గట్టివెన్నెల చల్దిగాఁగట్టి వల్లభు నుడురాజుకడకంపు నొకచకోరి
చేగవెన్నెల క్రొవ్వు భుజించి విందు, లొనరఁజేయును జుట్టాల కొకచకోరి
పండువెన్నెల పేసమేర్పఱచి పతికి, నుబ్బుగా నిచ్చు వేడుక నొకచకోరి.

పెదపాటి ఎఱ్ఱాప్రెగడ కుమారనైషధము.

రాధామాధవము తృతీయాశ్వాసము-62 పద్యము.

బలువగునారిపై శరము బాణముపై నరదంబు తేరిపై
విలు విశిఖాసనంబుపయి వీరభటాళియు నొప్పచిత్రభం
గుల నిజజూటదేశమున గ్రుమ్మరు కూటపురాసురేంద్రులన్
గెలిచిన యోధవర్య నినుఁ గీర్తనసేయుదు నంబికాధవా!

రంగనాథుని——

అదలనితేరు తేరునకు నాదరువై తగువిల్లు వింటికిం
గుదురగు నారి నారిపయిఁ గూర్చు శరంబు శరంబు బోడ్డునం
బొదలిన యంత యంతముఖముల్ నిజవాసములైన గుట్టముల్
చెదరక నీవు నెట్టిపని సేయునయా! గిరిజాధినాయకా!

అనుపద్యముతోఁ బోలికఁగలిగియున్నది.

రాధామాధవకవి మహావిష్ణుభక్తుఁ డైనను శివపారమ్యముఁ జాటించిన యద్వైతి-సిద్ధాంతపరుఁడు-భక్తితత్పరుఁడై, సరసహృదయంగమంబుగ నీరాధామాధవకావ్యమును రచియించినాఁడు. ఈతనిభక్తి ప్రకటించుఘట్టము లీగ్రంథమునఁ బెక్కులుగలవు. ఒక్కయుదాహరణము-పరిహాసమునకైనఁ దనయిష్టదైవముఁ గూర్చి పలుకునప్పు డాద్వైవోత్కృష్టతయే మనకు గోచరించునట్లు వ్రాసియున్నాఁడు. రాధతండ్రి యగుసహస్రగోపుఁడు తనకూఁతు శ్రీకృష్ణునకు నిచ్చెద నని నిండుసభలోఁ గృష్ణునిఁ బ్రశంసించునప్పు డది రాధయన్న భద్రకుఁ డనువాఁడు (భాగవతమున రుక్మిణీకల్యాణము రుక్మివంటివాఁడు) శ్రీకృష్ణునిఁగూర్చి పరిహాసము లాడుచున్నట్లు చెప్పియున్నాఁడు.

సీ. "వెల్లిఁబోయిన మాటలెల్లను బచరించి తేనెలుపుట్టించు తెఱఁగు గఱచి
మోరత్రోఁపుదనాన మురియుచుఁ దనయిచ్చ మెఱవడిమై గోళ్లనీటుకొనుచు
నేర్పరియై యుబ్బి నింగిముట్టుచుఁ బెంపు దీపింప మెఱసి ప్రతిజ్ఞలాడి
రాచరికముసఁ గొంత రవ్వైన మాన్లేక బలిమియు వెడమాయఁ గలితితనముఁ
జూపి ప్రబలయించు కృష్ణునిఁజూచి—

ఇందు శ్రీమహావిష్ణువు దశావతారములను రాధామాధవకవి సూచించినాఁడు.

శృంగారభక్తిమయకావ్యములలోఁ జేరిన యీరాధామాధవము చైతన్యమతప్రచారమునకుఁ దరువాత రచింపఁబడినట్లు తోఁచుచున్నది. ఇట్టికావ్యమునకుఁ బ్రకటనభాగ్యముఁ గలిగించిన శ్రీకపిలేశ్వరపురాధినేతలను మఱియొకతూరి ప్రశంసించుచు నింకను నిట్టిరసవత్ప్రబంధములు ప్రకటించి యాంధ్రభారతీసమారాధకులయ్యెదఁగావుత మని విమర్శక విజ్ఞప్తి.

శ్రీకృష్ణదేవరాయలకాలమున దండనాథుఁడై ప్రఖ్యాతిఁ జెందిన పెమ్మసాని తిమ్మానాయని యాస్థానమునఁనున్న ముడుమ్బ వేంకటరమణకవి రాధామాధవము సంస్కృతమున రచియించినట్లు తనకళాధరోపాఖ్యానమునఁ గలదు. రాధామాధవకవియును నీతఁడును సమకాలికులు.

ఒకవేళ నీతఁడు రాధామాధవకవిరసవత్కావ్యమును జూచి యానందించి సంస్కృతీకరించె నేమో? రాధామాధవమునకు మాతృక యగు జయదేవకవి గ్రంథమును గూర్చి పరిశోధన యింకను మిగిలియున్నది.

గ్రంథప్రణాళిక - రాధామాధవకవిం గూర్చి-

1. బ్రహ్మశ్రీ మదరాసు విశ్వవిద్యాలయాంధ్రభాషోపన్యాసము
శ్రీ. మా రామకృష్ణకవి ఎమ్. ఏ. గారు, 1921.
2. ,, ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారనివేదిక- 1926.
3. ,, భారతి- చింతలపూఁడి రాధామాధవకవి వ్యాసము.
4. ,, విష్ణుమాయావిలాసపీఠిక- 1934.
5. ,, మునిపలుకు- రాధామాధవపీఠిక- 1936.

---

# కీ. శే. వావిలికొలను సుబ్బరావుపంతులుగారు.

జననము ది 23 జనవరి 1863, మరణము ది 1 ఆగస్టు 1936.

---

వావిలికొలను సుబ్బరావుపంతులుగారు సుప్రసిద్ధులు. ఆబాలవృద్ధము నాంధ్రలోకము వీరినెఱుఁగును. ఆర్యకథావళులు సులభవ్యాకరణములుమూలమున బాలురకును వాల్మీకిరామాయణము భగవద్గీతలు మున్నగువానిమూలమున వృద్ధలోకమునకును బరిచయులు. నిక్కమైన భాషాభిమాని. మతవాదములలోఁ జారిత్రికవాదములలో నెగుడుదిగుడులు వీరివాదములోఁ గనఁబడుచున్నను భాషావాదమున నిరర్గళపాండిత్యమును దిరుగులేని మాటలును గ్రంథస్థములైపోయినవి. గ్రామ్యగ్రాంథికవివాదములలో వీరు గ్రాంథికపక్షముఁ జేసిన యుపన్యాసములు భాష కాధారములు. ఊఁదినఁ బడిపోవునట్టి దుర్బలులయ్యు నెంతెంతటి పండితునైనను బాండిత్యబలమున యుక్తుల నుక్తుల బడఁగొట్టుచుండిరి. లోకములోఁ బండితులుఁ గవులును లేకపోలేదు గాని యేపండితుఁడు నే

---

*రాధామాధవనామక కవిరచియించిన రాధామాధవము వేఱొక నింకొకటియున్నది. మనయెల్లయ్యకు రాధామాధవబిరుదమున్మాత్రమే. రాధామాధవుఁ డనుకవిది రాధామాధవము వేఱుగఁగలదు. దానిని సంగ్రహించుచున్నారము.		ప. అ.

కవియుఁ దాను బ్రదికియుండఁగాఁ దన గ్రంథమును ద్వితీయముద్రణము నకుఁ దెచ్చినవాఁడు లేఁడు. ఈయన తన చేతితో బ్రహ్మాండమైన శ్రీమద్వాల్మీకిరామాయణమును మనకన్నులయెదుట నాంధ్రీకరించి దానిని 5-6 సారులు పునర్ముద్రణము చేసినారనిన వారి గ్రంథమునకును వారి శక్తికిని గలగౌరవము లోక మూహింపకపోదు. 1900 సంవత్సరప్రాంతమున నెల్లూరనే వీరు మృతినొందవలసినవారు. కాని యాంధ్రభాష యదృష్టమున, వారిచిరమిత్రములయిన కొత్తపల్లి వేంకటపద్మనాభశాస్త్రి గారును లంకలపల్లె వేంకటసుబ్బయ్యగారును వీరిని చెన్నపురికి రప్పించి యౌషధసేవచేయించిరి. తర్వాత వీరు తిరువల్లిక్కేణి హైస్కూలు తెనుఁగుపండితులైరి. కం. వీరేశలింగము పంతులుగారియుద్యోగానంతరమున ప్రెసిడెన్సీకాలేజిలోఁ బండితులైరి. శ్రీరామజయమందిరమున ననేకోద్గ్రంథములు ప్రకటించిరి. భక్తిసంజీవనిపత్రికను నడిపిరి. ఒంటిమిట్టకోదండ రామస్వామి దేవాలయమునుం బునరుద్ధరించిరి. వీరు మాపరిషత్తునకు మొదటినుండియు గౌరవార్థపండితులు. పరిషత్తుపైఁ జాలనభిమానము గలవారు. వీరు కడపట విశిష్టాద్వైతమతబోధకులై పలువురుశిష్యులకు బోధించి తరణోపాయముచూపి తాముతరించిరి. వీరిశాంతమే వీరియాత్మకు శాంతిఁ గలిగించినది. వీరుకాలధర్మము నొందునప్పటికి వీరికి 73 సం॥ లు.

---

## — జనవాణి —

ఇది చెన్నపురమునుండి వెలువడు నాంధ్రదినపత్రిక. పేరుచేతనే యిది జనవాణి: దీనింగూర్చి ప్రసిద్ధాంధ్రపత్రికాధిపతులు జయవెట్టుచున్నారు. తెనుఁగుబీదల కన్నివిధముల ననుకూలించు పత్రిక. వ్యాపారులకుఁ జేయూఁత. లోకక్షేమమునకుఁ గంకణముకట్టుకొని స్వార్థమును గణింపని గొప్పగొప్ప సర్వాధికారులచే స్థాపింపఁబడిన చవుకపత్రిక. దీనిం జదివిన వెఱ్ఱిలోకమును మాటలచే లొంగదీసికొను దాంభికుల నిరర్థకప్రయత్నములు తెలియవచ్చును. ఎవ్వరిపక్షమును వారు సమర్థించుకొనుటకై వారువారుచేయు నుపన్యాసములను యత్నములను జక్కగ

ఖండించుచు వాస్తవమును లోకమునకుఁ జెల్పుపత్రిక. ఇతరపత్రికలలో వలెనే యింకను విదేశరాజ్యవ్యాపారవిషయములు, యుద్ధవార్తలు లోకవృత్తములు నుండును ముఖ్యముగా మాపరిషత్తు కోరినయాపు గ్రాంథికభాష నాదరించుచున్నది. ఇదియే ముఖ్యముగా జనులకుఁ గావల సినవాణి. ఈపత్రికాపోషకులు శ్రీ మూపితాపురముమహారాజావారు, పత్రికాప్రకాశకులు ప్రసిద్ధభాషావేత్తలు తాపీ ధర్మారావునాయఁడు బి. ఏ. గారు.

విడిసంచిక రు 0-0-3 !! పోరుగూరువారికి నెలకు రు 1 చందా. ఆఱునెలలకు రు 5-8-0. లోకోపకారమునకై వెలువడు పత్రికను లోకమే యభివృద్ధిచేసికొనుఁగాక. దానికై పరమేశ్వరుఁడు సాయపడి లోకము నభివృద్ధికిఁ దెచ్చుంగాక.

జనవాణికార్యాలయము చెన్నపురి మౌంటురోడ్డు 2/16 గృహ మున స్థాపింపఁబడినది. ప్రతిపట్టణమునను జిల్లరగాఁ బత్రికలు విక్ర యింతురు.

---

# సుపథము.

— సోంపల్లె కృష్ణమూర్తిగారు, అష్టావధాని, కొక్కంటి. —

---

క. మాకందము లేకవులకు
మాకందము లవియె వాగ్రమాకందములై
మీాకందములగు, రమ్మును
మీా! కందము, మిత్ర! వాని మ్రాఁకుమఘనగతిన్. ౧

క. తనబలము నెదిరి బలమును
మనమునఁ దలపోసి, వలయు మాటలఁ గార్యం
బును సార్థకపఱచెడు స
జ్జనుఁడే జనుఁడెంచఁ; గానిజనుఁడు జడుఁడే. ౨

క. విద్దెను నేరిచి మేలగు
బుద్ధికలిగి పెద్దవారి పోకడఁ గనుచున్
హద్దుగఁ బ్రదికెడువాఁడే,
తద్దయుఁ గీర్తినిఁ గాంచుఁ; దదితరుఁ డఘుఁడౌ. 3

క. కోటికి మించిన కవు లిలఁ
బాటింపఁగ వెలసినం గృపామతి సువచో
ధాటి శమమ్మును గలిగిన
మేటియె కవివర్యుఁ డతఁడె మే లొంను నెటన్. ౪

క. వార్తాపత్త్రిక లెన్నియొ ?
వర్తించుట మేలెకాని, బహుభంగుల దు
ర్వర్తనము పక్షపాతము
గుర్తెఱిఁగిన నపుడె, మూలఁ గూలుట నిజమా. ౫

క. స్త్రీలు, స్వతంత్రతఁగని మిడి
మేలపుగతిఁ బతులఁ దెగడి, మిడుకుట మేలా ?
బాలావనలీలాసుఖ
హేలామతి భర్తృభక్తి నెసఁగుట పొసఁగున్. ౬

క. ధనమే ముఖ్యంబగు సా
ధన మిహపరములకటంచుఁ దద్‌జ్ఞుల సద్బో
ధనములఁ దెగటార్చిన, నిం
ధనములె గతియౌను; జీవధనమున కెల్లన్. ౭

క. ఒప్పని తప్పని తెలియక
చెప్పెడు మాటలను నమ్మి చేటగుపనులం
దప్పక సల్పిన నాఁడే,
చిప్పెఁడుగంజియును లేక చెడునెవ్వాఁడున్. ౮

క. నవనీరదసన్నిభునకు
నవనీకన్యావిభునకు ననిమిషపరిష
న్నవనీయనీతికిఁ దా
నవనీహారాపహారనళినీపతికిన్. ౪౩

క. ధీరోదాత్తునకు జగ
ద్వీరోత్తంసునకు భవ్యదివ్యాకృతికిన్
వైరోచనకులమణికిన్
క్షారోదక్షోభకరణచణబాణునకున్. ౪౪

క. హైమవతీసన్నుతశుభ
నామునకు నిశాటపాటనపటూహలసం
గ్రామునకు గణేయగుణ
గ్రామునకభిరామునకును రఘురామునకున్. ౪౫

వ. సమర్పితంబుగా నాయొనర్పం బూనినరామాయణంబునకుం గథాక్రమం బెట్టి దనిన. ౪౬

—: సంగ్రహరామాయణము :—

క. శ్రీయుక్తుండుఁ దపస్స్వా
ధ్యాయరతుఁడు బ్రహ్మసుతుఁడు నగునారదు న
త్యాయత మగుహర్షమునం
బాయక వాల్మీకి యడిగె బంధురఫణితిన్. ౪౭

క. నారద యిపు డీజగతిన్
ధీరోదాత్తుఁడు మనోజ్ఞధీయుతుఁడు మహో
దారుఁడు నగువాఁ డెవ్వం
డారసి యెఱిఁగింపుమయ్య యట్టిమహాత్మున్. ౪౮

ఉ. ఎవ్వఁడు నిత్యసత్యపరుఁ డెవ్వఁడు నిర్మలధర్మవర్తనుం
డెవ్వఁ డవార్యశౌర్యధనుఁ డెవ్వఁడు సారవిచారశోభితుం
డెవ్వఁ డగణ్యపుణ్యనిధి యెవ్వఁడు తత్త్వమహత్త్వకోవిదుం
డవ్వరసద్గుణాభరణు నారసి నాకు నెఱుంగఁ జెప్పుమా. ౪౯

క. ధీరోదాత్తుఁడు జలధిగ
భీరుఁ డభీరుండు నన్యభీరువిముఖుఁడున్
వైరినృపభూరిమదసం
హారియు నగునాతఁ డెవ్వఁ డతనిఁ దెలుపుమా. ౧౦

క. ఎవ్వనికినుక యొకింతటు
నివ్వటిలినయంత వెఱచి నిఖిలామరులుం
జివ్వదొఱఁగి వడి జుణుఁగుదు
రవ్వీరోత్తంసు నెఱిఁగి యానతియీవే. ౧౧

వ. అనిన విని నారదుం డవ్వల్మీకసంభవుం గనుంగొని యిట్లనియె.

క. మహితాత్మ నీవుచెప్పిన
బహుగుణములు దలఁప దుర్లభములై యుండున్
మహి నైనను దాదృగ్గుణ
సహితుని నెఱిఁగింతు వినుము సంతసమెసఁగన్. ౧౨

క. రాముఁ డనుపేర జగదభి
రాముం డిక్ష్వాకువంశరత్నం బిపు డీ
భూమికి నవభూషణమై
శ్రీ మెఱయుచునుండు మౌనిశేఖర వింటే. ౧౩

క. అతనిశుభగుణము లలఫణి
పతియును వాచస్పతియును భాషాపతియు
న్నుతియింపలే రయిన నా
మతికొలఁది వచింతుఁ గొంత మౌనివతంసా. ౧౪

శా. కరుణాసింధుఁడు సత్యసంధుఁడు జగత్కళ్యాణబంధుండు బం
ధురసౌజన్యుఁడు లోకమాన్యుఁడు గుణస్తోమైకధన్యుండు సా
గరగంభీరుఁడు మేరుధీరుఁడు శుభాకారుండు సంగ్రామదు
ర్ధరదోర్ధాముఁడు వైరిభీముఁడు నన న్రాముండు మించు న్మహిన్.

క. ఓమునికులచంద్రమ యా
రామునికళ రూపమును బరాక్రమంబున్

సోమునిచందంబును నల
కామునియందంబు నెంతగల దనిపింపన్.

సీ. శ్రీమనోహరుఁడు సుస్నిగ్ధముగ్ధాంభోజ ౫౭
పత్రాక్షుఁడు విశాలఫాలతలుఁడు
సమవిభక్తాంగుఁ డాజానుబాహాయుగుండు
బంధురపరిణద్ధకంధరుండు
విపులాంసుఁడు కవాటవిస్తృతోరస్కుఁడు
సింహావీక్షణుఁడు సస్మితముఖుండు
గూఢజత్రుఁడు ధ్వజాంకుశశంఖచక్రాది
రేఖాంకితాంఘ్రిపానీరేయుగళుండు
బింబరుచిరాధరుండు గంభీరనాభి
శోభితవలగ్నుఁ డిందీవరాభవర్ణుఁ
డంగజాకారుఁ డఖిలలోకాభిరాముఁ
డహహ దశరథరాముఁ డోయనఘచరిత. ౫౮

క. సద్రక్షణభరణసము
న్నిద్రకృపానిధి సమగ్రనీతి సకలసా
ముద్రికలక్షణలక్షిత
భద్రాకారుండు రామభద్రుఁడె తలఁపన్. ౫౯

క. ఏవంవిధగుణమహిమల
చే విలసిలు నగ్రతనయు శ్రీరఘురామున్
భావించిచూచి దశరథ
భూవిభుఁ డవనీభరంబుఁ బూన్పఁదలఁచినన్. ౬౦

సీ. అభిషేకసంభారవిభవ మంతయుఁ జూచి
కైక యోర్వఁగలేక కంటుపూని
మున్నె తావరము గైకొన్నది గావున
వరముగా రామవివాసనంబు

భరతాభిషేకంబుఁ బ్రార్థించె ధర్మపా
శనిబద్ధుఁడై యలజనవిభుండు
కానకు ననిచె నగ్రతనూజు శ్రీరాము
నాతండుఁ బితృవచఃప్రీతి వెలయఁ
జనియె శుభలక్షణుండు లక్ష్మణుఁడు సుగుణ
జాత సీతయుఁ దోడ రా సాగి వనికిఁ
బురజనులు దశరథుండును వెక్కిపడుచుఁ
గొంతదూరంబు వెనువెంటఁ గూడినడువ. ౬౧

క. శ్రీరాముఁడు నటఁ బౌరులఁ
వేడుకొని మరల్చి శృంగిబేరపురిన్ భా
గీరథితటమున నంతట
సారథిఁ బీడ్కొలిపి పాదసంచారములన్. ౬౨

క. చని యచ్చట గుహునిం గనుఁ
గొని చెల్మి ఘటిల్లఁజేసి గుహసహితుండై
జనకజయు లక్ష్మణుఁడుఁ దోఁ
జనుదేరఁగ గంగదాఁటి సముచితగతులన్. ౬౩

గీ. కాననంబులు నదులు నెన్నేని గడచి
చని భరద్వాజమౌనీంద్రు శాసనమునఁ
జిత్రకూటపర్వతమును జేరి యచట
వసతిసేసిరి ముగురు నింపొసఁగుచుండ. ౬౪

గీ. చిత్రకూటాద్రి రాముఁడు చేరినంతఁ
బుత్రశోకాతురుం డయి పొగిలి పొగిలి
దశరథమహీధవుఁడు కాలధర్మమొందెఁ
బ్రేమ వేమఱు హా రామ రామ యనుచు. ౬౫

క. అంత వసిష్ఠప్రముఖులు
మంతనము సెలంగ భరతు మహీమండలికిం
గాంతునిఁ జేయఁగవలె నని
చింతించుచు భరతుఁ బిలిచి చెప్ప నత్తఱిన్ ౬౬

ఉ. కన్నుల బాష్పవారి దొలఁకం గలఁకన్ జివాఱఁ బల్కె నా
యన్న రఘూద్వహుం డడవికై చని కొండలమీఁద నుండ నే
నున్నతభద్రపీఠమున నున్న జను ల్ననుఁ జూచి నవ్వరే
యెన్నఁగ నామనంబునకు నెక్కసకం బిది యెల్లరాజ్యముల్. ౬౭

సీ. అని పల్కి చిత్రకూటాద్రికిఁ జని రాముఁ
గని బాష్పములు నేలఁ జినుకఁ ద్రొక్కి
ధర్మజ్ఞ నీవ యీధరణి యంతయు నేలు
రాజవై క్రమ్మఱ రమ్మటన్నఁ
దాతయాదేశంబుచేత సామ్రాజ్యంబుఁ
బూన నొల్లక మనంబున ముదంబు
దనర రాజ్యన్యాసమునకుఁ బాదుక లిచ్చి
భరతుని మగుడంగఁ బంపె నతఁడు
నగ్రజునిమాట జవదాఁట కల్ల వేగ
నఱిగి రామాగమనకాంక్ష నాత్మనగర
మునకుఁ జనక నందిగ్రామముననె యుండి
ధరణిఁ బాలించె ఘనధర్మసరణి వెలయ. ౬౮

క. అంతట శ్రీరాముఁడు నీ
చెంతకుఁ బురజనులు వచ్చి చేరుదు రనుచుం
జింతించి తానుఁ దమ్ముఁడుఁ
గాంతయునుం గూడి దండకంబున కరిగెన్. ౬౯

సీ. అఱిగి దండకమున కాదండ సాధిత
సాధువిరోధి విరాధుఁ ద్రుంచి
శరభంగముని సుతీక్ష్ణమహర్షి దర్శించి
సజ్జనవినుత సౌశస్త్యుఁ డైన
యల యగస్త్యుని నగస్త్యభ్రాతఁ గనుఁగొని
యయ్యగస్త్యుని వచనానుమతిని
నైంద్రశరాసనం బక్షయబాణతూ
ణీరముల్ ఖడ్గంబు నెమ్మిఁ జెంది

సకలమౌనులు నచట రాక్షసవధంబు
కోరుచుఁ బ్రార్థింప వారికిఁ గుతుక మొసఁగఁ
బ్రతిన గావించి తమ్ముఁడు సతియుఁ గూడి
మెలఁగుచుండఁగఁ దద్వనస్థలి వసించు.

గీ. శూర్పణఖ కామరూపంబు చొప్పడంగ ౨౦
మిగులఁ జక్కని మగువ యై తగులువొందు
నాసఁ జనుదేర మఱి దానినాసఁ గోసి
బోసిఁ జేసె విరూప తా గాసిపడఁగ. ౨౧

సీ. శూర్పణఖావాక్యచోదితులై జన
స్థాననివాసు లాసకలరాక్ష
సులు గూడి వెంట రాఁ జలమొప్ప ఖరదూష
ణత్రిశిరస్కులు ధాత్రి యదరఁ
బఱతేర వారలఁ బదునాల్గువేల నా
లంబులో బాణజాలంబుచేతఁ
జక్కాడె నెందును దిక్కఱి పాఱంగ
దేవత ల్తనబాహుతేజమునకు
మనమునందు మెచ్చి వినువీథి ఘనపుష్ప
వృష్టి గురిసి రాత్మదృష్టి మెఱయ
నచటి మౌను లెల్ల నాశీర్వదించిరి
వేనవేలు నుతులు వెలయ నంత. ౨౨

సీ. జ్ఞాతివధం బెల్ల దూతముఖంబుచే
విని రావణుఁడు క్రోధవివశుఁ డగుచుఁ
దనకు సహాయ మై చనుదేర మారీచుఁ
బ్రార్థించి వాఁడు నెయ్యంబు బెరయ
వల దన్న వినక కేవలమత్సరంబునఁ
దత్సహాయుండయి దాశరథుల
మాయామృగాకృతి మారీచుఁ డెడగల్గ
నెలయించుకొని పోవ నెడరు వేచి

యార్య రాముని భార్యఁ జౌర్యంబుచేత
నపహరించి జవంబున నడ్డగించు
గృధ్రరాజంబు నుద్ధతి గీటడంచి
కొంకక సురావళి దలంక లంక కరిగె. ౨౩

క. రావణుఁడు సీతఁ గైకొని
పోవుట పరప్రాణ మడల భూధరము బలెం
ద్రోవంబడిన జటాయువు
చెవిని శ్రీరాముఁ డంత జింతాకులుఁ డై. ౨౪

చ. దయ వెలయన్ జటాయునకు ధర్మగతు ల్లగఁ బారలౌకిక
క్రియ లొనరించి సీతఁ బరికించుచుఁ ద్రోవను నడ్డమై మహా
ద్రియుఁ బలెఁ జూడఁగా వికృతదేహు మదాంధుఁ గబంధుఁ ద్రుంచి వే
ప్రియమున స్నానపూతకబరిన్ శబరిం గని పూజ లందుచున్. ౨౫

క. చని పంపాతీరంబున
హనుమంతుని గూడి యతని యనుమతి సుగ్రీ
వునిఁ జేరి యతనితోడుత
మునుకొని సీతాపహారమును నెఱిఁగించెన్. ౨౬

క. సకలము విని సుగ్రీవుఁడు
నకలంకత నగ్నిసాక్షి యగుసఖ్యంబుం
బ్రకటించి రాముతోఁ గొం
కక మఱి యవ్వాలివైరకథయుం దెలిపెన్. ౨౭

క. తెలిపిన విని శ్రీరాముఁడు
వల దింక భయంబు నీకు వాలిఁ దునిమెదన్
నిలిపెద నిన్నని గట్టిగఁ
బలికె న్సుగ్రీవుఁ జూచి ప్రతినచెలంగన్. ౨౮

గీ. ప్రతిన గావించి యంతటఁ బ్రత్యయంబు
గోఱకు రవినందనుఁడు మహాగిరియుఁ బోని
దుందుభికళేబరముఁ జూపఁ గందుకంబు
బలెఁ బదాంగుష్ఠమున దానిఁ బాఱఁజిమ్మె. ౨౯

ఉ. వెండియు సప్తతాళములు వేఱె కపీంద్రుఁడు చూపి వీని నొం
డొండ గుఱించి యేయు మన నొక్క శరంబున నేసె నన్నిటిం
జండకరాన్వవాయమణిసాయక మవ్వలఁ దూఱి భూమియుం
గొండలుఁ గుండలిస్థలము గ్రుచ్చె వియచ్చరు లిచ్చ మెచ్చఁగన్.

క. ఆసుగ్రీవుఁడు నంతటఁ
గౌసల్యాసుతుని బలిమికలిమి కలరి వి
శ్వాసమున రాముఁ గూడి వి
భాసిలఁ గిష్కింధ కరిగి పటుదర్పమునన్. ౮౧

సీ. వాలి యుండెడు గుహాద్వారంబునందుండి
పృథుతరగర్జావిభీషణముగ
సరభసంబుగ భుజాస్ఫాలనం బొనరించెఁ
దద్భుజాస్ఫాలనాదమునఁ గనలి
తారహారోజ్జ్వలస్తనభార యాతార
నోడఁబడ నీఁ జేసి వెడలి వచ్చి
యట నిల్చెఁ గపిరాజు నంతట రాముఁడు
కోలనొక్కట వానిఁ గూలనేసి
యతనిరాజ్యంబునకుఁ గర్త యగుచునుండఁ
గరుణ సుగ్రీవుఁ బట్టంబుగట్టె నపుడు
గుభులు గుభులున దేవదుందుభులు మొరసెఁ
బుష్పవృష్టులు గురిసె నద్భుతముగాఁగ. ౮౨

క. సుగ్రీవుఁడు శ్రీరాముని
నుగ్రహమున నుగ్రశాసనుండును గపియూ
థాగ్రణియు నగుచు ధర నిర
వగ్రహ మగు రాజ్యవైభవంబునఁ జెలఁగెన్. ౮౩

వ. అంత. ౮౪

గీ. ఇనతనూజుండు సీతఁ గన్గొనఁగఁ దలఁచి
విపులబలు లగుకపుల వేర్వేఱఁ బిలిచి
నాల్గుదిక్కుల కనిచె మన్ననలు చేసి
వెనకఁగడఁగిరి వారు వేవేలగతుల. ౮౫

సీ. అంతలో హనుమంతుఁ డట సీతఁ గానక
సంపాతిమాటల జాడఁ దెలిసి
శతయోజనాయతజలరాశి లంఘించి
శంక యింతయు లేక లంక సొచ్చి
ఘనశోకమున నశోకవనిలోపల నున్న
యుర్వీతనయఁ గాంచి యూఱడించి
శ్రీరామముద్రిక చేనిచ్చి తోరణ
భంగంబు గావించి సంగరంబు
సలుపవచ్చిన రావణసైన్యపతుల
మంత్రిపుత్రుల నక్షకుమారుఁ ద్రుంచి
పట్టువడి యంత బ్రహ్మాస్త్రబంధ మెడలఁ
జేసికొని రక్కసులనెల్లఁ జీరి మీఱె. ౧౬

శా. సీతన్ సోఁకకయుండునట్లుగ శిఖాజిహ్వాలవాలజ్వల
జ్జ్యోతిన్ లంక దహించి వార్ధి కరి గచ్చోఁ దొంకఁ జల్లార్చి ప్ర
స్ఫీతాహంకృతిఁ గ్రమ్మఱన్ రఘువరున్ సేవించి కంటి న్మహీ
జాతన్ స్వామి! యటన్న రాముఁడు మదిన్ సంతోషముప్పొంగఁగన్.

గీ. రవితనయుఁ గూడి వార్ధితీరమున కరిగి
భీకరాశుగముల వార్ధి బెగడఁజేసి
సేతుబంధంబు గావించి సేతుసరణిఁ
గపులతోఁ గూడ జలరాశి గడచి నడచి. ౧౭

సీ. రణరంగమునయందు రావణుఁ ద్రుంచి క్ర
మ్మఱ సీతఁ జేకొని మది నొకింత
జననిందఁ బరిహరించఁ దలంచి సభలోనఁ
బరుషంబుగాఁ బల్క ధరణితనయ
తనయంతరంగంబు జను లెఱుంగుటకునై
యగ్నిలోపలఁ జొచ్చి యగ్గలంపుఁ
గాంతి వెల్వడియె లోకముచూడ నవ్వేళ
వేలుపుగమి పుష్పవృష్టి గురిసె

నగ్నివచనంబుచే నంత నతివిశుద్ధ
చరితఁగా జనకాత్మజ నరసి చూచి
హర్షితమనస్కుఁ డయ్యె, దేవర్షిగణము
మదిఁ బొదలెఁ జాల నారామమహిమఁ గాంచి. ౮౯

వ. అంత. ౯౦

సీ. రాముఁడు శుభముహూర్తమున విభీషణు
సాగరాదికతీర్థజలముచేత
నభిషిక్తుఁ జేసి లంకాధిరాజ్యమునకు
గట్టిగాఁ బట్టంబు గట్టి వేడ్క
వగ దీఱఁ గృతకృత్యుఁ డగుచుఁ గ్రమ్మఱ వాన
రులఁ బ్రాప్తసంజీవనులుగఁ జేసి
బంధులు గొల్వఁ బుష్పక మెక్కి వడి నయో
ధ్యకు నేఁగుచును భరద్వాజమౌని
యాశ్రమవనంబునకుఁ జని యచట భరతు
నంతికమునకు మును హనుమంతు ననిచి
భానుసూనుండుఁ దానుఁ బుష్పకము మీఁద
నెక్కి మిక్కిలి సంతసం బెసఁగుచుండ. ౯౧

సఖ్యము మెఱయఁగ వానర
ముఖ్యునితో శ్రవణసౌఖ్యములు సంధిలఁగా
నాఖ్యాయికల నృారెకు
వ్యాఖ్యానము చేసికొనుచు నతిమోదమునన్. ౯౨

క. నందిగ్రామమునకుఁ జని
యందు జడలు విడిచి సీత యనుజన్ములు సొం
పొంద నయోధ్యానగరముఁ
జెంది మగుడ రాజ్యలీలచేఁ జెలువొందెన్. ౯౩

చ. అనుజులు వేడ్కమీఱఁ దనయానతిమీఱక సేవసేయ భూ
జను లనురాగ మిం పెసఁగ సంతతమున్ జయవెట్టుచుండఁగా

జనకజతోడఁ గూడి యతిసౌఖ్యము లొందుచునుండె నిత్యశో
భనములు శోభిలంగ నిజబంధులు రంజిల రాజ్యలీలలన్. ౯౪

శ్రీధాన్యకటకమై చెన్నొందె నగరంబు
రాష్ట్రంబు సౌరాజ్యరమ్య మయ్యె
నయమొప్పఁ బ్రజలెల్ల జయవెట్టసాగిరి
నెలమూఁడువానలు నింగి గురిసెఁ
బాడుఁగు లుబ్బంగఁ బాల్విదికె గోగణములు
సస్యంబు లిలఁ బ్రశస్యంబు లయ్యె
బహువత్సరంబులు బ్రదికిరి జను లెంత
నిత్యోత్సవంబులు నెగడుచుండెఁ
దరుణు లందఱు నైదువతనము వెలయఁ
బతులు వారును నారోగ్యభాగ్యకలనఁ
బుత్రపౌత్రాభివృద్ధిని బొదలి రెపుడు
శ్రీరఘువరుండు రాజ్యంబు సేయునపుడు. ౯౫

మునికులశశాంక యింక రాముఁడు ధరిత్రిఁ
బదునొకొండువేలేండ్లు ప్రాభవము మెఱసి
గోసహస్రాది దానము ల్చేసి యంత
బ్రహ్మలోకంబునం దలరంగఁగలఁడు. ౯౬

ఈరామాయణకథ నె
వ్వారేనియు భక్తి వినిన వారికి నెపుడున్
దారసుతసారవిభవో
దారసుఖం బెసఁగుచుండు ధర్మోత్తరమై. ౯౭

విప్రుఁ డీకథ భక్తి వెలయఁ బఠించిన
మహితవాగ్వైఖరి మహిమగాంచు
క్షత్రియుం డీయుపాఖ్యానంబుఁ జదివిన
వార్ధివేష్టితమహీవలయ మేలు
వైశ్యుండు వేడ్క నీవస్తు వాకర్ణింప
బహుపుణ్యయుతపణ్యఫలము వడయు

శూద్రుఁ డీచరితంబు శ్రుతుల సోఁకఁగఁ జేయ
ధనధాన్యధన్యతఁ దనరుచుండుఁ
బలుకు లేటికి నెవ్వ రేతలఁపుఁ దలఁచి
రాతలఁపు వారికి ఫలించు నక్షణంబ
భక్తపాలనఖేలనప్రవణ మనఁగ
నడచు రామాయణశ్రవణంబువలన. ౯౮

క. అని చెప్పిన విని నారద
ముని నవ్వాల్మీకి మోదమున శిష్యగణం
బును దానును బూజించె
న్వినుతించె సముంచితోక్తివిభవము వెలయన్. ౯౯

వ. నారదుండు నమ్మహాముని చేత ననుజ్ఞాతుండై దివంబున కరిగె నంత నవ్వాల్మీకి వల్లలకలశంబులు గొంచు శిష్యుండు వెనువెంటఁ జనుదేర స్నానార్థంబు తమసానది కరిగి తత్తటంబున నిలిచి సంభ్రమంబున.

క. మిసమిస మెఱచుచు లోపల
నిసుకలు గనవచ్చుచుండ నింద్రమణివిభా
విసరముబలె నింపెసఁగెడు
ప్రసన్నసలిలంబు మనసు రంజిలఁజేయున్. ౧౦౧

క. అని శిష్యు భరద్వాజుం
గనుఁగొని యాతీర్థమహిమఁ గనుఁగొంటే స
జ్జనహృదయంబును బలెఁ గడు
వినిర్మలత మించెఁ జూడ వేడుక నించెన్. ౧౦౨

గీ. ఇది యకర్దమ మనుతీర్థ మిందు నేను
స్నాన మొనరించెద నటంచు మౌని యందుఁ
దాన మొనరించి యలభరద్వాజుఁ డొసఁగు
వల్కలంబులు దాల్చి పావనత మెఱయ. ౧౦౩

వ. తత్తటంబున నిలిచి యచటఁ గొంతతడవు మధురఫలభక్షణలోల పక్షికోలాహలసంలక్షితంబు లగువృక్షవిశేషంబు లీక్షించుచు నుండె నాసమయంబున. ౧౦౪

సీ. కుఱుచగాఁ జుట్టిన కుఱుమాపు దట్టిపైఁ
గొడవలిలో దోఁటి కూడఁ జెరివి
కొడిదిపూసలపేరు మెడ నంటఁగాఁ గట్టి
బిగి యెక్కఁ జెఱఁ బీలిబొజ్జువెట్టి
కొంగయీఁకలు గొన్ని యంగుగాఁ దలఁ జుట్టి
సంకుబల్లడియంబు సందిట నిడి
గట్టి యల్లిక తట్ట బుట్టి చంక నమర్చి
సెలవిల్లు నమ్ములుఁ జేతఁ బట్టి
చిక్కమురి గోల వల బిస జిగురుఁగండెఁ
బాదియును గొంచు బుడుత దాఁ బాల నెమిలిఁ
గౌఁజుఁ గక్కెరఁ గల్లేటిఁ గారుకోడిఁ
గొక్కెరను బట్టుచును వచ్చె నొక్కయెఱుకు. ౧౧౫

వ. ఇట్లు చనుదెంచి జేగుఱుజిగిదేఱు నెట్టజేగుఱుగ్రుడ్డుల నీఱుతొఱలు
వాఱుం జూచుచు నచట. ౧౧౬

ఉ. ఒక్కమహీజశాఖపయి నొక్కట వేడుకఁ గూడి యుండి యొం
డొక్కటి ఱెక్కవిప్పుకొని యొప్పుగఁ గప్పుచు నొయ్యఁ బల్కుచు
న్ముక్కుల మేను గీఱుచును మోమును మోమును జేర్చి మిక్కిలి
న్మక్కువ నుండఁ గ్రౌంచమిథునంబుఁ గనుంగొని సంభ్రమంబునన్. ౧౧౭

సీ. నుదుటిపై నొకవ్రేలు గదియించి క్రౌంచము
ల్నిలుచుచోటిది యని తెలిసి తెలిసి
చంకబుట్టటు వెట్టి సారెకు బుడుతనిఁ
జేరకు మని సన్న చేసి చేసి
కిఱుకిఱుక్కనకుండఁ గిఱుకుమెట్టులు విడ్చి
పొదదారి మెల్లనఁ బొంచి పొంచి
మండివ్రేయుచు మ్రాని దండ దండగ నిల్చి
సూటిగాఁ బలుమాఱుఁ జూచి చూచి
కుఱుచ తడవింట నొకమిట్టకోలఁ గూర్చి
నేర్పడర నూర్పడఁచి తెగనిండఁ దివిచి

కామమోహితమైన యాక్రౌంచయుగము
నందు నొక్కటి నేసెఁ బుళిందుఁ డపుడు. ౧౦౮

గీ. ఇట్టు లేయునప్పు డేమనఁగావచ్చు
మిట్టకోల బోరపట్టు దాఁకి
చెట్టుమీఁదినుండి చట్టుప ల్చెదర న
ప్పిట్ట పిట్టపిడుగు పృథివిఁ బడియె. ౧౦౯

క. పడి రోఁజుకొనుచు నెత్తురు
బుడబుడఁ గ్రక్కుచును బోరపొడవై యెగయూ
ర్పడరఁగఁ బొరలం దొడఁగె
న్వడఱెప్పం గన్ను గప్పి వేదన బలియన్. ౧౧౦

ఉ. క్రౌంచము బోయచేతి బలుగాయపుదొప్పిని రొప్పసేఁత నా
క్రౌంచి గుటించి దానిఁ గని కంపము నొందుచుఁ గూయుకూఁతఁ ద
త్క్రౌంచయుగంబుఁ జూచి కలఁగంబడు పక్షిగణంబు మ్రోఁత యొ
క్కించుక సేపు ముంచుకొనియె న్వని నెల్లెడలందు సత్తఱిన్. ౧౧౧

క. కులకులఁ గూయుచు నిలపై
జలజలఁ జట్టుపలురాల సారెఁ బొరలుచు
న్విలవిలఁ దన్నుకొనెడు నల
పులుఁగుం గని మౌని కరుణఁ బొగులుచుఁ బలికెన్. ౧౧౨

క. మంచితరుశాఖమీఁద స
మంచితగతిఁ గ్రౌంచిఁ గూడి మదనక్రీడ
న్మించిన క్రౌంచము నకటా
కొంచక యెట్లేసె బోయ కులకులఁ గూయన్. ౧౧౩

వ. అని యవ్వాల్మీకిమునివరుం డాశబరుం గనుంగొని యిట్లనియె. ౧౧౪

క. అక్కట! నిషాద! రతిచే
మిక్కిలిఁ దమి నెనయు క్రౌంచమిథునములో నీ
వొక్కటిఁ బడవైచితి నీ
కెక్కడ నిలుకడ ఘటిల్ల దిఁక నెన్నఁటికిన్. ౧౧౫

క. అని తిట్టి మౌనిచంద్రుఁడు
మనమున విస్మయముఁ జెంది మాటికి నిటు బో
యను కట్ట శ్లోక మయ్యె
న్వినుమని శిష్యునకుఁ జెప్పి వేమఱుఁ జదివెన్. ౧౧౬

వ. చదువ విని భరద్వాజుండును- "మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహిత" మ్మను శ్లోకం బేకసంధన గ్రహించి తదర్థం బూహించి. ౧౧౭

క. శ్లోకమునఁ బలుకుపలుకే
శ్లోకం బై నిలిచె నిట్లు లోకోత్తరమై
శ్రీకరమై మృదుపదశో
భాకరమై చూడ మిట్టి యద్భుతమొందున్. ౧౧౮

మ. అని వాగ్వైఖరి మీఱ సారెకును హృద్యం బైన తత్పద్యము
బ్బునఁ గొండాడుచు శిష్యుఁ డంబుకలశంబుం గొంచు వెన్వెంటరాఁ
జని యమ్మౌని నిజాశ్రమస్థలిని శిష్యవ్రాతముం జూచి చె
ప్పిన నప్పద్యము వార లెల్ల విని యుద్భిన్నాద్భుతానందులై. ౧౧౯

క. ఇది విన్నమాత్రమున సొం
పొదవించుచు నున్నయది సముల్లసితరసా
భ్యుదయాస్పదమ్మృదుపదసం
పద యిటు లుండంగవలదె బళిబళి యనుచున్. ౧౨౦

క. ఛందోనిబంధనము స్వ
చ్ఛందప్రసృతోక్తి సరణి సరసం బై సొం
పొందెడి వేదమునం బలె
సందర్భం బిది యమానుషము వివరింపన్. ౧౨౧

గీ. బోయఁ గనుఁగొని కోపంబు పొరయుచుండ
మాటలాడిన యంతన చాటుఫణితిఁ
బద్య మై నిల్చె నెంతటి చోద్య మరయ
ఋషులమహిమంబు లెవ్వార లెఱుఁగఁ గలరె. ౧౨౨

క. ఆనుష్టుభశుభలక్షణ
మానందము సేయుచున్నయది మది నరయం
గా నింపు ముందు భూమిం
గానము శ్లోకంబు నవముగా నుదయించెన్. ౧౨౩

క. ఈనయ మిట్టిరసోదయ
మీనుడికారము తెఱంగు నిటునును పెచటం
గాన మసాధారణ మీ
మౌనిగ్రామణికవిత్వమహిమ దలంపన్. ౧౨౪

క. అని వేఱువేఱ శిష్యులు
వినుతింపఁగ మఱియు మఱియు వినుచుఁ బ్రమోదం
బొనరఁగ వాల్మీకి తపో
ధనుఁ డాశ్రమవని వసింపఁ దదవసరమునన్. ౧౨౫

గీ. నిగిడె నొకదివ్యతేజంబు గగనవీథి
నది గనుంగొని జనులెల్ల నద్భుతంబు
నంద నందంద యాతేజ మల్లనల్ల
నల్లవాల్మీకివసముచాయ నెడిగంగ. ౧౨౬

క. మునిసంఘమెల్లఁ గనుఁగొని
ఘనతరశృంగములతోడఁ గననొప్పుచు నా
కనకగిరి యరుగుదెంచెనో
యని వేమఱుఁ బల్కుచుండ నంతటిలోనన్. ౧౨౭

సీ. జగదండములు సృజించంగ మాదిరిగొన్న
నలువున మణికమండలువు దాల్చి
శ్రుతిలతాతతులు నిల్చునుపఘ్నయష్టియు
బలెఁ గేల దండంబు పరిఢవిల్ల
వనజసంభవుఁ డౌట వనజతంతువులె నైఁ
దాల్చెనా వెలిజన్నిదములు వైచి
మెపుమ జ్యోతిశ్చక్ర మిట్లు ద్రిప్పెదు నను
రీతి నక్షసరంబుఁ ద్రిప్పుకొనుచు

—దేవమనుష్యతిర్యగ్గౌరవగతులు.—

క. సురనరగతి కచటతపల్
తిరమగులఘుదీర్ఘయుక్తిఁ దిర్యగ్గతు లా
యరలవ లనునాసికలుఁ
సరషిఁ గౌరవగతు లగు శషసహాళక్షల్. 3౭

క. ఈభాగక్షరములలో
వాబలుములఁ బోక గౌరవగతులు తిర్య
క్ప్రాబల్యగతులు విడుతురు
క్లీబంబుల విడరు మొదలఁ గీర్త్యర్థశ్రీ. 3౮

—మాతృకార్చనక్రమము.—

శా. ఆద్యార్యోక్తుల మాతృకార్చనలు చేయంబూనకే నూరకే
పద్యం బైనఁ బ్రబంధ మైన నొనగూర్పం జూడ నానాయకుం
డుద్యత్కీర్తులఁ జెందనేరఁ డిలఁ గావ్యండు న్మహోత్సాహుఁ డై
హృద్యశ్రీఁ గనఁ డానిమిత్తమునకై యీమాతృకార్చ ల్వలెఁ. 3౯

వ. అది యె ట్లనిన. ౪౦

గీ. స్నాన మొనరించి ధౌతవస్త్రములు గట్టి
నాయకసమేతుఁ డై కవినాయకుండు
ప్రార్చనోచితగృహములోపలికి వచ్చి
తాను సుముహూర్తమున సుఖాసీనుఁ డగుచు. ౪౧

గీ. అర్చకు నై చతుస్త్రింశదంబుజాత
ఘనదళంబులఁ గాదు లెల్లను లిఖించి
యలరఁ బదునాల్గుకుఱుచ లేకులస్వరములు
గర్ణికను దదంతార్ణయుగంబు వ్రాసి. ౪౨

సీ. అద్వయి మాళియు నాసన మిద్వయి
కనుఁగవ యుద్వయి కర్ణయుగళి
బుద్వయి ముకుఁగ్రోళ్లు ఌద్వయి చెక్కు లే
చ్చులు రదనోష్ఠముల్ పోలుపుమీఁఱు

బొట్లు జిహ్వామూలములు విసర్జనీయలు
కంధర యుం గచవర్గములు రెండు
భుజములు టతవర్గములు రెండుపదములు
పఫలు కుక్షిద్వయి బత్రయంబు
వెన్ను నాభియు హృదయంబు వేఱువేఱ
యాదు లేడును ధాతువుల్ హాము సమీర
మట క్షకారంబు క్రోధంబు నైనమూర్తి
సరణిగల నిన్నుం దలంచెద శారదాంబ. ౭౩

వ. అని మూర్తిధ్యానంబు చేసి. ౭౪

సీ. కలువలు గంధముల్ తెలిపట్టు ముత్యముల్
క్ష్మాదేవతాకులమాత్రుకలకు
సంపెగల్ కస్తూరి చంద్రకావులు మణుల్
మహీపాలవరకులమాత్రుకలకు
బొండుమల్లెలుం గప్రమును బచ్చచేలలు
మరకతాల్వెట్టులమాత్రుకలకు
మొల్లలు నగలును నల్లకోకలు నీల
జాత మంఘ్రిజనులమాత్రుకలకు
భక్తిమీఱంగ నిట్టు లేర్పఱిచి పెట్టి
యానవాలాజ్యముల్ తేనె యాసవంబు
మఱి సమర్పించి యాయాయిమాత్రుకలకుం
గృతుల వర్ణోచితగతుల నిడంగం దగును. ౭౫

—మిత్రాఃశోధనకుషోడశచక్రము.—

సీ. నిడుదగీ ట్లైదుగా నిడి యడ్డగీట్లైదు
సమకూర్చు షోడశచక్రమునను
శశిఐహిష్ణుశివసవద్విశరధీనదశౌరి
కరినృపమనుబాణగిరిదినత్ర
యోదశగృహముల నైదుపదు ల్వర్ణ
ములు వ్రాసి మును సిద్ధములును సాధ్య

ములు సుసిద్ధము లసత్ సలుదిక్కులను శోక
ములు చేసి వేర్వేఱ ఫలము లరసి
సిద్ధసాధ్యసుసిద్ధారిచిహ్నా లన్ని
చౌకములఁ గల్గు నని చూచి సరవితోడఁ
దెలిసి పతివర్ణమునుండి ఫలము గనుచు
వీనిలో నున్న రిపులిపుల్ విడువవలయు. ౪౬

సీ. సిద్ధంబులో నున్న సిద్ధసాధ్యసుసిద్ధ
ములు లెస్స యరిపు ల్కలిమి చెఱచు
సాధ్యంబులో సిద్ధసాధ్యసుసిద్ధంబు
లలరించు నం దరు ల్బలము చెఱచు
వలసుసిద్ధమునందుఁ గలసిద్ధసాధ్యసు
సిద్ధము ల్మేలరు ల్చెఱచు హితుల
నరియందు సిద్ధసాధ్యములు స్త్రీసుతహాని
తత్సుసిద్ధారులు తనకు హాని
కనుక నీపదాక్షిండ్లలోఁ గలుగులిపుల
యం దరు ల్గాని సంపత్కరాక్షరములు
కృతిముఖంబున నిల్పినయతఁడు సుకవి
వనధిగంభీర యోగంధవహకుమార. ౪౭

— గురులఘుసంజ్ఞ, గణసంజ్ఞలు. —

సీ. జడ్డ సున్నలు వ్రాసి నిడ్డవి దీర్ఘముల్
గురువులు లఘువు లగును గడమవి
మఱి యష్టగణములౌ మయరసతజభన
లవి త్రిగురుల త్రిలఘువుల మసలు
లలి నాదిమధ్యాంతలఘువులైన యరత ల
ప్పట్లను గురువూన భజస లగును
నలలనగగనవనహసలాసవసహ
భలభగురుతలతగురురలరగ

మలఘు లివి పదునాల్గుఁ జంద్రులు సలనగ
నలభరతపట్టె మింద్రులు నహ లినుండు
హావలు గురులఘు లఘుగురు లౌను లలను
గగము లఘుయుగ గురుయుగ మగును హానుము. ౧౯

క. శివుని త్రినేత్రము లం దు
ద్భవమైన గురుత్రయంబు దగ మగణము చా
నివలన యరసతజభనము
లవి మొదవె ని విన్ని గూడి యష్టగణంబుల్. ౨౦

గీ. పతిఫలగ్రహములు భములు రాసులు ను వ
ర్ణములు గోత్రములు స్వరములు యోను
లును రసములు గణములును వంశములు నెన్న
గణము లెనిమిదిటికిని గలవు తెలియ. ౨౧

సీసమాలిక. పతులు భూతకశశుల్ ఫలములు జయకీర్తి
భయల మైశ్వర్యరుక్పటుశుభములు
గ్రహములు బుధకవిక్ష్మాజార్కి గురురవీం
దులు తార లింద్రాంబ్వనలమరుద్గ
దూత్తరేందులు రాసు లౌనర వృశ్చికధను
రజతులాకర్కి సింహాబుమభములు
వన్నెలు హరిద్భవరపినీలశ్యామ
రక్తశుభములు గోత్రములు కాశ్య
పాఖ్యసంయమి గౌతమాంగిరకౌశిక

* * * * *

ధేను భోగీంద్రులు తెలియంగ రసములు
ఘనరౌద్ర కరుణ శృంగార భీతి
శాంతాఖ్యవీరహాస్యములు గణంబులు
దానవమానవదైత్యదేవ
దైవతమానవదైవతములు మయ
రసతజభములకుఁ గ్రమమున నగు

తయులు విప్రులు రజల్ ధరణీశ్వరులు విట్టు
లను భగణము మగణము సదజము
నగణ మంత్యజ మని నప్పించి కృత్యాది
నడుగణములకునుఁ గృతిపుపేరి
తారకును బొందు గూర్పంగఁ దగుడు సుకవి
నగణముచ కిడి యేమి యడసంగ వలదు
మంచి దని కృతి నగణసంపత్త్రలబ్ధి
జానకీజానిచరణాబ్జచంచరీక. ౫౧

వ. కావ్యస్వరూపం బెట్టి దనిన. ౫౨

క. ఋతుగిరివనజలకేళీ
రతిరణపురజలధివిరహరవిశశిగమనుం
త్రితనయదూత్యపరిణయనృ
పతిమధువర్ణనలు కృతులఁ బదునెనిమిది యుక్. ౫౩

సీసమాలిక. ఒకపద్య మైన ముక్తకము రెండు ద్వికము
త్రికము మూఁటను నయిదింటఁ బంచ
రత్నంబు లెన్మిది రాగజావళి తొమ్మి
దిట రత్నమాలిక తెఱఁగు ద్వాద
శంబు నామావళి చంద్రకళ పదాఱు
పద్యంబు లొనరింప హృద్యమగును
దగు సప్తవింశతి తారావళికి ముప్ప
దియు రెండు నేఁబది తెలియ వరుస
ద్వాత్రింశదభిధానతయుఁ బంచదశచిహ్న
జరుగు నూఱైనను శతక మన్యో
నంబుపై నెన్మిది యష్టోత్తరశతక
మన నగు మఱియు నుదాహరణము
చతురుత్తరంబును జక్రవాళముఁ జతు
ర్భద్రగుణావళుల్ రంగఘోష

త్యాగఘోషయును భోగావళి జయఘోష
బిరుదావళి యనెడి పేర్పుకృతులు
గలుగు నివియాదిగాఁ గవికల్పితములు
వీని లక్షణలక్ష్యము ల్విశదమతిని
సుకవు లీక్షించి కావ్యముల్ క్షోణి వెలయఁ
జేయుదురు పెక్కురీతుల వాయుతనయ. ౧౪

వ. ఇది కావ్యస్వరూపం బగు నింకఁ గవిస్వరూపంబు వివరించెద. ౧౫

శిఖరిణీవృత్తము.

శుచిన్ దక్షున్ శాంతున్ సుజనవినుతున్ సూనృతరతున్
సుచర్యున్ దైవజ్ఞున్ సదయహృదయున్ సూరివరునిం
బ్రచారు న్సద్వంశ్యుం గృతిఁ గుశలునిన్ భాసురతనున్
వచఃప్రౌఢున్ ఛందోవిదుని గవిని సర్వజ్ఞుఁ డన హా. ౧౬

క. కాచికశిల్పకసార్థులు
వాచకుఁడు వివేకి మార్దవప్రియుఁ డను భూ
షాచణుఁ డన నేర్పరు గల
రాచతురత లన్ని గలుగు నతఁడు సుకవి యౌ. ౧౭

క. ధరణిం గవి యగు విప్రుఁడె
వరమతి శుచి యనుచు వేదవచనమె తెల్పుం
బరఁగ నతఁ డొనర్చినకృతి
పరమపవిత్రంబు మొదవుపాలుం బోలెన్. ౧౮

వ. కవిస్వరూపం బిది, నాయకస్వరూపం బెట్టి దనిన— ౧౯

క. అతులితబలజితదానవ
శత ధీరోదాత్తధీరశాంతులు ధీరో
ద్ధతధీరలలితు లనఁగాఁ
జతుర్విధపు నాయకులకు సంజ్ఞలు దెలియన్. ౨౦

చ. కళలఁ బ్రవీణుఁడై మిగులఁ గావ్యములందుఁ బ్రియంబుగల్గి కో
ర్కులు సకలార్థికోటులకుఁ దీర్చి యొసంగుచు దానశూరుఁ డై

పొలిచి సుకీర్తియై వినయభూషణుఁడై మహిమానుభావుఁడై
నిలిచినవాని నాయకుఁ డని న్వచియింతురు సత్కవీశ్వరుల్. ౬౧

వ. మఱియుఁ బ్రాసంబులు — సమనామప్రాసంబును, సంయుక్తప్రాసంబును, సంధిగతప్రాసంబును, నుభయప్రాసంబును, ప్రాదిప్రాసంబును, వికల్ప ప్రాసంబును, బిందుప్రాసంబును, నబిందుప్రాసంబును, ఋప్రాసంబును, త్రికారప్రాసంబును, సమలఘుప్రాసంబును, ప్రాసమైత్రిప్రాసంబును, ననఁ బంక్త్రింబును-సంత్యప్రాసంబును, దుష్కరప్రాసంబును, ద్వంద్వప్రాసంబును, త్రిప్రాసంబును, చతుష్ప్రాసంబును, సనుప్రాసంబును, నను షడ్విధప్రాసంబులుం గూడఁ బదునెనిమిదివిధంబు లయ్యెఁ దత్క్రమం బెట్టిదనిన వివరించెద. ౬౨

— ప్రాసములు —

క. పదునెనిమిదిప్రాసంబులు
విదితముగా నేర్పరింతు విను లాక్షణికుల్
మొదల నొనర్చినక్రమమున
విదళితదైతేయకాయ వినయోపాయా. ౬౩

క. ప్రాసము రెండవయక్షర
మై సమవర్ణమున నాలుగంఘ్రుల నిలుపన్
భాసుర మగు నవి స్వరముల
తో సమకూర్చినను బెల్లు ధూమ్రాక్షహరా. ౬౪

సీసమాలిక.
అఱసున్న నెఱసున్న లరసి వేర్వే ఱెడ
జడ్డయు జడ్డయు సమము చేసి
ప్రాస ముంచుట సమప్రాసనామం బగుఁ
బాడు నూరును బ్రోలుఁ బొళ్లు నూళ్లుఁ
బ్రోళ్లును మొగలు మొగళ్లను నివిమొదల్
బహువచనములైన పట్లనూఁది
పలికినప్పుడు తేలఁ బలికిన సంయుత
ప్రాసంబు ద్వివిధమై పరఁగుఁ గృతులఁ

బవసజకవచ మేఖ్యతియింతు నన నిది
సంధిగతప్రాససంజ్ఞఁ దనరు
రలయుతాయుతడకారము రెండు వెలుఁగులై
యుండుచు నది విన గుండ్లు గొన్ని
పీఁడె వైచెను బగవాండ్రను ననిలసం
భవుఁ డనంగ నుభయప్రాస మగును
క్షోణిపై మకరికాప్రాణముల్ హరియించెఁ
బూనుక లక్ష్మణప్రాణ మెత్తె
హనుమంతుఁ డనుచు నీయనువున నణలు సం
బంధింపఁ బ్రాదియ ప్రాస మొనరు
వసుసతో వర్గాదివర్ణముల్ సానునా
సికలయ్య సంధులఁ జెందినపుడు
శబ్దవికల్పమై జరగుఁ గావున మాంస
భుజ్నికరవనికి యగ్ని యగుచు
హృన్మోదమునఁ గొల్చెఁ బద్మాక్షు నితఁ డని
పల్లి వికల్పమ ప్రాస మయ్యె
బిందువై పొల్లనాఁ జెందుసంధులను గ
నన్ దగుఁ బ్రాసంబు బిందు వగుచు
నణసున్న గలపక యరయ నిర్బిందువై
తేలినచోటను దెలియ వినుఁడు
దాఁటెఁ గేసరసుతుఁ డేటిగుంపులతేనిఁ
జాఁపుగా లంఘించి యేపు మీఱ
నన నర్ధబింపవై యమరుప్రాసం బగు
నచ్చులలోనుండి యచ్చమైన
యాఋకారము రేఫతో రహిఁ గూర్చుట
ప్రేషుతా కవులు ఋప్రాస మండ్రు
ఓ త్రిలోకస్తుత సీతేజ్ఞ యానుసంఖ్య
బలుకుఁ డ్రికారమ ప్రాససంజ్ఞ

శ్రీబృహదంబికాయైనమః.

## —: కవిజనోజ్జీవని. :—

### — సమస్యలు. —

ఉ. శ్రీకరవేలఁ బుష్పమునఁ జెందిన తావియుఁ బోలె దివ్యర
త్నాకలితంబగుఁ ద్యుతివిధంబున జాబిలి చల్వరీతిగా
నాకపిలాగ్రసుతీశ్వరుని యంగమున న్వసియించి సర్వవి
ద్యాకృతి నై వెలుంగు బృహదంబను గొల్తు నభీష్టసిద్ధికిన్.

వ. అని యిష్టదేవతాప్రార్థనంబు చేసి,

క. విజయరఘునాథభూపతి
నుజుఁ డఖిలక్షోణిపాలనుతుఁ డనుచుఁ గవి
వ్రజ మనఁగను మను కవితా
రజనిసుధావ్యతిని రాయరఘునాథపతిన్.

గీ. వెంకనకవీంద్రుఁ డుద్దండబిరుదశాలి
మమ్ముఁ గొలిచియుఁ గఠినసమస్య లొసఁగ
నొప్పుకొని మేము పద్యముల్ సెప్పినంత
నందఱును విని కృతి కివి యర్హ మనిన.

గీ. కవిజనోజ్జీవని యటంచుఁ గావ్య మొకటి
దుర్ఘటసమస్యలకు నెల్లఁ ద్రోవదెలియఁ
గవిజనంబులకును నుపకారముగను
జేతు దయచేతఁ బృహదంబ చిత్తగింపు.

### —: సమస్యలు, తత్పూరణములు :—

(1) “కలుషగిరిభేదశంబ శ్రీబృహదంబా”

ఇది యక్షరవంచనసమస్య- పూరణము.

క. వకుళవననిత్యవాసిని
సకలాభీష్టముల నిచ్చు చక్కనితల్లీ

ప్రకటితముసేయు మీాకృతి
నృకలుషగిరిభేదశంబ శ్రీబృహదంబా.

ఈక్రిందివి శబ్దచిత్రసమస్యలు.

(2) "క్రకచము జలధరమువోలెఁ గడు నింపెసఁగెన్."

క. మకరాంక కేళికోద్రే
కకరత్వం బొంచి చూడఁగాఁ జెలికిఁ జక
చ్చకితపుచివిచయమునగు వ
క్రకచము జలధరమువోలెఁ గడు నింపెసఁగెన్.

(3) "కావేరే శిరముపైని గట్టఁగవలయున్."

క. నీవంటి రూపవంతున
కేవేళను జీటిసరిగయో కాకను జెం
గావి మొదలైనపాగలు
కావేరేశిరముపైని గట్టఁగవలయున్.

కా=కాదు, వేరే (ఔ) శిరము- అని పదవిభాగము.

వేణుపురాణము.

క. స్త్రీవశ్యమునకు సిద్ధం
బౌవేరు నొసంగె దాని నెఱుఁగుమవే కా
యీావనితామఁణివలచుట
కావేరే శిరముపైని గట్టఁగవలయున్.

వలచుటకు- ఆవేరే, అల్లవేరే- అని పదవిభాగము.

(4) "వాతెఱ లే కొక్కవనిత వర్ధం బుండెన్."

క. సీతాంగన యొక్కతయే
వాతికి నెరలేక యొక్కవర్ధంబుండెన్
ఆ తెలుఁగున మఱె యేతఱి
వాతెఱలే కొక్కవనిత వర్ధంబుండెన్.

వాతికిన్ + ఎరా ; వాతెఱ=మోవి.

(5) "వావిలిలోఁ ద్రోయఁ గ్రోఁతి వలెనే యుండెన్."

క. ఓవిద్వన్మణి నను సు
గ్రీవుని యన్నకును జేరెఱింగింపుము హా
వేవిత మనియెఱుఁ మధ్యము
వావిలిలోఁ ద్రోయఁ గ్రోఁతి వలెనే యుండెన్.

వావిలి యనుపదమునకు- మధ్యమాక్షరము, త్రోయఁగా- వాలి యని యాయెను.

—: వివిధసమస్యలు :—

(6) "పాగా గొంతుకడ శిరముపైనిం గలదే."

క. బాగుగఁ దంబుర మీటుచు
రాగంబుల వినికిసేయు రమణికిఁ దలఁపన్
ధాగరి ధగారి ధగరిగ
పాగా గొంతుకడ శిరముపైనిం గలదే.

పాగా=పంచమగాంధారస్వరములు, గొంతుకడ=కంఠమందే కలుగు నని కాని
పాగా యనినఁ దలపాగ కాదు.

(7) "కంబాలకుఁ జనులు గిరులకైవడి వెలసెన్."

క. శంబరవిరోధి మామయు మొ
యంబుజసంభవుని సృష్టి యాకావనగతి దే
హంబునకు మించు మను జో
కం బాలకుఁ జనులు గిరులకైవడి వెలసెన్.

జోకన్ + బాలకు, అని పదవిభాగము.

(8) "పడుచున్నను బెండ్లిసేయువారును గలరే."

క. కడువేడుకగా నుండెను
పడు చున్నను బెండ్లిసేయవచ్చును జగతిన్
దడ లేక పండ్లుఁ జన్నులుఁ
బడుచున్నను బెండ్లిసేయువారును గలరే.

(9) "ముక్కున నలమానవుండు భూరి యొసంగెన్."

క. కక్కసపహా పదియవమా
లక్కట యనుమాడఁ దరుణి యాత్మజు గడెలోఁ
జక్కఁగఁ గనఁగాఁ గని యొక
ముక్కున నలమానవుండు భూరి యొసంగెన్.

"కనెనొక ముక్కున" అనియుండవచ్చు ననితోఁచెడిని (ముక్కు=తినుకుటుంబంటిది.) ముక్కుటకు మూల్గుట- భూరి=పుత్రోత్సవసందర్భమున సువర్ణాదిదానము.

(10) "వంకాయా పెసరకాయె వడ్లాజొన్నల్"

క. వంకాయ లమ్ముదానివి
జెంకను బెట్టేసి సరకుఁ జేకొనెఁ జోరుం
డింకేమి చెప్ప మాకుర్
వంకా యాపెసరకాయె, వడ్లాజొన్నల్.

ఉత్తరప్రత్యుత్తర విషమ సమస్య - వంకాయ, పెసరకాయ, వడ్లు, అజొన్నల్ వంకాయలమ్మెదాని సరకుగానాయెను, విషమపరిహారము.

(11) "నీవేచేసితిని గాక నేచేసితివే."

క. ఏవేళఁ దప్పవెట్టెద
వోవనితా దేవపూజ కుంచక మును పే
కావలసిన భక్ష్యంబులు
నీవేచేసి తిని కాక నే చేసితివే.

నీవేచేసి=నీవేపాకము చేసి, తిని=దేవతానైవేద్యమునకుఁ బూర్వమే భక్షించి. కాక నేచేసితివే=పూజాసన్నాహముగాఁ జేసితివిగదా:—అని, వక్రముగా- నీవే చేసితిని, నేచేసితివి అని క్రియలం బ్రయోగించినందులకు విషమపరిహారము.

(12) "భంగి నీళ్లను ద్రాగినఁ బ్రజ్ఞచెడను"

సీ. భంగినీళ్లను ద్రాగినఁ బ్రజ్ఞచెడక
పోవ దెటువంటి వాడికి భూమిలోన
లలన యేమందుఁ జిత్ర మాకలశమునికి
భంగి నీళ్లను ద్రాగినఁ బ్రజ్ఞ చెడను.

భంగము=అల, భంగములుగలది భంగి=సముద్రము. భంగి=గంజాయి, కలశముని=అగస్త్యుఁడు- భంగినీళ్లు=సముద్రోదకము.

(13) "చండాళులఁ జేరు తమ్మి సరి యనఁ దగునే"

క. అండజగామిని శ్రీముఖ
మండలమునకు ద్విజరాజు మాద్రియె కా య
ట్లుండఁగఁ దద్వైరము గొని
చండాళులఁజేరు తమ్మి సరియనఁ దగునే.

చండాళులన్=మాతంగజాతిని, చేరు=ఆశ్రయించిన, తమ్మి=పద్మినీజాతిస్త్రీ. చండ + అళులన్=కోపముగల తుమ్మెదలను, చేరు, తమ్మి=పద్మము. చండాలసంపర్కముగల పద్మినీజాతిస్త్రీని స్వచ్ఛమైన దనవచ్చునా. చండములగు తుమ్మెదలతోఁగూడిన పద్మము-అండజగామిని ముఖమునకు సరివచ్చునా.

(14) "పోఁగులు చెవులకడ లేక భుజమున వెలసెన్"

క. పోఁగులు కావలె నంచని
రోఁగతిఁ దండ్రికడఁ జెప్ప నీయమి నిప్ర
త్యాగతి బాఁపనపిల్లకుఁ
బోఁగులు చెవులుకడ లేక భుజమున వెలసెన్.

పోఁగులు=కర్ణాభరణములు. పోఁగులు=నూలిప్రోఁగులు- యజ్ఞోపవీతములు. ప్రోఁగులు చెవులకడలేవు భుజమున నున్నవి యని విషయము- నూలిప్రోఁగులు, అనఁగా జన్నిదములు భుజముపై నున్నవని విషమపరిహారము.

(15) "తరుణి నీకంట సుందరదాసుగుంట"

గీ. పుష్పిణివి నీవు కావేరి ముట్టరాదు
ఇంటనన నె తానమును జేయ నింపుగాదు
నాఁడె బహుయత్నమునఁ ద్రవ్వినాఁడు గాదె
తరుణి నీ కంట సుందరదాసు గుంట.

నీకంటన్, నీకంటియందు- ఇదివిషయము. నీవు, అంటన్=నీవుస్పృశించుటకు కగ్గమైన సుందరదాసుగుంట- సుందరదాసు త్రవ్వించినకోలను, కలదుగదా యని పరిహారము.

(16) "పల్లములో రాతు రాతుపైఁ బల్లంబున్"

క. పెల్లుగ మీటిరి యశ్వా
ల్గొల్లన రాతులును వానిలో నొకటి పడిగా

ప్రాఘ్లఁగఁ బడె నా యగడితఁ
బల్లములో రాతు రాతుపైఁ బల్లంబున్.

పల్లము=లోఁతు, పల్లము=గుజ్జుముపై జీని.

(17) "కాశీతల మొక్క గ్రుక్కగాఁ గొనె లోకన్"

క. వేసవిదినముల నెండలు
గాసిన గాశిమును జెంది కావడిలోనన్
మోసినజలం బమృతఘుటి
కాశీతల మొక్క గ్రుక్కగాఁ గొనె లోకన్.

కాశీతలము- వారణాసిప్రదేశమును లోఁగొనె నని విషమము. అమృతఘుటికా శీతలము=అమృతఘుటికవలెఁ జల్లనైన యని పరిహారము.

(18) "మారు జగడాన నారదమహాని బలిసె"

గీ. దైత్యనాశకు జగడాన దప్పి యణఁగె
శూలిపోరునఁ గొంచెము క్షుధ యణంగెఁ
గదనమున వారికిని మిన్నగాన నాకు
మారుజగడాన నారదమహాని బలిసె.

మారు=మన్మథయుద్ధమునఁ గలహాశనుఁడు స్థూలించెననుట విషమము. ఆమ మారు= ఆమహాస్వామియొక్క యుద్ధములో నని పరిహారము.

(19) "కుంపటిలో నక్క కుక్కకూనల నీనెన్"

క. తెంపరి యగు శుని కూనల
డింపఁగ గంను పిడఁ జూలు దేఱిన ముంగన్
సొంపుగన దివ్వె నిడఁ బటిఁ
కుంపటిలో నక్క కుక్క కూనల నీనెన్.

ఈనుటకు సిద్ధముగానున్న (శుని)= కుక్క మూలుగుచుండఁగా దానిం జూచుటకై (అక్క=)జ్యేష్ఠసోదరి, (పటిన్=) గుడ్డను, కుంపటిలోపల, నక్కన్= పెట్టఁగా=దీపము వెలిఁగించుటకై కుంపటిలో గుడ్డపేలికను పెట్టఁగానే- దీపము వెలిఁగించుటకు ముందే- కుక్క కూనలను బెట్టినది.

(20) "చేఁపచన్నులలోఁ బాలు చెఱచెఁ గుండె"

గీ. కోరియుండిన యావును గొల్ల నాఁడు
పల్లెపాలని చెప్పిన బ్రమసియుండి

పచ్చికయు మేసి తప్పుడును బాగుగఁ దిరఁ
జేఁప చన్నులలోఁ బాలు చెంబెఁడుండె.

జేఁపచన్నులు= పత్న్యస్తనములు= విరోధము. జేఁపన్= పాలు చేఁపఁగా, చన్నులన్= చనుకట్లలో- పాలు చెంబెఁడు గలవు- పరిహారము.

(21) "కమలాననచంటిమీఁదఁ గాఁకర మొలచెన్"

క. రమణుండు వరాటికిఁ బోయెడ
రమణి యనఁ జనుల సరసము గాచినతోడన్
భ్రమఁజెందె ననఁగఁ బులకలు
కమలాననచంటిమీఁదఁ గాఁకర మొలచెన్.

కాఁకర= కాకరపాదు. కాఁక + అర= విరహతాపమునం బొక్కిల్లు.

(22) "వావిరికడఁ ద్రోచి తెలిసి వారికిఁ బలికెన్"

క. శైవాత్మకాస్య యొవతే
యీ వని నీతపసి యనుచుఁ గృష్ణుని చెల్లిన్
భావముగ నడుగ నదియున్
వావిరికడఁ ద్రోసి తెలిపి వారికిఁ బలికెన్.

వావిరి కడన్ ద్రోసి,= అనర్థము. వావిరిన్= వావిరియనుశబ్దములోని, కడన్= చివరియక్షరమును, త్రోసి=తీసివైచి, "వావి"అయెను. దానిం దెలిసి పలికె ననిభావము.

(23) "ఖానుఁడు వేంచేసి రాఁగఁ గంటివె చెలియా"

క. ఆనాఁడు యువనకన్యక
మానము చేకొన్నవాఁడు మాన్యుఁడు త్రిజగ
త్త్రాణుఁడు ధీరుఁడు నిర్జిత
ఖానుఁడు వేంచేసిరాఁగఁ గంటివె చెలియా.

నిర్జితఖానుఁడు= తురుష్కుని జయించిన రంగనాయకుఁడు. రంగేశుఁడు తురుష్కుని జయించి తురకనాచ్చారును గాంధర్వమున వరించెనని పురాణప్రసిద్ధము.

(24) "మణి కరఁగును గానచంద్రమసులను దక్కన్"

క. మణి కరఁగు గీతిచే విధు
ఘృణిచే లోకమున రసికుఁ డింతిచను మొనల్
పుణుకుటయె చాలుఁ జ్యొక్కి ర
మణి కరఁగును గానచంద్రమసులను దక్కన్.

గానమున రాల్గరఁగును, చంద్రమునిచేఁ జంద్రకాంతమణులు కరఁగును, గానమును జంద్రముఁడును లేకుండఁగనే సరసునిచే రమణి కరఁగును.

(25) " కంబలి తిని పెరుఁగుపట్టి కాఁపుం గంటిన్. "

క. సంబళమును గొనఁగా గ్రా
మంబున కంపితిని యూరు మణియములే వి
త్తం బొసఁగ లేమి నాఁకటి
కంబలి తిని పెరుఁగుపట్టి కాఁపుం గంటిన్.

కంబలి=కంబళము. ఆఁకటికి + అంబలి. సంబళము-జీతము. మణియగులు=ఉద్యోగులు. అధికారులు. మణీవము.

(26) " బోటికి నెంపైన వస్త్రమ్మింతురె చెలియా. "

క. పూఁటకుఁ బూఁటకు మేలౌ
బోటికి మేలైనవస్త్ర మొసఁగఁగవచ్చున్
హాటకమయ మగు నచ్చో
బోటికి నెందైన వస్త్ర మ్మింతురె చెలియా.

బోటికి వస్త్రమింతురే-ఇదివిపరీతము. ఆ + చెంబు + ఓటికిన్ = ఆచెంబునకుఁ గల ద్వారమునకు, అనిపరిహారము. ఓటిచెంబునకు మూటింతునుగాని గుడ్డలికి వెట్టరుగదా!

(27) " ఉత్తరమున సూర్యబింబ ముదయం బయ్యెన్. "

క. మత్తాళిచికుర నాథుని
కత్తఱిఁ దములంపునుడుపు లందిచ్చుచు నా
చిత్తేశుఁ డనెడుపలుకున
నుత్తరమున సూర్యబింబ ముదయం బయ్యెన్.

ఉత్తరమున=తర్వాత. ఉత్తరము చెప్పినపిమ్మట-

(28) " ఈఁగయుఁ బులి సమముగానె యేర్పడి యుండెన్. "

క. ఈసుంటకడచు నీళ్ళను
ద్రాగుటకు వ్రాఁగఁ బొంచి దారంబిడి వే
వేగఁ ముపాకిని నెత్తఁగ
నీఁగయుఁ బులి సమముగానె యేర్పడి యుండెన్.

ఈఁగయుఁ బులియు సమముగా నుండుట విపరీతము. ఈఁగ=తుపాకి మొగలా టమున గుఱుతెలుఁగుటకై యుండునుంట (ఉండ). ఈఁగయుఁ బులియు సమముగానె యున్నవి యనఁగా లక్ష్యము సరిగానుండె ననుట—

## ఆంధ్రసాహిత్యపరిషత్తు — ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురముమహారాజావారు; పరిషద్యావజ్జీవాధ్యక్షులు.
కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు.
కీ. శే. శ్రీ బొబ్బిలిమహారాజావారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.
వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

### — కార్యనిర్వాహకసభాసభ్యులు. —

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయఁడుగారు, (కోశాధ్యక్షులు)
పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ. ,,
చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.
కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.
శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., ఎల్. టి.
దర్భా వేంకటశివరామరాసుగారు, బి. ఏ., బి. యల్.
అళక్కి వేంకట్రామయ్యగారు.
కేశవరపు కామరాజుగారు.
కోకా వేంకటసుబ్బారావునాయఁడుగారు.
ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.
పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.
పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మారావునాయఁడుగారు.

# శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు.

శ్రీ పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని, రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమసంపుటము ముద్రితమై విక్రయమునకు సిద్ధముగా నున్నది. ఇందు, అకారము మొదలు, ఔకారమువఱకును గల యచ్చు లాదియందుఁ గల సంస్కృతాంధ్రశబ్దము లన్నియుఁ గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నింటికంటె నిది సర్వవిధముల నుత్తమమయినది. ఈభాగము శబ్దరత్నాకరములో 186 పుటలలో నిమిడినది. దీనినిబట్టి యీరెండు నిఘంటువులకుఁ గల తారతమ్య మూహింపవచ్చును. ఈనిఘంటువునందు, సంస్కృతశబ్దములు పూర్వనిఘంటువు లన్నిటియందుకంటె మిక్కిలి యధికముగా నీయఁబడినవి. కావున సంస్కృతవిద్యార్థులకుఁ గూడ మిగుల నుపయోగకరముగా నుండును. ఇది యున్నచో సంస్కృతనిఘంటువు నపేక్ష యుండదు. ఆచ్ఛికపదములకుఁ గలయర్థభేదములఁ గనఁబఱచి వానికిఁ బ్రమాణవాక్యము లును పూర్వగ్రంథములనుండి విపులముగా నీయఁబడినవి. లభ్యమైనంతవఱకుఁ దెనుఁగుశబ్దములకు సంస్కృతద్రావిడాదిభాషలయందుఁ గల సజాతీయపదములు చూపఁబడినవి. కేవలము విడిశబ్దములే కాక సందర్భానుసారముగ సమస్తపదములు (Phrases)ను వానికిఁ గలయర్థములును బ్రయోగములును గూడ నీయఁబడినవి. జనకశబ్దములక్రింద జన్యశబ్దములు చూపఁబడినవి. ఏవిధముగఁ జూచిన నిది యిదివఱకున్న నిఘంటువు లన్నిటికంటె మిన్నయని మఱియొకసారి నిస్సంశయముగఁ జెప్పవచ్చును. దళసరికాగితములమీఁద నచ్చువేయఁబడినది. చక్కనియక్కరములు, తోలు, క్యాలికోలతో గట్టి బైండుచేయఁబడినది. గిల్టు అక్షరములతోఁ బేరు గలదు. పుస్తకభాండాగారముల కిది యలంకారముగ నుండును. విద్యార్థులకు సహాకారి. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకే కాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయునను తలంపుతో సాదాప్రతి వెల రు. 5 లు, ఆర్టుపేపరు ప్రతి రు. 7 లు, మాత్రమే నిర్ణయింపఁబడినది. రైలు, పోస్టువ్యయములు, కొనువారే భరింపవలయును. కావలసినవారు, కాకినాడ, ఆంధ్రసాహిత్యపరిషత్తు కార్యదర్శులకు వ్రాయఁగోరెదము.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౧. { ధాతృనామసంవత్సరము. శ్రావణనిజభాద్రపదమాసములు. } సంచిక 3.

## పొగడదండ

— వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు పిఠాపురము. —

ఈపదము శ్రీనాథుని చాటు వగు 'కవిరాజుకంఠంబు కౌఁగిలించెను గదా పురవీథి నెదురెండఁ బొగడదండ' యనుపద్యమునఁ గలదు. ఇయ్యది పొగడదండ కాదు. పోరకదండ యై యుండును. అని బండారు తమ్మయ్య గారు 'శ్రీనాథకవిప్రయోగవిశేషములు' అనువ్యాసమున వ్రాసియున్నారు.

పొగడదండ యనఁ బైని జూపినది గాదని నాయభిప్రాయము. 'పొగడదండ' ఇచట సవరించి పోరకదండ యనినను రామాభ్యుదయము ప్రథమాశ్వాసమునందలి—

"క. అలరువిలుకానితోఁ డీపుఁ
డెలమి న్నాపొగడదండ యి; మ్మీవైతే
వలరాజునాన మీఁజిన
వెలఁదీ నినుఁ బొగడదండ వేయింతుఁ జుమీ." 19 ప

అనుపద్యమునఁ బోరకదండ (= గడ్డివెంటి) యనుట సరి పడదు. ఈపద్యమునఁ గూడఁ బోరకదండయే కాఁ గూడదా యనినచోఁ యమకప్రచురమైన రామాభ్యుదయము స్వరూప మెఱుఁగన ట్లగును.

శ్రీనాథునిపద్యమునఁ బొరకదండ యెట్లని యర్థమునఁ గుదిర్చినను నీకం దపద్యమున 'నిను బొరకదండ వేయింతు' ననుట యెట్లు? గడ్డివెంటిచే నిన్ను వేయింతు నని యర్థము చెప్పుట యనుచితము గదా! శ్రీనాథుని పద్యమునఁ 'గౌఁగిలింతు,' అను క్రియతో నన్వయము కావున నచటఁ బొసఁగినను 'నినుఁ బొగడదండ వేయింతు' ననుతావునఁ బొసఁగన ట్లున్నది. 'నినుఁ బొగడదండఁ గట్టెదను' అని యుండవలయును. అట్లు లేక 'నినుఁ బొగడదండ వేయింతు' నని యుండుటవలనను, శ్రీనాథపద్యమునఁ దక్కిన మూఁడుపాదములందును నపరాధ మొనర్చువారికి వేయు శిక్షలే యుండుటవలనను, పొగడదండయు 'శిక్షించుట కుపయుక్తమగు సాధనము' అయియుండును. ఈపొగడదండయొక్క స్వరూపమును గొంతవరకు గ్రహింప ననువగునట్లుగా రామాభ్యుదయమునందే 8 వ యాశ్వాసమున, నింద్రజిత్తు గగనమునుండి యుద్ధముచేయుట వర్ణించుసందర్భమున "సీ. మెడకు మీఁగాలికిఁ బుడమికిఁ గొన నేయఁ బొగడదండల తోడఁ బోలియువారు"-16 పద్యమున నున్నది. ఆకాశమునుండి యింద్రజిత్తు భూమిపైనున్న వానరులను బాణములచేఁ గొట్టుచున్నాఁడు. ఒక బాణమే మెడకును మీఁగాలికిని గ్రుచ్చుకొని భూమిలో నాటుకొనిపోవుచున్న దఁట. అట్లు మెడకును మీఁగాలికిని గలిపి కట్టినట్లుండుట 'పొగడదండ' యనుశిక్ష వేసినట్లున్నది. అని భావము. దీనివలనఁ బొగడదండ యన నిగళయుగము వెమురుగోడియు, మున్నగు శిక్షాసాధనములలో నొకటి కాని యన్యము కాదనియు, మెడకును మీఁగాలికిని గదలకుండ నంటఁగట్టెడు త్రాడో, యినుపగొలుసో, మఱియొకటియో యైయుండు ననియుఁ దెలియవచ్చుచున్నది.

# సాహిత్యసంస్కారము.

—కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు, సాలూరు.—

---

సాహిత్యపరిషత్కార్యకలాపములలోఁ బండితజనులకుఁ దుష్టిపుట్టించుటయు లోకఁ దగుట నప్పని కెప్పగిది నెందకేని సప్రయత్నులగుట యుచితమే. ఇందు సాహిత్యచర్చయును సంస్కారస్వరూపమును నిరూపింపనిశ్చయించితిని.

సాహిత్యము, సహితభావము సాహిత్యమని తెలియఁబడుచున్నను బరికింప ననేకాకాంక్షాసాపేక్షమయి మహాగంభీరాశయగర్భ మయినట్లు తోఁచును.

భాషామయ మైన దెల్లదియును సాహిత్య మనవలయును. వేద వేదాంగ తదితరసర్వవాఙ్మయప్రపంచమును సాహిత్య మనవలయును. భాషాపాండిత్యము పరిమితమై పదపదార్థములను మాత్రము గ్రహింపఁ జాలును. సాహిత్యము పదపదార్థసమగ్రసారమును గ్రహింపఁజేయును.

సాహిత్యపదము వర్తమానకాలమునం దేయర్థ మిచ్చుచున్నదో యాయర్థము ప్రాచీనకాలమునుండియు నిచ్చుచున్నట్లు వాఙ్మయంబునఁ గానము. అయినను దద్భావవాచకమును వేఱొకదాని నరయుదము. వేదము లతిప్రాచీనము లగుట నందు "సాహిత్య"శబ్ద మున్నది యేమో యన్న నందు లేదు. లేకున్నను గవిశబ్దముం గాంతుము కావునఁ గవిసామగ్రియగు సాహిత్యమును నుండి యుండవలయుటఁ దత్తదర్థబోధకపద జాల ముండితీఱును.

కవిః, వేదవిత్, ధీరః, ఆర్యః, మేధావీ, హోతా, ఉద్గాతా, ఇత్యాదిశబ్దములు విద్వత్పర్యాయములుగఁ గానవచ్చుటచే విద్వత్సాధ్య మగువిద్వత్త్వమును గల దని యనుకొనవలయును.

పురాణములయందుఁగూడ శ్రుతిసంపన్నుఁడు, వచనసంపన్నుఁడు, వ్యుత్పన్నుఁడు, పండితుఁడు, మున్నగు శబ్దములఁ గందుము. ధర్మశాస్త్రంబులను ధర్మవిదాది శబ్దములను గాంతుము. కాని, ప్రాచీనవాఙ్మయంబున

"సాహిత్యసంపన్నుఁడు, అనునట్టి పదమును గానము. అయినను ధర్మివాచకములను జూచి ధర్మవాచకము లున్న వని గ్రహించి సాహిత్యపదర్థ వ చ్ఛబ్దము లున్న వని యనుకొనవలసినదే.

ఏది యెట్లున్నను గావ్యవాఙ్మయమును దద్వివేచనావాఙ్మయంబును ప్రాదుర్భవించిననాఁటినుండియు ను సాహిత్యశబ్దము సామాన్యపాండిత్యశబ్దార్థవిలక్షణార్థవైశిష్ట్యము గలది యగుచున్నది. నాఁడును నేఁడును గవికి ముఖ్యజ్ఞేయము సాహిత్య మనియును గావ్యపరిశీలనాసామర్థ్యమున కుత్తమసాధనమును సామగ్రియును సాహిత్యమనియును బెద్దలందురు. అట్టిభావము గలవా రగుటఁ బెద్దలు నాట్యాలంకారగ్రంథములకు సాహిత్యమీమాంసాది నామములఁ బెట్టి కావ్యమాత్రోపయోగిచర్చ గావించిరి. జ్ఞానప్రకాశనావైదగ్ధ్య సాహిత్యమునం దుండుటచేఁ గొందఱు సంప్రయోగ మనియు వాడి రనుకొందును.

కొందఱు సాహిత్యశబ్దమును భోజనసామగ్రికి వ్యవహారములో వాడుదరు. అయినను సహితభావము సాహిత్య మనునర్థయోగమునకు భంగమురాకుండఁగనే వాడుచున్నారు. కనుక సుపదయే సాహిత్య మని యనుకొందను.

వాఙ్మయప్రపంచమున వాఙ్మయసంపదయే సాహిత్య మందను. ఈసాహిత్యస్వరూపిణియే సరస్వతి యని భావింత మన్న సరస్వతీవర్ణనాసందర్భమున "సంగీతమపిసాహిత్య"మ్మని చెప్పుసంగీతమును సాహిత్యాంగముగఁ దీసికొన్నట్లు భావింపవలసివచ్చును.

## సాహిత్యము, సంగీతము.

సరస్వతీదేవి స్తనద్వయము సంగీతసాహిత్యాత్మకము. ఉత్తమసారస్వత మంతయు సంగీతసాహిత్యవిశిష్టము గాకున్న సరస్వత్యధిదేవతాకము గా దనవలయును. ఎల్లవాఙ్మయంబున నీరెండును నుండవలయు నన్నచో శాస్త్రాదులు సారస్వతవాచ్యములు గా వనవలసివచ్చును. రామాయణాది చ్ఛందోబద్ధగ్రంథములయందు సంగీతము గల దనియును సాహిత్య మున్న దనియును సారస్వత మగు ననియును నిర్ణయించుకొంద

మన్న దశకుమారచరిత్రాది వచనగ్రంథములు నిశ్ఛందసము లగుటను సంగీతము లేమిని సారస్వతము లన వలను గాదు. శాస్త్రాదులమాట చెప్పనేల ? సూత్రగ్రంథములును సరస్వత్యధిదేవతాకములు కావనవలయును. గీతగోవిందము త్యాగరాజకృతులు మున్నగునవియే సరస్వతీపూర్ణరూపారోపము లనవలసివచ్చును. కావున నా"సంగీత"శబ్దమునకు శ్రూయమాణార్థ మపార్థ మనియు ను రమణీయశబ్దతత్స్వరవైశిష్ట్యమే సంగీత మనియుఁ దదర్థసారమే సాహిత్య మనియు నర్థము చెప్పవలయును. నేఁ డనుకొనుసంగీతము కేవలకృతకమును వినోదమాత్రనిర్వాహకమును, స్వరకలాపమాత్రైంద్రజాలికక్రియావిశేషమును నగు ననవలయును. తంత్రీలయసమన్వితముగఁ బరిమితస్వరమేళనావిశేషమునఁ బలుకు శబ్దజాలము సంగీతము. రామాయణమును గుశలవులు గానము చేసిరనుటయు నట్టిసంగీతమనియే యర్థము. వేయేల ? పొందిక యగుపలుకే సంగీతము. తదర్థములే సాహిత్యము. భావావేగమును బూర్ణాభినివేశముతోఁ దెలుపుపలుకే సంగీతము. ఇట్లర్థము చేసిననే యెల్లవాఙ్మయమును సంపూర్ణసరస్వతీసుందరారోపము నొందఁగలదు. మఱియును బూర్వుల కాయభిప్రాయ ముండుటచేతనే వేదాదులయందు స్వరవిశేషమును బ్రధానము చేసిరి. అదియే గాన మనియు నందుసామవేదము కేవలగానార్థ మనియు సామములు గానముచేయుట యనియు సంప్రదాయముగ ననుకొనుచున్నారు. కావున సంగీతసాహిత్యము లవినాభావములు. శబ్దార్థముల నిత్యసంబంధము నట్లు సంగీతసాహిత్యములు నిత్యసంబంధములు. ఆచదువులతల్లి పాలిండ్ల పాలును నేకముఖపేయములు. కాకున్న నస్వభావము. ఆసంగీతమే శాబ్ది యనియు నాసాహిత్యమే యార్థి యనియు నయ్యెను.

వ్యాకరణశాస్త్రము సంగీతోద్భవము. మాహేశ్వరసూత్రము లట్టివే. చదువునప్పు డొకస్వరమును నొకస్థాయియుఁ బలుకునప్పు డొకస్వరమును స్థాయియు భారతీయు లుపయోగించుట సహృదయు లెఱుంగుదురు. శాబ్దప్రమాణము సంగీతముపై నాధారపడియున్నది. అనఁగా

స్వరవైకల్యమునఁ దర్థవైకల్యమును ననర్థప్రాప్తియుఁ గలదగుట సంగీత ప్రాధాన్యము నెఱుఁగవచ్చును. వక్తృవివక్షాధీనముగ శాబ్దమున్న దను టయు సంగీతమే. ఆసంగీతసామంజస్యమే వైదికులకు స్వరసహితశబ్దము గను సూత్రకర్తలకు సూత్రములు ఛాందసములుగను పౌరాణికులకుశ్లోక ముగను వైయాకరణులకు ననపశబ్దత్వముగను నాలంకారికులకు శబ్దా లంకారముగను మాఱినవి. సంగీతము సాహిత్యసహచరము.

సాహిత్యచర్చలు వేదములయందును గలవా? కావ్యాద్యవే క్షణమాత్రము సాహిత్యము గాదా? సాహిత్య మెఱింగిన సంగీత మెఱిం గిన ట్లగునా?

సంగీతము సాహిత్యాంతఃపాతి యగుటను జర్చింపనక్కఱలేదు. సంగీతసాహిత్యము లేకున్నఁ బశువే యని భర్తృహరి యనెను. సాహి త్యము సమగ్ర మగునెడ సంగీతాదు లన్నియును విజ్ఞాతము లగును. మల్లినాథాదు లట్టిసాహిత్యవేత్తలే. వాఙ్మయంబున "సాహిత్యము" కా వ్యాంగముగ నున్నను గవిమాత్రవేద్యముగ నున్నను వేదవేదాంగా ద్యనంతరభావిత్వము సూచితమైనను దావన్మాత్రనిర్వాహకము సాహిత్య ము గాదు.

కవిమాత్రవేద్యము సాహిత్య మనున ట్లాయాసాహిత్యగ్రంథము లున్నవి. కావ్యనిర్వాహకము ను దత్సంశీలనాపరము ను నై సాహిత్య మున్నది. ఇఁక సాహిత్యవిషయప్రాధాన్యము మనమున నిడుకొని "అధి కృతానధికృతయోః అధికృతప్రతిపత్తి ర్బలీయసీ" యనున్యాయమున నేదేదో యాగ్రహాభినివేశములతోఁ జెప్పవలసినదే కాని స్పష్టప్రతిపత్తిగఁ జెప్పుట కింతకు మించి లేదు. అయినను "సాహిత్య"శబ్ద తదర్థ తత్తాత్పర్య పర్యాలోచనాపర్యవసితముగ నితోఽధికము చెప్పకున్న విషయసమగ్ర త్వభంగము వాటిల్లును. కావునఁ బునఃపున ర్విచారణీయ మగును.

విచారిత రమణీయమును వాఙ్మయప్రచుర నవనవోజ్జీవిత వికాస విలాసమును నగుసాహిత్యవివేకము పురుషార్థము ననవచ్చును. ప్రాకర ణికవిషయమును వేదానుబంధము గావించుటయు దర్శనాంతఃపాతిగావిం

చుటయుఁ బ్రాచీనకాలమునుండియు నాచార మగును. కావ్యమీమాం
సాకర్త "సాహిత్యవిద్య"ను వేదాంగముగఁ బరిగణించెను. వేదాంగత్వ
మున్నఁ బవిత్ర మని విశ్వాసము- అగుంగాక. వేదాంగత్వసిసాధయిష
ధిమ[illegible]కచ్ఛాందస మని యఘునాథనాంగ్లసాహిత్యవాసనావాసితమా
త్రఛ్ఛాందసు లందురు. కాని వాదవిచక్షణు లెవ్వరేని వేదైకశరణ్యులు
గావలయును. అవిముఖ్యాంతముల విభాగించుకొని వివేకించుట జిజ్ఞాసా
విధానము గాని పరమార్థజ్ఞానము గాదు. అట్లగుట నేవిషయమును
దత్త్వమన నవిర్వాచ్యనిర్వాణమునకు దారిమాపునదియే యగును. కా
వున సాహిత్యము వేదాంగముగ నెఱుంగవచ్చును. సాహిత్యేతిశబ్దము
ప్రయమాణము గాకున్నను దదర్థవచ్ఛబ్దము మాయా వాఙ్మయంబున లేక
పోలేదు. సాహిత్యశబ్దశాబ్దిభావనామూలముగనే సాహిత్యశబ్దము నిష్ప
న్నమైనది. కావునసాహిత్యము వైదిక మనరాదు. మఱియును "సంవదధ్వం
సంవో మనాంసి, సమానీ సమితిః సమానీఆకూతిః" ఇత్యాదులగుఋగ్వే
దసూక్తములవలనను (యజుర్వేదమునను గలవు) నానామనస్సమీకరణ
మును నానాభిప్రాయసమీకరణమును గలదగుట సాహిత్యమున్న దనవల
యును. ఇంతకును వేదబ్రాహ్మణములు మంత్రభాగసమాలోచనాత్మకము
లనియు నందు సాహిత్యశాస్త్రసంప్రయోగము గలదనియు విజ్ఞులెఱుంగు
దురు. "అశ్వోవా బృహద్వయః, శ్రీర్వై పిలిప్పిలా, రాత్రిర్వై పిశం
గిలః" ఇత్యాదులును ఇదంద్రో ఇంద్రః, చత్వారివాక్పరిమితా, యత్రాపిత
రన్వబ్రవీత్ త త్రాపితరనువాకస్య ప్రాతరనువాకత్వమ్." 'సమస్య త్వేవో
త్తరేపదే' ఇత్యాదులవలన నానావిధశాస్త్రసాహిత్యసాహాయ్యవ్యాఖ్యా
నవైదగ్ధి సువిదిత మగుట లేదా; వ్యాకరణచ్ఛందోవైద్యాది శాస్త్రస
మన్వయమును వైదికవాఙ్మయంబునఁ గాంతుము. వేదములనుండి వచ్చి
నదనుటలో లోపము లేదు, కాని, శబ్దశక్తిప్రామాణ్యమును బట్టి కావ్యో
పయోగి యని యనవలయును. అట్లన్నను బంచమవేద మనఁబడుభార
తము కావ్యమనియుంటఁ గావ్యత్వము వేదాదులకుఁ గలదనవలయును.
"తత్త్వాలంకారశాబ్దానాం సంహతి స్సాహితీ" అనుటను శాస్త్రసముచ్ఛ
య మని యెఱుంగవలయును. సాహిత్యము పాండిత్యేతర మని యొకకవి

వర్ణించెను. "సాహిత్యపాండిత్యయోః" వ్యాఖ్యాతయును సాహిత్యము నను గావ్యాలంకారాదియనియును పాండిత్యమనఁ దర్కాదులనియు ననెను. సాహితిశబ్దమున కొకఁడు పదార్థవ్యుత్పత్తి యనెను. "సాహిత్య నిర్వర్తితద్యుక్తరంగా" అని శ్రీహర్షప్రయోగము. వ్యాఖ్యాత "మహాకావ్యనాటకచంపూప్రభృతినా" అనియనెను. మఱి యొకఁడు "కవిత్వేన" అనిసాహిత్యమున కర్థము వ్రాసెను. ఇట్లు నానావిధములఁ బెద్దలర్థము చేసినను వానియం దేకత్వ మున్నది. అది వివిధశాస్త్రసాహిత్యమే.

వాక్ప్రపంచమున నిత్యవసంతోత్సవము సేయుచు వాగర్థకల్యాణవేదికపై నానాశాస్త్రముల నాస్తరించి శుభాశీర్వాదములఁ గావించు నానాశాస్త్రపండితుల వక్తృజ్ఞానవైశిష్ట్యవ్యవహృతి శబ్దశక్తిప్రభాశోభాకందమే సాహిత్యము.

వివిధవిషయముల కుత్తేజమును వ్యక్తిత్వమును సాధికృతముగ సంపాదించి సార్థక్యమును గూర్చునది సాహిత్యదివ్యశక్తి. వాఙ్మయవిశ్వము నునికి గలతత్త్వత్రిస్వికరూపవిశేషము సాహిత్యసంసర్గమువలనఁ బ్రతిష్ఠిత మగుటచే నన్యోన్యశాస్త్రములయుఁ గావ్యములయు విద్యలయు నన్యోన్యసామరస్యము సమంజసరీతి సంపాదించు నలౌకికశక్తి సాహిత్యము. పదములకు వాక్యములకు నర్థవంతులకు ను దార్శ్వికులకును గోచరమగు స్ఫోటమున సకలవాఙ్మయస్వరూపమునం దనిర్వాచ్య నిరవయవ నిత్యసుందర లావణ్యవంత స్ఫోటము సాహిత్యమునకు నైకాంతిక లక్షణము. ధర్మధర్ములకుఁ గార్యకారణములకు, ఘటఘటత్వములకు శాస్త్రాదివేదులకుఁ దద్వేద్యమునకు వేదమునకుఁ దద్వేద్యునకు వాగర్థములకు నవినాభావసంబంధసాతత్య ముఖ్యస్వభావము సాహిత్యము.

అనుభూయమానవిషయపరంపరాజన్మభూమి యావత్స్వరూపావగమకమంగళసాధనాసాధ్యసాధారణ్యవిన్యాసము సాహిత్య మగుట నీసాహిత్యప్రభాసాన్నిధ్యమున సదసద్వాదేశ్వరసిద్ధాంతములును వైష్ణవబౌద్ధాదివ్యక్తివాదములును నణ్వాదిపదార్థవాదములు నాస్తికాస్తిక హృదయములును బ్రకృతి పురుషప్రధానప్రస్తావములును శాబ్ద రసగు

నాలంకారాదిపారమ్యాంగీకారములును జాతివ్యక్తిశక్తిభక్తిప్రకారకోక్తు
లును, సవిరోధస్థితిపత్తిసంపత్తితో నేయుసయు గావించి తత్త్వదిక్యవిధా
నాఖండానుభవప్రబోధము సుగమము సేయును

షడ్దర్శనదర్శనీతిలోహాసముచు మహామంత్రవిద్యయునై నిశ్చై
తన్యము లగువానికిఁ జైతన్య మిచ్చి విద్యలకు శాస్త్రములకుఁ గలాప్రతి
భనుగూర్చి తనసర్వవ్యాపకతాశక్తిఁ బ్రకాశించు స్వయంశక్తి మీసాహిత్య
ము. వేదవేద్యప్రబోధకము వేదాంత మనునెడల వేదవేదాంగాదిసకల
విద్యాచాతుర్వైకస్థాన సుఖాసీన దివ్యమహాపధ్యాన ముద్రాభద్ర వేదాంత
తత్త్వము సాహిత్యము. సమన్వయము సాహిత్యము. తదితరము తదితర
ము. "సహిత" భావము సాహిత్య మైనను "సర్వ (వేదశాస్త్రాద్యాది)
హిత (అన్యోన్యావిరుద్ధసమన్వయమైన) తత్త్వము (సామరస్యనిర్ణయము)సహి
త మనియుఁ దద్భావము సాహిత్యమనియు సంగ్రహముగ నడవచ్చును.

---

# గ్రంథస్వీకారము

## 1. సీతాకల్యాణము.

ఇది కొల్లాపురము స్నేహలతాకవితాసంఘాధ్యక్షులు వాజపేయ
యాజుల రామసుబ్బరాయఁడు బి. ఏ. గారును వారిసోదరులు వేంకట
నారాయణగారును రచియించిన మూఁడాశ్వాసముల పద్యకావ్యము.
కవిత నిర్దుష్టముగా నున్నది. గ్రాంథికశైలి చక్కగా ననుసరింపఁబడినది.
రచన మృదుమధురము. దీనిపై ననేకపండితులు తమతమ యభిప్రాయ
ముల నిచ్చియున్నారు. అందఱును మెచ్చుకొనిరి. తొల్లిటిప్రబంధములలో
వలెఁగొంతవఱకు సూచించినట్లు శృంగారాతిశయవర్ణనములు గాని వెఱ్ఱికల్పన
లతోడి యతిమాత్రములగు నిరర్థకవర్ణనలు గాని లేకున్నను భరతఖండ
వర్ణనము హృద్యకల్పనతో నొప్పినను నధిక మేమో. చాతుర్వర్ణ్యవర్ణ
నము చర్వితచర్వణమేమో యనుకొందుము. చమత్కారముకొఱకుపై రతి
శయించి వ్రాసి రంద మనినను బూర్వులు నితరవిషయములను వారికిఁ

జమత్కారముగ దోఁచియే వ్రాసి రని కొందఱయినఁ దలంతురు. చిన్ని పొత్తములోనిచట వర్ణనాతిశయమే తోఁపవచ్చును. అష్టాదశవర్ణనములు నుండవలయునను నియమ మున్న దని ప్రారంభమున వరుసపెట్టి పదునెనిమిదిపద్యములుం జెప్పుటకంటె నాయాసందర్భములలో నాయావర్ణనలు చేయుట మంచిది. అది యిప్పటికి నెవ్వరుం బాటించుటలేదు. అందఱను మెప్పించువా రగుటకు కష్టము.

రెండుమచ్చుపద్యములు -

మ. రణమేస్వర్గము మోక్షమంచు నితరారంభంబుల న్మాని ధా
 రుణిఁ గంపింపఁగఁ జేయుసైన్యముల నిష్ఠాలంబుఁ గావించి వీ
 రనరవ్యాఘ్రములన్ వధించెడి మహోగ్రస్ఫూర్తితో మాస్థరన్
 క్షణమాత్రంబున రంభఁ జేర్చిన ఘనుల్ జన్మించి రిందే కదా. 1-8

చ. చిరసఖుఁ డాజికిన్ విమలశీలుఁడు కాలుఁడు వైరిసేనకున్
 బరమదయావిభూషణుఁడు పావనమూర్తి విశుద్ధకీర్తి సు
 స్థిరమతి యంగదేశపతి జిష్ణుసమానుఁడు రోమపాదుఁ డా
 వరనృపుఁ బిల్వ నన్యులను బంపక నీవ స్వయంబ యేగుమా. 2-16

కొల్లాపురము స్నేహలతాకవితాసంఘములో దొరకును. వెల రు ౧.

## 2. సువర్ణకోశము.

గ్రంథకర్త శ్రీమాన్ శేట్లూరి వేంకటరాఘవ అయ్యంగారు, బి. ఏ, బి. ఇడి. బెజవాడ. శ్రీమదయ్యంగారు విద్యార్థిదశలోఁ జదివిన షెల్లీ, కౌపరు, బ్రౌనింగు, వర్డ్సువర్తు, ఆర్నాల్డు మున్నగు నాంగ్లేయ కవులు రచించిన పద్యమంజరులం బట్టి యాంధ్రమున 1 వలపు 2 కవిత 3 సంకీర్ణము 4 జీవము ననుభాగములుగా 52 చిన్నచిన్నపద్యమంజరులుగ రచించిన సువర్ణకోశము. అన్నియుఁ దేటగీతమాలికలు. కవిత్వము చక్కగా, ధారాళముగ నలరుచున్నది గాని యక్షరగౌరవమును బాటింపలేదు. కార్యాంతరనిమగ్నుఁడనగుటం జేసి, అర్ధానుస్వారరేఫశకటరేఫలను వ్యాకరణసంధిదోషములను అచ్చుపొరపాట్లను సవరింపఁజాలనైతిని.... ముందుముద్రణమున దిద్దుకొందునని తెల్పిరి. మచ్చుపద్యములు-

కవిత-పుట 36.

బావిలో జల స్రవహించు భాతిగాగ
వృక్షశాఖలు చిగిరించు విధముగాగ
మల్లెజాతులు వికసించుపద్ధతి గాగ
కయితనల్లెడి క్రమములోన గలుగుసౌఖ్య
మెసగువారలు కవులుగా నెవరు గలరు ?

కవిత్రయము పుట 42.

ప్రతిభ లేని కవీశ్వరుల వాక్యసమితి
ప్రకృతివైచిత్రి ప్రతిభా ప్రభావములను
గాని తక్కొంట కృతినేర్పు గానఁబడదు
అతివసర్వాంగసౌష్ఠవ మందెగాని
ముక్కు మొగమున గనలేము చక్కదనము.

వెల తెలుపఁబడియుండలేదు-

### 3. చెన్నబసవపురాణము.

ఇది యొక్క వచనకావ్యము. రాజమహేంద్రవరము శ్రీశైవగ్రంథ మండలి ప్రథమగ్రంథము. గ్రంథకర్త అన్నదేవర నాగభూషణముగారు ప్రకాశకులు శ్రీ. పీ. మ. స్వ. కాళహస్తి తమ్మారావుదేవరగారు. ఇది వఱకుఁ జెన్నబసవపురాణము పూర్వకవిరచిత పద్యకావ్యము గలదు, దాని కిది వచనము. శివభక్తుల కథలు మాహాత్మ్యములు పెక్కులుగలవు. మొదట విభూతిమహిమ, రుద్రాక్షమహిమ, పంచాక్షరిమహిమ, గురుప్రసాదప్రశంస మొదలైనవికలవు. తరువాత శివభక్తాగ్రేసరుల ప్రభావములు కలవు. వచనరచన మంచిది. వ్రాఁతపొరపాటులందందునుఁ గలవు. మిక్కిలి నలఁగిపోయిన యక్షరములతోఁ గూర్పఁబడినయచ్చు. కొందఱకు సుఖముగాఁ జదువుకొనుటకు సాయపడదు. ఇందైదుప్రకరణములు 44 విషయములు శైవారాధకులయుఁ దన్మహిమలయు వర్ణనములు గలవు. నిజాంరాష్ట్రములోని యాంధ్రసోదరుల సౌకర్యమునకు-సికింద్రాబాదులో మహంకాళివీథిలో కొండా శంకరయ్యగారిబుక్కుడిపోలోఁగూడ గ్రంథములు విక్రయింపఁబడును. వెల రు 1.

## 4. శ్రీసత్యనారాయణవ్రతచరిత్రము.

శ్రీమద్గద్వాలాస్థానకవియును, కవిసింహబిరుదాంకితులును నగు మ. రా. రా. పోకూరి కాశీపతిగారు రచించినది. రాయచూరినివాసులు విశ్వకర్మకులోద్భవులు ఆత్మకూరి ముత్యాలయాచారిగారికిఁ గృతి. ఇందు శ్రీ సత్యనారాయణవ్రతవిధాన మున్నది. వ్రతకథకుఁ బూర్ణముగ, 5 అశ్వాసములు పద్యములు రచింపఁబడినవి.

మచ్చుపద్యము:—

చ. విమలుని చంద్రకేతునృపవీరుని వీక్షించి నావనెక్కి ధా
మమునకు వైశ్యు లేగునెడ మాధవుఁ డింపలరన్ ద్రిదండివే
షమును ధరించి వీరలకు జ్ఞానము వచ్చెనొ లేదొ నేఁడు వే
గమ కనుగొందుఁ గం చెదురుగాఁ జని బేరులతోడ నిట్లనెన్.

దీనివెల రు 0-4-0 వలయువారికి రాయచూరులో శ్రీరాధాకృష్ణముద్రాక్షరశాలలో దొరకును.

## 5. అలంకారమంజరి.

గ్రంథకర్త శే. వేం. రాఘవఅయ్యంగారు, ఎమ్. ఏ., బెజవాడ.

సంస్కృతాలంకారప్రపంచమున మునిత్రయ మని ప్రఖ్యాతిఁ జెందిన మమ్మటాచార్యుని కావ్యప్రకాశమునందలి కారికలను సూత్రప్రాయములుగ ననువదించి వృత్తిని వివరించి లక్ష్యపద్యముల రచియించి లక్ష్యలక్షణములకు సమన్వయ మొనరించి శ్రీరాఘవ అయ్యంగా రలంకారమంజరిఁ గూర్చి యాంధ్రవిమర్శకవాఙ్మయమునకు నొకనూతనాలంకారము సమకూర్చినారు.

సంస్కృతాలంకారశాస్త్రగ్రంథములకుఁ గేవలానువాదములు గాక నిట్టివివరణగ్రంథము లున్ననే యవి విద్యార్థిలోకమునకును, విమర్శకలోకమునకు నుపకరించును. ప్రకృతగ్రంథమున రాఘవఅయ్యంగారు మమ్మటాచార్యమతమే గాక నితరాలంకారికమతములను గూడ సూచించుట మిగులఁ బ్రశంసనీయము. అలంకారమంజరియందు, తొమ్మిదిసుమము లున్నవి. (1) కావ్యభేదములు (2) శబ్దభేదములు, వృత్తులు వ్యాపారములు, (3) వ్యంగ్యము (4) ధ్వనిభేదము (5) రసస్వరూపము రసధ్వని

(6) గుణీభూతవ్యంగ్యములు (7) శబ్దాలంకారములు (8) గుణరీతులు, (9) అర్థాలంకారములు. ఇవిగాక యనుబంధమున శబ్దరసవిషయమై లొల్లట శ్రీశంకుక భట్టనాయక అభినవగుప్తపాదాచార్యరసమతవిచార వివరణము గలదు. పైవిషయసూచికచే నీగ్రంథ మలంకారశాస్త్రవ్యుత్పత్తి నభిలషించువారల కెంత యుపయోగమో తెలియకపోదు.

రసనిష్పత్తి, రసనిరూపణమును గూర్చి శ్రీరాఘవ అయ్యంగారు ప్రాచీనాలంకారికమతసిద్ధాంతము లింపుగ జర్చించియున్నారు. అయ్యది సహృదయైకవేద్యము- శృంగారాదినవరసములఁ గూర్చి స్థాయిభావములఁ గూర్చి యింకను వివరణము గలిగినచో నది యీగ్రంథప్రాశస్త్యమును మఱియుఁ బెంపొందించును. అలంకారశాస్త్రము రాఘవయ్యంగారు తొలిపలుకునఁ దొలిని నుడివినట్లు 'అపారము అగాధము' అయినను వారు కావ్యప్రకాశము నాధారముగాఁ గొని గ్రంథము రచియించుట చేతను నితరమతములవారినిఁ గూడ దిఙ్మాత్రముగఁ జర్చించుటచేతను నీ విషయ మావశ్యకమైనది. ఇట్టిపట్టు లీగ్రంథమునందలి రెంటినిఁ జూపుచున్నాఁడను.

పంచమసుమము 71 పుట. స్థాయిభావములవివరణము- 'ఆలుమగల కొండొరులపై నంటియుండువలపు నాఁబడు మనమునందలి మక్కువనే 'రతి' యందురు- గ్రంథకర్తగారి తెలుఁగుపలుకుబడి మెచ్చఁదగినదియేగాని శాస్త్రీయసాంకేతికపదవివరణమునందుఁ దెలుఁగుపలుకుబడి (మనకాయాశాస్త్రసాంకేతికములకుఁదెలుఁగుపదములు తెలియుటచేసు) యంత ప్రయోజనకారి కానేరదు. రతి యనునది ప్రేమ మని ప్రీతియని చెప్పఁబడు నొకచిత్తవృత్తియే "తత్ర స్త్రీపుంసయో రన్యోన్యాలంబనః ప్రేమాఖ్యశ్చిత్తవృత్తి విశేషో రతిః స్థాయిభావః" ఇయ్యది కేవలస్త్రీపురుషుల కన్యోన్యవిషయికమై నపుడు శృంగారస్థాయిభావ మగును.

గురుదేవతాపుత్రాద్యాలంబనస్తు వ్యభిచారీ- గురుదేవతాపుత్రాద్యాలంబనమైన ప్రేమ (రతి) వ్యభిచారిభావ మగును. ఇచ్చట నితరేతరాలంబనము ప్రధానముగా నెన్నఁదగియున్నది. ఇట్లీరతిభావమును రెం

డువిధములుగఁ జెప్పుటకన్న రతియంతయుఁ బ్రేమ యని చెప్పుట నవీనాలంకారికసిద్ధాంత మని సుప్రసిద్ధాంధ్రదేశీయాలంకారికుఁడు వ్యాఖ్యానించినాఁడు. ఈస్థాయిభావమునుగూర్చి సూత్రించుపట్ల "స్త్రీపుంసయోః" 'యూనోః' రిత్యాదిశబ్దములనే యలంకారికు లుపయోగించియున్నారు. అట్టియెడ 'ఆలుమగ'లను పదము స్త్రీపురుషవాచకపరమైనను పైశబ్దార్థములను ధ్వనింపఁజేయుట లేదు. కావ్యప్రకాశమున రతికి 'అన్యోన్యాస్థాబంధాత్మికా రతిః' అని మాణిక్యచంద్రుని సంకేతటీక. కావ్యప్రకాశమున రసలక్ష్యములు చెప్పఁబడినవి గాని స్థాయిలక్ష్యములు వేఱుగఁ జెప్పఁబడి యుండలేదు. తరువాతి యలంకారగ్రంథములయం దావివరణము గలదు.

నవమసుమము- పుట 238. వ్యతిరేకాలంకారము.

మలినతఁ గోశనిషణ్ణత
ములుచన దృఢతలనిబద్ధముష్టిగుణములఁ
దలఁపఁ గృపాణకృపణుల
కిలలో నాకారభేదమే గలదుసుమీ.

ఇత్యాది-శ్లో. దృఢతరనిబద్ధముష్టేః కోశనిషణ్ణస్య సహజమలినస్య
కృపణస్య కృపాణస్య చ-కేవల మాకారతో భేదః.

ఇచట కృపణకృపాణములకు నాకారమున మాత్రమే- అనఁగా- ఆకృతివలన-కాదేని, ఆయనువర్ణమున నే భేద మని యభిప్రాయము-ఇందుపమేయ మగుకృపణుని యందుపమానమగు కృపాణము కంటె న్యూనాధిక్యములు లేవు. ఉపమానము కంటె నుపమేయ మాధిక్యమును వహించిన వ్యతిరేకాలంకార మని కావ్యప్రకాశకారుఁడు. ఈలక్ష్యమున నిట్టియాధిక్యము లే దనుదోషము నప్పయదీక్షితులవారు కువలయానందమునఁ జూపిరి. ఇట్టిరీతి చర్చల నాయాపట్టులఁ జూపిన గ్రంథకర్తగారిపరిశ్రమ మింకనుఁ దెల్లముఁగాఁగలదు.

ఇందలి లక్ష్యశ్లోకములకుఁ బద్యములు హృద్యములై యున్నవి. గ్రంథకర్తగా రింకను సులభవివరణమున నాలంకారికవిషయికగ్రంథముల

రచియించెదరుగాక. పాఠశాలోపయోగ మగు నీగ్రంథమును విద్యా శాలాసంస్థాపకు లాదరించెదరుగాక. (వి. వేం.)

గ్రంథము వెల రు 3. ఫైవర్ వైట్ గ్లేజు రు 2. రఫ్ రు 1.

6. శ్రీశుకనాసోపదేశము, శ్రీగురుదక్షిణ.

మదనపల్లికాలేజీలో నాంధ్రభాషోపన్యాసకులును దేశభాషాప ర్యవేక్షకులునగు బ్ర॥ విద్వాన్ దర్భా వేంకటకృష్ణమూర్తి ఎం.ఏ.గారిచే రచియింపఁబడి మాకార్యాలయమునకు భాషాభిమానముతోఁ గవిగారి చేతనే పంపఁబడినది.

ఇందు శుకనాసోపదేశము 134 వివిధపద్యములతోడి యేకాశ్వా సము. బాణకృతకాదంబరి దీనికి మూలము. అందు శుకనాసుఁ డను భూసురుఁడు, తారాపీడునకు బహిఃప్రాణమును మంత్రియు. తారాపీడుని కుమారుఁడు చంద్రాపీడుఁడు. ఆచంద్రాపీడునకు యౌవరాజ్యపట్టాభి షేకసమయమున శుకనాసుఁ డుపదేశించిన నీతి. మూలమునందలి యభి ప్రాయము తెలుఁగులో నిపుణముగ నుచితరీతినిఁ దెనిఁగించిన కవిగారిం గొనియాడఁదగును. ఈచిన్నిపొత్తమునకై మూలము నిటఁజూపుట గ్రం థవిస్తరము. వేత్తలు గ్రహింతురుగాక.

సీ. మాలిన్య మెల్లఁ బ్రక్షాళింపఁజాలి యంభస్స్నానం జేయని మజ్జనంబు
జరయును నొదల నరయుట లోనైన వైరూప్యములు లేని వార్ధకంబు
బంగారునం గాని రంగారుశ్రుతిభూష మెదటిదోషములేని మేటిగురుత
జ్యోతి కతీశమా జ్యోతియు నుద్వేగ కరము గానట్టి జాగరము కరము
గురుని యుపదేశ మేమనుకొంటి వోకొ్క, నరుల కందును గరము భూవరుల కెందుఁ
బాదృశహితోపదేశంబు తప్పదెపుడు, వినయనయధుర్య భూజానితనయవర్య. 45

సీ. అభిషేకమప్పుడే యణఁగు దాక్షిణ్యంబు కలశోదకములఁ బ్రక్షాళిత మన
స్స్వాంతంబు మలినతాక్రాంతమా హోమాగ్ని కార్యధూమంబు దాఁ గప్పె ననఁగఁ
దాలిమిసర్వంబుఁ దూలుఁ బురోహితదర్భాగ్రసమ్మార్జితం బనంగ
మున్ముందుఁ బ్రాప్తించు ముదిమియజ్ఞ స్మరణంబు తలఁగు నుష్ణీషబంధమున ననఁగఁ
బరలోకదర్శనప్రాప్తి దూరంబగు ఛత్రమండలసమాచ్ఛాదిత మన

సత్యసంధత్వంబు సంపూర్ణముగ మాయుఁ జామరపవమానసంహృత మన
హితవాక్యలవితిరస్కృతముతో జయజయ కలకలధ్వనులకుఁ గలఁగె ననఁగ
వేత్రదండములకు భీతిచేతనో నాఁగ, సద్గుణములు దవుల సాగిపోవు
ధ్వజపటాంచలముల గజిబిజి నన మలీ, మసత నెసయు నృపులయశము తండ్రి. 86

ఆంధ్రదేశభాషాపర్యవేక్షకులు నాచార్యపట్టాభిశోభితులు పెక్కురిక్కాలమునఁ గలరు గాని వీరికున్న యాంధ్రభాషాభిమానము వారికింతయు లేదనుట నిక్కము. ప్రమాదము లెవ్వరికైన నుండును. ఓపినకొలఁది నిక్కమైన మాతృభాషాసేవకులు వన్నెకెక్కుదురు.

ఇందలి రెండవది గురుదక్షిణ- ఇది చిన్న పూర్వకథ. ఉత్తమకులుఁడై గ్రహచారవశమున నన్నిటం జెడి యసత్యస్తేయాసులం దిరిగి చెడియు సద్గురూపదేశమున యసత్యమును గురుదక్షిణగా నిచ్చి బాగుపడిన యొక్క పురుషుని చరితము. 52 కందపద్యములు. పై యుపదేశము నందువలెనే యీగురుదక్షిణయందును గవిత్వము నాతికఠినమై నిర్దుష్టముగ నలరారుచున్నది. ఉభయభాషాపదప్రయోగము చక్కగా నున్నది. ఈకథయే, వివిధపద్యములలో 'భారతి' తొమ్మిదవసంపుటమున రెండవ భాగములో "దస్యుఁడు- సదస్యుఁడు" ననునామమునం గలదు. మచ్చు పద్యములు.

క. అంతట నాభూవిభుఁ డో
మంత్రీ నీవేఁగి యిపుడ మనభవనమునం
దంతటఁ గనిరమ్ము పరీ
క్షింతు మిదే వీనిమాట యెంతనిజంబో. 29

క. అమ్మకచెల్ల నినుఁగా నెఱ
నమ్మితి నిందనుక నెమ్మనమ్మున నీదౌ
ష్టమ్మెల్లఁ దెలిసె గృహస
ర్వమ్మువిధమ్మైతి గదర ! పరమద్రోహీ ! 34

ఈగ్రంథమునకు వెల రు 0-8-0 కవిగారియొద్దనే దొరకును.

# భాసుఁడు.

## (7) భాసకాళిదాసులు.

5. హృదయే నేహ తత్రాజ్ఞః ద్విధాభూతేవ గచ్ఛతి- బాలచరిత-1-13
ద్విధావిభక్తం ఖలు మేశరీరమ్- అవిమా-4-పు 70
గచ్ఛతి పురః శ్శరీరం ధావతి పశ్చా దసంస్తుతంచేతః-శాకుం-1-30

6 పుష్పితానాం నగానాం షడ్భాగగ్రహణ మస్మాకం ధర్మః-తస్మా దస్య
నాన్ వృక్షాన్ కరిష్యామః-అవిమా- 4 అం-పు 62
నీవారషష్ఠభాగ మస్మాక ముపహరంత్వితి- శాకుం. అంక. 2
ఆర్యస్య వచనే నాన్యృణ దాసీ మేషా. 1 అంక.

7. ఆపృచ్ఛ పుత్రకృతకాన్ హరిణాన్ ద్రుమాంశ్చ
విన్ధ్యం వనం తవ సఖీ ర్దయితా లతాశ్చ- ప్రతిమా-5-11
యస్యోపాంతే కృతకతనయః కాంతయా వర్ధితో మే- మేఘ -2-14

శాకుంతలమున శకుంతల యాశ్రమోపాంతవృక్షముల సెలవుగై కొనినటుల వర్ణింపఁబడినది.

భోభోః సన్నిహితదేవతా స్తపోవనతరవః-
'పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం...' అంక 4-8
ముంచం త్యశ్రూణీవ వనలతాః 4-11
జహాతి సోయం న పుత్రకృతకః పదవీం మృగస్తే 4-13

8. అప్యుపలభ్యతే స్య సప్తపర్ణస్యాధస్తాత్ శుక్లవాససం భరతం దృష్ట్వా
పరిత్రస్తం మృగయూథ మాసీత్- ప్రతిమా. అంక-7

శాకుంతలనాటకమునఁ బంచమాంకమున శకుంతలావచనమును గనుఁడు. పరిచయరహిత మగు జనమునెడల మృగము లెట్లు చరించునో కాళిదాసుఁడు చక్కగ వర్ణించి భాసుని భావమునకు వన్నె వెట్టియున్నాఁడు. (ఛాయ) తత్క్షణేన మే పుత్రకృతకో దీర్ఘాపాఙ్గో నామ మృగపోతక ఉపస్థితః త్వయా యం తావత్ ప్రథమం పిబ త్విత్యనుకంపి నోపచ్ఛందిత ఉదకేన నపునస్తే పరిచయాత్ హస్తాభ్యాస ముపగతః పశ్చా త్తస్మిన్నేవ మయా గృహీతే సలిలేఽనేన కృతః ప్రణయః.

9. కాలక్రమేణ జగతః పరివర్తమానా
చక్రారపంక్తి రివ గచ్ఛతి భాగ్యపంక్తిః- స్వప్న-అంక-1
నీచైర్గచ్ఛ త్యుపరి చ దశా చక్రనేమిక్రమేణ- మేఘ- 2 -49
10. రేణు స్సముత్పతతి లోధ్రసమానగౌరః
సంప్రావృణోతి చ దిశః పవనావధూతః ప్రతిమా-7-4
విరక్తసంధ్యాకపిశం పురస్తాత్
యతో రజః పార్థివ ముజ్జిహీతే- రఘు-13-64
11. త మాపతంతం సహసా సమీక్ష్య- బాలచరి-5-2
తమాపతంతం నృపతే రనర్ఘ్యే- రఘు 5-50
12. ఇషుమాత్రోదితే సూర్యే- ప్రతిజ్ఞా-అంక-1
యుగమాత్రోదితే సూర్యే- శాకుం-
13. కన్యాయాః వరసంపత్తిః పితుః ప్రయత్నః భాగ్యేషు శేష మాయత్తం దృష్టపూర్వం న చాన్యథా ప్రతిజ్ఞా-అంక-2-5
భాగ్యాయత్త మతఃపరం నఖలు త ద్వాచ్యం- శాకుం-4-16
ఏత ద్రేకమ్-అహ మాత్మనః ప్రభవామి-అవిమా-అంక-3 పు.33
య ద్యాత్మనః ప్రభవిష్యామి- శాకుం. అంక-1
15. స్వప్నవాసవదత్తమున (అంక-1) తాపసీపద్మావతుల ప్రసంగము-
తాపసీ—చిరంజీవ-ప్రవిశ-జాతే ప్రవిశ-తపోవనానినా మాతిథిజనస్య స్వగేహమ్.
పద్మా—భవతు-భవతు-ఆర్యే విశ్వస్తా స్మి- అనేన బహుమాన వచనే నానుగృహీతా స్మి.
శాకుంతలమునందలి (అంక-1) రాజా—భవతు భవతీనాం సూనృతయైవ గిరా కృత మాతిథ్యమ్. అను దుష్యంతుని వాక్యము నుబోలి యున్నది.
16. మఱియు స్వప్ననాటకమున నాశ్రమవాసుల నుత్సారణ మొనర్పరాదను కాంచుకీయునివాక్యమును, దుష్యంతుఁడు సేనాపతిని వెనుకకు మరల నాజ్ఞాపించుచుఁ బల్కినమాటలును సమానార్థకములు-

కాంచుకీ—నఖలు నఖ లూత్సారణా కార్యా । పశ్య
పరిహరతు భవాన్ నృపాపవాదం
నపరుష మాశ్రమవాసిషు ప్రయోజ్యమ్
నగరపరిభవాన్ విమోక్తు మేతే
వన మభిగమ్య మనస్వినో వసంతి- స్వప్న-1-5

దుష్యం—యథా న మే సైనికా స్తపోవన ముపరుంధంతి తథా నిషేద్ధవ్యాః-
శమప్రధానేషు తపోవనేషు గూఢం హి దాహాత్మక మస్తి తేజః
స్పర్శానుకూలా ఇవ సూర్యకాంతా స్తదన్యతేజోఽభిభవా ద్వమంతి.

శాకుంతలీయశ్లోకమున నాశ్రమవాసులయందు గూఢ మగు తేజస్సు గల దనియు నది దాహాత్మక మనియు, నన్యతేజోఽభిభవమున వెడలఁగ్రక్కఁబడు ననియుఁ జేర్పఁబడినది.

17. సురద్విపాస్ఫాలనకర్కశాంగుళిః
మయాకృతార్థః ఖలు పాకశాసనః- కర్ణభార-శ్లో-23
సురద్విపాస్ఫాలనకర్కశాంగుళౌ- రఘు-3-55

18. స్వప్నవాసవదత్తమున నవిధవాకరణ, సపత్నీమర్దనము లను మూలిక లున్నట్లుల శాకుంతలమున నపరాజిత యను మూలికయు వర్ణింపఁబడినది. (అంక. 7)

19. స్వప్నవాసవదత్తము- (అంక-2)

పద్మావతీ—ఆర్యే-కి మిదానీం మా మపహసితు మివ నిధ్యాయసి.
వాస—నహి నహి-హాలా అధిక మద్య శోభతే అభిత ఇవ తేద్య వరముఖం పశ్యామి.
పద్మా—అపేహి-మేదానీం మా మపహస.

ఈసంభాషణము శాకుంతలమునందలి ప్రియంవదావాక్యమును 'యథావనజ్యోత్స్నా......' అను దానినిఁ దలపించుచున్నది.

20. వత్సరాజునకు వాసవదత్తయందలి ప్రేమ నష్టమయిన ఘోషవతీ వీణ లభింప నెట్లు వృద్ధి నొందెనో యట్లే దుష్యంతుని ప్రేమయు నంగుళీయకపునర్దర్శనమున నభివృద్ధిని గాంచినది. ఈసందర్భమున

స్వప్ననాటకమున (6-1) 'శ్రుతిసుఖనినదే' అనుశ్లోకమును శాకుంతలమున (6-11) 'తవసుచరిత మంగుళీయ' మను శ్లోకమును జూడుఁడు. వీనియందే వీణాంగుళీయకముల యుపాలంభనము గలదు.

పై విషయములవలన భాసునిభావములఁ గొని కాళిదాసుఁడు చమత్కారముగ నెట్లు చక్కనిశ్లోకముల రచించియున్నాఁడో స్పష్టముగ దా. భాసునిశ్లోకము లనావిద్ధరత్నములవంటివి, కాళిదాసునివో సానలదీరిన జాతిరత్నములు.

రత్నావళీనాగానందప్రియదర్శికలను రచించిన హర్షవర్ధనుఁడును భాసకాళిదాసుల నాధారముగఁ గొని తననాటకముల రచియించెను. రత్నావళీప్రియదర్శికలయందు వత్సరాజచరితమే యితివృత్తము. వాసవదత్త యగ్నిలో దహింపఁబడె ననుకల్పితగాథ ననుసరించి రత్నావళియందు నైంద్రజాలికమాయచే రాజప్రాసాదము దగ్ధమయ్యె నని కవి కల్పించియున్నాఁడు. రత్నావళిలోని 'పరిమ్లానం పీనస్తన'... 'బాణఃపంచ' అను శ్లోకములు 'శయ్యానావనతా (5-4)' 'కామేనోజ్ఝయసిం (4-1)' అను స్వప్నవాసవదత్తశ్లోకములను బోలియున్నవి. పూర్వోదాహృత విషయములవలన భాసుఁ డశ్వఘోషుని కర్వాచీనుఁ డనియుఁ గాళిదాస హర్షవర్ధనులకుఁ బూర్వుఁ డనియుఁ, గాళిదాసాదు లాతని ననుకరించిరనియు స్పష్టము.

## — (8). చారుదత్తమృచ్ఛకటికములు —

ఇంతవఱకును మనము తిరువనంతపురనాటకములలోఁ జారుదత్తము నొకటిగ నెంచియున్నాము. నాటకము లన్నియు నేకకర్తృకము లని నిరూపించునపుడు చారుదత్తములోని శ్లోకములకుఁ బోలిక లితరనాటకములఁ జూపఁబడినవి. కాని చారుదత్తనాటకము మనకు సంపూర్ణముగ లభించి యుండలేదు. మొదటి నాలు గంకములు మాత్రమే కలవు. ఒక వ్రాఁతప్రతియందు నాలుగవయంకము చివరను 'చారుదత్త మవసితమ్మ్'ని యుఁ గలదు. ఇందు మనము ప్రథమమున విమర్శింపఁదగిన విషయములు రెండు గాననగును. చారుదత్త మసంపూర్ణ మగునాటకమా? లేక చతుర్థాంకముతో సంపూర్ణత నొందినదా? యనునది యొకటి-రెండవ

వది శూద్రకవిరచిత మగు మృచ్ఛకటికమునకును దీనికిని గలసంబాధ మేమి? చారుదత్తము స్వతంత్రనాటకమా? లేక మృచ్ఛకటికము నట కులచే మార్పఁబడి యిట్టిస్వరూపమును జెందెనా?

(ఇ) చారుదత్త మసంపూర్ణ మగునాటకమే యనఁదగును. అందు లకు పలయు నుపపత్తు లిటఁ గొన్నింటిని మాత్రమే చూపితిని. సుక్తం కరుగారు విపులముగ నీవిషయమును జర్చించి యట్లులే సిద్ధాంతీకరించిరి.[1]

(1) చారుదత్తనాటకమున మంగళశ్లోకభరతవాక్యములు లేవు.

(2) వసంతసేనాచారుదత్తుల ప్రణయ మెట్టులు వృద్ధినొందెనో చారుదత్తమునఁ దెలియుట లేదు. దాని కెట్టిప్రతిబంధకములు నాటిల్లి నవి? పర్యవసాన మేమి? కథాభాగమున ముఖ్య మగు వసంతసేనా చారుదత్తుల సమాగమమును గవి వర్ణింపకుండునా? అది లేనిచో నాట కప్రయోజనము గానరాకపోవుటయే గాక వస్త్వైక్యము గూడ సిద్ధిం చుట లేదు.

(3) ప్రథమాంకమునఁ జారుదత్తుఁడు దారిద్ర్యమును వర్ణింపును 'పాపం కర్మ చ యత్ పరైరపి కృతం తత్తస్య సంభావ్యతే'-చారు-1-6

అదును- ఏపాపకర్మ మాతని కంటఁగట్టఁబడిన దను విషయము చారుదత్తమున విశదీకరింపఁబడ లేదు. ఇందులకు గణపతిశాస్త్రిగారు వ్యా ఖ్యాన మొనర్చుచు 'ఏతేన చారుదత్తేఽర్పితస్యాలంకారన్యాసస్య చౌర్య మన్య కృతం చారుదత్తకృత మితి శంకయా ప్రవృత్తో నరహంతు రభియోగ ఇతి వృత్త గతః సూచ్యతే'-అని వ్రాసియున్నారు తత్ప్రసన్న చారుదత్తమున లేదు.

(4) చారుదత్తము- 4-7 సజ్జలకః—

నరః ప్రత్యుపకారార్థీ విపత్తౌ లభతే ఫలమ్
ద్విషతామేవ కాలోఽస్తు యో స్యాభవతు తస్య వా-

'అనయా చ ప్రార్థనయా వసంతసేనా చారుదత్తద్వేషిణః తద్విప దుత్పాదనప్రవృత్తస్య శకారస్య స్వప్రవృత్తివైఫల్యపూర్వకవిపత్ప్రా

1. Journal of the Mythic Society, Bangalore Vol. 9— P. 181-85 (1919).

ప్తిలక్షణః కథావస్తుశేష ఉపరితనే ష్వంకేషు ఘటనీయః సూచితః" అని గణపతిశాస్త్రిగారి వ్యాఖ్యానము. సజ్జలకుని ప్రార్థన మెటులు సఫలీకృతము నొందినదో చారుదత్తమునఁ దెలుపఁబడియుండలేదు.

(5) చతుర్థాంకమున వసంతసేన సజ్జలకునితో 'ఇమం తస్మై చారుదత్తాయ దదాత్వార్యః' అనియును, దనచెలితో 'ఏహి. ఇమ మలంకారం గృహీత్వా ఆర్య చారుదత్త మభిసరిష్యావః' అనియుఁ బల్కుటచే నలంకారమును, జారుదత్తుని కొసఁగుట నాటకమందు వర్ణిత మని తోఁచుచున్నది. అట్టికథాంశము చారుదత్తమునఁ గానరాదు. మఱియు 'ఏదం పుణ అభిసారిఆ సహాఅభూదం దుద్దిణం ఉణ్ణమిదం' (ఏత త్పున రభిసారికా సహాయభూతం దుర్దిన మున్నమితమ్') అనుచతుర్థాంకాంత చేటీవాక్యము మృచ్ఛకటికమునఁ జతుర్థాంకమునఁ గలకథాభాగమును సూచింపుచున్నది. వసంతసేన 'హదాసే! మాహు బడ్ఢావేహి' (హతాశే! మాఖలు వర్ధయ) అనుటయు నామెభావికష్టములను సూచించు నని సుక్తంకరుగారు వ్రాసియున్నారు.

(6) శకారుఁ డెటులు వసంతసేనపై ద్వేషము వహించి యామెను బాధింప యత్నించెనో చారుదత్తమున లేదు. మృచ్ఛకటికమునందువలె వసంతసేనం జంప శకారుఁడు యత్నింపనిచో నాతనిపాత్రప్రవేశము నిరర్థకము. ప్రథమాంకమునఁ జారుదత్తుని కాతఁ డంపిన సందేశమును దానినే స్పష్టపఱచుచున్నది. సంవాహకసజ్జలకుల కృతజ్ఞతయుఁ గార్యరూపము నొంది యుండలేదు.

కదా ఖ ల్వస్యాః ప్రతికర్తవ్యం భవిష్యతి-చారు-అంక-4.

సజ్జలకుఁ డెట్లు వసంతసేనకుఁ బ్రతికృతి యొనర్పయత్నించెనో వివరింపఁబడలేదు. పైకారణములవలనఁ జారుదత్తనాటక మసంపూర్ణముగ నున్నటుల స్పష్టము. భాసుఁడు దాని నసంపూర్ణముగ నేల రచియించెనో తెలియరాదు. భాసుఁ డీనాటకమును సంపూర్ణముగ రచియించె ననియు, శూద్రకుఁడు దానిని సంస్కరించె ననియుఁ గొందఱు విమర్శకుల యభిప్రాయము.[1]

---

1. Sudraka and Mricbakatika — by Mehendale- Bhandarkar Commemoration Volume - P. 367 - 374.

(b) చారుదత్తము మృచ్ఛకటికనాటకమునందలి మొదటినాలు గంకముల సంక్షేపరచన మేలకాదు ? అనువిషయము మిపుడు విమర్శింప వలసియున్నది. మృచ్ఛకటికాచారుదత్తముల కథాసంవిధానముల విమర్శించి మార్గెనస్టైనను పండితుఁడు మృచ్ఛకటికము చారుదత్తము ననుసరించి రచింపఁబడినది కాని చారుదత్తము మృచ్ఛకటికమునకు సంక్షేపరూపరచనము కాదని స్థిరపఱిచెను. విమర్శకు లీవిషయమున భిన్నాభిప్రాయులై యున్నారు. శ్రీయుత మహానంద శాస్త్రిగారు తమ గ్రంథమున నీవిషయమునఁ జర్చనొనరించి (పు. 21-24) చారుదత్తము స్వతంత్ర గ్రంథము కాదని యొక నిర్ణయ మొనరించిరి. శూద్రకుఁడు భాసుని గ్రంథమును గైకొని తనపేర నేల ప్రచురింపవలయును? 5 మొదలు 10 వఱకు నాఱంకములు రచింపఁగల మేధావి మొదటి నాలుగంకములును రచింపలేఁడా ? శూద్రకుని యొక్క రచనానైపుణ్యము తరువాతియంకములలోనే కానవచ్చుచున్నది. అట్టికవి పరవిరచిత మగు గ్రంథమును, జంకునుగొంకును లేక స్వవిరచితముగఁ గైకొనునా ? యని వీరును వీరిమతానుయాయులును బ్రశ్నించుచున్నారు. ప్రథమమున శూద్రకుని గుఱించి కొన్ని విషయములను దెలుపవలసియున్నది. శూద్రకుఁ డేకాలమువాఁడో, యేదేశము నేలెనో యింతవఱకును నిర్ణయ మొనర్పఁబడి యుండలేదు. కాళిదాసునకుఁ బ్రాచీనుఁ డని కొందఱును నర్వాచీనుఁ డని కొందఱు ననుచున్నారు. చారుదత్తమృచ్ఛకటికములకుఁ గలపోలికను బట్టియు, పై విషయములు స్థిరపఱుపఁబడక పోవుటవలనను, భాసశూద్రకు లొక్కరే యని యు క్రీ. శ. 4, 5 శతాబ్దముల నుండి రనియు నొకనూతనవాదముకూడ వచ్చినది.[1] ఈవిషయముల విమర్శించినచోఁ జారుదత్తము భాసునిచేఁ బ్రథమమున రచింపఁబడె ననియు, నది యసంపూర్ణ మగుటచే శూద్రకుఁడు దానిని బూర్తి యొనర్చె ననియు సహృదయులకుఁ దోఁచకమానదు. గ్రంథము శూద్రకునిపేర నుండుటేల యనిన-కాదంబరీ దశకుమారచరితము లే తార్కాణ

1. K. G. Sankar — Bhasa Problem — Ashutosh Mukherji Commemoration Volume.

ము. కాదంబరీదశకుమారచరితముల నిద్దఱుకవులు రచించి రని విమర్శ కు లంగీకరించియున్నారు. మనోహర మగుచారుదత్తనాటక మసంపూర్తిగఁ గాననగుటచే శూద్రకుఁ డేల దానిని పూర్తిచేయరాదు? ఇందు న్యాయవిరుద్ధ మేమియును లేదు. చారుదత్తమును గొంత మార్చి తనకథ కనుగుణముగా శూద్రకుఁడు మిగిలినభాగమును రచియించెను. చారుదత్తమునఁ గలకథాభాగము కొంచె మెచ్చుతక్కువగ మృచ్ఛకటికమునఁ గననగుటచే నాలంకారికులు మృచ్ఛకటికమునుండియే యుదాహరణాదులఁ గైకొనిరి. అయినను చారుదత్తనాటకము వారికిఁ దెలియనిది కాదు. వామనుఁడు కావ్యాలంకారసూత్రములలో, చారుదత్తములోని

"యాసాం బలి ర్భవతి మద్గృహదేహలీనాం
హంసైశ్చ సారసగణైశ్చ విలుప్తపూర్వః
తాస్వేవ పూర్వబలిరూఢయవాంకురాసు
బీజాంజలిః పతతి కీటముఖావలీఢః" అను శ్లోకము నుదాహరించి

యున్నాఁడు. ఇది చారుదత్తశ్లోకమునకుఁ జేరికగా నున్నయది. ఇందువలన వామనునకుఁ జారుదత్తనాటకము తెలియు నని నిశ్చయము కదా. మఱియు రామచంద్రగుణచంద్రులు తమనాట్యదర్పణమున శూద్రకమృచ్ఛకటికప్రశంస యొనర్చియును, దరిద్రచారుదత్తమును గూడ నుదాహరించిరి. అభినవగుప్తుని నాట్యవేదవివృతియందును "శాకుంతలచర్చా" అను వ్యాఖ్యానమునందును, జారుదత్తప్రశంస గలదు. చారుదత్తమృచ్ఛకటికములఁ బోల్చిచూచినచో చారుదత్తము స్వతంత్రనాటక మనియు సంగ్రహము కాదనియు స్పష్టపడఁగలదు.

(1) చారుదత్తమున వసంతసేన విటశకారులచే ననుగమ్యమానయైనది. మృచ్ఛకటికమున విటచేటశకారులు ముగ్గురు గలరు.

(2) చారుదత్తమున ద్వితీయాంకమున మృచ్ఛకటికమునందువలె మాథుర, దర్దురక, ద్యూతకరులు గానవచ్చుట లేదు. మృచ్ఛకటికములో జూదరులజీవితము చక్కగ వర్ణింపఁబడినది. నీచపాత్రములు స్వాభావికముగఁ జిత్రింపఁబడినవి. చారుదత్తమున నివి విడువఁబడనేల ?

(3) సంవాహకుఁడు చారుదత్తమునఁ బరివ్రాజకుఁ డగును- మృచ్ఛకటికమున శాక్యశ్రమణకుఁ డగును.

(4) ఆర్యక, పాలకులవృత్తాంతము చారుదత్తమునఁ గానరాదు. మృచ్ఛకటికము మూలగ్రంథ మగుచోఁ జారుదత్తమున నీయితివృత్తము విడువఁబడుటకుఁ దగినకారణము గానరాదు.

(5) మృచ్ఛకటికమున, చారుదత్తశ్లోకములు కొన్ని విడువఁబడి నవి. (అంక 1. శ్లో 1, 4, 7, 13. 16 ఇత్యాదులు.)

(6) చారుదత్తమున లేని నూతనశ్లోకములు చేర్పఁబడినవి (అంక 1-శ్లో 14, 15, 20, 21, 23, 24, 25, 26, 32, 37, 38 మొదలగునవి).

(7) దారిద్ర్యవర్ణనము చారుదత్తమున 'దారిద్ర్యాత్ పురుషస్య బాంధవజనో' అను నొక్కశ్లోకమునఁ గావింపఁబడినది. దీనికి మృచ్ఛకటికమున-

'నివాస శ్చింతాయాః' 'దారిద్ర్యాత్ హ్రియమేతి' 'సంగం నైవ హి కశ్చి దస్య కురుతే', 'దారిద్ర్య శోచామి' అనుశ్లోకములు చేర్పఁబడినవి.

(8) చారుదత్తము మృచ్ఛకటికమునకు సంగ్రహ మగుచో మృచ్ఛకటికమున లేనిశ్లోకములు, వచనభాగములు చారుదత్తమున నేల గన్పడవలయును? మృచ్ఛకటికనాటకమును సంగ్రహ మొనర్చి నూతనవిషయములఁ జేర్ప నవసర మేమి కలిగినది.

చారుదత్తమునఁగల 'దారిద్ర్యం ఖలు నామ మనస్వినః పురుషస్య సోచ్ఛ్వాసం మరణమ్' యనువచనము మృచ్ఛకటికమున లేదు.

(9) చంద్రవర్ణనమును (అంక-1) జూడుఁడు. మృచ్ఛకటికమున-

ఉదయతి హి శశాంకః కామినీగండపాండుః
గ్రహగణపరివారో రాజమార్గప్రదీపః

అనియుండ, చారుదత్తమున-

ఉదయతి హి శశాంకః క్లిన్నఖర్జూరపాండుః
యువతిజనసహాయో రాజమార్గప్రదీపః

అని కలదు. 'కామినీగండపాండుః' అను దానిని "క్లిన్నఖర్జూర పాండుః" అని మార్పఁ గతమేమి. ఉపమానము బాగుగలే దని మృచ్ఛకటికమున మార్పఁబడుట స్పష్టము. 'మార్జారః ప్లవనే' యను భాసుని శ్లోకము 'మార్జారః క్రమణే' యని మృచ్ఛకటికమున మార్పుగాంచినది.

(10) చారుదత్తమృచ్ఛకటికములకుభేదము గలస్థలముల మృచ్ఛకటికమునందలిశైలి కొంచెము ప్రౌఢముగ నున్నదనియే చెప్పవలయును.

ఏతత్తు మాం దహతి యద్గృహ మస్మదీయం
క్షీణార్థ మి త్యతిథయః పరివర్జయంతి
సంశుష్కసాంద్రమద లేఖమివ భ్రమంతః
కాలాత్యయే మధుకరాః కరిణః కపోలమ్. 1-12.

(11) మృచ్ఛకటిక సంగ్రహమే యగుచోఁ జారుదత్తమున వసంతసేనాదుల యభిధానము లేల మార్పునొందవలయును? గణికానాయకు లనుటయేల ?

(12) మృచ్ఛకటికమున హాస్య మతివ్యాప్తినిగాంచియున్నది. చారుదత్తమునను భాసుని యితరనాటకములయందును గొలఁదిగనున్నది. అదియును గ్రామ్యము 'భాసోహాసః' అను జయదేవకవివర్ణనము సార్థకతనొందినది.

(13) తృతీయాంకమునఁ జంద్రవర్ణనమున-

అసౌ హి దత్త్వా తిమిరావకాశ
మస్తం వ్రజ త్యున్నతకోటి రిందుః
జలావగాఢస్య వనద్విపస్య
తీక్ష్ణం విషాణాగ్రమి వావశిష్టమ్—

అని మృచ్ఛకటికమునుండఁ జారుదత్తమున నిట్లున్నది.

అసౌ హి దత్త్వా తిమిరావకాశ
మస్తం గతో హ్యష్టమపక్షచంద్రః
తోయావగాఢస్య వనద్విపస్య
విషాణకోటీవ నిమజ్జమానా- చారుద-3-3

అష్టమపక్షచంద్రుఁ డగుచో వనద్విపవిషాణకోటితో నుపమించుట బాగుగలే దనిమృచ్ఛకటికాకారుఁడు 'ఉన్నతకోటి రిందుః' అని మార్పు

కొనినాఁడు. కోటిరత్నము ద్వితీయపాదమున నుండుటచే, చతుర్థపాదము నందలి 'క్షీణం విసాగ్రం చ వాసకీక్షణమ్' అని మార్చుకొనియె ను. దీనివలన 'నిమ్మలానా వినాశకోటికే' యనుచో మన కనుల కగ పడు దృశ్యము మాయమైనది. మూలశ్లోకము నెంత్త సరసతయుఁ జెడిన యది. చారుదత్తమునుండి మృచ్ఛకటిక ముత్పత్తిఁ బొందినదియు స్పష్టము.

(14) 'లింపతీవ తమోఽఙ్గాని' యను శ్లోకము మృచ్ఛకటిక కథా భాగమునకంటెఁ జారుదత్తమునఁ బాగుగా నతుకుచున్నది. అలంకారికుఁ డగు దండి యీశ్లోకపాదమును దనకావ్యాదర్శమునం జేకొనెను. బాల చరితమునఁగూడ నీశ్లోకమే యుండుటచే, మృచ్ఛకటికము చారుదత్తము ననుసరించి వ్రాయఁబడినదను యూహను బలపఱుచుచున్నది.

చారుదత్తము ప్రాచీన మనియు, మృచ్ఛకటికాకారుఁడు కొన్ని శ్లోకముల వదలి పైచియుఁ, గొన్నిటినిఁ జేర్చియు, గొన్నిటిని మార్చియుఁ గథాభాగమును విస్తరించియుఁ దనగ్రంథమును రచియించెననుటస్పష్టము. శూద్రకునకు గ్రంథచౌర్య మాపాదింపనేల యనిభాసశూద్రకుల కైక్య ము గల్పించియుఁ జారుదత్తమును మృచ్ఛకటికాసంగ్రహ మని వాదించి యుఁ బండితులు వివిధమార్గముల ద్రొక్కిరి. అసంపూర్ణ మగు చారుదత్త మును, దనకుఁ దోఁచినరీతిని సవరించి సంపూర్ణ మొనర్చినచో శూద్రకు నకుగ్రంథచౌర్యమెట్లువాటిల్లును? ఇంతకును దశమాంకమునందుఁ గొంత భాగము శూద్రక విరచితము గాదనియును, నీలకంఠవిరచిత మనియును విమర్శకు లంగీకరించియున్నారు. శూద్రకుఁ డనుకవి నిజముగ లేఁ డని యు నెవరో వ్రాసి యది శూద్రకుని కంటఁగట్టి రనియుఁ గొందఱు వా దించుచున్నారు. ఎవ రయిననేమి, మృచ్ఛకటికారచన మాకవియశశ్చం ద్రికల వెదచల్లుచున్నది. అసంపూర్ణ చారుదత్తపూరణ మతనికి న్యూనత నాపాదింపదు.

ఇఁక భాసశూద్రకు లొకరే యనుశంకరపండితునివాదము విమ ర్శింపవలసియున్నది. ఈవాదమున భాసుఁడు మృచ్ఛకటిక పద్మప్రాభృతిక కర్త యనియు, శూద్రకుఁడు మాళవదేశమునఁ క్రీ. శ. 475 ప్రాంతమున

బాలించె ననియు నిర్ధారణ మొనర్పఁబడినది[1]. వీరివాదమునందుఁ గల ముఖ్యాంశములు:—

(1) ఆలంకారికులు భాసశూద్రకుల నిద్దఱను దమగ్రంథములఁ జేర్కొనకపోవుట- నాట్యదర్పణమున దరిద్రచారుదత్తమృచ్ఛకటికముల ప్రశంస యుండుటయే దీనిని ఖండించుచున్నది.

(2) 'లింపతీవ తమోంగాని' యనుశ్లోకము శూద్రకవిక్రమా దిత్యమేంఠుల దని యాలంకారికు లనిరి, కాని, భాసుని దని యెవరును జెప్పియుండ లేదు.

(3) మృచ్ఛకటిక పద్మప్రాభృతికములు, శైలియందు, స్వప్నవాస వదత్తాదులఁ బోలియుండుట- మృచ్ఛకటికమునందలి ప్రస్తావన శూద్రకునిది గాదు. శూద్రకుని యనంతర మెవరో రచించినటులు స్పష్టము.

(4) శూద్రకుఁడు వత్సరాజచరితమును రచియించె నని ప్రతీతి గలదు. భాసుని ప్రతిజ్ఞాయౌగంధరాయణము కొన్ని ప్రతులలో వత్సరాజచరిత మనునామాంతరముతోడఁ గానవచ్చుటచే, భాసుఁడును శూద్రకుఁడు నొక్కరే యనవలయును.

(5) 'శూద్రకుని కగ్నిమిత్త్రుఁ డని నామాంతరము గల దని క్షీరస్వామి యమరవ్యాఖ్యలో నుదాహరింపఁబడిన (నామమాలా) శ్లోకము వలనఁ దెలియుచున్నది. అగ్నిమిత్త్ర, జ్వలనమిత్త్ర శబ్దములు పర్యాయ పదములు. వాక్పతిరాజు గౌడవహమునందు 'భాసమ్మి జలణమిత్తే' అని స్తుతించియుండుటచే భాసశూద్రకు లొకరే. ఇది సరికాదు; వాక్పతిరాజ శ్లోకమునఁ జ్వలనమిత్త్రుఁ డనుటచే నగ్నిమిత్త్రుఁడను శూద్రకుని నామాంతరము సూచింపఁబడుట లేదు. స్వప్నవాసవదత్తమున లావాణకదహనమును, గవి వర్ణించి యుండుటచేఁ గాని భాసనాటకము లగ్నిం బరిక్షిప్తము లగుటచేఁ గాని పంచరాత్త్రాదినాటకములలో నగ్ని వర్ణితమగుటచేఁ గాని భాసునకు జ్వలనమిత్త్రుఁ డను బిరుదనామము ఘటిల్లి యుండవచ్చును.

1. K. G. Sankar—The Problem of Bhasa in Sir Ashutosh Commemoration Volume.

పై విషయముల వలన, భాసశూద్రకుల మైక్యత మెట్టిదిరా నాకరమగు విషయములతో నుపపాదింపఁబడినదో యూహింపనగును. మృచ్ఛకటికమునఁ గలపాత్రపోషణము, కథావిధానము దల్లికయు, రసవిజృంభణము, మున్నగునవి భాసగ్రంథముల కన్న విశేషాంశము లని తోపక మానదు. అందును మొదటి నాలుగంకములకన్న మిగిలిన మృచ్ఛకటికాభాగముతే రసవంతము లని విమర్శకుల యభిప్రాయము. మృచ్ఛకటికాచారుదత్తములఁ గలప్రాకృతభాషవలన వానియం దేది మఱియొకదాని ననుకరించుచున్నదో నిర్ణయించుట కష్టసాధ్యము. ప్రస్తుతపరిశోధనమునఁ జారుదత్త మసంపూర్ణ మనియు శూద్రకుఁడే యసంపూర్ణగ్రంథమునకు మిగిలినయంకములఁ జేర్చియుఁ, గథాభాగములను విస్తరించియు మృచ్ఛకటికమును రచించె ననియుఁ దేలుచున్నది. హిందూనాటకములపైని దాము వ్రాసిన విమర్శనమునందు కార్పెంటరుగారట్టియభిప్రాయమునే సూచించియున్నారు.[1] ఈయభిప్రాయమునే బెరడీలుకీతుగారు తమసంస్కృతనాటక మనుగ్రంథమున బలపఱిచియున్నారు.[2] కాని మృచ్ఛకటికారచనము గ్రంథచౌర్యము కాదు. నష్టభాగపూరణమో, సంస్కరణమో యననొప్పును. మూలమునకుఁ జక్కని కథాభాగమును జేర్చి గ్రంథమును సంస్కరించిన శూద్రకుఁడు మహాకవి యని యంద అంగీకరింపవలసిన విషయమే. అది శూద్రకుని కీర్తిన్యూనతయుఁ గలిగింపదు. ప్రస్తావన శూద్రకవిరచితము కాదు.

— (9) భాసనాటకములలోని ప్రాకృతభాష. —

ఈనాటకచక్రమున నుపయోగింపఁబడిన ప్రాకృతభాషను, బరిశీలించి గణపతిశాస్త్రి, సుక్తంకరు మున్నగువారు కాళిదాసునికిఁ బూర్వమునఁ బ్రచారమునందిన ప్రాకృతభాషయే యిందు వాడఁబడిన దనియు, నందువలననే కవి ప్రాచీనుఁ డని నిర్ధారణ మొనర్పవచ్చు ననియు సిద్ధాంతీకరించిరి. క్రీ. శ. మొదటి రెండుమూఁడుశతాబ్దములనాఁటికే సంస్కృ

---

1. A note on the Hindu Drama by Dr. Charpentier J. R. A. S, (1923) P. 606.
2. Sanskrit Drama by A. Berriedale Keith P. 128 et seq.

తప్రాకృతభాషలు వాడుకలో జీవభాషలుగా నుండుట లేదనియుఁ దజ్జన్యము లగు దేశభాషలయందే వ్యవహారాదికములు నడుపఁబడుచువచ్చెననియు భాషాశాస్త్రవేత్తలు దెలుపుచున్నారు. పాణిన్యాదులచే సంస్కరింపఁబడిన సంస్కృతభాష గాని దానికిఁ జేరువగ నుండునది గానియగ్రవర్ణములవారికినిఁ బండితులకును వాడుకభాష యయ్యెను. స్త్రీలకును పామరజనులకును బ్రాకృతభాషలు వాడుకభాష లయినవి. దేశవిభాగము ననుసరించియు, విదేశీయుల సంసర్గాదులచేతను వివిధప్రాకృతము లుద్భవించినవి. అందువలన నాటకములం దుత్తమపాత్రములకు సంస్కృతభాషయు, స్త్రీలకును నీచపాత్రములకును బ్రాకృతభాషయును గవులు దమగ్రంథముల నుపయోగించిరి. స్త్రీలు, విదూషకుఁడు మొదలగుపాత్రములకు శౌరసేనియు, జాలరులు, విదేశీయులు మొదలగు వారికి మాగధియు, శ్లోకములకు మహారాష్ట్రప్రాకృతము నుపయోగింపఁబడుచు వచ్చెను.

సంస్కృతనాటకములందుఁ గల సంస్కృతప్రాకృతమిశ్రమమునకుఁ గారణ మేమి యని పాశ్చాత్యులు తర్కించి హిందూదేశమున క్రీస్తుశకమునకుఁ బూర్వమే యవి ప్రచారమునందుండి పామరజనులచే నుపయోగింపఁబడుటయే యందులకుఁ గారణ మని నిశ్చయించిరి. మహాకావ్యములగు రామాయణమహాభారతములు సంస్కృతభాష యందు రచింపఁబడుటచే నాభాష జనసామాన్యమునకుఁ గూడ సులభగ్రాహ్యముగ నుండెడిది యని వీరి యాశయము. రామాయణ మహాభారతములుప్రాకృతభాషాజన్యము లే యనియు నిటీవల సంస్కరింపఁబడి నేఁటిస్వరూపమును గాంచిన వనియుఁ గొందఱు తలంచుచున్నారు. కొంతకాలమున కీప్రాకృతభాషలును స్థిరత్వమును గాంచినవి. వైయాకరణులును వీనికివ్యాకరణముల రచియించిరి.

కాళిదాసుని యనంతర మీ ప్రాకృతభాషలు విశేషప్రచారము నందకపోవుటచేఁ గవులు తమగ్రంథములఁ బ్రాచీననిబంధనముల ననుసరించియుఁ బ్రాచీనగ్రంథములఁ గల ప్రాకృతభాషను గైకొనియుఁ దమతమ గ్రంథములరచియించియున్నారు. అందువలన మనగ్రంథములఁ గలప్రాకృ

తద్భాషనే మహాకారముగఁ గొని గ్రంథముల వ్రాసితని నిర్ణయింపరాదు. అట్లు నిర్ణయింప యత్నించుటయు సుగమము కాదు.

అశ్వఘోషుని ప్రాకృతము భాస కాళిదాసుల ప్రాకృతముకంటెఁ ప్రాచీనమని యొప్పించుటకు యుక్తము. ఇందుకు తెల్లమువలె ... కలవు. భాసనాటకములఁ గల ప్రాచీనప్రాకృతి ప్రయోగములఁ గొన్నింటిని జూపుదును.

| | సంస్కృతము. | ప్రాచీనప్రాకృతము. | కాళిదాసుల ప్రాకృతము. |
|---|---|---|---|
| (1) | ఖలు | ఖు | ఖు |
| (2) | త్వాం | తువమ్ | తుమమ్ |

భాసనాటకములలో నొకటిరెండు స్థలముల తుమమ్ అనియుండును.

| | | | |
|---|---|---|---|
| (3) | తవ | తవ | తుహ తుజ్ఝ |
| (4) | ఆర్య | ఆయ్య | అజ్జ |
| (5) | కృత్వా | కరి అ | కదు అ |
| (6) | గత్వా | గచ్ఛి అ | గదు అ |

శాకుంతలమున 'కరి అ' విక్రమోర్వశీయమున 'కదు అ' 'గదుఅ' అని కలదు.

(7) ద్వితీయాబహువచనమున నపుంసకలింగపదములకు శాకుంతలాదుల 'ఆఇం' అను ప్రత్యయముగన్పడును. (సుఉమార కేసరసిహాఇం, సిరీసకుసుమాఇం 11-4)

భాసనాటకములయందును, అశ్వఘోషునిగ్రంథములందును, అశోకుని శాసనములందును 'ఆని' ప్రత్యయముతోఁ గూడియుండును.(అహిఅరమణీఆణి ఉదఅట్ఠాణాణి-అహికరమణీయాని ఉదకస్థానాని)స్వప్నవాస.

(8) అహం-అహకె-తరువాత హకె, హగె అయినది. భాసకాళిదాసులగ్రంథముల అహం అనియే కలదు.

ఆధావతి, ప్రధర్షిత, యిత్యాది పదములఁ గలధకారము భాసుని ప్రాకృతమున హకార మాయె ననియు, నట్టిమార్పు యాశోకశాసనములఁ గలదనియు ఘటకుగారు తమవ్యాసమున నిరూపించి యున్నారు. భాసుఁడశ్వఘోషునకిని బూర్వుఁడని వీరివాదము.

ఇట్టి ప్రాచీనప్రాకృతప్రయోగములు ఆశ్చర్యచూడామణి, ప్రసన్నాభ్యుదయము, తపతీసంవరణము, సుభద్రాధనంజయము, మత్తవిలాసము మొదలగుదక్షిణదేశనాటకములందుఁ గల వనియు, నివి యన్నియు క్రీ. శ. ౧౨వశతాబ్దానంతరమున రచియింపఁబడుటచే భాసునిప్రాచీనత్వమును బ్రతిఘటించుచున్న వనియును హీరానందశాస్త్రిగారు వ్రాసియున్నారు. [1]ఇటీవలి కవులు తమగ్రంథములఁ బ్రాచీనకవులప్రాకృతమును గైకొనుట మనకు విదితమే. క్రీ. శ. 10 వ శతాబ్దమునఁగూడ రాజశేఖరుఁడు ప్రాకృతమున గర్పూరమంజరీసట్టకమును రచియించియున్నాఁడు. మిగిలిన యాధారములవలనఁ గవి ప్రాచీనుఁడని మనము నిర్ణయించినచో, నతనిప్రాకృత మాధునికగ్రంథముల గానవచ్చుట యతని ప్రాచీనత్వమునకు భంగకరము కాదు. దక్షిణదేశమునం బ్రచారమునందుఁ గల ప్రాకృతము ఔత్తరాహులప్రాకృతమునకుఁ బ్రాచీన మనియు, దానివలె విశేషముగ మార్పులఁ జెందలేదనియు వూల్నరుగారు వ్రాసియున్నారు. గ్రంథములం గల ప్రాకృతభాషవలననే కవుల దేశకాలాదులనిర్ణయ మొనర్పరాదను విషయము మన మంగీకరింపవలసినదే. భాసుని ప్రాకృతమును విమర్శకదృష్టితో లెస్నీ (Lesny) ప్రింట్జు (Printz) మొదలగు పాశ్చాత్యులు చదివి యందలి విషయములను విమర్శించి యున్నారు. సుక్తంకరుగారును భాసనాటకములం గల ప్రాకృతభాషవలన నిదమిత్థ మని వక్కాణింప వీలులేదనిరి. భాసుఁడు క్రీ. శ. 2, 3 శతాబ్దములవాఁడై తిరువనంతపురనాటకము లాతనివేయయినచో నతనిప్రాకృతము, అశ్వఘోషకాళిదాసుల మధ్యకాలమును సూచించుచున్నదనియు, బ్రాకృతభాషయొక్క మార్పులను స్పష్టీకరించుచున్న దనియు డాక్టరు వూల్నరుగారు (Dr. Woolner-Introduction to Prakrit-P. 74-75) తమగ్రంథమునవ్రాసిరి. అదియే యుక్తమని తోఁచుచున్నది.

---

1. Bhasa and the authorship of the thirteen Trivendrum plays by Hirananda Sastri.

# ఉదాహరణగ్రంథములు.

నిడుదవోలు వేంకటరావుగారు బి. ఏ., కాకినాడ.

(1) బసవోదాహరణము.

ఆంధ్రవాఙ్మయమున మన కుపలబ్ధము లగునుదాహరణములలో బసవోదాహరణము మొదటిది. పూర్వలాక్షణిక శైవకవిసార్వభౌముఁడు పాల్కురికి సోమనాథుఁడు దీనిని రచియించినాఁడు. సోమనాథుఁడు తెలుఁగుననే గాక సంస్కృతమునఁ గూడ నుదాహరణమును రచియించెను. తెలుఁగుబసవోదాహరణమును ప్రభవసంవత్సరము మాఘభారతియందు బ్రహ్మశ్రీ ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించినారు. సంస్కృతమునఁ గల యుదాహరణ మముద్రితము. ఈయుదాహరణము క్రీ. శ. 1220 ప్రాంతము ? కావచ్చును.

(2) త్రిపురాంతకోదాహరణము.

కాలక్రమమున ద్వితీయ మయ్యును, గవితాప్రకర్షము ద్వితీయ మగునీయుదాహరణము రావిపాటి త్రిపురాంతకమహాకవి ప్రణీతము- దీనిమాతృక తంజాపూరు శరభోజీ సరస్వతీభవనగ్రంథభాండాగారమునఁ గలదు- క్రీ. శ. 1912 వ సంవత్సరమున మానవల్లి రామకృష్ణకవిగారు దీనిని ముద్రించినారు- కవిగారే తిరిగి దీనిం 1933 వ సంవత్సరము ఏప్రియలునెలలో తిరుమల శ్రీ వేంకటేశ్వరపత్రిక ప్రథమసంపుటము నవమసంచికయందుఁ బ్రకటించియున్నారు. నే నీయుదాహరణమును మూఁడవతూరి ప్రకటించుచున్నాఁడను. ఈయుదాహరణకాలము- క్రీ. శ. 1370 సంవత్సరప్రాంతము.

(3) వేంకటేశ్వరోదాహరణము.

శ్రీతిరుపతి క్షేత్రమున సంకీర్తనాచార్యులై మహాప్రఖ్యాతినివహించిన తాళ్లపాకవారిలోని పెదతిరుమలయ్యగారీయుదాహరణమును రచియించినారు. ఇయ్యది పైనుదాహరించిన తిరుమల శ్రీ వేంకటేశ్వరపత్రికయందు సప్తమసంచికయందు మా. రామకృష్ణకవిగారిచేఁ బ్రకటితమైనది. ఈయుదాహరణము క్రీ. శ. 1530 ప్రాంతమున రచియింపఁబడి యుండును.

(4) హనుమోదాహరణము.

లక్షణసారసంగ్రహమును రచియించిన చిత్రకవి పెద్దన తనలక్షణ

గ్రంథమునం దుదాహరణలక్షణముచు జెప్పి దానికిలక్ష్యముగా హనుమం తునిపరముగా నొకయుదాహరణముచు రచియించియున్నాఁడు. ప్రస్తుత మీపరిషత్పత్రికయందు ప్రకటిత మగుచున్నలక్షణసారసంగ్రహమునందు ద్వితీయాశ్వాసమున నుండుటచే నీయుదాహరణ మలంతికాలములోనే ముద్రణభాగ్యమునందును. ఈయుదాహరణకాలముక్రీ.శ.1560ప్రాంతము.

(5) శ్రీకృష్ణోదాహరణము.

గొప్పకవి యగునప్పకవి తనయప్పకవీయము చతుర్థాశ్వాసమున నుదాహరణలక్షణమునుం జెప్పుచు లక్ష్యముగాశ్రీకృష్ణునిపరముగానీయు దాహరణము రచియించియున్నాఁడు. అప్పకవికాలము సునిశ్చితమైనదే- ఈయుదాహరణము క్రీ. శ. 1656 సంవత్సరమున రచియింపఁబడినది.

(6) శేషార్యోదాహరణము.

శ్రీనల్లందిగళు వంశజుఁడైన శేషార్యునిప్రశస్తిని వర్ణించుచు, బాల కవి యనంతయ్య రచియించినది. ఇది యముద్రితము. ఈశేషార్యుఁడు మధురనాయకుఁడగు విజయరంగచొక్కనాథుని యమాత్యుఁడగుటచేఁ గవియు నాకాలపువాఁడే. విజయరంగచొక్కనాథుఁడు క్రీ. శ. 1704 మొద లు క్రీ. శ. 1730 వఱకుఁ బరిపాలించినవాఁడు. శేషోదాహరణము క్రీ. శ. 1720 సంవత్సరప్రాంతముల రచియింపఁబడి యుండవచ్చును.

(7) విశ్వేశ్వరోదాహరణము.

ఏనుఁగు లక్ష్మణకవి విశ్వేశ్వరోదాహరణము రచియించినట్లు భర్తృహరి యాంధ్రీకరణమువలనఁ దెలియుచున్నది. కాని యీయుదాహ రణము లభ్యముకాలేదు. దీనిరచనాకాలము క్రీ. శ. 1780 ప్రాంతము.

(8) ముఖలింగేశ్వరోదాహరణము.

నలువదేండ్లక్రిందట కళింగదేశాంతర్గత జలుమూరు వాస్తవ్యుఁడు మచ్చ వేంకటకవి ముఖలింగేశ్వరుని పేర నుదాహరణము రచియించి నాఁడు. ఇయ్యది యాకాలమున ముద్రింపఁబడినది. శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచనమున కుశచరిత్రమును రచియించుటవలనను నాగ్రంథ మముద్రిత గ్రంథచింతామణియందుఁ బ్రకటింపఁబడుటచేతను నీతఁడు ప్రసిద్ధిఁ జెందె ను. రచనాకాలము 1896.

(అయ్యలరాజు రామభద్రకవి)

# సకలకథాసారసంగ్రహము.

—: కృత్యాది :—

శా. శ్రీలీలావతి యైన సక్తిశయు రాజీవాస్య యైవట్టి స
త్యాలోలాక్షియు నిచ్చ రెప్పు డతివేలాసక్తి నిర్వాంకలన్
హేళిన్ నిల్వఁ దటిద్వయీలలిత సిలాభ్రాకృతిం బొల్చు గో
పాలస్వామి దయాసుధారసము నాపైఁ జిల్కు నెల్లప్పుడున్. ౧

సీ. శ్రీవరనామధేయానాప్తిఁ జెన్నొంది
యబ్జపాణియనఁ బ్రఖ్యాతినొంది
భృగువంశము పవిత్రముగఁ బ్రేమ జనియించి
నాళీకవరవదనమున మించి
కమలాఖ్య నివాసగరిమచేఁ గడునిక్కి
వరవర్ణిని యనంగఁ బ్రౌఢికెక్కి
ఘనకాంతిఁ దనరి భూజననుతదేవతా
రామాభిధానత రమణనొనరి
పుణ్యజనుల సుదర్శనంబునను పొంది
తగువిధూత్తమవిశదవిస్తారకీర్తి
నిజకటాక్షాంచలంబులు నిగుడఁజేసి
నిత్యసైశ్వర్యములు కరుణించుఁగాత. ౨

మ. హరివక్షఃస్థలశక్రనీలమణి సౌధాగ్రంబునన్ వైజయం
తిరహిన్ దోలికనూఁగుచున్ సదనురక్తిం గౌస్తుభచ్ఛాయఁ జూ
చి రతి న్వేడ్కల నొందుచుం గవుఁగిటం జిత్తేశుఁ జొక్కించు నిం
దిర మాకీవుత సత్కృపారససమృద్ధిన్ నిత్యకళ్యాణముల్. 3

చ. అవనిధరాధినాథతనయాకుచకుంభవిలుప్తకుంకుమ
ద్రవ పరిలిప్త విస్ఫురదురఃస్థలిభాస్వదనూన నవ్యమా
ర్దవసుజపాప్రసూనకలితస్ఫటికాకృతిదోఁప నిత్యుడై
భవమున నొప్పు శూలి నను భవ్యసుఖాన్వితుఁ జేయుఁగావుతన్. ౪

సీ. మహితనవీనాబ్జ మండలీకృతవతం
సాభ్ర కేశకలాప మతిశయిల్ల
ననుపమానూనసంతతమండనీరాజ
కమలభాసురపాళికరము వెలుఁగ
నగ్నిశిఖాకలాపారుణాలోకన
వదనాంబుజము వింతవగలుదెల్ప
నజహరివర్ణనీయవరాతిరోహిత
సచ్ఛుచి పాదముల్ సరణినొసరఁ
బరఁగి ప్రణవసువర్ణరూపమున నొప్పు
క్రతుమథనజాయమానరావనిధి మమ్ము
సాదరకటాక్షవీక్షణాసారలీల
నిశ్చలశ్రేయ మొసఁగి మన్నించుఁగాత. ౫

ఉ. మాళితటీజపాకుసుమ మాల్యరుచుల్ ప్రియమేన నిండినం
బోలఁగఁ జూచి యీతఁ డిదెమో కడుచిత్రము మేనఁ గుంకుమం
బేలయలందెఁ జందనమదేలయలందక యంచుఁ బెక్కుచం
దాలఁ దలంచు శాంభవి ముదంబున మాకు నభీష్ట మీవుతన్. ౬

చ. తరగనిమోహభావమునఁ ద న్నెడఁబాయుట కోర్వలేక వా
క్సరసిజనేత్రి నాత్మముఖకంజమున న్నివసింపఁజేసి సు
స్థిరమతి లోకపుంజము సృజింపుచు శాశ్వతకీర్తి నొప్పు నా
సరసిజగర్భుఁ డిచ్చు విలసత్కృప మాకుఁ జిరాయు రున్నతుల్. ౭

గీ. శ్రీకళాకాంతనామకస్థితి గ్రహించి
నెగడు చతురాననప్రియ నిగమరాశి
యతులకలహంసగమన మహావిభూతి
సత్త్వరుణ మాకు శుభము లొసంగుఁగాత. ౮

చ. దళముగ మౌళిఁ గల్పసుమదామముఁజుట్టి సితాంబరంబు పైఁ
వలరఁ గటిం ధరించి ఘనహారతతుల్ గళసీమదాల్చి మై
మలయజకర్దమం బలఁది మానితలీల నిజేశుకీర్తినా
నలవడు వాణి నాదు రసనాగ్రమున న్నటియించుఁ గావుతన్. ౯

గీ. సోమనిభుఁడగు తిక్కనసోమయాజి
నిత్యసత్కీర్తిఁ బోతనామాత్యు సుకవి
భట్టభద్రుఁ బౌనన్నయభట్టుఁ గాంతి
భాస్కరుని భాస్కరునివేడ్కఁ బ్రస్తుతించి. ౧౫

చ. సరళపదార్థ విస్ఫురణ సంగతిఁ జాలనెఱింగి లక్షణం
బరమరలేక చూచి యమరాంధ్రములందుఁ గడుం బ్రవీణులై
సరసకళల్ గ్రహించి మృదుసారవచోరచనాచమత్క్రియా
పరులగు సత్ప్రపన్నులను భావికవీంద్రుల నాశ్రయించెదన్. ౧౬

గీ. సరసగతుల రచించెడి శక్తిగలుగు
సుకవులకుఁ గాని సుకవులసూక్తిపటిమ
తెలియఁగారాదు మూఢబుద్ధులకు మోయు
వానికిఁ దెలియుఁ గావడిబరు వనంగ. ౧౭

చ. సుకవులొనర్చు సత్కృతులు చూచి రసజ్ఞులుమెత్తు రెయ్యెడన్
బకములు హంససంఘములఁ బల్లఱు మెచ్చనిభంగి దుష్టవు
ల్వికవిక నవ్వుచుం గొదవలే పచరింపుదు రైననేమి సా
రెకు నిజబుద్ధి కుక్కలు మొఱింగిన జగము వాసి పోవునే. ౧౮

చ. చదివినవారు గాఢసరసక్రియఁ జెప్పు మహాప్రబంధము
ల్చదువనివారు నేర్చినకొలంది రచింపక యుంట లేదు శా
రద దయచేసినంతయుఁ దిరంబుగఁ గబ్బముఁజెప్పి శ్రీకరా
స్పదముగ శ్రీరమేశునకొసంగుటకంటె విశేషమున్నదే. ౧౯

ఉ. నన్నయ తిక్కనాది కవినాథులు చెప్పినయట్లు చెప్పలే
కున్నఁ దదుత్తరాంధ్రకవు లూరకయుండిరె తోఁచినట్లు ని
త్యోన్నతబుద్ధిఁ గబ్బముల నోజరచింపక యాను జ్ఞానసం
పన్నులకావ్యముల్ హరిసమర్పణమై చెలువొందు నెందునన్. ౨౦

గీ. హరిసమర్పితమైన యాసాధ్విఁబోలె
భువిని బొలుపొందు సుజనసంపూజ్య మగుచు
నిట్టు లగుటకు నరిదియె యెంచిచూడ
హరిపదస్పర్శఁ బాషాణ మతివ గాదె. ౨౧

చ. హరికి సమర్పణంబుగ మహాకవు లున్నతిఁ జేయుకావ్యముల్
అరయఁగఁ బావనంబు లని యార్యులు తప్పులనెన్న రెంతయు
న్నరయ ఖలుండు జాహ్నవిమునింగి పవిత్రతఁ బొందుకైవడిన్
బరసముఁ బొందఁగా నిను ముఖ్యము నైన తెఱంగునన్భువిన్. ౨౨

వ. అని యివ్విధంబున నిష్టదేవతాభినందనంబును శిష్టకవిజనాభినందనం
బును దుష్టకవినిందనంబును గావించి పరమశ్రావ్యంబును నత్యంత ది
వ్యంబును సకలబుధసేవ్యంబును నైనపురాతనకవిస్తుతిప్రముఖపుణ్యా
పురుషకథాసంబంధబోధకం బగు సారోక్తప్రబంధంబు రచియింపంబూ
ని యున్న సమయంబున. ౨౩

సీ. చినుకుఁబూసలనొనర్చినచిత్తరపుదండ
దండాలు గలవేల్పుతపసి కొండ
కొండాటములను జిక్కులు పన్ను జడదారి
దారిగట్టులరాయఁ జీరు టలుగు
అలుగుడింతికి వెన్నుఁ డిలకుఁ దెచ్చినచెట్టు
చెట్టు గట్టుగఁ జేయు చెలువ తోడు
తోడుచేడెలనేలు దొరకుఁ దోఁబుట్టువు
పుట్టిలిబ్బులజేని పొందు కాఁడు
గాడుపూరిని గాచిన కన్నతల్లి
తల్లిబిడ్డల బెండ్లాడు గొల్లమనికి
మనికితము దీర్చు విలుకానిజనకువిందు
విందునీకీర్తి నరసింహవిభునికృష్ణ. ౨౪

వ. ఇట్లు కీర్తివిస్తారధురంధరుం డగుకృష్ణరాయనరపాలాఖండలుండు నన్నుఁ
బిలిచి శ్రీమత్సీతారామచరణకమల పరిచరణీయమాన మానసుండవు
బహువిధకవితాచమత్కారధుర్యుండవు సకలపురాణేతిహాస ప్రబంధరచ
నాదక్షుండవు మన్మనోరథకార్యనిర్వాహకుండవు నగుటంజేసి పురా
తనమహాకవి విరచిత ప్రబంధంబు లన్వేషించి భగవద్భక్తినిష్ఠాగరిష్ఠు
లగురాజశ్రేష్ఠుల వృత్తాంబులు ప్రసిద్ధంబు లగునట్లుగాఁ బ్రశస్తకథలు
విన్యస్తంబుగా నెలకొల్చి సాహిత్యలక్షణచిత్రకవిత్వ ప్రభావంబు లో
క్లోకచోటం గనుపడ రచియింపవలయునని ప్రార్థించిమఱియు నిట్లనియె.

చ. అరవత గుబ్బచన్బలె బయల్పడనీకను గూర్జరాంగనా
గురుకుచయుగ్మముం బలె నిగూఢముగాకను నాంధ్రదేశపుం
గరిత చనుంగవ న్బలె నొకానొకయుంచుక గానిపించిన
న్సరసులు మెత్తు రక్కవిత జాణలకుం గడురంజకం బగున్. ౨౬

వ. కావున నతిమధురరసామలద్రాక్షాపాకంబుగా శృంగారరసయుక్తంబ
గునట్లు సకలకథాసారసంగ్రహంబు గ్రంథవిస్తారంబు గాకుండ నట్లుగా
రచియింపు మని యుపన్యసించిన సంతోషితస్వాంత తరంగితాంతరం
గుండ నగుచు నున్నసమయంబున. ౨౭

సీ. అఖిల జగద్ధితోద్యత్ప్రభావమువాఁడు
ఘనఘననీలవిగ్రహమువాఁడు
దనుజభిచ్చక్రభృత్సారపంకజమువాఁడు
సరసబాహాచతుష్టయమువాఁడు
స్ఫురదిందుబింబసుందరముఖాబ్జమువాఁడు
సవితృకోటిప్రకాశంబువాఁడు
శ్రీవత్సలాంఛనశ్రీవిలాసమువాఁడు
వర్ణితమురగరవంబువాఁడు
సాదరకటాక్షవీక్షణాపాదితాబ్జ
భవపురందరనిత్యవైభవమువాఁడు
కాళియోరగవరఫణాకలితరత్న
కాంతిదీపితపాదయుగంబువాఁడు. ౨౮

సీ. శిఖిపింఛములదండ సిగవెలింగెడివాఁడు
కస్తురి తిలకాళికంబువాఁడు
శ్వేతాబ్జముల నీరసించు కన్నవవాఁడు
నవసుధారుచి నవ్వు నవ్వువాఁడు
చక్రాదిసాధనాంచద్భుజంబులవాఁడు
రమణీయకంఠహారములవాఁడు
శ్రీవత్సకౌస్తుభాంచితమైన యెదవాఁడు
కలితకాంచీకటిస్థలమువాఁడు

కనక వస్త్రంబుగల మృదు తనువువాఁడు
ఘర్ఘనూపురయుత పదాబ్జములవాఁడు
మించి వేదాంతముల సంచరించువాఁడు
ప్రౌఢి శ్రీకృష్ణుఁ డను పేరఁ బరఁగువాఁడు. ౨౯

వ. మఱియు భాగ్యవశంబున స్వప్నకాలంబునఁ బ్రసన్నుం డై పరమ మంత్రోపదేశ పూర్వకంబుగా సకలకథాసారసంగ్రహంబునకుఁ గృతినాయకుని దన్నుం గావింపు మని హితోపదేశంబు చేసి యంతర్హితుం డైన నే నంతట మేలుకాంచి నాపురాతనకృతజన్మసుకృతంబునకుం బరమాహ్లాదంబు నొందుచు నద్దేవతాశిఖామణికిం బునఃపునః ప్రణామంబు లాచరించుచుఁ గర్నాడమహీమండలాఖండలుండు నుబ్రచండ పరాక్రమ పరరాజ శుండాల కంఠీరవుండును నగునరకంఠీరవరాయసూతి ప్రేరిత సకలకథాసారసంగ్రహనామక ప్రబంధంబు రచియింపం జాలుటకు నిప్పుడు గదా సమర్థుండ నైతి నని మహాధైర్యం బవలంబించి యిదియ కడ జన్మంబుగా నెంచుచుఁ గొంచక ప్రబంధం బుదంచితమతి రచియింపంబూని మదీయస్వప్నవృత్తాంతం బంతయు మహీకాంతునకు నెఱింగించినఁ గుతూహలుం డగుచు నా రాజముఖ్యుం డిట్లనియె. ౩౦

ఉ. నీవును బాలకృష్ణపదనీరజభక్తుఁడ వార్యచిత్తమో
దావహసద్గుణుండవు రమాధిపునింగలలోనఁగాంచి య
ద్దేవుహితోపదేశమునఁ దేజమునొందినవాఁడ విన్నిటం
గావున నీప్రబంధము ప్రకాశముగా హరికిమ్ము నావుడున్.

వ. అనిన తద్వాక్యంబు మనోభీష్టసామ్రాజ్యకుర్గాధ్యక్షత్వంబునకు సులభసోపానమార్గంబుగా నెంచుచు నానందకందళితహృదయారవిందుం డనగుచుఁ బ్రబంధంబు రచియింపం బూనినవాఁడ నగుచు మదీయేష్టదైవం బగు నద్దేవతాసార్వభౌముని హృదయకమలకర్ణికామధ్యంబునఁ గనకాసనాసీనుం జేసి మానసపూజావిధానంబు సాకల్యంబుగాఁ గావించి నమస్కరించి యతనిం గుఱించి షష్ఠ్యంతములు విన్నవించెద.

క. శ్రీకరగుణధన్యున కరి, భీకరశౌర్యునకు మేరుపృథుధైర్యునకుం
బ్రాకటవీర్యునకును ర, త్నాకరగాంభీర్యునకును యదువర్యునకున్.

క. మురగజహర్యక్షునకున్, నిరుపమదృష్పృతవిపాగ్ర నిటలాక్షునకున్
బరశిక్షాదక్షునకును, వరపుండాక్షునకు గోపికాధ్యక్షునకున్.

క. సురరిపుకులకాలునకును, సరసకపోలునకు సత్యశయశీలునకున్
మురళీరవలోలునకును, గురువాంఛాపాలునకును గోపాలునకున్.

క. సురహృదయచరిష్ణునకును, నరశార్ఙ్గసహిష్ణునకును నతజిష్ణునకున్
హారిమణిరోచిష్ణునకును, జిరశుభధనరిష్ణునకును శ్రీకృష్ణునకున్.

క. ఏవంవిధగుణాతతికిని, దేవాచలనిభధృతికియతిదయామతికిన్
సేవితవాగధిపతికిని, భూవినుతోన్నతికి భోజపుత్రీపతికిన్.

వ. సమర్పణంబుగా నాయొనర్పంబూనిన సకలకథాసారసంగ్రహంబను మహాప్రబంధంబునకుం గథాక్రమంబెట్టిదనిన.[1] ౩౮

---

# నూయాణశబ్దార్థవిమర్శనము.

1936 సెప్టెంబరు నెల గ్రంథాలయసర్వస్వపత్రికయొక్క 136 వ పొరటలో బ్రహ్మశ్రీ మానేపల్లి రామచంద్రశాస్త్రిగారు "నూయాణ" పదమును గూర్చి కావించిన విమర్శనము చదివినాను. శ్రీశాస్త్రిగారు వేసిన ప్రశ్నములు చూచినపిమ్మట వారివంటి సంశోధకులకును మున్ముందు సకారాదిపదవిమర్శనము చేయునప్పుడు మాకును నుపయోగింపం గల దను నూహతో మాకందికలో నున్న గ్రంథములతోడ్పాటునం దాత్కాలికపరిశోధనము కొంత కావించితిని తత్పరిశోధనపర్యవసానము నీక్రింద వ్రాయుచున్నాను—పాఠాంతరములు.

సీ. నడదివియలుసేసె నగరికి మాణిక్యమకుటముల్ పూనినమనుజపతులఁ
దగునాజ్ఞ నూయాణముగ నొనరించె మంచిగ నేల నాలుగుచెఱఁగులకును

---

1. (ఈపద్యములవలన నీగ్రంథవిషయమును శైలియుఁ దెలియు నని యింతమాత్రమే ప్రకటించితిమి. దీనిమూలము చెన్నపురి దొరతనమువారి ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారములో నున్నది.)

(స్త్రీ)తార్థిజనుల సచేతనత్యాగధ్వజములుగా నన్ని దేశములఁ బఱపె
దిక్కులన్నింటను వెలుపొఱపూఁత గావించె నుజ్జ్వలయశోవిభ్రమంబు
గీ. రాజసూయాధ్వరప్రవర్తకుఁడు నిత్య, సత్యభాషామహావ్రతశాలి పాండు
రాజదుగ్ధపయోనిధిరాజు ధర్మ, రాజు సుమ్ము మత్స్యాన్వవనీరమణయితఁడు. భార. విరా.

ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయములోని తాళపత్త్రప్రతులు కొన్ని చూడఁగా నీపట్టున భిన్నభిన్నపాఠాంతరములు లగపడినవి. కాని యన్నిటికంటెను 'సూయాణ' పాఠమే సందర్భోచితముగా నున్నట్లు తోఁచినది. 'తగునాజ్ఞ సయ్యాణముగ నొనరించె' అని భారతము లక్ష్మీపతి సోమయాజులుగారిపాఠము. 'సయ్యాణము' 'సంవ్యాన' శబ్దభవమనియు, ఉత్తరీయము అని అర్థమనియు సోమయాజులుగారు తమవ్యాఖ్యలో వ్రాసినారు. కాని, లభించిన యన్నిపాఠములలోను శబ్దరత్నాకరపాఠమే ప్రశస్తతమముగ నున్నది. అం దిచ్చిన యర్థము కూడ సరిపడియున్నట్లే కాన్పించుచున్నది. ఈవిషయమున శ్రీశాస్త్రిగారును నేనును నేకాభిప్రాయులము. విమర్శనమునకై మేము సేకరించిన పదములలో, ఈ పదమునకు భారతప్రయోగ మొకటియే తప్ప నితరప్రయోగములేవియు నులేవు. తెలుఁగునాఁట నిది వాడుకలో నున్నట్లుకూడ మాకుఁగనఁబడదు.

వ్యుత్పత్త్యర్థము:—శబ్దరత్నాకరములో "సూయాణ" పదము వైకృతముగా గ్రహింపఁబడినది. దాని కుపోద్బలకముగా, పురుషోత్తమకవీయములో 'సూయన' 'సూయాన' పదములు ప్రకృతులుగా నీయఁబడినవి. కాని, మాకార్యాలయములో నున్న యే సంస్కృతనిఘంటువులోను ఆ పదములు లేవు. వ్యాకరణదృష్టితోఁ జూచునెడల నారూపముల సాధుత్వముకూడఁ జింత్యము. ఇఁక శ్రీశాస్త్రిగారు అదనముగా సూచించిన సుయాన' పదము, ప్రత్యేకముగా నిఘంటువులందు లేదు కాని కల్పించుకొనవచ్చును. అర్థసంబంధము కూడ నెట్లో కుదుర్చుకొనవచ్చును.

సూచియానము:—సజాతీయభాషాపద మేదైన దొరకవచ్చునేమోయని కిట్టెల్ దొరగారి కర్ణాటాంగ్లనిఘంటువు చూడఁగా, అందుసరిగా 'సూయాణ' పదమే యీయఁబడినది. మఱియు నది 'సూచియాన' శబ్దభవ మనియు వివరణముకై శబ్దమణిదర్పణము చూడవలసిన దనియు

నందున్నది. కర్ణాటక శబ్దమణిదర్పణములోని తద్భవప్రకరణము 294 సూత్రము చదివి చూడఁగాఁ సమాసపదములు విశ్రుతు లగునప్పుడు కొన్నిపట్టులఁ బూర్వపదాంత్యవర్ణలోప మగును. ఉదా:—దేవకుల-దేగుల; దేశశాఖా-దేసాకె,-సూచియాన సూయాణ" అని యున్నది. పిమ్మట విల్సను సంస్కృతాంగ్లనిఘంటువు చూచితిమి. 'సూచి' శబ్దమునకు సూచివ్యూహ మనునర్థము మనుస్మృతి భారతప్రమాణములతో నం దీయఁబడినది. మనుస్మృతి 7-187 చూచితిని. దానిక్రింది కుల్లూకభట్టవ్యాఖ్యానములో నిట్లున్నది.

"పిపీలికాపంక్తి రివ అగ్ర పశ్చాద్భావేన సంహతరూపతయా యత్ర సైనికావస్థానం స శీఘ్రప్రవీరపురుషముఖః సూచీవ్యూహః—తేన అగ్రతో భయే సతి యాయాత్."

ఈయాధారము ప్రబలమైన యాధారముగానే నాకుఁ దోఁచినది. దానిఁబట్టి "సూయాణము=సూచియానము, సేనను సూచివ్యూహముగా పన్ని శత్రువులపై వెడలు దండయాత్ర. అనఁగా శబ్దరత్నాకరములోఁ జెప్పినట్లు "శత్రుభీకర మగుదండయాత్ర" యనుభావమే తేలినది.

ప్రకృతసీసపాదసమన్వయము.

తగునాజ్ఞన్=సముచిత మగు నాజ్ఞను. నేల నాలుగుచెఱఁగులకును=భూమి నాలుగుదెసలకును. మానికన్=సౌమ్యముగ, సామోపాయముచే. సూయాణమునన్=శత్రుభీకర మగు దండయాత్రవలెనే ఒనరించెన్=చేసెను.

"శరపీడక మగుదండయాత్రవలన నేప్రయోజనము నెఱవేఱునో యాప్రయోజనమును యావద్భూమియందును సౌమ్యముగఁ దన యాజ్ఞచేతనే ధర్మరాజు నెఱవేర్చుకొనెను" అని తాత్పర్యము.

విజ్ఞాపనము.

దీనికంటె మంచివ్యుత్పత్తి గాని మంచి యర్థము గాని గోచరించినచో విద్వాంసులు దయతో మాకుఁ దెలిపిన యెడల మేము వానిని వందనపూర్వకముగా గ్రహింతు మని విన్నవించుకొనుచున్నాను.

శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు కార్యస్థానము, పిఠాపురము. } చర్ల నారాయణశాస్త్రి, మేనేజరు.

క్షీరనీరవిచారంబు సేయనేర్చు
వారువము నెక్కి యమరు లిర్వంకఁ గొలువ
నలువ చనుదెంచె నమ్మౌనినాథుఁ జేరి
వాణి యుండంగ వెదకెడువానికరణి.  ౧౨౮

చ. మిసిమికడానికుందనపుమించుల నీనెడు మేనిడాలు న
ల్దెసలఁ జరించుచుండఁ జనుదెంచిన కాంచనగర్భుఁ గాంచి యిం
పెసఁగఁగ నమ్మహామునిమహీస్థలిఁ జాఁగిలి మ్రొక్కి భక్తిమై
వెసఁ గుసుమార్ఘ్య మిచ్చెఁ గడువేడుక శిష్యులతోడఁ గూడఁగన్.

గీ. అర్ఘ్యపాద్యంబు లొసఁగి యర్హాసనమున
మస్తకచతుష్కమకుటాగ్రమణిసమగ్ర
కాంతి విలసిల్లఁ గొలువున్న కమలభవుని
చెంతఁ దగ నిల్చి యంజలి సేసి పలికె.  ౧౩౦

ఉ. నీకరుణావిశేషము గణింపఁగ శక్యమె చెల్లికల్లి వా
ల్మీకిగృహంబు మెట్టెఁ బరమేష్ఠి యటంచు సమస్తదేవతా
నీకము నెంచఁ జేసితివి నీరజసంభవ యింత చాలదే
చేకొని యెన్నిపుణ్యములు చేసితినో జననాంతరంబులన్.  ౧౩౧

సీ. నారాయణుని దివ్యనాభిపంకరుహంబు
తల్లిగర్భం బయి తనరుచుండ
శ్రుతు లన్నియును ముఖోద్గతము లై విలసిల్ల
నలసరస్వతి పత్ని యై చెలంగ
నారదసనకసనందనప్రముఖులు
నందను లై మహానంద మొసఁగ
సకలప్రపంచైకసర్గసంచారంబు
నిత్యవిహారమై నెగడుచుండ
నున్ననీమహత్త్వ మే నెన్నఁగలనె
యేనకా దింక నెవ్వారు నెన్న లేరు
బ్రహ్మ బ్రహ్మస్వరూప హిరణ్యగర్భ
వనజసంభవ నీ కిదె వందనంబు.  ౧౩౨

క. మునులును దైవతవరులు
న్నినుఁ గానఁగనేర రట్టినీవు కరుణచే
నను బహుమానము చేయఁగఁ
జనుదెంచితి నేను బుణ్యశాలిఁ దలంపన్. ౧౩౩

క. అనిన విని బ్రహ్మ యమ్మునిఁ
గనుఁగొని కూర్చుండు మనియెఁ గమలాసనుశా
సనమున నాతఁడు నుచితా
సనమునఁ గూర్చుండె సంతసం బెసఁగంగన్. ౧౩౪

వ. కొంతతడవు గూర్చుండి వాల్మీకి యంత నంతరంగంబున శబరశరవిద్ధ శకుంత సంతాపావలోకన వ్యాకులత్వంబు వొడమం బ్రాక్కి పడుచు నిమీలితలోచనుం డగుచు బోయం జూచి తా నాడినమాటలు మాటికిం దలంచుచుండ నరవిందభవుం డతనిం గనుంగొని నగుచు నో మునికులోత్తంస నీవు శోకంబునం బలికిన పలుకు శ్లోకం బై నిలిచె మచ్ఛందంబున స్వచ్ఛందంబుగా ఛందోమయసరస్వతి నీయందుఁ బ్రవర్తించె నేతాదృశశ్లోకంబుల లోకంబులు వొగడ రామాయణంబు నారదోక్తప్రకారంబునఁ గావ్యంబు సేయుము రామచరితంబు సకలంబును నీకుఁ గరతలామలకంబుగాఁ గానిపించు నీవు చెప్పిన రామాయణంబును ధరణీతలంబున నాచంద్రతారార్కంబై ప్రవర్తిల్లు నని యుపదేశించి జలజాసనుండు నిజనివాసంబున కరిగె నంత వాల్మీకియు ధ్యానస్తిమితనేత్రుం డగుచు రామచరిత్రంబు సర్వంబును హృదయంబునఁ బ్రత్యక్షంబుగా నీక్షించి నారదోక్తప్రకారంబునఁ జెప్పం గడంగెఁ దత్కథాసంవిధానం బెట్టి దనిన. ౧౩౫

ఉ. వాంఛితదానకల్పనగ, వాసవసన్నుత, కేకిపింఛతా
పింఛనిభప్రభాంచిత, విభీషణపోషణ, భీషణాశుగ
ప్రోంఛితమత్తశాత్రవ, నభోమణివంశమణీ, ధనుర్లతా
లాంఛితపాదపద్మ శుభలక్షణ, భక్తజనైకరక్షణా. ౧౩౬

క. అర్ధేందుధర ధరేంద్ర
స్వర్ధేనుస్ఫూర్తికీర్తివైభవబద్ధ

స్వర్గేంద్రవైరిహర సుర
మూర్ధేందూర్మికుటఘటితముగ్ధాంఘ్రియుగా. ౧౩౭

కవిరాజవిరాజితము.

జలనిధిలంఘనజాంఘికవానరసంఘముఖాచలశంఖవిశృం
ఖలఘనఘోషితబాహుజయా దశకంఠవిఖండనచండశరా
బలమథనప్రముఖాఖిలదైవతపాటలరత్నకిరీటతటో
జ్జ్వలపదపద్మ సహస్రకరాన్వయవార్ధికళానిధి దాశరథీ. ౧౩౮

గద్యము. ఇది శ్రీరామచంద్ర సాంద్రకరుణాకటాక్షలబ్ధ సిద్ధసారస్వత విశేషనిరర్గళవాగ్వైభవాశేషసరససాహిత్యకళాభోజ, సత్యసంభూషితముఖాంభోజ, సకలసామ్రాజ్యధురంధరేయ, నిత్యనితీర్ణధారారాధేయ, నిరతావారితాన్నసత్రసంతోషితపంచాశత్సహస్రభూసుర, బహువారావర్తితమహాదానవైభవానర్తితకీర్తిభాసుర, నిజనామాంకితాకలంకవస్తుసమగ్రబహుళాగ్రహారభూషితచోళధరామండల,నిఖిలభోగవిభవనిర్జితాఖండల, సాధితసముద్రాంతరద్వీప పరనృపాలసంస్తుతప్రతాప, నేపాళభూపాలస్థాపనాచార్య, కర్ణాటరాజపూజనీయధౌరంధర్య, రామసేతు శ్రీరంగ విజయరాఘవపుర కుంభఘోణాది దివ్యస్థలప్రతిష్ఠాపిత రామభద్ర, సర్వజనసంభావిత గాంభీర్యముద్రాంకితసముద్ర,సదాశ్రితభరణదీక్షాదక్ష,దక్షిణసింహాసనాధ్యక్ష, రాజాధిరాజసన్నుతాసాధారణశౌర్య, దిగంతప్రసిద్ధతరౌదార్య,సుజ్ఞానజనక, సతతసంసేవితజనక, పోషితవిద్వత్కవియూథ, భువనశోభితగుణసనాథ, బలవత్పరిపంథిగృహీత సామంతమహీకాంతవిమోచనశ్లాఘనీయ బాహుబల, మూర్తిమూలంభాగర్భశుక్తిముక్తాఫల, చినచెవ్వయాచ్యుతనృపాలపుత్ర, సజ్జనస్తోత్రపాత్ర, రూపరేఖావిజితసుమసాయక, సకలధర్మసంధాయక రఘునాథనాయకప్రణీతంబైన శ్రీమద్రామాయణంబున విబుధజనవినుత వివిధకథాశాఖాప్రకాండంబగు బాలకాండంబునందు ప్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# రఘునాథరామాయణము.

## ద్వితీయాశ్వాసము.

---

క. శ్రీపంక్తిరథకుమారక
చాపకళాచార్య బాహుశౌర్యోజ్జ్వలశో
భాపరిపూర్ణ ఘనాఘ
క్షేపకశుభదివ్యనామ శ్రీరఘురామా. ౧

వ. అవధరింపు మవ్వాల్మీకిమునివల్లభుం డిట్లని చెప్పందొడంగె. ౨

ఉ. శ్రీసతికి న్నివాసము ధరిత్రికి నుత్తమరత్నభూషణ
న్యాసము సారసారవ[1]ఘనాంబువిజృంభితసస్యసంపద
ద్భాసితభూవిభాగము నుదంచితభోగము నంచు నెంచఁగాఁ
గోసలదేశ మొప్పుఁ గలకోకిలగానవనప్రదేశమై. ౩

క. ఆదేశమహిమ యెంతయు
వేదజ్ఞులు పలుకు లలర వినుతింపంగా
కోదరపతి తగునేమో
కా దితరులచేత నెన్నిగంతులు గొన్నన్. ౪

శా. వేదండంబుల హస్తకాండములఠీవిం బొల్చు బల్గంటులం
ప్రోదిన్ స్త్రీజను రాజనంపువరిగుంపు ల్నిండి యొక్కాలమున్
గేదారంబులఁ బండి తట్టారఁగ వీక్షింపంగ నానందమా
నాదేశంబున నేకదేశమును జేయంజాల దేదేశమున్. ౫

సీ. కీరము ల్ముక్కుల గీఱ నిల్వక జాఱు
చెలువంపు రసదాళి చెఱకుఁబాలు[2].
జెంత నంతటఁ బండి చిదిసిన ముంతమా
మిడిపండ్లరసములోఁ బడి పొరలుచు
నుఱుతలు గొఱుకంగ నొండొండఁ దొరఁగెడు
నారికేడంపుబొండ్లములనీటఁ

---

1. సారవ=సరయూనదీసంబంధి- 2. చెఱ్ఱుఁబాఱు.

గలసి చేరువయేటికాలువలను గూడి
ములు రాజనపుఁ జేల వలఁదిరుగుచుఁ
దరులఁ బొదవులఁ బసువంపు విరుల వడియు
కమ్మఁదేనెలు పైఁగ్రమ్మి కమ్మనంగ
ననుదినంబును బ్రవహించు నన్నియెడల
నేమి చెప్పంగవచ్చు నాభూమిమహిమ. ౬

చ. చిలుకలు ముక్కునం బొడువఁ జిల్లువఁ జిమ్మనగ్రోవులం బలె
న్వెలువడు నిక్షుకాండరసనిర్ఝరముల్ నికటస్థపల్వలం
బులఁ బడి యొండకాఁకలను బొంగునఁ జిక్కఁగఁబాక మైన రా
జిలుతమిఁ ద్రొక్కి చక్కెరలు సేయుదు రక్కడి హాలికోత్తముల్. ౭

మ. సరయూతీరమహాగ్రహారముల నశ్రాంతంబు సంతుష్టభూ
సురయూథశ్రుతిఘోషపోషితములై శోభిల్లుఁ దత్ప్రాంతభూ
సరసీజాకరమాకరందరసనిష్యందప్రహృష్యత్తరా
గరిత్సాఫరహంససారసవతీసంఘుక్రేంక్రియాస్ఫుంకృతుల్. ౮

క. ఎక్కడఁ జూచిన శుభనదు
లెక్కడఁ గనుఁగొన్న నిధులు నెక్కడఁ గన్నం
జొక్కపుఁగనులు న్నెలకొను
నక్కోసలదేశమహిమ యలవియె పొగడన్. ౯

సీ. పల్లెలు చూడ భాసిల్లు నచ్చట మహా
గ్రామము ల్వలె నభిరామలీల
గ్రామము ల్గనుఁగొన్నఁ గడుసమృద్ధి చెలంగఁ
బట్టణంబులువోలెఁ బరిఢవిల్లుఁ
బట్టణంబులు గన్న బహువైభవంబుల
దేశంబులును బోలెఁ దేజరిల్లు
దేశ మంతయును శోధించి కాంచ నఖండ
భూమండలమువోలెఁ బొలుపు మిగులు
నమరగురుఁ డైన నక్కోసలములమహిమ
నరసి వర్ణింపఁగలఁడె బ్రహ్మాండగోళ

మునఁ గలుగుధాత్రి యంతయు నొనరి యొక్క
చక్కి నిలిచినయటు లుండు నిక్కముగను. ౧౦

సీ. పుష్పమాజరు లిప్పపువ్వరాజనములు
కస్తూరినిగరాలు గంధసరులు
గంగాజలంబులు బంగారు తీఁగియ
లేనుంగుదంతముల్ దీనసరులు
సన్నవంకెలు ముత్తెసరులు ప్రాసంగులు
రాయమెచ్చులు నీశ్వరప్రియములు
నయములు రామబాణములు సీతాభోగ
ములుఁ బాలకేసరుల్ మోసనములు
కలియమేనులు సన్నబక్కండ్లు మఱియుఁ
గలుగు ధాన్యంబులెల్ల ముక్కారుఁ బండి
బిండి యొల్లెడఁ జూచిన నెగడుచుండు
క్షామ మనుపేరు నెఱుఁగ రాభూమిప్రజలు. ౧౧

క. కరములఁ జిలుకలు వ్రాలఁగ
శిరమున రాజనపు వెన్ను చెఱివి ననసుధా
కరకళఁ దగుపార్వతు లనఁ
బరఁగుదు రాప్రోలి శాలిపాలిక లెపుడున్. ౧౨

ఉ. కప్పురభోగివంటకముఁ గమ్మగ నే వడియ న్భుజించి మే
ల్దుప్పటులట్లు మూరగల తోరపుఁబచ్చడము ల్చెలంగఁగా
గొప్పకడానిపైఁడి జిగిగుత్తపు టుంగరము ల్కరంబులం
ద్రిప్పుచు రచ్చ సేయుదురు రెడ్డిదొర ల్తమి హెచ్చ నచ్చటన్. ౧౩

వ. మఱియు సరయూసరిత్ప్రవాహనివహాలంకృతసదేశం బగు నక్కోసల
దేశంబు ధర్మం బాతట నెలకొన నెలనెల దప్పకుండఁ గుండలం గ్రుమ్మ
రించినట్లు గురియువర్షంబులచేత హర్షంబునం బలె నుప్పొంగి నదీతరం
గంబు లెల్లెడ వెల్లివిరియ నొండొండ మెండుకొని పండు లిరవుకొన
నెరువుచల్లినబాగున వీరభోగంబు లగు భూమి భాగంబులం గనుం
గొనం జాలి శాల్కి యవ గోధూమాది ధాన్యంబు లెప్పుడుం దెప్ప

లుగాఁ బండు నుదారకేదారంబులకు నాధారంబు లగుచెఱువుల దొరువులం గనుపట్టుచు బంగారు వెట్టిన మొలచు జాంగలభూములం జెంగలించు నుత్తుంగ నారికేళతరు సంఘంబులవలన నక్కడక్కడం జిక్రోడదంష్ట్రాటంకదష్టంబు లై తోటతోటునం బడు ఫలదట్టంబులు జలదేవతలు వేడుకలు పుట్టం బుట్టచెండులు గోర్చువిధంబున మాటి మాటికిని నీటిమీఁదటం బుట మెగయం దటరుహతరుభ్రంశికుసుమ వాసనలు ముంచికొనం బ్రవహించు కట్టఁగాలువల చెంగట నందంద కుందప్రసూనబృందకందళన్మకరందపానసంభ్రమబంభ్రమ్యమాణబం భరడింభఝుంకారంబులతోడఁ గూడి యిక్షుయంత్రక్రేంకారంబులు సవిధకాసారసారసక్రేంకారంబులం గర్ణోత్సవంబులు నెఱప నెఱప సిండి మిసిమిజిగి సీను మేచుల పసం బొసంగు పసిగాఁపుగుబ్బెత లుబ్బుచెలంగ సలిలపూర్ణస్వర్ణకలశంబులు బింకంపుఁజన్నుల నొఱ యం జంకల నిడికొని నడయాడుఁ తీవులం బాటిల్లు నీరాటిరేవులం జూపఱకు నుత్కంఠగొలుపు గ్రామోపకంఠంబుల విలసిల్లు తిల్య మాష్య భాంగీన మాద్గీన కొద్రవీణాదిక్షేత్రంబుల గనిమలం బొదలు చు మెచ్చుగొలుపు లేఁతపచ్చికలు మేసి యాము గ ఏసి మిసమిసని మే నుల శోభిల్లుచు నాభీరకుమారవదనాదితవంశనాళవివర వివిధభంగి తరంగితాలాపలీలాపరంపరాకర్ణనంబుల నానందించు నాలమందల యమందలలిత హంభారవవిజృంభణంబుల ఘూర్ణమానంబు లగునదీ మాతృకగ్రామంబుల సమగ్రం బై యగ్రమండపాంతరనిరంతర నటన్నటీచటుల పదకంజమంజుమణిమంజీరఝుణంఝుణస్వానానుకా రిమనోహర మంగళమృదంగసంఘుధింధిమిధ్వనిబంధురంబు లగు దేవా లయంబుల నందం బై సకలజనానందం బై విలసిల్లు చుండు. ౧౪

అక్కోసలంబులంముల
నొక్కపురము చూడఁదగు నయోధ్య యనఁగ నా
చక్కఁదనము వర్ణింపఁగ
నిక్కముగాఁ గమలభవుఁడు నేరఁడు దలఁపన్. ౧౫

క. శ్రీనటనరంగశాల మ
హానృపగణరత్నపేటి యనుచు జనంబుల్
వేనోళ్లం బొగడ నయో
ధ్యానగరము వెలయు లోచనానందం బై. ౧౭

వ. మనునిర్మితం బగు నయోధ్యానగరంబు యోజనత్రయవిస్తారంబును ద్వాదశయోజనాయామంబునుం గలిగి రెండు యోజనంబుల మేర సత్యనామంబై యతిభీమం బై సకలజనాభిరామం బై విలసిల్లుచుండు.

క. దివినుండి భువికి డిగ్గరు
భువినుండియు దివికి నేగఁబోలు భుజగరా
డ్భవనంబునుండి...
భువికిఁ దివికి నేఁగ నసఁగఁ బుకోట దగుఁన్. ౧౮

క. అన్నగరికోట తుదమొన
లెన్నఁగ సురపన్నగేశు లెఱుఁగుదు రేమో
మిన్నక పలికితిఁ గా కవి
మొన్నఁగ ......... ౧౯

గీ. ఆనగరికోట మలఁచిన మానికంబు
లంశుబాలాతపంబుచే నలరఁజేసి
యగడితలలోని పద్మంబు లంబురాగ
మునుపఁగాఁ(బద్మరాగంబు లనుచుఁ) బరఁగె. ౨౧

క. పులిమొగము లనం గోటల
యులిమొగములు మెఱయుచుండు నుగ్రపుఁగోటల్
వలె నుక్కువసులు పెక్కులు
పలుచిక్కులు మీఱ..............గఁన్. ౨౧

క. సురవాహిని బహుముఖములఁ
బరిఖాంబుధి దుముకులీలఁ బరఁగుం బురగో
పురహీరకాంతిధోరణి
నిరతము నామురా..............న్. ౨౨

విద్రిచె నక్షుని దిక్కు లద్రువ వాయుజుఁ డన
భావింప సమలఘుప్రాస మయ్యె
బిందుపూర్వంబుగాఁ బొందిన బములు జ
గంబులోఁ గృతులను గ్రమ్ము నసఁగ
శమదమసంపన్నుఁ డమృతాశి యని ఋయు
తాయుతంబుల ప్రాస మంటుటయును
లళ లవి యొండొంటిఁ గలయఁగఁ గూర్చుట
పాటింప నిట్టిదె ప్రాసమైత్రి
పొదలు రాఘవదాస కదనజయోల్లాస
కదియు నంత్యప్రాస మిది సువాస
దోఃఖండితాసుర దుఃఖనాశా యను
పట్టున దుష్కరప్రాస మయ్యె
శ్రీరామపాదసేవారామ యనుచును
రచియింప ద్వంద్వము ప్రాస మగును
జనకజాశోకనాశన కజాతా యని
పల్కుచో నిదియె త్రిప్రాస మరయ
వినయశోభనమూర్తి ఘనయశోభూషణ
భరియింపు మనఁ జతుష్ప్రాస మయ్యె
అప్రతీకప్రతాపప్రభాప్రకర య
నుప్రాస మగు నిది సుప్రసిద్ధ
యిట్టి యష్టాపదప్రాసపృథులభేద
మెఱిఁగి పూర్వులు చెప్పినకృతులయందు
లక్ష్యము లెక్కు లీక్షించి లాక్షణికులు
కృతులఁ బ్రాసంబు లునుతు కోకేశనాథ. ౬౫

మఱియు యతిభేదలక్షణంబులు వివరించెద. ౬౬

వడి యగుఁ బాదాదులయం
దిడునక్షర మేది యదియె యెనచేసుక యె

య్యెడ యతి రావలె నని రట
నిమటయు విరతులకు సంజ్ఞ యినసుతమంత్రీ. ౬౭

— యతులు —

సీ. స్వర విభాగ ప్రాది వర్గ నిత్యాదేశ
సరస మా వృద్ధ్యనుస్వర వికల్ప
భిన్న కాకుస్వరా భే దోభ యాఖండ
ఋ ప్రభు దేశీయ రి ప్లుత జ్ఞ
యుత శకంధుగణాఖ్యయతులును మఱి చక్క
టియు నెక్కటియుఁ బోలికయును గూడి
సప్తవింశతి యతు ల్సత్త్వ ల్పనిగొన్న
కరణి వళ్లన్నియుఁ గానరాఁగ
గీతి తారావళిగఁ జేతుఁ గృతుల లాక్ష
ణికులు మెచ్చంగ నీకు నే నెప్పు మెఱసి
జానకీనాథపదభక్తజనవిధేయ
భంజితాసురసముదాయ యాంజనేయ. ౬౮

గీ. ప్రామ్యభయనిత్యకాకుస్వరములు గాక
యన్యపదములపై స్వర మందె నేని
అదియె స్వరయతి యగును శౌరాష్ట్ర యనఁగ
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧

గీ. సంఖ్యయంమను బరిమాణసంజ్ఞ సంఘ
టిల విభాగాఖ్యయతులు రెండేసి యగుఁ గ
వీశ్వరుల కర్థమిా గంపెఁడేసి యనఁగ
భంజితాసురసముదాయ యాంజనేయ. ౨

గీ. ప్రాకు లిరువదిలోఁ బరాజపులు దక్క
నన్నియుపసర్గలు స్వరసమస్వితముగఁ
బ్రాది యతియగుఁ గిరివైభవుఁడ యనిన
భంజితాసురసముదాయ యాంజనేయ. 3

గీ. కచటతపలపై వర్ణము ల్లడల నుంచి
కడమ వేర్వేఱ నాల్గేసి కలయ నిడినఁ
గావ్య లది వర్గవడి యంద్రు ఘనవితరణ
భంజితాసురసముదాయ యాంజనేయ. ౪

గీ. పదము లేర్పాటుగాఁ జేయ బాగుగాని
సంధి నిత్యసమాసవిశ్రమము దనరు
నవ్యసద్గుణరత్నరత్నాకర యన
భంజితాసురసముదాయ యాంజనేయ. ౫

గీ. ద్వీపనాకశబ్దముల నాదేశవిరతి
యగును గవిజనబుధలోకనాకవృక్ష
యెంతరమ్యంబు జాంబవద్వీప మనిన
భంజితాసురసముదాయ యాంజనేయ. ౬

గీ. శషసలకు చఛజఝచతుష్టయము వడియిడ
నయహ లొండొంటితోడుత యను లమర్ప
సరసయతి యందు రవి కవిజనము లెల్ల
భంజితాసురసముదాయ యాంజనేయ. ౭

గీ. యహలపైఁబద ననుస్వారసహిత మైన
మాకు వడి యగు దేవసంయమినుతుండు
మాకు సిరులిచ్చు దైవసింహం బనంగ
భంజితాసురసముదాయ యాంజనేయ. ౮

గీ. ఏక మోజంబు మొదలుగా నెసఁగుసంధి
వృద్ధియతు లగు దేవలోకైకమాన్య
యున్నతాహితశైలబిడౌజ యనిన
భంజితాసురసముదాయ యాంజనేయ.

గీ. నణమలకు బిందుయతు లిటుండఁగవలయు
నరవరస్తుతకావ్యసందర్భములను
మహితరణరంగశౌర్యసంపన్న వినుము
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౦

గీ. సంధులను రెండురూపము ల్జరగువర్ణ
మున వికల్పాక్షరయతులు దనరుఁ గృతులఁ
దలఁపు రాముపై నిడినస్మృతివి యనిన
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౧

గీ. ప్రేమచే నీవు మమ్ము భరింతు వనిన
జగణమధ్యంబు భిన్నవిశ్రమము దనరు
పీన నిత్వంబు విరళమై పూనుఁ గనుక
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౨

గీ. అమరఁ బ్రశ్నైకలితదీర్ఘమైన యెడ వ
డి యగుఁ గాకుస్వరమున వీఁడే ఘనుఁ డితఁ
డే చుమీ కీర్తినిధి యని యెంతు రనిన
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౩

గీ. పృథివి సుకవులు 'పవయోరభేద' యనెడి
పలుకుచేఁ బఫబభ లవి వాకుఁ గృతుల
విరతు లుప్పను రవిగా యభేదయతులు
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౪

గీ. జగతి యుష్మదస్మచ్ఛబ్దముగళమున నె
తగు నుభయరూపయతి యస్మదలఘుసుకృతి
యవని వెలయుట యది యుష్మదతిశయ మన
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౫

గీ. ఒక్క వర్ణంబు స్వరమూఁద నొకటి స్వరము
గలయకుండంగఁ గూర్తు రఖండయతులు
రామపదపద్మలోలవరాళి యనుచు
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౬

గీ. ఋవడి పొలుపొందు వేర్వేఱఁ గృతులయందు
హేమగిరిధీర రక్షితకృపణాపార
యుద్ధచారిత్ర కరుణాసమృద్ధ యనిన
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౭

గీ. అయ్యు యన్నచోఁ దేలిన త్రిసంధి
నగును బ్రభునామయతి హనుమయకుఁ గన్న
తల్లి యైనది యాపార్వతన్న యనఁగ
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౮

*గీ. అచ్చుతోఁ గూడి దేశీయ మనెడు విరతి
యొన్న నొక్కొక్కచోటఁ గ్రిక్కిరియుఁ గృతుల
సరసలక్షణకవులు ప్రచ్చుర సమర్చ
భంజితాసురసముదాయ యాంజనేయ. ౧౯

గీ. కృతులబుత్త్వంబుతోడుత రియమువడియుఁ
బృథివిపై మించు దండితరిపుసమూహ
పృథులతరకీర్తి రణజయశ్రీ యటన్న
భంజితాసురసముదాయ యాంజనేయ. ౨౦

గీ. సంశయాపహ్నవగీతార్థసరణి దగును
నాదవు ప్లుతయతి యగునో కాదో యటంచు
ననినయెడ దీర్ఘమున మహాత్మా యటనిన
భంజితాసురసముదాయ యాంజనేయ. ౨౧

గీ. జ్ఞాకుఁ దెలుఁగుతద్భవ మైన నా దలిచ్చు
దానఁ జేసి వడి జ్ఞాకుఁ దగు నిడఁగ
నవయశోజితచంద్ర ప్రజ్ఞాఘనేంద్ర
భంజితాసురసముదాయ యాంజనేయ. ౨౨

గీ. ఒకటిరెండును గలసి సంయుక్త మైన
నందు నొక యక్షరమునకు యతి నమర్చ
సంయుతాక్షరయతియండ్రు త్ర్యాఘరహిత
భంజితాసురసముదాయ యాంజనేయ. ౨౩

గీ. అల శకంధ్వాదిగణమున కచ్చు హల్లు
యతు లొనర్తురు సుకవి వేదండరచిత

---

*అచ్చు హల్లును దేశీయమనియెడివడి... గ్రిక్కిరియోఁ గృతుల— గి. రా. నాయిల్ల వారి అప్పకవీయము.

నిఖిలకృతులను జూచి మనీషివినుత
భంజితాసురసముదాయ యాంజనేయ. ౨౭

గీ. పుఫుబుభులు ముకారంబుతోఁ బొల్పుమీఱ
మొనయఁ జక్కటియతి యండ్రు పూర్వకవులు
బుధనుతాంచితకీర్తి సత్స్ఫూర్తి యనఁగ
భంజితాసురసముదాయ యాంజనేయ. ౨౫

*గీ. మహిమ నెక్కటియతులమ్యో మరవఱలలు
రహిని దమతమకయ వళ్లు రమ్యచరిత
వనధిగంభీర సద్గుణావాస యనఁగ
భంజితాసురసముదాయ యాంజనేయ. ౨౬

గీ. దొరయఁ బుఫుబుభులు విభ్రాంతిదలఁ గలము
వర్ణమునఁ బొల్చి యతు లనవచ్చుఁ గృతులఁ
బుణ్యమూర్తివి భూలోకమున నటన్న
భంజితాసురసముదాయ యాంజనేయ. ౨౭

— వృత్తక్రమము —

క. నరగణసంజ్ఞలు దీర్ఘా
క్షర మున్నను గణము రెండుగను సంయుక్తా
క్షర మున్న గణము లెడలిచి
వరుసన యిడవలయుఁ దెలిసి వనచరచంద్రా. ౬౯

గీ. పంక్తి మొదలుగాఁగఁ బదునేనుఛందంబు
లంను వృత్తములను యతు లమర్చ
వలయుఁ గాన నెచట వడి యిందుఁ బూన్చితి
నచట వళులు నిలుపనగు హరీంద్ర. ౭౦

గీ. అమర నుక్తాదిగా నిర్వదాఱుఛంద
ములను గల్గిన వృత్తసంఖ్యలఁ బ్రసిద్ధ

*మహిమ నెక్కటివళులన మరవఱలలు । రహిని దమతమకయ మగు- గీ. రా, వావిళ్లవారి అప్పకవీయము.

మైనవృత్తంబు లోకైక యస్థిర గూన్య
హనుమ లక్షణలక్ష్యంబు లగును వినుమ. ౭౧

— ఉక్తాదిచ్ఛందములు —

క. మొదలిటి 'యుక్త'ను దెలియఁగ
నదయుగచిత యట్టివృత్తియుగదళ 'శ్రీ'కిం
బదమున కొక్కొకగురుపై
కదియుచను మారుతాంజనేయ కవిజనగేయా. ౭౨

౧. ఉక్తాఛందంబున 'శ్రీ' యనువృత్తము- గ ౧.*

క. నాలుగువృత్తము 'లత్యు
క్తా'లక్షితము లందులోనఁ గల' స్త్రీ' పేరుం
జాలఁ బ్రసిద్ధిగ నొందును
పాలితమశజనసమాజ పవనతనూజా. ౭౩

౨. గా'స్త్రీ' ౧ ౧. ఈస్త్రీపేరనువృత్తమే 'స్త్రీవృత్తము'.

క. ఎనిమిదివృత్తంబులు 'మ
ధ్యను' గలిగెను వానియందుఁ దనరుచు "నారీ,
వినయ, మృగుల్" మసరల నగు
ననఘా క్రమయుక్తిఁ జేసి యనిలకుమారా. ౭౪

3. నారీవృత్తము, మ ౧ ౧ ౧; వినయవృత్తము, స । । ౧; మృగీవృత్త
ము, ర ౧ । ౧.

క. తెలియఁగ నాల్గవయది యై
వెలయు 'ప్రతిష్ఠ' ను బదాఱువృత్తంబులలోఁ
బొలుపై "బింబాదులు" నా
ల్గలరును సుగ్రీవమిత్ర యుచితగాత్రా. ౭౫

౪. 'బింబ', భగల్-భ ౧ । ।, గ ౧; 'కన్యా'గాగాః-గా, ౧౧,గా౧౧;
యగల్'ప్రేక్షా'-య । ౧ ౧, గ ౧;'సుకాంతి'జగల్-జ । ౧ ।, గ ౧.

క. ఒప్పైన 'సుప్రతిష్ఠ'ను
ముప్పదియును రెండువృత్తములలోఁ దగునా

---

*౧ ఇది గురుసంజ్ఞ । ఇది లఘుసంజ్ఞ.

అప్పంక్తి మొదలుగా నవి
చెప్పెద శ్రీరామదాససేవామోదా. ౨౬

గీ. 'పంక్తి'భమ్ముగగాగ-భ ౧।।, గా ౧ ౧; దీనిపేరే సుందరీవృత్తము.
రంబుగాల్ 'ప్రీతి'-ర ౧।౧, గా ౧ ౧;
'సతి'జగాలౌ-జ।౧।, గా ౧ ౧;
'నందం'దలగల్-త ౧ ౧।, లగ।౧;
'ప్రగుణ' సల్గాల్-స।।౧, గా ౧ ౧;
'అంబుజము' భ్వల్ భ ౧।।, వ।౧.

క. విను గాయత్రీఛందం
బున నఱువదినాల్గువృత్తములు గల వందుం
దనుమధ్యాదు లవెన్నిది
దనరును గృతులందు గిళితతామరసాక్షా. ౨౭

ఉ. త్యాప్తిం'దనుమధ్య' త ౧ ౧।, య।౧ ౧;
'వసుధ' ససలౌ-స।।౧, స।।౧;
'శశివదన' న్యల్-న।।।, య।౧ ౧;
'చంద్రవదన' భ్యల్-భ ౧।।, య।౧ ౧;
షడ్గంబు'ల్పానిత్రి'(ఆఱుగురువులు)-మ ౧ ౧ ౧, మ ౧ ౧ ౧;
తాన్ప్తి'వసుమతి'-త ౧ ౧।, స।।౧;
యయంబుల్'విచిత్ర' య।౧ ౧, య।౧ ౧;
'సురలత'కు న్యల్-న।।।, య।౧ ౧.

క. ఉల 'యుష్ణి'క్ఛందంబున
నెలమింగల నూటయిర్వదెన్మిదివృత్త
ములలో మదరేఖాదులు
పొలుపగు మునిసంఖ్య వెలయు భూమీశహితా. ౨౮

ఉ. †మస్గంబుల్ 'మదరేఖ'- మ ౧ ౧ ౧, స।।౧, గ ౧;
'మధుమతి'నభగల్-న।।।, భ ౧।।, గ ౧;
రజ్గము 'విభూతి'కి-ర ౧।౧, జ।౧।, గ ౧;

† సల్గంబుల్-అనిమాలము.

(29) "వంకాయను జెఱకురసము వడియుచునుండెన్."

క. పంకజముఖిపై నామక
రాంకున కేసుట్టికినుకొ యాసుగముల ని
శ్శంకముగఁ జేద నప్పుడు
వంకాయను జెఱకు రసము వడియుచు నుండెన్.

వంకాయను, వంక + ఆయెను. వంకరగాఁబోయెను. ఇక్షుధనుస్సు వనుక- ఆచెఱకున రసముపడియెను. పద్యములో వంకాయెను, అనియున్నది. వంక + ఆయెను- అనునది సరియే కాని వంకాయె- అనివంగకాయకురూపముకొధనీయము. వ్యవహారములోనిధ్వనిని బట్టిరి.

(30) "కలికిని గనుఁగొంటి డేగకాల న్మింటన్."

క. పొలమున నారణపక్షిన్
బలిమిని దాప యని తూఱి బహువేగమునం
దలపట్టి యీడ్చునప్పుడు
కలికిని కనుఁగొంటి డేగకాల న్మింటన్.

కలికిన్=స్త్రీని. మింటఁగంటిని- విషమము. నారణపక్షికలికిన్=నారాయణపక్షి శిరమునందుండు, (తురాయి) యీఁకెను. డేగ పట్టి యీడ్వఁగా దానికాలిని బట్టెనని- కలికితురాయి.

(31) "రతిపతి మన్మథుఁడు గాఁడు బ్రహ్మాయె తలఁపన్."

క. సతతము వీణావాదన
చతురతఁ దన రత్నసభను జలరూపం బా
వితమునను జేయు నాభా
రతిపతి మన్మథుఁడు గాఁడు బ్రహ్మాయె తలఁపన్

(32) "బీరకాయకన్ను చేరెఁడంత."

గీ. వినను గనను లేదు విశ్వంబులో వింత
గంటి నేను జాలఁ గన్నులార
నీవుఁ జూడరమ్ము నిక్కంబు కనకజం
బీరకాయ కన్ను చేరెఁడంత.

కనక, జంబీర, కాయ=బంగారు, నిమ్మపండువంటి, శరీరము, గల స్త్రీయొక్క, కన్ను=నేత్రము- చేరెఁడంత.

(33) "రతనమునకు గుఱుతు దంతిరథఘోటకముల్."

క. సతతము సరసామాత్యుల
మతివిభవము గూడ రాష్ట్రవర్ధన మెపుడుం
గుతుకమ్మునఁ జేయు నలదొ
రతనమునకు గుఱుతు దంతి రథ ఘోటకముల్.

(34) "అమ్మనన్నను నవల సయ్యాట గలదె."

గీ. నిమ్మపం డమ్ముచును నొక్క నెలఁత రాఁగ
గొప్పవిగ రెండుపండ్లు గైకొందు ననఁగ
నేల పలుమాట లాడెద విటుల విటుల
కమ్మనన్నను నవల సయ్యాటగలదె.

అమ్మను=నిమ్మపండ్లువిక్రయింపను, అమ్మను=తల్లిని. పండ్లమ్మనని పిమ్మటవదు గుటయేల. అమ్మను- అని వారి తెల్పినప్పుడు విటులసయ్యాటము లుండునా.

(35) "బోడికిఁ గొప్పాంచ మిగుల ముద్దులు గులికెన్."

క. ఏడను వినికియుఁ గలదే
బోడికిఁ గొప్పంచు పలుకు భువనస్థలిలోఁ
గోడెమిటారికి నాపూఁ
బోఁడికిఁ గొప్పాంచ మిగుల ముద్దులు గులికెన్.

పూఁబోఁడికిన్=పుష్పసదృశశరీరముగల స్త్రీకి.

(36) "పలుకులనే చెప్పకతనఁ బలుకులె యయ్యెన్."

క. పులకండము లంచని తే
నెలటం చని పలుకుచుంద్రు నేరసహారల్
కలికికిఁ బలుకులు కపురపుఁ
బలుకులనే చెప్పకతనఁ బలుకులె యయ్యెన్.

(37) "గ్రామమ్మున కొసఁగె శివుఁడు కంజాక్షునకున్."

క. తామరలు వేయి పూజకు
నేమంబున నొకటి దఱుగ నేత్రం బిడినం
బ్రేమం జక్రమ్మును సం
గ్రామమ్మున కొసఁగె శివుఁడు కంజాక్షునకున్.

గ్రామము- విషయము, సంగ్రామము=యుద్ధము- సమాధానము.

(38) "తెలిమఱుఁగే చాలు వేఱె తెరమఱుఁగేలా."

క. తెలివా నీయధరమునే
నిరతము నాశించి యుండ నీప్రియు చేతన్
మఱుఁగిడి తడిసరియా నా
తెలిమఱుఁగే చాలు వేఱె తెరమఱుఁగేలా.

తెర=మఱుఁగుచీర. నాతెలి=నాలి.

(39) "రంగపతే తురక గాక రంగపతౌనా."

క. అంగనఁ గొనె వానింటను
బొంగలి నదివెట్టఁ బినియెఁ బో యని యెగ్గా
గంగాధర యేమనుఁ దా
రంగపతే తురక కాక రంగపతౌనా.

తురంగపతి=అశ్వపతి- పాచ్ఛాగొర. రంగపతి=శ్రీరంగనాయకులు.

(40) "హారంబులు లేక యమరు లౌటరుదే కా."

క. ధీరతను దెంపుచేసుక
ఘోరాహవభూమిలోనఁ గూలిన మేలౌ
శూరగణ మప్పు డమృతా
హారంబులు లేక యమరు లౌటరుదే కా.

హారములు=ఆహారములు లేకయే. అమరులు=చావనివారైరనుటవిషమము. అమృతాహారములేకయే, యుద్ధమునం గూలిన శూరు లమరులై రని సమాధానము.

(41) "గాలికి సదృశములు యువతికఠినకుచంబుల్."

క. వలుఁగసమములు కన్నులు
కాలాహికి సాటి వేణి కాముని విల్లౌ
భ్రూలత లన్నట్లగును న
గాలికి సదృశములు యువతికఠినకుచంబుల్.

నగ + ఆలికి=నగాలికి, కొండలగుంపునకు.

(42) "ధీరుఁడు రణ మన్న వెఱచుఁ దెంపరిగామిన్."

క. సూరునిఁ గన్న దివాంధము
బెరినిఁ గనుఁగొన్న కొంగ పంచాననముం

జేరినమృగ మన్నట్ల యు
ధీరుఁడు రణమున్న వెఱమఁ డెంపరిగామిన్.

(43) "రాముని సతి గుణము శబ్దరాశిం గొలిపెన్."

క. భూమిాశు నెదురు వారల
పై మందును గుండ్లుచుం దుపాకిని నిడి తా
వేముఱు బాదరు నుంచిన
రాముని సతిగుణము శబ్దరాశిం గొలిపెన్.

రాముని సతి యగుసీతగుణము శబ్దరాశిం గల్పించుట- విషయము.

రామునిసతి=జానకి; గుణము=త్రాడు. జానకిత్రాడు, పూర్వము కర్ణాటకపుతుపాకులకు జానకిత్రాళ్లచివర నగ్ని ముట్టించియుంచి, బాదరు, అనఁగాఁ దుపాకియందు, పోసిన తుపాకి చెవికిఁ దగిలించిన నది శబ్దముచేసెడిది, ఆరచెట్టునార మొదలగు కొన్నినారలతోఁ ద్రాళ్లుపేని నిప్పంటించిన నది యాఱకుండ రగులును. రంజకమంటుకొనిన శబ్దించును. రామునిసతిగుణము=జానకిత్రాడని కల్పింపఁబడెను. లక్షితలక్షణముగా గ్రహించునది.

(44) "మీాసానకుఁ గాళ్లు మూఁడు మేదినిఁ గల్గెన్."

క. మీాసానకుఁ గాళ్లెక్కడ
వాసిగ విన్నదియు లేదు వసుధాస్థలిలో
వాసనగందము రా చేదు
మీాసానకుఁ గాళ్లు మూఁడు మేదినిఁగల్గెన్.

మీాసానకు=మీాసమునకు- మీాసానకు=మీాగందపుసానకు-

(45) "పులి దాసరులకును బెట్టెఁ బొట్టలు నిండన్."

క. పులి యెదురఁ బడినచోఁ దిరు
మలరాయని వేఁడుకొనఁగ మనసున నొకఁడా
వలఁ దొలఁగిపోయె శాంతతఁ
బులి దాసరులకును బెట్టెఁ బొట్టలునిండన్.

పులి హింసచేయక తొలఁగిపోయినది. అతఁడు పిదప వేఁడుకోలుచొప్పున దాసులకు భోజనము పెట్టెను.

(46) "వాలంబులు రెండు నిండుబండ్లాతునకున్."

క. కేలను గేడెము వీఁపున
మేలౌ తరకసము బాకు పేటి న్వలచే

బాలాపడుదలలోఁ గర
వాలంబులు రెండు నిండుబంప్రొతునకుఁ.

(47) " విధవా నీ మగఁడు నిండువేకటి గదవే. "

క. విధుశేఖరుసతి యాజ్ఞను
మధురాధర యైనఁ గూడె మారుని కేళిన్
బుధుఁ డేమి చెప్ప గృహాదట
విధవా నీమగఁడు నిండువేకటి గదవే.

విధవా నీ మగఁడు=అనునది విషయము.

గృహాదటవిధవా=గృహాత్=ఇల్లుగాఁజేసికొనిన, అటవి=అడవిగలవాఁడే,ధవా=పెనిమిటిగాఁగల యోషనితా=నీమగఁడు పరిపూర్ణగర్భమును దాల్చె నని సమాధానము.

వైవస్వతమనువు పుత్రుం బడయఁగోరి వసిష్ఠుం బ్రార్థించి యతనియాజ్ఞచే యాగ మొనరించిన, నతనిభార్య యిష్టముచొప్పున హోత ప్రయత్నము ద్వారా, కుమారి జనించెను. మఱియు వసిష్ఠుని ప్రయత్నముచే నాకుమారి కుమారుఁడయ్యెను. ఆకుమారుఁ డొక నాఁడు వేఁటకు వెడలి మేరుపర్వతాగ్రస్థ కుమారవనముఁ జేరఁగాఁ బూర్వమే యొక కారణమున శివునిశాప మావనమున కేర్పడినచొప్పున స్త్రీరూపము కలిగెను. తత్సమయమున బుధుఁడు, ఆస్త్రీని గూడిన నామెకు గర్భమై పురూరవునిం గనియె నని పురాణ ప్రసిద్ధము. పురుషరూపమున నున్నపుడు ప్రద్యుమ్నుఁ డనియు, స్త్రీరూపమున నిలాకన్య యనియుఁ బేరులం గాంచెను.

(48) " పగటఁ జంద్రిక గనుపించెఁ బద్మనయన. "

సీ. బాగములు సేయుచును వేడ్కఁ బలుకులాడఁ
దమ్మ రసమింతకోకపైఁ దగిలియుండ
నేమి యనఁ గొంకి తెలుసుక యింతినవ్వ
పగటఁ జంద్రిక గనుపించెఁ బద్మనయన.

(49) " కుందేటికిఁ గొమ్ములాఱు కుక్కకువలెనే. "

క. మందకడఁ దఱిమి పట్టిన
నందుల మూఁడు పసరమ్ము లదరి పొడిచినన్
ముందుబడి వెనుక దూసెను
గుందేటికిఁ గొమ్ములాఱుఁ గుక్కకువలెనే.

మందలో నొకకుక్కయును గుండేలును జగడమాడఁగా నక్కడనున్న యూఁడు పసరములు బెదరి యాశెంటిని దమకొమ్ములతోఁ బొడువఁగా యూఁడావుల యొఱు కొమ్ములును గుండేటికిని గుక్కకును గూడ గ్రుచ్చుకొనియెనని-

(౫0) "చేఁప కొంగను మ్రింగెను జెట్టుపైని."

గీ. బలునిడివి యైన దాసరిపా మొకండు
చెట్టు మీఁదను గొమ్మను జుట్టుకొండి
దెలియకను గూఁటిపిల్లలఁ గలయ ముక్కు
చేఁప కొంగను మ్రింగెను జెట్టుపైని.

కొంగ యొకచేఁపను దనముక్కుచేత నెత్తుకొని యొక్కవృక్షముమీఁదఁ గట్టియున్న గూఁటియందుఁ గలతనపిల్లలకు నిచ్చునపుడు ఆవృక్షముమీఁది కొమ్మనుజుట్టి కొనియున్నపా మాచేఁపను ముక్కునందుఁ బెట్టుకొనియున్న కొంగను మ్రింగెను.

ముక్కునందుఁ జేఁపగలకొంగ ముక్కుచేఁపకొంగ.

(51) "దీపముశిఖమీఁద నీఁగ స్థిరముగ నిలిచెన్."

క. శ్రీపతికి భక్తి ధూపము
దీపము లిచ్చెతువితాన నీఁడుఁ వ్రాసెన్
గోపురముమీఁద వెరుకన్
దీపము శిఖమీఁద నీఁగ స్థిరముగ నిలిచెన్.

గోపురముమీఁద వ్రాసిన దీపపుశిఖమీఁద నీఁగ వ్రాతఁని-

(52) "కుంతికిని నుంపడుంబయ్యెఁ గులుకులాఁడి."

గీ. ఖడ్గితో నొక్క మాసంబు గలిసియుండెఁ
జక్రితోడను నట్లనె సరసుకొనియెఁ
బోటుకాఁడని మదినెంచి పూని యిపుడు
కుంతికిని నుంపడుంబయ్యెఁ గులుకులాఁడి.

ఖడ్గముగలవాఁడు ఖడ్గి- చక్రముగలవాఁడు చక్రి. అట్లే కుంతము=(బల్లెము)ను జేతఁబట్టినవాఁడు కుంతి. ఆకుంతాయుధధారితోఁ గులుకులాఁడి యిపుడుండె ననిభావము.

(53) "కడుపునఁ బెట్టుకొని ప్రోచెఁ గమలోద్భవుఁడున్."

క. మడుపులమీఁదను నాసలు
విడఁబడ వెవ్వారికైన విశ్రుతమహా బు

పుత్తడి కొంచెము వడి దొరకినఁ
గడుపునఁ బెట్టుకొని ప్రోచెఁ గమలోద్భవుఁడున్.

బ్రహ్మదేవుఁడు హిరణ్యగర్భుఁడవుటే యన్నదిగానఁ బుత్తడిని గడుపునఁ బెట్టుకొని కాఁచెనని చమత్కరించెను. పుత్తడి=బంగారు.

(54) "కజ్జలధవళావతంసకమలముఁ గంటిన్."

క. గొజ్జంగపెటు నొకసతి
మజ్జనమై రాఁగఁ జూపు మాటికిఁ గనుల్
కజ్జలరాఁ దేఁటులు నిలఁ
గజ్జలధవళావతంసకమలముఁ గంటిన్.

లోచనములు కర్ణాంతాయతములై యుండఁ గుసుమభ్రాంతిచేఁ దుమ్మెద లచట వ్రాలఁగాఁ జూచువారికిఁ గాటుకతోఁ గూడిన తెల్లనికర్ణభూషణమో యనునట్లుండెను. కజ్జల=కాటుకతోఁగూడిన, ధవళ=తెల్లనైన, కర్ణావతంసకమలము=విలాసమునకైఁ గర్ణమునధరించిన తెల్లకలువ.

(55) "కొల్లడమున నొక్క చేఁప కొంగను మ్రింగెన్."

క. అల్లుని హాస్యము సేయఁగ
బెల్లమునం జేసి పక్షివితతిని గొని రాఁ
ద్రెళ్ళి పడె నల్లగంపయుఁ
గొల్లడమున నొక్క చేఁప కొంగను మ్రింగెన్.

కొల్లడము=తిరిచినాపల్లి సమీపమునఁ గావేరీనదినుండి భాగమై పాఱునొకనది. గంపలోనున్న బెల్లపుకొంగను మ్రింగెనని భావము.

(56) "పాలు త్రావకయుండియు బలిమికలిగె."

గీ. ధరణినెల్లెడ బిడ్డలు తల్లిచనుల
పాలు త్రావకయుండిన బ్రతుకు టరుదు
వింతయిది యౌనో కాదో తాఁబేటిపిల్ల
పాలు త్రావక యుండియు బలిమికలిగె.

(57) "మఱుకుగదా పంద రణము చూచినవేళన్."

క. కలకలితోడను యుద్ధం
బిరువాగున నడచుచుండ నేర్పడ మడియం

# శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)


సంపుటము ౨౫. { ధాతృనామసంవత్సరము. ఆశ్వయుజకార్తికమాసములు } సంచిక ౪.





కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచే బరి[illegible]యమునఁ

ప్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

ఆ 1936 సం. అక్టోబరు, నవంబరు మాసములు.

# విషయసూచిక.

---


1. సాహిత్యము-పాశ్చాత్యవిజ్ఞానసమన్వయము ౧౨౯-౧౪౦

    కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు.

2. చంద్రాపీడోత్కర్షైకశతకస్తవము ... ౧౪౧-౧౪౪

    వేంకటార్యకవి.

3. భాసనాటకములు ... ... ౧౪౫-౧౬౦

    కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

4. కర్ణధర్మరాజన్వృత్తము ... ... ౧౬౧-౧౭౦

    కీ. శే. తాడిహారి లక్ష్మీనరసింహారావుపంతులుగారు

5. గ్రంథస్వీకారము ... ... ౧౭౧ ౧౭౬

6. రఘునాథరామాయణము ... ... 33-40

    రఘునాథభూపాలుడు.

7. కవిజనోజ్జీవని-సమస్యలు ... ... 17-24

    కోటి రాయరఘునాథ భూపతి.


---

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

## కాకినాడ


రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౫. { ధాతృనామసంవత్సరము. ఆశ్వయుజకార్తికమాసములు. } సంచిక ౪.


# సాహిత్యము—పాశ్చాత్యవిజ్ఞానసమన్వయము.


— కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు, సాలూరు. —


నేఁడు పాశ్చాత్యవిజ్ఞానసమన్వయమును సాహిత్యవేదులకుఁ బరమ చరమకార్యముగఁ గన్పట్టుటచే నిప్పట్టునఁ గొంచె మాయభిప్రాయములను బరికింతము. ఆంగ్లమాత్రమే మనకుఁ బాశ్చాత్యవాదప్రమాణావసరప్రదర్శనాశక్తి యగుట నిక్కమగును. "Literature" అను పదము వాడుదురు. ఈపదము మన సాహిత్యపదమువంటిది కాదు. సాహిత్యశబ్దార్థసమగ్రత్వనిరూపక శక్యతావచ్ఛేదకశబ్దము సంప్రదాయబద్ధముగ నాంగ్లభాషలో లేదు. 'లిటరేచర్' పద మాంధ్రీకరింప "అక్షరిక మ"గును. అక్షరికరూపాపన్న వాక్యసముదాయము "లిటరేచర్" అనవచ్చును.

Literature consists of all the books where moral truth and human passion are touched with a certain largeness, sanity and attractiveness of form.

— Morley. —

"మార్లే" యనుపండితుని వాక్యముల తాత్పర్యము నరయుఁడు. మానవునినైతికానుభూతియును రసానుభూతియును సమగ్రముగ బోధించు నాకర్షకరూపమున నున్నగ్రంథముల సాముదాయికస్వరూపము, లిటరేచర్, అని యనెను. ఆర్నాల్డుపండితుఁడు Literature gives

nourishment to the sense of beauty and the sense of conduct, అనియు అజారియస్, అనువేత్త 'Literature is the expression of humanity" అని యనెను. ఇట్లనేకు లనేకవిధముల నేకతాత్పర్యపర్యాయములుగఁ బల్కిరి. కాని ప్రాచ్యుల సంగ్రహసద్భావము లేదు. మఱియును నానాశాస్త్రసమీకరణతాప్రాగల్భ్యము వారినిర్వచనములయం దుండదు. పాశ్చాత్యుల నిట్టియాధ్యాత్మికవిషయములలోఁ దడవిన లాభము లేదు. వారిరచనలయం దెప్పుడును దికమక లగు నిర్వచనము లుండును. Art is art, Art is the explanation of life, Literature is the expression of humanity, Drama is the representation of life. ఈ మొదలగు నిర్వచనము లానందముగ ననవగతముగ వినవచ్చును. దురహంకారబీజ మున్నచో దానిఁ బెంచి పెద్దచేయవచ్చును. మనుష్యానుభవప్రకాశకము గాని భాష యేది; తద్భాషాగ్రంథములును స్వానుభవమునే ప్రకటించును. అది నిర్వచనపద్ధతియా? వారిసంప్రదాయములోఁ "గవికి" సాహిత్య మక్కఱ లేదు. కవి విమర్శకుఁడు కాఁడు. కవి కవి. మనయాచార మట్టిది కాదు. "మల్లినాథకవి స్సోయ" మ్మని యుద్దండ విమర్శకుఁడు తాను గవి నని చెప్పుకొనెను. విమర్శకుఁడు గాకున్న వివేకి కాఁడు. వివేకి కాకున్నఁ గవియును గాఁడు. ఇఁకఁ గవికి సాహిత్యము విమర్శనాపాటవము ముఖ్యమే. కవి యెల్లవాఁడును గావలయును. నానావాఙ్మయస్వరూపమున కైక్యస్థానము సాహిత్య మెట్లో నానాజాతికులాదిభిన్నసంఘాంతఃకరణసూత్రాత్మస్వరూపుఁడు కవి యు నట్లే. నామరూపసృష్టిలో రూపకర్త బ్రహ్మ నామకర్త కవి యని మనయాచారము. కవిత్వ మీశ్వరాంశము మనకు. వారి'కింపల్సని'యో 'యిన్స్టింక్ట'ని యోనికీశ్వరాంశముగ నుండదు. కావున వారినిర్వచనములను యథాక్షరముగ గ్రహింపక తాత్పర్యమును మాత్రము గ్రహింపవలయును.

కావున సాహిత్యమునం దాసంఘజీవితవిధానరహస్య మున్న దనుటలో నేరికిని విప్రతిపత్తి గానరాదు. ఇఁక సాహిత్యము గ్రంథమాత్రమా వ్యక్తిగతము నగునా యనుసంశయముతో ననేకవాదము లుద్భా

తము లగును. కేవలశబ్దాశ్రయమై యున్నను దదర్థావగతికి వక్త్రపేక్ష ముఖ్యము. ఒక్క వైదికమునకుఁ దక్క నితరమున కెల్ల వక్త్రృబుద్ధి వైశిష్ట్యము లేకున్న శాబ్దబోధమే లేదు. కావుననే ధర్మశాస్త్రకర్తలు వాఙ్మూలము సర్వవ్యవహార మని నిర్వచించిరి.

శ్లో. తృణాని భూమి రుదకం వాక్చతుర్థీ చ సూనృతా
  ఏతా న్యపి సతాం గేహే నోచ్ఛిద్యంతే కదాచన- మనుః.
  వాచ్యర్థా నిహితా స్సర్వే వాఙ్మూలా వాగ్వినిస్సృతాః
  తస్మా ద్యః స్తేన యే ద్వాచం స సర్వ స్తేయకృ న్నరః

శ్లో. ఆచారహీనం న పునంతి వేదాః
  యద్య ప్యధీతా స్సహ షడ్భి రంగైః- "వసిష్ఠః.

ఇత్యాదులు శతాధికములు గలవు. సదాచారవంతు లయి సనాతనధర్మపరులయి యాస్తిక్యబుద్ధితోనున్నచో సాహిత్యతత్త్వమును గ్రహించియుపకరింపఁగలరు.ఆచారము,ధర్మము, నీతి, దయ, మున్నగుసుగుణములులేకున్న నేదియు లేనివాఁడే యగును. అక్కతన వక్తను బట్టి సాహిత్యమును సాహిత్యమును బట్టి వక్తయు నన్యోన్యపునీతభావంబునఁ బ్రకాశితసత్త గలిగి యొప్పును. కావుననే ప్రారంభమునుండియు నన్నివిషయములలో సంస్కారము సంస్కార మనుచుఁ బెద్దలు వాక్రుత్తురు.

సాహిత్యము సంస్కారవంతమై యున్ననే సాహిత్యము. సాహిత్యము సంస్కరించిననే సంస్కారము. సాహిత్యనిరపేక్షితసంస్కారము చితిసంస్కారమే. అట్టియిక్కట్టే నేఁడు సంభవించె నని తోఁచుచున్నది. సాహిత్య లోపముననే నేఁటిసంస్కారములన్నియు శిథిలములగుచున్నవి. ఆయాలోపములును శైథిల్యములును సూచింప నతివిస్తర మగుట వాఙ్మయమాత్రముగ నిందుఁ జూపింతును.

సంస్కృతము:—విద్యాపిధానము లోపభూయిష్ఠ మని పెద్దలందఱు నందురు. సర్వంకషప్రజ్ఞ యీవిధానమున లభింప దని యెఱుఁగుదురు. ఏల ? ఇంకను బోధకులు నిశితప్రజ్ఞు లుంట నాదం దీనైశిత్యము ప్రతిఫలించుచున్నది. ఏ మైనను "గురుప్రసాదము" తక్క వేఱొండు గ్రంథ ముపజ్ఞాలక్షితముగ బయలువెడలెనా ? ఏశాస్త్రమునం దైనను

స్వోపజ్ఞాశ్రయగ్రంథములు పుట్టెనా ? పరిశోధనము లున్నవా ? సందిగ్ధ సందిగ్ధచరిత్రములందుఁ ద్వక్ష నితరమునఁ గలదా ! స్వావ్యక్తిత్వస్థాపకసా హిత్య మేదీ ? పోనిండు.

ఆంధ్రము:— దీనిలోఁ గొన్ని సంస్కారములు సాహిత్యబద్ధములు నూత్నములు గలవు. కాని యనేకదుష్టసంస్కారము లిందు సంక్రమించి నవి. అఖిలభారతీయులు "హైందవు" లని పిలువఁబడుట తమలోఁ బిలు చుకొనుట గ్రహచారము కాదా ! ఆంధ్రము వేఱు- తెలుఁగు వేఱు. ఆం ధ్రులు ద్రావిడులు, అను నీమొదలగు వాదము లన్నియు నాంగ్లవాస నావాసితము లే. వేఱుప్రమాణము లేదు. ఆర్యులు ద్రావిడులు, నను నీ విభాగమునకు భారతీయవాఙ్మయంబున నాధారము గలదా ! కాల్డు వెల్లుదొరగారికిఁ బూర్వ మీవాద మున్నదా ! ఆంధ్రు లనుకొని యెఱుఁగుదురా ! భారతీయభాషాతత్త్వవేత్త లవిరా ? ఆంగ్లేయవాసన కాదా యిది ?

అక్షరములు:—న, స, ష, వ ప్రభృత్యక్షరములకు సంస్కారము కలిగెను. కాని నిలువ లేదు. కెం=కొ-చెన్నపట్టనమున సంస్కారము. క్+ఎ+ఉ- కొ యె ట్లగునో యాంధ్రు లెవ్వరు నెఱుంగరు. ద్రావిడు లెఱుఁగుదురుగాక. అరవవాసన. "ంక" దాపలసున్న ప్రాకృతవాసన. "క్ర" ( )- శేషాధోవర్ణరూపము. "బ్రానురకార"మని క్రొత్తగఁ బుట్టె ను. ఇప్పు డకారాది క్షకారాంతము సీసకవేషమున బెంగుళూరువారు సిద్ధపఱిచిరి. ఏమిసంస్కారము లు ? పాదరక్షార్థము కాలిద్రేళ్లు కోయిం చుకొనలేదా "కొండలు."

పదములు:—కృతకపదములు వేలు పుట్టుచున్నవి. ఈక్రొత్తపద ములు శక్తములుగావు. అశక్తంపద మ్మని శాస్త్రమునుసంస్కరింపవలయును.

ప్రప్రథమము:—ఆంధ్రగైర్వాణికము. అఖిలపూర్వగ్రంథముల నప్రయుక్తము. అయినను భాష్యపంక్తి 'సప్తద్వీపావసుంధరా' ప్రమాణీక రింపవచ్చును. వారియిష్టము, "నేరారోపణము, బానిసత్వము, సర్వులు, ప్రభృతిశబ్దములు "స్వాతంత్ర్య"భావనాధారములు. కాంగ్రెస్సువాసన, రాచకీయము, చట్టనిర్మాణము, మున్నగునవియు నట్టివే.

వాక్యరచన:—గ్రాంథికగ్రామ్యవివాదములు ప్రారంభింపఁ బడి నవి. వేంకటరావుగారు, పి. టి. శ్రీనివాసయ్యంగారు, మున్నగు నాంగ్ల వాసనావాసితు లుద్యమించిన విషయము. "పలికేటట్లే వ్రాయాలి" అనునది దీనికి మూలసూత్రము. ఈశాఖవారు ప్రబలప్రచారము సాగిం చుచుఁ బండితు లందఱును బ్రమాదము గావించి రనియు ను నిర్దోష మగుగ్రంథ మొక్కఁడే లే దనియును శీర్షవాదమును గావింతురు. అగునవి కొంద ఱాంగ్ల మెఱుంగని యచ్చుపుబండితులు వెనుకఁ దాళము వేయు చున్నారు. తాళములో నేదో, చిత్రగతి, యున్నది. ఈస్వాతంత్ర్య మాంగ్లవిషయమునఁ జూపిన తెన్ను యయ్యెడిది. కావింపుము "Indian nationhood was specially weak in one point" అను నాంగ్లవాక్యము Endeyan nashonhud vaz speshaly veek en von poyant" అని వ్రాయింతురా. ఆంగ్లము సనాథము దానిని సంస్కరించుచో నేదో "బ్యూటీ" యేదో, "ఇంట్రిన్‌సిక్ వాల్యూ" పోవు నఁట. ఆంధ్రమునం దందఱును జండశాసకులు. గ్రామ్యముగ నో వ్యావహారికముగనో వ్రాయువారైన నిర్దోషముగఁ బలికినయట్లు వ్రా యఁ గలుగుచున్నారా! కొంత నియతము కొంత తప్పులబొంత. "స్పష్టం గా తెలవాలి, మొదలుకుని, ప్రపాంచారు కూడనూ, చేయడ మెక్కి లి అవసరం" ఇత్యాదిపదములు కోటులకొలఁది వ్రాయుచున్నారు. పలి కినట్లు వ్రాఁత యీ వివేకింపుఁడు. వ్యావహారికవాదులలో నొక్కఁడేనిఁ బలికినట్లు వ్రాయఁగలుగువాఁడు లేఁడు. కుప్పలుగఁ దప్పు లున్నయవి. ఇంతయేల నిర్దోషముగ నాదర్శముగ వ్రాయుటయే కాని యెవ్వరికిని దత్పరమాదర్శమును జేరుటకు శక్తి లేదు. అహింస తమమత మందురు. పప్పులోఁ గాలు వేసి హింసింతురు. సత్యముకంటె మతము లే దందురు. సత్య మెఱుంగ నేరరు. మతము సున్న. నియమావళి, వ్యాఖ్యానవైదగ్ధి కే కాని పూర్ణముగఁ గార్యరూపమును బొందింపనేరరు. ఏవిషయము నం దెవ్వరు నియతులో వారే యకలుషచిత్తముతో నిరహంకారముగ నాలోచించు నెడల నీకీలు తేటపడును. "అజ్ఞానే నావృతం జ్ఞాన" మ్మని యు "మమ మాయా దురత్యయా" యని యున్నమాటల తాత్పర్యము

మూయూరచనము దురధిగమ మనియే కదా! ఈవ్యవహార మెల్లదియు నట్టిదే యగుట నెందో యొకత ప్పెంచి చిరకాలాభ్యస్త ప్రశస్తపాండిత్య ము గల విఖ్యాతపండితుల నెదిరించుట యుచితమా? "యాన్యస్మాకగ్ం సుచరితాని తా న్యుపాసితవ్యాని" అనియే ప్రత్యుత్తరము. గురుకులవా స మెఱుంగక భాషాపాండిత్యము లేక యభ్యాసక్రమపరిపాక స్థైర్యము లేక, సదసద్వివేచనాపాటవము లేక యన్యధర్మాద్యాలంబనామాత్రసంస్కా రపురస్కారముగ స్వధర్మదివ్యస్వరూప మరయ నేరని యలసులా సంస్కర్త లు? అహా! ఏమి దుర్గతి? శమించుఁగాక. సంప్రదాయదూర మగురచ నము లవలోకింపుఁడు.

రచయితలు వర్తమానకాలమున విఖ్యాతు లగువారే. వారిపద ఘటనారీతి నరసి తాదృశరచనామూలసంస్కారము నెఱుంగఁదగు.

(1) నాగరికులు స్వదేశభాష మాట్లాడలే రంటే యూరపులో నవ్వుతారు పిచ్చిమాటని. మన తెలుఁగువారిలో తగుమనుష్యులే సిగ్గుప డకుండా ఉఁటారు "మేము తెలుగుమాటాడ లేము. మాలో పండితుఁడైనా మాటాడ లేడు." అని.

(2) దేశభాషాభిమానులు రసికు లయినవారు తమ వేషదేశ భా షలం దభిమానముగలవారై వైకృతభాషలలో వ్రాసిన గ్రంథములను మెచ్చుకొంటూ రని తెనుగునకు గౌరవము సంపాదించినారు.

(3) సూదులవంటికనులు తెలియును.

(4) ఆక్రొత్తధన మామెకు స్పర్శదూర మతిగమించినది.

(5) వర్షమును రమ్మన్నట్లు చిన్నగాలి కాకులు కదలుచున్నవి.

(6) ఆకసమున బురదవలెవ్యాపించిన నల్లనిపెద్దమేఘము నుద్ధృ తి జూచి బండివాఁడు వర్షాశంకి శకటమును దూరాన నున్నశకటములు నిల్చు చావడికి గొంచుబోయి...బిగించికట్టి సేతుపతుల శకటసారథుల పసిపిల్లతో నెనిమిదేండ్ల బాలికతో ప్రసంగములోనికి దిగెను.

(7) దాని కనులలో చల్లని గాలి చొరబడి చిన్ని కన్నీటిబొట్లు దెచ్చెను.

(8) మీనాక్షి యాకదలిక యేకపీరకు తెలియకపోలేదు. ఆకదలిక కేకపీర చెప్పుకున్నయర్థము వేరు.

(9) కప్పుకొని లోనితనదేహము ముడుచుకున్నది.

(10) ఆమె మనసు లోతులలో సంగతమయ్యెను.

(11) ఆమె పెద్దయూపిరి తీసుకొన్నది.

(12) వానచేత రాజబాట యంతయు తడిసినది.

(13) చప్పరి వడగల్లు నోటనైనుకొని......

గద్యరచనమునందలి యీవాక్యములు చాలును. ఇట్లే కోటానుగోట్లు తికమకరచనలు గలవు. ఏల తికమకలో యెఱిఁగింతును. చిత్తగించి క్షమించిన క్షమింపుఁడు.

(1) ఈవాక్యరచనలో "నవ్వుతారు పిచ్చిమాటని" "సిగ్గుపడకుండా ఉంటారు" "మాలో పండితులైనా మాటాడ లేరు." అని, వికటముగఁ బుచ్ఛాభిముఖముగఁ బోవునాశ్వికునికౌశలమును స్మరింపఁజేయును. ఏమిశయ్య; ఆంధ్రీసుభగసుందరవపుస్సౌకుమార్యమున కెంతకష్టకర్మగతియో విజ్ఞులూహింపుఁడు. ఆంగ్లభాషాసంస్కారఫలము." They laugh that it is mad" అను నింగిలీషులోని "క్లాసు" సొంపు చూపించిరో. ఇట్టి"క్లాసుస్టైలు" నేఁడందఱును "ఆంగ్లభాషాసంస్కారసమ్మూఢులు" ధారాళముగ వాడుదురు. "విన్నాది చెప్పినమాట లన్నీ బలే ఖుషీతో వెంకమ్మ. దాని కున్నాది తన్నుమించిన సుందరులు లేరనే ఆత్మతృప్తి." ఇట్లస్తవ్యస్తము నపవ్యస్తము నప్రశస్తము నగుకృతి భీతి గొల్పదే? ఈ"క్లాసు"సెజ్జపైఁ దెలుఁగుపిల్లను బడఁబెట్టి

"బజ్జో"వే మాయమ్మ 'బజ్జోవె' నీవు,
బజ్జోవె యరవల పాపవు నీవు,
బజ్జోవె హాయిగా బడలికతీరా
బొజ్జనిండా కాఫి పోసుకొన్నావె
గజ్జలు మువ్వల్లు కడఁబెట్టినావె,
వజ్జగ పాలును మంటబెట్టేవె॥ జోజో॥

అని లిరిక్కులస్పిరిట్టులో "వకసాంగు" విసిరేస్తాము" ని యందురు. ఆంగ్ల భాషలోఁ బూర్వోక్తవాక్యరచన సొంపుగా వచ్చునేమో కాని యాంధ్రుల కట్టిరచన యనిష్టము నస్వాభావికము నగును. గద్యరచన వేఱు. పద్యరచన వేఱు. ఆంగ్లమునందును గద్యపద్యరచనములు భిన్నము లయ్యు నభిన్నత్వ మాకాంక్షించుచున్నారు. స్వాతంత్త్ర్యప్రియుల యతిచారము లట్టివి సంభవించుట భావదౌర్బల్యము. ఆచాపల్యము రాక్షసము. మనపురాణములలోఁ "దానే దేవుఁడ" నని మిఱిసిన ముష్కరరక్షోగణ మున్నట్లును మఱియు 'గ్రీకురోము' చరిత్రలలో నట్టివా రున్నట్లును నెఱుంగుదుము. కంటిరే యతిస్వాతంత్త్ర్యేచ్ఛాపరిణామతుచ్ఛాకారము; అట్టిదుష్పరిణతియే నేఁడు మనదేశమునకును సంభవించె నని సకలశాస్త్రసమన్వితసమాలోచనాపరుల నిశితబుద్ధికి సుస్పష్టముగ స్ఫురింపకపోదని విమలధైర్యమున నందును.

(2) "ఈవాక్యములలో దేశభాషాభిమానులు వైకృతభాషలలో వ్రాసినగ్రంథములను మెచ్చుకొంటూ రని తెనుఁగునకు గౌరవము సంపాదించేరు." అని తాత్పర్యము. కాని యీవాక్యములో దేశభాష వైకృతము, తెనుఁగు, భిన్నము లనియు వైకృతభాషలో వ్రాయుటవలనఁ దెనుఁగునకు గౌరవము వచ్చె ననియు నేదో భాషలో వ్రాయుటవలనఁ దెనుఁగునకు గౌరవము సంపాదించుట యెట్లో యనుసందేహమును దిక మకమాటలకూర్పును దోఁచును. "రాముఁ డడవులఁ దిరిగి దాశరథినామము కీర్తిమంతము గావలయు నని లక్ష్మణాగ్రజుఁడు ప్రయత్నించెను." అన్న ట్లున్నది. పర్యాయపదముల "గాభరా" య ట్లుల్లేఖింపఁజేసెనో; "దేశభాషాభిమానులు స్వభాషలో గ్రంథములను వ్రాసి గౌరవమును గూర్తురు." అని వ్రాయుటసొంపు. విషయము సంగ్రహముగ సుగ్రహమగును. "మెచ్చుకొంటూ రని తెనుఁగునకు గౌరవము సంపాదించేరు." "కాని మెచ్చుకొనలే ద"ను వ్యతిరేకార్థస్ఫూర్తి గలదు.

(3) సూదులఁ బోలుకన్ను లంద మనియో వెగటనియో వర్ణితములయ్యెను. అవకతవకలనవకల యని యిట్టివిషయముల నెఱుంగఁ బరిభాష వాడుకొందము.

(4) "స్ఫుర్మదూర మతిగమించెను" ముట్టుటకునేని వలను గా లేదను తాత్పర్యార్థమునకుఁ గలిగిన రూప మది. స్ఫుర్యదూర మైపో యెను. అనుటకు మాఱు గీర్వాణేంద్రాంధ్రపదవ్యనాళీలాసాతివేలకౌశల శలాకగా దూర మతిగమించె నని కూర్చిరి. అర్థప్రసన్నత సన్నగిల్లదా ! విజ్ఞులు వివేకింపుఁడు.

(5) వక్షముదు 'రస్త్రి రస్త్రి' అని పిలుచుచున్న ట్రాకులు కదు లుచున్నవి అనుతాత్పర్యమున కట్టిరచనమా సొంపు ?

(6) బురదబలె మేఘము వ్యాపించుటలో రమణీయమున్నన మనిమా కాక శాస్త్రరహస్యమా మఱి యాథార్థ్యమా యిమిడి యున్నది ? మేఘావరణకాల మెట్టిదో? పగలా, రాత్రియా ? గమ్య మానమా ? తెపాంశము నరయుఁడు. వచ్చాకి-కి, శకటమేమి ? శంకించి బండిని గొంపుఁబోవుట యేమి ? నిల్పుచాపడియా నిల్చుచాపడియా (Carts stand) అయి యుండునా ? సేతుపతుల శకటసారథులపిల్ల-పాతకుల కీపిల్ల దిక్కుమాలినపిల్లయే యగును. సేతుపతుల ... పదము చేఁదఃపొట్లమో యేదో యనిపించుకొనుటయే నేఁటిరచనాచిత్రము. 'పసిపిల్ల యెనిమిదేండ్ల బాలిక, ఒక్కతె యా యిద్దఱా! వయోగణన మేల? పసిపిల్లను జేయుటేల; 'శారదాబిల్లు తొందఱలోని యా వేశరచనమా ! ఆపసిపిల్లతోఁ బ్రసంగములోనికిఁ దిగెనఁట. ఎంతవింత, ఇఁక నెందలోనికి దింపునో ? ఏమో.

7. చిన్నికన్నీటి బొట్లు చల్లనిగాలి తెచ్చెనఁట. కాని చచ్చె నన లేదు. ఆతెచ్చుట యనువ్యాపారమును జేసినవా రెవరు ? గాలియే కదా ? కన్నులనుండి గాలి లేచి పోవుచున్నదా ? చచ్చె నని వర్ణించు టయే ప్రకృతమా ? "నేచురలు" (Natural) మచ్చా ? పరిశోధనా ప్రాగల్భ్యమా ! ఇది యేడవది సార్థవ్యంజక మగుచున్నది.

8. మీనాక్షియొక్క కదలిక. అచ్చాంధ్రపదీకరణసరణి, ఆకదలి క దైహికమా మానసికమా ! ఏపదము లుపయోగించిన నర్థవ్యక్తి యగునో యూహింపుఁడు. "చెప్పకున్న యర్థము" చెప్పకునేయర్థ మైన యెడల లెస్సగనుండెడిది. వ్యావహారికభాషాభూషణపదములును మాను

దురా? అపార్థప్రతీతి గలరచనములు శతసహస్రములుగఁ గలవు. సం
ప్రదాయజ్ఞుల కవగతము లయ్యుఁ దెలుపకయున్నారు. భాషాభివృద్ధిఁ గో
రువారు తెల్పవలసినదే.

9. కప్పుకొని "లోని తనదేహము" ముడుచుకొన్న దనిరి. పాఠ
కుల కేమిత్రోఁచునో యూహింపుఁడు. "లోని-తన" శబ్దములసంబంధము
"దేహ"శబ్దముతోఁ గూర్చియే యర్థమును బ్రసన్నము గావించిరో!

10. "మంసులోతులు"- క్రొత్తదారి, రసప్రవాహినీరమణీయకు
ల్య. ఆఙ్గ్లాంధ్రాదిభాషావైమష్యసంపాదనాబృహత్ఫలము.

11. పెద్దయూపిరి (నిట్టూర్పు) తీసుకొన్నది. సాధారణము నిట్టూ
ర్పులు విడుచుట సంభవ మగును. కాని "తీసుకొనుట" నవరచన మయి
యుండును. ఐకాగ్ర్యంబున నాలోచనానిమగ్నస్థితిలో నెవ్వరైనఁ గుం
భించి యవ్వల విడుచుట యనుభవగోచరమే. దీని నెట్లు సమర్థింతురో?

12. "రాజబాట"- వ్యావహారికశుద్ధికొఱకా?

13 "చప్పని వడగల్లు" రుచివర్ణన మెట్టిలాభమో. బాలుర
యాసక్తిని విస్ఫురింపఁజేయుటకా? స్వభావోక్తిని వర్ణించుటకా: తియ్యని
వడగల్లుగాదు సుఁడీ యని హెచ్చరించుటకా యీరుచివర్ణనము?

ఇట్టి వాక్యరచన యేమిహాయి యిచ్చునో నాకెఱుకలేదు. "పా
శ్చాత్యభాషాసంపర్కం వల్ల భావౌదార్యం వారికి వుండవచ్చు." అని
యనుకొను వారియహంకారమునకు మితిగలదా? భావౌదార్యమునకు
ను బాశ్చాత్యభాషాసంపర్కమునకును నేమిసంబంధము? వీరిదృష్టికిఁ గే
వలప్రాచ్యపండితులు భావదరిద్రులుగఁ గాఁబోలు గోచరింపఁబడుదురు.
ఆగోచరత్వ మాగోచారఫల మగును.

భావ మనునది యుండినఁ దదౌన్నత్యముఁ దదౌదార్యముఁ దదౌ
త్కృష్ట్యమును నింకను గల్యాణగుణగణపరంపర లెల్లఁ బ్రాచ్యవాఙ్మయ
సంస్కారఫలములై యుండును, గాని, పాశ్చాత్యవాఙ్ముఖంబున నేర్పఁదగిన
దిలేదు. వాడియు లేదని 'మాక్డొనలు' పండితుఁడే యంగీకరించెను. ఇఁ
క నీయావేశావిష్టుల యత్యుక్తులతో మనకుఁ బనియేమి? విస్పష్ట విని
వేదకప్రసాదగుణ మాంగ్లవ్యామోహితు లగువారికుండను, ఆఙ్గ్లవాస

నాఫలము. ఆంగ్లభాషోచ్చారణకు రమణీయత యథార్థశైథిల్యముగ నుం
డును. "Easterners are born philosophers" అనువాక్య
మెంత యస్పష్టముగఁ బలికిన నంతరమణీయత సుప్రకాశితమగును. అది
వారికి సొంపు. మనకుఁ గాదు. అస్పష్టతారమణీయోచ్చారణాపూర్వక
భాషాభ్యాసఫలంబుగ మనసాహిత్యమునందును ప్రత్యేకస్ఫూర్తికలవను లం
కురించుచున్నవి. ఆయంకురములపొంకమే నేటి భాషాకటిమ. కట్టా!

రచనావైషమ్యమును బ్రయోగనైపుణియును వీరి కలవడనికా
రణ మాదేశభాషలోఁ దగినంతసాహిత్యపరిచయంబు కొఱవడు
టయే యనఁదగును. తిక్కన్నగారి రచనారీతి ననుకరింపవలయు నని కోరి
'షెల్లీ షేక్స్పియరుల' యందు నాశ్రయింతురు. ఈసాంకర్యమే నేటి
నూత్నస్వరూపము.

నిష్ప్రయోజనముగ విశేషణముల నతికించుటయుఁ దేటతెనుఁ
గున వ్రాయుచు నొకచో గీర్వాణాడంబరమును జూపుటయుఁ దనుభ
యరీతి సమ్మేళనాలాలిత్య మెఱుంగకపోవుటయు నేటిరచనములయంద
లి విశిష్టలక్షణము. "వర్షాకాలగాఢ నీలావిలశర్వరీమధ్య వేళాగగనభా
గపరివ్యాప్తకాలమేఘగర్భభేదియైన సౌదామని మెరసి" అనువాక్యభా
గమును విలోకింపుఁడు. పూర్వమున సాధారణపదసంఘటన ముండియుం
డి మెఱయునప్పటికి సాంస్కృతికప్రభయు మెఱసెను. చల్లనిమాటలా
డుచుఁ గోపప్రలాపము గావించిన ట్లారీతి విచ్ఛేద మేలయ్యెనో? చిమ్మ
చీఁకటిలో మెఱసిన దని తెల్పుటకే యగుచోఁ గాలమేఘము మహాప్ర
శయము ను స్మరింప నేల? ఇంతకును జిరకాలవ్యవధాపిత స్మృతిసూచనా
వర్ణన మటఁ బ్రకృతము గదా దానిని బూర్వరీతి వర్ణింపనేల? గగనప్రదే
శము ను "పరి"త్యుపసర్గము ను నిష్ప్రయోజనములు. కాలమేఘము
భ్రమాస్పదము. రచనాతులితభంగి వికటము. ప్రారంభమునుండి యు
న ట్లుభయభాషాకైవల్యరచనము గావించినచో రచనాసామాన్యస్వరూ
పావగమనానంతరము భావనారథము క్షుణ్ణమార్గమునఁబడి పోవునట్లుండి
నిమ్నోన్నతప్రదేశగమనావయవిక్రమము లేక గమ్యస్థానమును జేరు
ను. అట్లుగాక యలఁతియలఁతిమాటలఁ దేటతేనియ నించు జాను తెలుఁ

గుపలుకుల పొందికలఁ గూర్తు మనుకొని నిరర్థకోపక్షీణశక్తికగీర్వాణశబ్దయోజనాసామర్థ్యమును జూపనేల? పోనిండు. వర్షాకాలము వర్ణింప మొదలిడి నాయికల నందఱ నాహ్వానించెను. కాని యుచితాలంబనము లేదు. స్వాధీనపతికలను బోలి మయూరములు పురి విప్పుకొన్నవఁట. ఏజాతివో? గగనలక్ష్మి యభిసారిక యయ్యెనఁట. లక్ష్మీశబ్ద మెందులకో? తికమకల కూర్పు లీనాఁటి వచనరచనలో విశేషముగ నున్నవి. ఇఁకఁ బద్యములు గేయములు నరసముగ మన్న మఱియు వింతగనున్నవి.

---

# చంద్రాష్టోత్తరైకశతకస్తవము.

సంస్కృతములో సూర్యశతకమువలె నిది చంద్రశతకము- చంద్రశతకములు తెలుఁగులోఁ గనఁబడవు. సూర్యశతకము లున్నవి. శతకములకుఁ దెలుఁగులోవలె సంస్కృతమున మకుటము నియమముగా నుండుటలేదు. శతకములు సాధారణముగా భక్త్యతిశయమున నిష్టదేవతలను గూర్చిన ప్రార్థనలును, స్తోత్రములును, గాక నీతిమాత్రవైరాగ్యబోధకములుగాఁ గూడఁ గలవు. తెలుఁగులో శతకములు, సంస్కృతములోఁ గావ్యములలోని సర్గములవలె నేకవృత్తముననే నడచును. కావ్యములలో నేకాని శతకాదిస్తోత్రములలో సంస్కృతమున నేకవృత్తనియమము తఱచు లేదు. భర్తృహరిత్రిశతిఁ జూడుఁడు. ఈచంద్రశతకమును నట్టిదిగానే యున్నది. ఇది స్తోత్రరూపముగా లేదు. చంద్రవర్ణనముతో నిండియున్నది. ఇది పరిషత్పుస్తకభాండాగారములోఁ గనఁబడినది. శతకము ౧౦౮ శ్లోకములు లేవు. ౬౦-౧౦౦ నడుమఁ గొన్నిశ్లోకములు లోపించినవి.

కవి యతిప్రాచీనుఁడు కాఁడేమో కాని వర్ణనములు ప్రాచీనకవిమార్గముననే యున్నవి. కవినామము శ్రీశైలము వేంకటార్యుఁడఁట:—

శ్రీశైలవంశకలశోదధిశీతభానో
రణ్ణార్యదీక్షితమణే స్తనయ స్తృతీయః
శ్రీవేఙ్కటార్యకవిరాడ్విబవాఖ్య మిన్దో
రష్టోత్తరైకశతకస్తవ మాదియానోః.

అని శతకముచివర నున్నది. వ్రాఁతతప్పులు గలవనుట కీశ్లోకములలోఁ గొంత యాధారము కనఁబడును. శతకస్తవ మని శ్లోకములో నున్నది. తెలుఁగుశతకములోని స్తవమువంటిది కాదు. వర్ణనలే స్తవములు. సంబోధనములు శతకములలోవలె అంబ, దేవి, దేవ, యిత్యాదులును లేవు. శతకమున నూఱుశ్లోకము లుండుటయే యిచట చూడవలసినది.

పరిషత్పుస్తకభాండాగారములో నిదియొక్కప్రతియే కలదు. సంపూర్ణప్రతి యెవ్వరియొద్దనైన నున్నచోఁ బంపఁగోరుచున్నాఁడను. కవి చరిత్రాదులు దెలిసినఁ దెలుపవేఁడుచున్నాఁడను. ఇది మఱియెచ్చటనైన నచ్చుపడినదేమో నేను దెలిసికొనలేను. అవియు నెఱిఁగినవారు తెలుపఁ బ్రార్థన. కొన్నికొన్నిశ్లోకములు దీనిలోఁ జేర్చుచున్నాఁడను. చిత్తగింపవలయును. తప్పులు సవరించి వ్రాసినవారికిఁ గృతజ్ఞుఁడను.

శ్రీమద్రమారమణపాదనఖాంశుకాశి
రిన్దుచ్ఛలాన్మ్యసరిదమ్భసి పర్యణాసీత్
తస్మిన్ ధృతే శిరసి శూలభృతాళికాగ్ని
ధూమాంకురోక్త ఇవ భాతి తదన్తరఙ్గః.

ఇనసఙ్గమనాదుదీర్ణగర్భా
దధతీ శైశిరపత్త్రపాణ్డిమానమ్
అమృతాంశుసుతం ప్రసూయ దృష్ట్యై
జగతా మంజన మాదధాదివైన్ద్రీ.

ఐన్ద్రీ వియజ్జలనిధే రుడుమౌక్తికాని
వ్యాకృష్య నావ మభిపూర్య చ ముద్రయన్తీ
ఉద్ధృత్య రశ్మిభి రిమాం ప్రకటీకరోతి
భూయః పురః సుమనసాం శశికైతవేన.

ఇనే పరాశావ్యసనేన యాతే
వృథా ద్వియోగాతపఘూననాయ
శితాతపత్రం తుహినాంశు దమ్భా
దైన్ద్రీ శనైరజ్జ్వనినీలశృఙ్గమ్.

అమ్బరసరిదమ్బుజమివ
చుమ్బిత మణుబమ్బరేణ వినివిశ్య
జనవశ్య కజ్జలోజ్జ్వల
శుక్తిరివ వ్యోమ్ని భాతి హరిణాఙ్కః.

అయుక్తైణప్రాణోన్మథన మిహ రాజ్ఞో ద్విజపతే
రయుక్తం మత్వా సత్త్వవిశదమివస్థాస్నుఘుపురః

ఇమం దోషం గర్హీకృత మసహమానైరివ జనైః
కళఙ్కే ప్రఖ్యాతే ప్రతిదిన మసావృశ్చతి కథాం.
గవాం పత్యా కృష్ట్వా గతవతి సఖోహాబ్జలతటీం
తమోవస్త్రైస్సిక్తాం భృశే మనయతా వాలబలినా
అమేధ్యాజామస్త్రే వ్యతికరవిరబీకేషు ఫలితే
ష్వసా విద్యారాతే స్వహేత ఇవ ముద్రాఙ్కిత ఇవ.
కరిదశనమయేన స్వ్రస్తనే నేష్టవామ్నా
గగనవన మునన్చ్రస్తారకాకోరకాన్యవి
ప్రవిశతి హి మనోభూ ర్లక్షితాన్త్రా తిసస్త్రః
కిరికుసుమశరౌఘాన్ వ్యాఘ్రకాన్తామనుఘ్నన్.
ఛత్రాపాత్ర ముదఞ్చ దమ్బర సదా మాలోక్య భూయఃసుధాం
శుష్యన్తీషు పురశ్చకోరతరుణీ ష్వన్త స్సమాదిత్సుషు
ప్రాచ్యైచ్చైకకరేణ చోడుకబళక్రేణ్యంతు విశ్రాణితాం
జగ్ధ్వా స్వాన్త గతాసు ముద్రిత మిదం చన్ద్రాత్మనావ్యోతతే.
కాలాత్మనా స్వభువి సూక్ష్మతయా ప్రకాశ్య
పశ్చాద్వితత్య నిజరూప మథో నిధాయ
పాతుం తమో బలి శిరస్యమహ్నాన్యతి ప్రా
క్తఙ్కాళనామ్ని కలశః కిమజస్య చన్ద్రః.
కిం పద్మినీ కృతపరిత్యజనా ద్వియోగ
వహ్నే రుదేష్యత ఇనాంతరుదీతధూమ,
అజ్ఞాత్మనా లుఠతి చన్ద్రిమసి స్వదేహే
స్ఫూర్త్తిశ్చ తత్ర విరహోద్ధిత పాణ్డిమేవ.
మనోజేన స్థిత్వోదయగిరి శిరస్యధ్వగవధూ
వధాయైవాకర్ణాంచలకృత గణేనోగ్రవిశిఖాన్
ప్రయుఞ్జానేనావర్తిత మివధనుః పౌష్పముదితం
విధోర్బిమ్బం తస్మిన్ స్వతను రపి దగ్ధ్యత ఇతి.

కర్షం కర్షం గతవతి నభస్స్వా మినే కర్షకే ద్రా
గన్తధ్వాన్తచ్ఛలకదళికాజాల మాసజ్య తస్మిన్
తారావ్యాజా దుదితవిమలస్మేరకర్పూరఖణ్డా
న్నైన్ద్రీరాశం శశధరమిషాత్తుర్వతీ కిం సమిద్ధే.
విష్ణోః పదం జగతి తావక మిత్యవేక్ష్య
పుష్పాంజలిః కిముకృతః పురతో మఘోనా
తత్రాన్తరాళ తులసీదళ మేవసార
సౌరభ్య జృమ్భిత మితీన్దుత లేజ్క మాహుః.
కృత్వాగ్రిమాచలకుచోపరికజ్కతేన
కృష్ట్వాద్య సన్తమస కున్తలజాల మైన్ద్రీ
సంగ్రథ్య చాథ పరతః స్ఫురదిన్దునామ్నా
తత్కజ్కతం ద్విరదద న్తమయం విధత్తే.

విజ్ఞుల కీశతక మిదివఱకుఁ దెలిసియేయుండును, గాని, నావంటి కొందఱకు దీనివిషయము తెలియకపోవచ్చును, వారికిఁ గొంత యానందము గల్గించు ననుతలంపుతోఁ బ్రకటించితిని.

క్రొ. సూర్యరావు.

# భాసనాటకములు.

కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ. బి. ఎల్. కాకినాడ.

---

ప్రతిమాభిషేకములు—

ఈ రెండు నాటకములు రామాయణేతివృత్తము ననుసరించునవి. ప్రతిమానాటకమునఁ గరుణారసము బాగుగఁ బోషింపఁబడినది. రాముని యందు ధర్మవీరరసము చిత్రింపఁబడినది. భరతుఁడు సీతాపహరణ మెఱుంగుటయు, రామునికి ఋషిస్త్రీముఖముల రాజ్యాభిషేక మెఱుఁగఁబడుటయు, భరతుఁడు ప్రతిమాగృహమునఁ దశరథప్రతిమను గాంచుటయు మూలకథయందు గన్పడవు. మఱియు శత్రుఘ్నలక్ష్మణు లభిషేకభాండం బులను దాల్ప దశరథుఁడు స్వయంబుగ ఛత్రంబును బట్ట మంథర యా తని చెవిలో నేదియో పల్కె ననియు, నంతఁ బట్టాభిషేక మాఁగె ననియు గలదు. ఇది రామాయణకథకు విరుద్ధము.

"శత్రుఘ్నలక్ష్మణగృహీతఘటేఽభిషేకే
ఛత్రే స్వయం నృపతినా రుదతా గృహీతే
సంభ్రాంతయా కిమపి మంథరయా చ కర్ణే
రాజ్ఞే శ్శనై రభిహితం చ న చాస్మి రాజా." ౧

సీతాపహరణమునకుఁ బూర్వము రామరావణులసంభాషణము (పంచమాంకము) మూలకథావిరోధమై యున్నది.

రామాయణకథ నిట్టిమార్పులతోఁ బ్రతిమాభిషేకములఁ గవి వర్ణించియున్నాఁడు. రామునియొక్క బాల్యము నేనాటకమునను వర్ణించి యుండలేదు. బాలచరిత మను నాటకమున రాముని బాల్యమును వర్ణించియుండు నని కొందఱ అభిప్రాయపడుచున్నారు. సాహిత్యదర్పణమున (6-85) బాలచరితములోని దని పరశురాముఁడు శ్రీరామునితోఁ బలికిన శ్లోక మీయఁబడినది. భాసుని దని చెప్పఁబడి యుండలేదు.

"ఉత్సాహాతిశయం వత్స తవ బాల్యంచ పశ్యతః
మమ హర్షవిషాదాభ్యా మాక్రాంతం యుగప న్మనః.

భాసుఁడు రెండు బాలచరితములను రచియించి యుండెనా ? ఇది విమర్శనీయము. కృష్ణచరితము మాత్రము మనకు లభించినది.

ప్రతిమానాటకమున రామునిరాజ్యాభిషేకసందర్భమున శ్రీరామ దశరథుల భావమును గవి చక్కగ వర్ణించియున్నాఁడు.

"సమం బాష్పేణ పతతా తస్యోపరి మమాప్యధః
పితుర్మే క్లేదితౌ పాదౌ మమాపి క్లేదితం శిరః. అంక-1-6

పట్టాభిషేకవిఘ్నము నెఱుఁగక సీత పరిహాసమునకై తనచెలి కత్తె లుంచిన నారచీరల ధరింపఁగోరుటయు 'హా! కింను ఖలు మమాపి తావ చ్ఛోభతే' అనుటయు భావికథను రమణీయముగ సూచించుచు న్నది. కంచుకి రామునితో నతనికి వనవాసము కైకేయిచే విధింపఁబడిన దని చెప్ప, నతఁడు కైకేయి యందుఁ గనఁబఱచిన గౌరవ మాతనియౌ దార్యమును వ్యక్తీకరించుచున్నది. సీతాలక్ష్మణభరతాదుల పాత్రములు రామాయణమునందువలెనే చక్కగఁ జిత్రింపఁబడినవి. సీతాలక్ష్మణులు భ రతు నరణ్యమునఁ జూడఁగనే రాముఁ డని భ్రమించి విస్మయావిష్టులై రను కథ యేల కల్పింపఁబడియెనో తెలియకున్నది. ఒకవేళ భరతుఁడు పుట్టినది మొదలు మాతులుని గృహమున నుండె నని కవి యభిప్రాయ మైయుండునా ? శ్రీరాముఁడు సీత నరణ్యమునకు రావల దని వారింప లక్ష్మణుని నియోగించును. అతఁడు రామునితో 'నోత్సహే శ్లాఘనీయే కాలే వారయితు మత్రభవతీమ్.

అనుచరతి శశాంకం రాహుదోషేపి తారా
పతతి చ వనవృక్షే యాతి భూమిం లతాచ
త్యజతి నచ కరేణుః పంకలగ్నం గజేంద్రం
వ్రజతు చరతు ధర్మం భర్తృనాథా హి నార్యః. 1-15

అని పల్కుటయు, సీత దన్ను నివారింప నామెతో లక్ష్మణుఁడు పల్కినవాక్యములును సరసములై యొప్పారుచున్నవి.

"గురోర్మే పాదశుశ్రూషాం త్వమేకా కర్తు మిచ్ఛసి
తవైవ దక్షిణః పాదో మమ సవ్యో భవిష్యతి. 1-17

దశరథుని మరణానంతరము భరతుఁ డయోధ్యానగరమునఁ బ్రవేశించును. ఇట రథవేగవర్ణనమును గనుఁడు-

ద్రుమా ధావంతీవ ద్రుతరథగతిక్షీణవిషయా
నదీవో ద్వృత్తాంబు ర్నిపతతి మహీ నేమివివరే
అరవ్యక్తి ర్నష్టా స్థితమివ జవా చ్చక్రవలయం
రజశ్చా శ్వోద్ధూతం పతతి పురతో నానుపతతి—ప్రతిమా. 3 2

కాళిదాసుఁడు శాకుంతలమున దీనినే విపులీకరించి
"అత్యోద్ధతై రపి రజోభి రలంఘనీయా
"ధావం త్యమీ మృగజవాక్షమయేవ రథ్యాః" అనియు 1-8.
"య దాలోకే సూక్ష్మం వ్రజతి సహసా త ద్విపులతాం
యదర్థే విచ్ఛిన్నం భవతి కృతసంధాన మివతత్
ప్రకృత్యా యద్వక్రం తదపి సమరేఖం నయనయోః
నమే దూరే కించిత్ క్షణ మపి నపార్శ్వే రథజవాత్"
అనియు రచించినాఁడు. 1-9

భరతుఁడు శ్రీరాముని రాజ్యమును మరలఁ గైకొనుమని ప్రార్థింప రాముఁడు రఘుకులసదృశముగఁ బలుకును.

"పితు ర్నియోగా దహ మాగతో వనం
న వత్స! దర్పా న్న భయా న్న విభ్రమాత్
కులంచ నః సత్యధనం బ్రవీమి తే
కథం భవాన్ నీచపథే ప్రవర్తతే. 4-10

సప్తమాంకమున సీతారాములు తమపూర్వవృత్తాంతమును స్మరించుట భవభూతి యుత్తరరామచరితమునఁ జిత్రనిరూపణాంకమునఁ గైకొనె నని మన మూహింపవలసి యున్నది.

రామః- మైథిలి! అపిజానాసి పూర్వాధ్యుషిత మస్మాకం జనస్థానమాసీత్ అప్యత్ర జ్ఞాయంతే పుత్రకృతకా వృక్షాః.

సీతా- (ఛాయా) జానామిజానామి! అవలోకిత పత్రకా ఉల్లోకయితవ్యా ఇదానీం సంవృత్తాః.

రామః- ఏవ మేతత్ । నిమ్నస్థలోత్పాదకో హి కాలః, మైథిలి- అప్యు

పలభ్యతే స్య సప్తపర్ణస్యధస్తా చ్ఛుక్లవాససం భరతం దృష్ట్వా పరిత్రస్తం మృగయూథ మాసీత్.

సీతా. ఆర్యపుత్ర దృఢం ఖలు స్మరామి.

రామః. అయంతు న స్తపస్తః సాక్షిభూతో మహాకచ్ఛః అత్రాస్మాభి రాస్నైనై స్తాతస్య నివపనక్రియాం చింతయద్భిః కాంచనపార్శ్వోనామ మృగో దృష్టః.

సీతా. హం ఆర్యపుత్ర మాఖలు మాఖ ల్వేవం భణితుమ్.

రామాభిషేకముతో సప్తమాంకము ముగియును అభిషేకనాటకమునఁ గిష్కింధకాండానంతరవృత్తాంతము రూపకముగ రచియించి, కవి సీతాపహరణాదికమును ప్రతిమానాటకమునఁ జిత్రించినాఁడు. సీతాపహరణము, జటాయువధయుఁ బ్రతిమానాటకమందే కలవు. అభిషేకమునఁ బ్రథమాంకమున వాలివధయు సుగ్రీవాభిషేకము ద్వితీయమున హనుమంతుఁడు లంకఁ బ్రవేశించి సీతతోడ భాషించుటయుఁ దృతీయమున నక్షకుమారాదుల నిర్జించుటయు రావణునికి హిత ముపదేశించుటయుఁ జతుర్థమున విభీషణశరణాగతియుఁ బంచమాంకమున నింద్రజిత్తువధయును, షష్ఠాంకమునరావణవధయును రామాభిషేకమును వర్ణితములు. ఈనాటకమునందును రామాయణము కొలఁదిమార్పులతో ననుసరింపఁబడినది.

'ఏకవేణీధరా దీనా' అను రామాయణమునందలి సీతావర్ణనము

"అసితభుజగకల్పాం ధారయంత్యేకవేణీం
కరపరిమితమధ్యా కాంతసంసక్తచిత్తా
అనశనకృశదేహా బాష్పసంసిక్తవక్త్రా
సరసిజవనమాలే వాతపే విప్రవిద్ధా. 2-8

అని మార్పఁబడినది. సీతావియోగపరిఖిన్నుఁ డగురామునివర్ణనము నట్టిదె.

"అనశనపరితప్తం పాండుసక్షామవక్త్రం
తవవరగుణచింతాపీతలావణ్యలీలమ్

వహతి విగతధైర్యం హీయమానం శరీరం
మనసిజశరదగ్ధం శాప్పవర్యాకులాక్షమ్.  2-31

'మానుషం పూర్వ మాస్థాయ', 'మానుషీం తను మాస్థితా' అనునవి వాల్మీకమునుండియే గ్రహింపఁబడినవి. రామాయణ నాటకములయందుఁ గవి యొక్కి స్వతంత్రతను జూపియుండ లేదని కొందఱు తమస్వతంత్ర నాటకచరితమున వ్రాసిరి. కాని వింటర్నిట్సుగారి యభిప్రాయ మిందులకు వ్యతిరేకము. రామాయణకథ ననుసరించి భాసమహాకవి పాత్రపోషణ మొనరించియుండుటచే నట్టిస్వతంత్రత కవకాశము లేదని చెప్పవలయు. ముఖ్యవిషయముల నితివృత్తము రామాయణము ననుసరించుచున్నది. ద్వితీయాంకమున సీతాహనుమంతుల సంభాషణమున హనుమంతుఁడు సీతను, దశభుజంబున నిడి రామునికడకుఁ గొనిపోవుదు ననుటయు, సీత వీరస్త్రీజనోచితం బగుసమాధాన మొసంగుటయు నిట వివరింపఁబడినవి. 'భద్ర! ఏతాం మేఽవస్థాం శ్రుత్వా దశరథపుత్రో యథాశోకపరవశో న భవతి, తథా మే వృత్తాంతం భణ' అను సీతావచన మామెపాత్రమునకు వన్నె పెట్టుచున్నది.

చతుర్థాంకాంతమునఁ గలసూర్యాస్తమయవర్ణనమును, గ్రంథాంతమునఁ గల శ్రీరామస్తుతియు భాసమహాకవియొక్క కవితానైపుణ్యమును విశదీకరించుచున్నవి.

"అస్తాద్రిమస్తకగతః ప్రతిసంహృతాంశుః
సంధ్యానురంజితవపుః ప్రతిభాతిసూర్యః
రక్తోజ్జ్వలాంశుకవృతే ద్విరదస్య కుంభే
జాంబూనదేన రచితః పులకో యథైవ  —(4. 23)

బ్రహ్మా తే హృదయం జగత్త్రయపతే! రుద్రశ్చ కోపస్తవ
నేత్రే చంద్రదివాకరౌ సురపతే! జిహ్వా చ తే భారతీ
సబ్రహ్మేంద్రమరుద్గణం త్రిభువనం సృష్టం త్వయైవ ప్రభో
సీతేయం జలసంభవాలయరతా విష్ణుర్భవాన్ గృహ్యతామ్
(6—31).

మగ్నేయం హి జలే వరాహవపుషా భూమిస్త్వయైవోద్ధృతా
విక్రాంతం భువనత్రయం సురపతే! పాదత్రయేణ త్వయా (6-31)

బాలచరితము:— ఈనాటకమున నయిదంకములు గలవు. కంస వధము వఱకుఁ గృష్ణునిబాల్యక్రీడలు వర్ణితములు. పురాణాములయందుఁ గృష్ణుఁ డష్టమగర్భజనితుఁ డని యుండ నిం దేడవవాఁ డని మార్పఁబడి నది. అందులకుఁ గారణ మూహ్యము. ప్రథమాంకమున నారదాగమన ము, వసుదేవుఁడు కృష్ణుని నందగోపుని కిచ్చుటయు, ద్వితీయమునఁ గం సుఁడు యశోదబాలికం జంప యత్నింప నామె కార్త్యాయని యై సపరి వారముగ నిష్క్రమించుటయుఁ గలదు. తృతీయాంకమునఁ గృష్ణునిబా ల్యక్రీడావర్ణనమును, నరిష్టర్షభహననమును, గోపికలతో హల్లీసకనృత్య మును, జతుర్థాంకమునఁ గాళియభంజనమును వర్ణింపఁబడినవి. పంచ మాంకమునఁ గంసవధయు, నారదస్తుతియుఁ గలదు. దూతవాక్యమునఁ గృష్ణునితోఁ జక్రాద్యాయుధములు సంభాషించు టెట్లు వర్ణింపఁబడినదో యట్లే బాలచరితమునందుఁ గార్త్యాయనియుఁ గుండోదర, శూలనీలమ నోజవాదులును, శాపాధిదేవతయుఁ బాత్రత్వమును బడసినవి. ఇట్టిపా త్రములు భాసనాటకములం దక్క మఱియెందును గానము. యోగ మాయయే కార్త్యాయని యనియుఁ గృష్ణబలదేవులు దామోదరసంక ర్షణు లనియుఁ జెప్పఁబడినది. నందగోపుఁడు తనమృతశిశువు నర్ధరాత్ర మున యమునానదీతటమునకుఁ దెచ్చుటయు, నట వసుదేవసూనుఁ డగు కృష్ణుని గైకొని తనగృహంబున కరుగుటయుఁ గృష్ణునిప్రభావమున నా మృతశిశువు జీవింప వసుదేవుఁ డామెను గైకొని దేవకి కిచ్చుటయు భా గవతాంతర్గతకథాభాగమునకు భిన్నముగ నున్నది. భాసమహాకవికి నంధ కారవర్ణన మనినఁ గడుం గడు నిష్టము.

అవిమారక చారుదత్తముల నంధకారము హృద్యముగ వర్ణింపఁ బడినది. (అవిమారక-అంక-3 ; చారుదత్తము-అంక-1) బాలచరితము నందుఁ గూడ నంధకారవర్ణనము గలదు.

“అహో బలవాం శ్చాయ మంధకారః. సంప్రతిహి.
లిమ్పతీవ తమోఙ్గాని వర్షతీ వాంజనం నభః

> అసత్పురుషసేవేవ దృష్టి ర్నిష్ఫలతాంగతా. (15)
>
> అహో తమసః ప్రభుత్వమ్.
>
> అప్రకాశా ఇవ దిశో గుహీకృతా ఇవ ద్రుమాః
>
> సునివిష్టస్య లోకస్య కృతో ఽహాపరిపర్యయః. (16)
>
> సంప్రతిహి మహిషశతసంఘాతసదృశే మహో బలవదంధకారమ్.
>
> దంష్ట్రివినికీర్ణజ్యోత్స్నా రాత్రి ర్వ్యక్తతే నిమీలితాకాశా
>
> సంప్రావృత ప్రసుప్తా నీలనివసనా యథా గోపీ. (19)

భాగవతమునందు వలె శ్రీకృష్ణుని శృంగారచేష్టలిందు వర్ణితములు గావు. అసభ్యములని కవి వానిని వదలి యుండునా? కవి నాటకపాత్రములయందు రాధను గూడఁ జేర్చియుండలేదు. భాసునికాలమునకే కృష్ణుఁడు నారాయణుని యవతారమని యంగీకరింపఁ బడినటుల దూతవాక్య, దూతఘటోత్కచ, బాలచరితములవలనఁ దెలియు ననియు, రామాదు లవతారపురుషులుగఁ బరిగణింపఁబడిన తరువాతనే యీనాటకము లుద్భవించిన వనియుఁ బాశ్చాత్యులు వ్రాయుచున్నారు. బాలచరితమునందలి కథ హరివంశ, విష్ణుపురాణ, భాగవతపురాణములఁ గల కథకు భిన్నముగ నున్నది.

చారుదత్తము— ఈనాటకమున వసంతసేన విటశకారులచే ననుగమ్యమాన యగుటయుఁ జారుదత్తుని యింట నాభరణముల దాఁచుటయు, సజ్జలకుఁడు వాని హరించుటయు మున్నగు మృచ్ఛకటికాంతర్గత కథాభాగములే వర్ణింపఁబడినవి. చారుదత్తమృచ్ఛకటికములయం దేది మాతృకయో యిదివఱలోఁ జర్చించి చారుదత్తమే మృచ్ఛకటికమునకు మూలమని నిర్ణయము చేయఁబడినది. అలంకారికులకు మృచ్ఛకటికమే గాక చారుదత్తముగూడఁ దెలియు ననియు, నభినవగుప్తాదు లుదాహరించిన దరిద్రచారుదత్త మిదియే యనియుఁ బ్రథమాంకమునందలి దారిద్ర్యవర్ణన మట్టినామమునకుఁ గారణ మనియుఁ జెలుపఁబడినది. చారుదత్తమసంపూర్ణము- దొరకినంతవఱకుఁ గథాభాగము మృచ్ఛకటికమునందలి మిగిలినయంకములవలెఁ గల్పనావైచిత్రి లేక స్వభావసిద్ధముగ నున్నది. శ్లోకములు విరళముగ నున్నవి. చారుదత్త మసంపూర్ణముగ నుం

డుటవలననో, చతుర్థాంకమునకీవలిగ్రంథభాగమునశించుటవలననో, శూద్రకుఁడు మృచ్ఛకటికమును రచింపవలసివచ్చెననియు, నది యెట్లున్నను మృచ్ఛకటికముకంటెఁ జారుదత్తము ప్రాచీన మనియు వింటర్నిట్జిగారి యభిప్రాయము.[1] విమర్శకులలోఁ బెక్కురొకటిగా మున్నగువా రూహించిన టులు చారుదత్తము మృచ్ఛకటికమునకు సంగ్రహము కాదు. నటకులచే సంగ్రహ మొనర్పఁబడిన నాటకభాగమును గాదు.

అవిమారకము:—ఈనాటకమునందలి యితివృత్త మెచటినుండి గైకొనఁబడినదో తెలియుటలే దనియుఁ గథావాఙ్మయమునుండి గ్రహించి కవి దీనిని రచియించియుండు ననియుఁ బాశ్చాత్యవిమర్శకు లూహించుచున్నారు. కథాసరిత్సాగరమునఁ గల (లంబ. 16. తరం. 2) కురంగి కథయే దీనికి మూల మని తోఁచుచున్నది. సుప్రతిష్ఠిత నగరాధిపతి యగు ప్రసేనజిత్తునకుఁ గురంగి యనుకొమరిత గల దనియు నామె తన్ను రక్షించిన యంత్యజుని వలచె ననియు, నామెను వివాహమాడ నుపాయంబు గానరాక నాతఁడు మరణోద్యోగి యై యుండ వైశ్వానరుఁడు ప్రసేనజిత్తునకు స్వప్నంబునఁ గాన్పించి యాతఁడు తనకొమరుఁ డని తెలుప, ప్రసేనజిత్తు కురంగి నాతని కొసంగి వివాహ మొనర్చె ననియుఁ గథాసరిత్సాగరమునందలి కథయై యున్నది. అవిమారకనాటకమునఁ గురంగి యవిమారకుని మేనమామ యగు కుంతిభోజుని కొమరిత. దీర్ఘతపసుని శాపముచేఁ బ్రచ్ఛన్నరూపమును దాల్చి యంత్యజుఁడై కుంతిభోజుని పురమున నివసించుచు నవిమారకుఁడు కురంగిని క్రుద్ధద్విపము బారినుండి రక్షించును. కురంగీయవిమారకుల ప్రేమానుబంధమును గుర్తెఱింగి, యామెచెలులు రహస్యముగ నవిమారకుని నామెతోఁ గూర్తురు. కొంతకాలము గతించినపిదప నవిమారకుఁడు కన్యాంతఃపురమున నివసింపరామి, నాత్మహత్య నొనర్ప నొకపర్వత మధిరోహించి, విద్యాధరుల ప్రభావముచే నొకయంగుళీయకమును బడసి, ప్రాణాధిక యగుకురంగితోఁ బునస్సమాగమము నొందును. కుంతిభోజుఁడును కురంగిని జయవర్మ కొసంగ నిచ్ఛగింప, నారదుఁ డరుదెంచి యవిమారకుని వృత్తాంతమును వారల కెఱింగించి, కురంగీయవిమారకుల వివాహమునకుఁదోడ్పడును.

1. Some Problems of Indian Literature P. 114.

మహాభారతమునందలి సుభద్రార్జునులవివాహమువలె నిందును మనుధర్మశాస్త్రవిరోధముగ మేనత్తకూతుతోడి వివాహము వర్ణింపఁబడుట, నట్టి శాస్త్ర మంగీకరింపఁబడని కాలమున నవిమారకనాటకము రచియింపఁబడి యుండవచ్చునని కొందఱు వ్రాయుచున్నారు. కాని యిది సరికాదు. కురంగీయవిమారకుల సమాగమము వివాహమునకుఁ బూర్వ మగుటయును, నాటకముయొక్క ప్రాచీనత్వమును సూచింపదు. తృతీయాంకమున నవిమారకుఁడు రజ్జుహస్తుఁడై చోరవేషమున నగరవీథులఁ గడచి కన్యాంతఃపురమును జేరుట రమణీయముగ వర్ణింపఁబడినది.

అవిమారకః.

నగరపరిచితోఽహం రక్షిణో జ్ఞాతసారా
స్తిమిరగహనభీమం వర్తతే చార్ధరాత్రమ్
అసి రపి సుసహాయో నిశ్చిత శ్చాంతరాత్మా
కిమిహ బహువిచారైః కో మయా దుష్కరోఽర్థః.

అద్యైవ ఖలు వర్తతే కాలరాత్రిః-
తిమిరమివ వహంతి మార్గనద్యః
పులిననిభాః ప్రతిభాంతి హర్మ్యమాలాః
తమసి దశదిశో నిమగ్నరూపాః
ప్లవతరణీయ ఇవాయ మంధకారః.

(పరిక్రమ్యా వలోక్య) హాహాహా అయ మపరః కః క్రుద్ధాం కాంతాం ప్రసాదయతి। మహాన్ ఖ ల్వస్యా యమపరాధః యేనేయ మస్యాం వేలాయా మపి నప్రసీదతి। అథవా ప్రసన్నా ఖ ల్వియం వ్యపదేశ మిచ్ఛతి, కుతః—

బాష్పోపరుద్ధజడగద్గదజిహ్వకంఠం
కాహం తవే త్యసకలం ప్రణయాత్ వదంతీ
సద్భావతః ప్రియవశం సముపాగతాపి
స్త్రీభావతః ప్రవదతి ప్రతికూల మేవ.

కోను ఖ ల్వయం పక్షీ భైరవస్వరః-ఆ-ఉలూకః ఖల్వియమ్ కథం హసిత మనేన। ఉలూకస్వరశ్రవణభీతయా కాంతయా పరిష్వక్తః ఖల్వయం తపస్వీ సదృశం వయసః కిం పరవ్యాపారవీక్షణమ్ । సాధయామ స్తావత్......అయే అయం తు తస్కరః-ఏషహి-

దృఢపరికరబంధహృష్టచిత్తః పరగృహవాదనివిష్టదృష్టిచేష్టః
ద్రుతగతిరపి దీపికావలోకే భవతిచ పాదనిపాతనాదభీరుః.

ఈవర్ణనమంతయుఁ గడుంగడు స్వాభావికమై కవియొక్క లోకజ్ఞానమును విశదీకరించుచున్నది. పంచమాంకమున నళినికావిదూషకులప్రసంగము హాస్యరసపోషకము.

(1) కన్యాపితు ర్హి సతతం బహుచింతనీయమ్.
(2) క స్తావ దౌషధ ముపలభ్య మందీభవ త్యాతురః.
(3) కః శక్నో త్యుచ్ఛిష్ట మకుర్వన్ భోక్తుమ్.
(4) నహి ఘృతవచనేన పిత్తం శామ్యతి—ఇత్యాదిలోకోక్తు లితర నాటకములందు వలెనే పెక్కులు గలవు. గ్రంథాంతమున-

గోబ్రాహ్మణానాం హిత మస్తు నిత్యం
సర్వప్రజానాం సుఖ మస్తు లోకే-అనుశ్లోకము
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు- అను మనయాశీర్వచనవాక్యము తో సమానార్థకముగా నున్నది.

ఇట్టి యపూర్వనాటకముల మన కొసఁగి కీర్తిశేషు లగుగణపతిశాస్త్రిగారు కృతకృత్యతనుగాంచిరి. ఈనాటకములు భాసుని వని పలువురు విశ్వసించుచున్నారు. అట్లు కా దని భావి విమర్శనములవలనఁ దేలినను, ఈనాటకముల రచించినకవి యసామాన్యప్రతిభాసంపన్నుఁ డనియు, సంస్కృతవాఙ్మయమున నవి యున్నతస్థానమును గాంచుననియు, సందులకైనను మనము గణపతిశాస్త్రిగారి నభినందింపవలసియుండు ననియు, వింటర్నిట్జిగారు తమ కలకత్తాయుపన్యాసమునఁ దెలిపియున్నారు. సంస్కృతవాఙ్మయాభిమాను లీనాటకములనుఁజదివి యానందింతురుగాక.

## 11. భాసుని చాటువులు.

సంస్కృతవాఙ్మయమునఁ జెక్కుచాటువులు సుభాషితావళి, శార్ఙ్గధరపద్ధతి, సదుక్తికర్ణామృతము మొదలగు గ్రంథముల సమకూర్పఁబడి యున్నవి. అందుఁ జేర్పఁబడిన శ్లోకకర్తల సందడు సూచించుటయుఁ గలదు. కాని వానిని సత్యములుగఁ గైకొని గ్రంథవిమర్శన మొనర్ప రాదు. భాసుని వని తెల్పఁబడిన శ్లోకముల నిటఁ జూపుదును. కొన్ని శ్లోకములయందు భాసునిశైలి గల దనుట విస్పష్టము.

(a) వల్లభదేవుని సుభాషితావళిలోని శ్లోకములు.

"బాలా చ సా విదితపంచశరప్రపంచా
తన్వీ చ సా స్తనభరోపచితాంగయష్టిః
లజ్జాం సముద్వహతి సా సురతావసానే
హా కాపి సా కి మివ కిం కథయామి తస్యాః. ౧౨౮౬

"దుఃఖార్తే మయి దుఃఖితా భవతి యా హృష్టే ప్రహృష్టా తథా
దీనే దైన్యముపైతి రోషపరుషే పథ్యం వచో భాషతే
కాలం వేత్తి కథాః కరోతి నిపుణా మత్సంస్తవే రజ్యతి
భార్యా మంత్రివరః సఖా పరిజనః సైకా బహుత్వం గతా. ౧౩౫౩

"కఠినహృదయే ముంచ క్రోధం సుఖప్రతిఘాతకం
లిఖతి దివసం యాతం యాతం యమః కిల మానిని
వయసి తరుణే నైత ద్యుక్తం చలేచ సమాగమే
భవతి కలహో యావ త్తావ ద్వరం సుభగే రతమ్. ౧౬౧౭

"కృతకకృతకై ర్మాయాసఖ్యైః త్వయా స్మృతి వంచితా
నిభృతనిభృతైః కార్యాలాపై ర్మయా ప్యుపలక్షితమ్
భవతు విదితం నేష్టా హం తే వృథా పరిఖిద్యసే
అహ మసహనా త్వం నిస్స్నేహః సమేన సమం గతమ్. ౧౬౨౮

ఇది శార్ఙ్గధరపద్ధతియందు (3560) గలదు.

"తీక్ష్ణం రవి స్తపతి నీచ ఇవాచిరాఢ్యః
శృంగం రురు స్త్యజతి మిత్రమి వాకృతజ్ఞః

తోయం ప్రసీదతి మునే రివ చిత్త మంతః
కామీ దరిద్ర ఇవ శోష ముపైతి పఙ్కః." ౧౮-౨౧

ఈశ్లోకము శార్‌ఙ్గధరపద్ధతియందును(3907)సదుక్తికర్ణామృతము (2-168-3) నందును గలదు.

"కపోలే మార్జారో పయ ఇతి కరాల్లేఢి శశిన
స్తరు చ్ఛిద్రప్రోతా న్బిసమితి కరీ సంకలయతి
రతాంతే తల్పస్థాన్ హరతి వనితా ప్యంశుక మితి
ప్రభామత్త శ్చంద్రో జగ దిద మహో విప్లవయతి. ౧౯-౧౪

ఇందు చక్రనిహ్నవము గల దనియు నీశ్లోకము భాసుని దైయుండు ననియు నిదివఱలో సూచించితిమి. ఇది శార్‌ఙ్గధరపద్ధతియందును(3340) గలదు. రాజశేఖరుని దని సదుక్తికర్ణామృతము దెలుపుచున్నది(1-77-2)

(b) శార్‌ఙ్గధరపద్ధతియందు 'కపోలే మార్జారః 'తీక్ష్ణం రవిస్తపతి' యను శ్లోకములే గాక మఱికొన్ని భాసుని వని యుదాహరింపఁబడినవి.

1. అస్యా లలాటే లిఖితా సఖీభిః విభావ్యతే చందనపత్త్రలేఖా
ఆపాండురక్షామకపోలభిత్తే రనఙ్గబాణవ్రణపట్టికేవ. (3292)
సుభాషితావళియం దీశ్లోక మెవరిదో తెలుపఁబడలేదు. (1487)

2. దయితాబాహుపాశస్య కృతోయ మపరో విధిః
జీవయ త్యర్పితః కంఠే మారయ త్యపవర్జితః. (3330)

ఈశ్లోకము సుభాషితావళియందు గలశకుని దనియు సదుక్తికర్ణామృతమునఁ గాశ్మీరశ్యామలుని దనియుఁ దెలుపఁబడినది.

(c) సదుక్తికర్ణామృతమున 'తీక్ష్ణం రవే స్తపతి' యనుశ్లోకముగాక మూఁడుశ్లోకములు భాసుని వని కలవు.

1. దగ్ధే మనోభవతరౌ బాలాకుచకుంభసంభృతై రమృతైః
త్రివళీకృతాలవాలా జాతా రోమావళీ వల్లీ. (2-77-3)

2. ప్రత్యాసన్నవివాహమంగళవిధౌ దేవార్చనవ్యస్తయా
దృష్ట్వాగ్రే పరిణేతు రేవ లిఖితాం గంగాధర స్యాకృతిం
ఉన్మాదస్మితరోషలజ్జితరసైః గౌర్యా కథంచి చ్చిరా
ద్వృద్ధస్త్రీవచనాత్ ప్రియేవినిహితఃపుష్పాంజలిః పాతువః.(1-23-2)

3. విరహివనితావక్త్రౌపమ్యం బిభర్తి నిశాపతిః
గలితవిభవ స్యాజ్ఞైవాద్య ద్యుతి ర్మసృణా రవేః
అభినవవధూరోషస్వాదుః కరీషతనూనపా
దసరలజనాశ్లేషక్రూర స్తుషారసమీరణః. (2-175-2)

(d) జల్హణుని సూక్తిముక్తావళియందు 'అహ్యాలలాటే...'అను శార్ఙ్గధరపద్ధతిలోని శ్లోకమును క్రిందిదియు భాసునివని తెలుపఁబడినవి.
"యదపి విబుధైః సింధో రంతః కథంచి దుపార్జితం
తదపి సకలం చారుస్త్రీణాం ముఖేషు విలోక్యతే
సురసుమనసః శ్వాసామోదే శశీచ కపోలయో
రమృత మధరే తిర్యగ్భూతే విషంచ విలోచనే.

ఇది భోజదేవుని దని వేఱొకప్రతియందుఁ గలదు. లక్ష్మీధరుని దని సదుక్తికర్ణామృతమువలనఁ దెలియుచున్నది.

(e) సోమదేవుని యశస్తిలకమున భాసునిదని యుదాహరింపఁబడినశ్లోకము.
"పేయా సురా ప్రియతమాముఖ మీక్షణీయం
గ్రాహ్యః స్వభావలలితో వికటశ్చ వేషః
యేనేద మీదృశ మదృశ్యత మోక్షవర్త్మ
దీర్ఘాయు రస్తు భగవాన్ స పినాకపాణిః.

మహేంద్రవిక్రమవర్మ రచిత మగు మత్తవిలాసమునఁ గలదు. ఈ విషయములను విమర్శనబుద్ధితోఁ జూచినయెడల సుభాషితావళి మున్నగు గ్రంథముల కెట్టిప్రాముఖ్యత నొసఁగవలయునో మన మూహింపవచ్చును. ఈశ్లోకము లెవ్వియును తిరువనంతపురనాటకములఁ గానరావు. అందుచే నవి భాసకృతములు కావని కొందఱు వాదించుచున్నారు. ఇది యసమంజసము. ఆలంకారికగ్రంథముల శ్లోకకర్తల నామములు సరిగఁ జేర్పఁబడియుండలేదు. సుభాషితావళియం దశ్వఘోషుని వని తెలుపఁబడినశ్లోకములు బుద్ధచరితమునఁ గాని యితరగ్రంథములఁ గాని కనఁబడుటలేదు. మఱియు నొకశ్లోకమే పలువుర కంటఁగట్టఁబడియున్నది. 'లింపతీవ తమోంగాని' యనుశ్లోకము విక్రమాదిత్యుని దని సుభా

షితావళిలోను, విక్రమాదిత్యమేంఠుల దని శార్ఙ్గధరపద్ధతియందును గలదు. దండి శూద్రకభాసుల దని మఱి కొందఱు వ్రాయుచున్నారు. బాలచరితమున నిది యుండుట మనకు విదితమే. భాసనాటకము లన్నియు మనకు దొరకి యుండలేదు. ఇంకను గల వని పండితులు వాదించుచున్నారు. చాటువుల నాధారముగఁ గొని భాసనాటకకర్తృత్వమును నిర్ణయింపరా దనియే నిశ్చితాంశము.

## 12. భాసునిదేశకాలములు.

విమర్శితాంశములవలన భాసుఁడు కాళిదాసున కొకటిరెండు శతాబ్దములయినను బూర్వుఁడై యుండవలయును. అశ్వఘోషున కర్వాచీనుఁడు. భామహదండివామనులకుఁ బూర్వుఁ డని వేఱ చెప్పనవసరము లేదు. భరతపాణినిపతంజలు లతనికిఁ బూర్వులు. క్రీ. పూ. 5,6 శతాబ్దముల భాసుఁ డుండె నను గణపతిశాస్త్రిగారివాద మతిశయోక్తి. శైలివలనను, గథావిధానాదులవలనను, బ్రాచీనుఁ డని యంగీకరింపవలసినదే. ఆశ్చర్యచూడామణి మత్తవిలాసాదుల కాలమున నీనాటకచక్రము రచియింపఁబడె ననుట సాహసము. ప్రాచ్యపాశ్చాత్యపండితులలోఁ బెక్కురు కాళిదాసుఁడు క్రీ. శ. 4 శతాబ్దమువాఁ డనియు, గుప్తరాజులకాలమున నుండె ననియు నిశ్చయించిరి. క్రీ. శ. మొదటిశతాబ్దము ప్రాంతమువాఁ డనువాదమును గలదు. కాళిదాసునికిఁ గొన్నిశతాబ్దము లయినను బూర్వుఁ డగుట భాసుఁడును క్రీ. శ. 1, 2 శతాబ్దములవాఁ డని నచో సత్యేతరము గా దని తోఁచుచున్నది. భాసుని ప్రాకృతభాషను విమర్శకదృష్టితోఁ బరిశీలించి లెస్నీ, సుక్తంకరు, ప్రింట్జి మొదలగువారీనాటకములఁ గల ప్రాకృత మశ్వఘోషుని కాలమునాఁటికిఁ జేరువగ నున్నదనిరి. దానినిబట్టి వూల్నరు, కీత్, మున్నగువారు భాసుఁ డశ్వఘోషునికిఁ దరువాతను గాళిదాసునికిఁబూర్వము నుండియుండు నని తలఁచిరి.

ప్రాచీనకవులవలెనే యాతనిదేశ మెద్దియో తెలియుటలేదు. దాక్షిణాత్యుఁ డనియు, ద్రమిళపంచకావ్యముల మణిమేఖలాశిలప్పధికారము లతనికిఁ దెలియు ననియుఁ గొందఱూహించుచున్నారు. శిలప్పధికారమున 'బాలచరితై నాటకంగళిల్' అనుచో భాసనాటకమే సూ

చింపఁబడిన దంసురు. ఇందలి యథార్థము భావివిమర్శనములఁ దేలవలసి యున్నది. భరతవాక్యములఁ బ్రశంసింపఁబడిన రాజసింహుఁ డెవ రని వి మర్శకులు చర్చించిరి. బార్నెట్టుగారు పాండ్యరాజకు ప్రథమరాజసింహు డనియు (675 A. D.) స్టెన్ కోనో (Sten Konow) గారు పశ్చిమ క్షత్రపుఁ డగు రుద్రసింహుఁ డనియు (200 A. D.) నిశ్చయించిరి. మఱి కొందఱు పల్లవు లగుసింహవిష్ణు (590 A. D.) నరసింహవర్మ (646 A. D) లలో నొకరని వ్రాసియున్నారు. జయస్వాలు, చౌదరి మున్నగు వారు రాజసింహుఁడే కణ్వవంశపునారాయణుఁ డనియు, నతని కాల ము క్రీ. శ. మొదటి శతాబ్ద మనియు, శుంగవంశపురాజ నిర్మూలనమే బాలచరితమునఁ జిత్రిత మనియుఁ దెలిపి యున్నారు. రాజసింహుఁ డను చో రాజశ్రేష్ఠుఁ డని యర్థము గాని యది యొకరిపేరు గా దని గణప తిశాస్త్రిగారి మతము. ఈవిషయము లన్నియు విమర్శనీయములు. అం దులకుఁ దగిన యాధారము లింకను మనకు లభింపలేదు.

భాసనాటకముల 'యవనికా' పదప్రయోగమువలనను, యవి మారకమున నగ్నశ్రమణుల ప్రసంశ యుండుటవలనను, విశ్రామశబ్దము నకు మాఱు విశ్రమ మనియే వాడఁబడుటవలను, ఆర్యపుత్ర యనుసం బోధన మశోకునిశాసనములందువలె రాజకుమారపరముగా నుపయో గింపఁబడుటచు, బౌద్ధజాతకకథలందువలె యక్షిణీశబ్దము క్షుద్రదేవతా పరముగ నుపయోగింపఁబడుటవలనను, భాసుఁడు ప్రాచీనుఁ డనియు, క్రీ. పూ. 2, 3 శతాబ్దములవాఁ డని ఘటకుగారు వ్రాసియున్నారు. ఇవి ప్రబలమైన యాధారములు గావు. భాసనాటకములఁ గలప్రతిమాగృ హనిర్మాణము, పాటలీపుత్రనాగవనవేణువనప్రశంసయుఁ గాలనిర్ణయము నకు సహకారులు కావు.

స్వప్నవాసవదత్తప్రతిజ్ఞాయౌగంధరాయణముల నుదయనప్రద్యో తదర్శకుల ప్రశంసయుండుటచే నవి క్రీస్తుపూర్వము 5 శతాబ్దమున కిటీ వల రచియింపఁబడినవి. నాటకములఁ గలప్రాకృతమునుబట్టియు మిగిలిన

విషయములనుబట్టియు లెస్నీ, వింటర్నిట్జి, స్టెన్ కోనో ప్రభృతులు క్రీ. శ. 2 మొదలు 4 శతాబ్దముల నీనాటకరచనము జరిగియుండవలయు నని నిశ్చయించిరి. క్రీ. పూ. 6 శతాబ్దివను గణపతిశాస్త్రిగారి వాదము ను విమర్శకు లందఱు నిరసించియున్నారు. బార్నెట్టుగా రీనాటకములు మత్తవిలాసప్రహసనమునకు సమకాలికము లని యూహించుటచే బాం డ్యరాజగు రాజసింహుఁడే భరతవాక్యమునఁ బేర్కొనఁబడిన రాజసిం హుఁ డనిరి. శ్రీ కుప్పుస్వామిశాస్త్రిగారు ఆశ్చర్యచూడామణి యభి షేకనాటకములఁ గలసామ్యములను, కేరళనాటకచక్రవాదమును ముఖ్య ముగ నాధారముగఁ గైకొని భాసశక్తిభద్రుల యైక్యతను స్థిరపఱుప యత్నించిరి సహృదయులు, ఆశ్చర్యచూడామణి మత్తవిలాసముల భాస నాటకములతోఁ బోల్చిన నీవాదములు నిలువనేర వని తెలిసికొనఁ గల రు. ఈనాటకచక్రమంతయు నిటీవల క్రీ. శ. 10 శతాబ్దమున రచింపఁబడి ప్రాచీనుఁడగు భాసుని కంటఁగట్టఁబడిన దను పండితరామావతార శర్మ గారి వాదమును గొందఱు విశ్వసించుచున్నారు. నాటకము లేక కర్తృ కము లగుటవలనను, స్వప్నప్రతిజ్ఞాదులు సుప్రసిద్ధాలంకారికులకుఁ దెలి యుటవలనను బలువు రివి భాసరచితములనియే యంగీకరించియున్నారు. ప్రస్తుతవిజ్ఞానమును బట్టి భాసునికాలము క్రీ. శ. 1, 2 శతాబ్దములై యుండు నని నిశ్చయించుటయే సమంజసము. మృచ్ఛకటికము చారుదత్త ముపై నాధారపడిన దని మన మంగీకరించినచో నదియుఁ బై కాలనిర్ణ యమునే బలపఱచుచున్నది.

# కర్ణధర్మరాజవృత్తము.

— శ్రీ. శే. తాపసారి లక్ష్మీనరసింహారావు పంతులుగారు —

---

శ్లో. అవృత్తి ర్భయ మంత్యానాం । మధ్యానాం మరణా ద్భయమ్
ఉత్తమానాం తు మర్త్యానా । మవమానా త్పరం భయమ్.

అని వ్యాసమహాభారతోద్యోగపర్వములో ముప్పదినాల్గవయధ్యాయములో నేఁబదిరెండవశ్లోకము గలదు. ఇది విదురుఁడు ధృతరాష్ట్రునితోఁ జెప్పినమాట. దీనికి నా తెలుఁగుపద్యము:—

క. చను వృత్తి యనుచు జడియుచు
మనుజాధముఁ డరయ జడియు మధ్యముఁడై సం
జను బ్రాణం బని మానము
చను నని యుత్తముఁడు జడియు జగతీనాథా.

ఇందలి కఠినపునియమమును బట్టి కుంతీపుత్రు లైనకర్ణధర్మరాజులిరువురలోను గర్ణుఁ డుత్తముఁ డని చెప్పఁదగును. ధర్మరా జధముఁ డని చెప్పవచ్చును. చూడుఁడు:—

శ్రీకృష్ణుఁడు హస్తినాపురములోని కౌరవసభకు రాయబారిగాఁ బోయి తాను జెప్పినసంధిమాటలు నిష్ప్రయోజనము లౌటయుఁ గౌరవుల వీడి పాండవులకడకు మరలఁ బోవుచోఁ దన మేనత్త యైనకుంతియింటికిఁ బోయి యయ్యమపాదముల కెఱఁగి,

గీ. నేనునున్మచులు గ్రహణీయములు స
హేతుకంబులు నౌచు నెంతేని యొప్ప
బలుకు లెన్నేని తెఱఁగులఁ బలికినార
మొల్లఁ డయ్యెను వాని సుయోధనుండు.

గీ. వానికిని వానిపక్షంబు నూనినడచు
నందఱకు నిండెఁ గాల మోయమ్మ యింక
నీదు సెలవును గైకొని నేను వేగఁ
బాండవులయొద్దకుం బోవువాఁడఁ దల్లి.

నీ వేమిచెప్పి తని నేను వారికిఁ జెప్పువాఁడఁ జెప్పుమా యని యడుగుటయు నయ్యమ యుధిష్ఠిరునితోఁ జెప్పవలయు మాట లిట్లు కృష్ణునితోఁ జెప్పెను:—

తనయా! ధరణీపాలనమున నయ్యెడు నీవుధర్మము సమస్తమును హీన మగుచున్నది. దానిని వృథాపుచ్చఁబోకుమా! అర్థ మెఱుఁగక వేదాధ్యయనము చేయు నయ్యపండితుని వల్లిచేఁ జెడిన బుద్ధివోలెను నీ బుద్ధి ధర్మమొక్కటియే చూచుచున్నది.

మ. అరయన్ ధర్మము ధాత మీకు నెటు లన్నా మున్ను సృష్టించె నో
సరగం గాంచుము క్రూరకర్మముల నిచ్చల్ సేసి సర్వప్రజం
బరిపాలింపఁగ బాహువీర్య మదియొప్పన్ జీవనోపాధిగా
గరిమం జేసి సృజించె క్షత్త్రియులఁ గోడ్గా బాహులందుండి తా.

ఏనీయర్థంబునఁ బెద్దలచే నొకయుపమ విన్నదాన నది చెప్పెద వినుము. మున్ను వైశ్రవణుఁడు ముచికుందుఁ డను రాజర్షి కీభువనం బెల్లఁ బ్రీతితో నిచ్చిన దానిం గైకొన కతండు బాహువీర్యార్జితంబై పరఁగు రాజ్య మొకండ యేలు గుడువంగ వలచెదఁ గాని యొండొల్ల ననవుడు వైశ్రవణుఁడు కరమ్ము ప్రీతుఁడై విస్మయంబందె. తరువాత భుజబలంబున ధర యెల్లం జయించి క్షత్త్రధర్మం బెంతయు నిరతిం జరపుచు ముచికుందరాజు ధన్యతతోఁ బరిపాలనంబు చేసెను.

గీ. క్షత్త్రధర్మంబు చేతను గయ్యమాడు
కొడుక పితరుల ముంపఁబోకు మహకీర్తి
బుణ్య మెల్లను గోల్పోయి పొందఁబోకుఁ
డీవుఁ దమ్ములుఁ బాపులు వొందుగతిని.

ఇట్లు చెప్పి విదులోపాఖ్యానం బను నొక తొల్లింటియితిహాసం బామూలాగ్రంబుగఁ జెప్పి యదియుఁగూడ ధర్మరాజునకు బోధింపు మని కుంతి కృష్ణుని నియోగించెను. అయ్యితిహాసంబు విదుల యను నొకమూర్ధాభిషిక్తురాలికిని సంజయుండను నయ్యమపుత్త్రునకును జరిగినసంవాదము. దానికంటెఁ బ్రశస్తంబైనదియు నెక్కుడైనదియు సంవాద మెందును లేదని యయ్యమయే చెప్పెను. అది వినియెనేని రాజవంశమునఁ

బుట్టిన యెల్లవాఁడును నీరము దాల్చి తోఁచేలు మేఁకపిల్లమీఁదఁ బడెను వడుపునఁ దనకైకిమీఁదఁ బడి ముక్తముక్తాలుగఁ జీల్చి రక్తము నని బుద్ధి పుట్టినవాఁడగుడు. అది వ్యాసమహాభారతంబులో 118 పద్యంబులు గల యుపాఖ్యానము. ఇంక్కటిలి ద్రౌపద్యమునకు క్షేత్రయుక్తముగను బల్లి కుంతికలుకు తెల్ల విని పరమహర్షంబు నొంది ఆపద్యాహము సమర్పించి యథావిధిగఁ బ్రదక్షిణించి భక్తినెఱపి సింహాసనగమనంబున యయ్యె మసదనంబునుండి కృష్ణుఁడు వెడలి యుపప్లావ్యంబునకుఁ బోయెను.

అట్లు కుంతీవచనంబునుండి వెడలునప్పుడు కృష్ణుఁడు తనవెంట నున్న భీష్మాదికురుపుంగవాళిని విడిచి కర్ణుని దనరథముమీఁద నెక్కించుకొని సాత్యకిసహితము పోయెను. హస్తినాపురము దాఁటిన పిమ్మట రథము నిలిపి కర్ణునితో నెంతయో నిపుణ మంత్రము చేసెను. అనంత్రములో మృదువులై ప్రియములై ధర్మయుక్తములై సత్యములై హితములై మనోహరములై తుదకుఁ దీక్ష్ణములునై యొప్పుచుండెడి పలుకులు కర్ణునితో నిట్లని రహస్యంబుగఁ బలికెను.

"తండ్రీ! బ్రహ్మపారగులైన బ్రాహ్మణులను భక్తితోడను నీతితోడ నుపాసించినవాఁడవు. ఈర్ష్యఁ దాల్పని మతిచే దత్త్వార్థ మెల్లఁ దెలిసికొన్నవాఁడవు. సనాతనవేదవాదముల నెఱింగినవాఁడవు. ధర్మశాస్త్రంబులం గల ధర్మసూత్రముల నెల్లఁ బరిపూర్ణంబుగ గ్రహించినవాఁడవు. అనఘా! కన్యయందుఁ బుట్టిన కానీనునకును సహోఢునకైన వానికిని నల్లకన్యనుఁ బెండ్లియాడినయాతఁడే తండ్రి యని శాస్త్రికులు చెప్పుదురు. నాయనా! నీవట్లు పుట్టినవాఁడవగుటచే ధర్మముచేతఁ బాండుపుత్రుఁడవైతివి. ధర్మశాస్త్రనియతిచే నీవే ధరణికిఁ దప్ప. రాజవగుదువు. కాన పాండులయొద్దకు రమ్ము. నీకుఁ దండ్రివంకను బాండవులున్నవారు. తల్లివంకను వృష్ణులున్నవారు. ఈయుభయులును నీవారే గాని లాంతివారు గావు సుమీ! ఇప్పుడే నాతోడ రమ్ము. యుధిష్ఠిరుని కంటె నీవు ముందుపుట్టినవాఁడ వనియుఁ గౌంతేయుఁడ వనియుఁ బాండవులెఱుఁగుదురు గాక. భ్రాతలైన వారేవురును ద్రౌపదీపుత్రులును నపరాజితుఁడైన సుభద్రాసుతుండును భక్తితో నీపాదములు పట్టువారు. పాండవపక్ష

మందుఁ జేరినరాజులును రాజపుత్త్రులును వృష్ణివరులును నంధకులును నీయెల్లవారును నీ రెండుపాదములు పట్టికొనువారు. హిరణ్మయామ్యద కుంభరాజియు నౌషధ్యబీజరత్నవీరుధములును దండ్రీ నీయభిషేచనము కొఱకు రాజన్యులును రాచకన్నియలును మోఁచికొని రాఁగలవారు; మఱియుఁబట్టపురాణియైనద్రౌపదీదేవి దయితయై నిన్ను నాఱవయవసరమునఁగలయఁగలదు. బ్రాహ్మణోగ్రుం డైనధౌమ్యుం డాజ్యాహుతిఁ జేయువాఁడు. నాలుగువేదములును జదివినభూసురేంద్రులు నీకభిషేచనము సేయువారు. మఱియు బ్రహ్మకర్మస్థితుం డైనపాండవపురోహితుండును బూనుమసింహులైన యేవురుపాండవులును ద్రౌపదిపుత్త్రు లేవురును బాంచాలురును జైద్యులును నేనును నిన్నుఁ బృథ్వీపతిగా మిక్కిలి నైపుణ్యముతోఁడఁ బ్రేమపూర్వకముగా నభిషేకించెదము. అనఘా! శంశితవ్రతుఁడైన ధర్మరాజు నీయనుమతిని రాజ్యమేలుచు నిన్నుఁగొలువ నిమ్మా! శ్వేతచామరము చేతఁ బట్టి భక్తితో నీవెనుకను నీరథముమీఁద వానిని నిలువ నిమ్మా! నీవభిషిక్తుఁడవైన పిదప స్వచ్ఛమైన ఛత్త్రంబు నీశిరముమీఁదఁ బట్టుచు నాగాయుతబలుం డైన యమ్మహాబలనందనుని భీమసేనుని నిలువ నిమ్మా! వెలిమావులఁ గట్టిన యడియఁ బ్రక్కలను బులితోలు గప్పఁ బొలిచెడునదియు గలగలలాడు గజ్జెలు గలదియు నగునీరథమును సురేంద్రపుత్త్రుఁ డైనయర్జును నడపనిమ్మా తండ్రీ! జనని గర్భములో నున్నసమయమందే యస్త్రవిద్యసమస్తంబు నభ్యసించి తండ్రిని మఱపించు నల్లసుభద్రాకుమారు నీసన్నిధిని నిత్యంబు నిలువనిమ్మా! నకులసహదేవులు నుపపాండవులును మఱియు నెల్లపాంచాలురును మహారథుండై వెలుఁగొందు శిఖండియు నీవెనుక నడచుచుండువారు సుమీ! మఱియు నేనుగూడ నీవెనుక నడచువాఁడను. సర్వవృష్ణ్యంధకసహితముగ దశార్ణులును దాశార్హులును నీపరివారమందుఁ జేరుదురుసుమీ!

గీ. జపములును హోమములు లెస్స సలిపికొనుచు
సలిపికొనుచును వివిధమంగళము లెల్ల
భ్రాతృగణమైన పాండవరాజితోడ
ననుభవింపుము సర్వరాజ్యంబు కర్ణ.

గీ. గౌరవంబార సూతమాగధులు బహువి
ధముల స్తుతిసేయువారు గాక తగఁగ నిన్ను
నవని వసుషేణునకు విజయుం బటంచుఁ
బాండవులఁ జేయఁగా నిన్ను బ్రకటనమ్ము.

గీ. తారకాపరివృతుఁ డైన తారకాధి
పతియుఁ బోలెను బాండవపరివృతుండ
వగుచు నేలుమా నీవ రాజ్యంబు గొంతి
సంతసింపఁగఁ జేయుమా కొంతికొడుక.

గీ. అన్న నీమిత్రులఁ బ్రహర్షమందనిమ్ము
వ్యథము పొందఁగనిమ్ము నీవైరిగణము
నాయనా భ్రాతలైన పాండవులతోడ
భ్రాతృభావంబు నెఱపుమా పరఁగ నేఁడ.

కర్ణుఁడు కుంతీపుత్రుఁ డగుట రహస్యముగఁ దెలియఁజెప్పి వానిని బాండవపక్షమునకు రమ్మని యివ్విధంబున శ్రీకృష్ణుండు మృదువులును బ్రియములును ధర్మయుక్తములును సత్యములును హితములును హృదయమున కింపులును నైయొప్పుచుండెడు మధురవాక్యంబులతోఁ బ్రోత్సాహముచేయుటయుఁ దానుఁ బాండవపక్షముఁ జేరుటకుఁ గల ప్రతిబంధకములను సహేతుకముగఁ జెప్పి తనరహస్యము వెల్లడిచేయువల దని కర్ణుఁడు కృష్ణు నిట్లు వేఁడికొనెను.

మహానుభావా! నిశ్చయంబుగ నాపై సౌహృదమునను బ్రణయంబునను సఖ్యమునను నాశ్రేయస్సును గోరియే చెప్పినవాఁడవు. నీచెప్పినట్లు ధర్మముచేతను శాస్త్రవిధానముచేతను బాండుపుత్రుఁడ నని యెఱుంగుదును. సూర్యునివలన నన్ను గర్భముదాల్చి జాతుండ నైన యంతన యాతనివల్లనే నాకు ముప్పగునట్టి విధమున నన్నుఁ గుంతి విడిచెను. అధిరథుఁడను సూతుఁడు దైవవశంబున నన్నుఁ జూచి తన గృహమునకుఁ గొంపోయి మిక్కిలి ప్రేమముతోఁ దనభార్యయైన రాధ కప్పగించెను. నామీఁది ప్రేమచే నప్పు డయ్యమ కద్భుతంబుగఁ బాలుద్భవించెను. నామూత్రపురీషంబులు తనమేన నింక నయ్యమయ తాల్చె

ను. ధర్మవిదుఁడును ధర్మశాస్త్రశ్రవణరతుఁడును నగుచుండువాఁడైన మన బోఁటివాఁడల్లకాంతపిండంబు పడఁగొట్టఁగడఁగనగునే? రాధయోతానే సూతకులజాతుఁడైన యధిరథుఁడును నన్ను నందనుఁడుగఁ బ్రేమతోఁ జూచుచున్నాఁడు. నేనుంగూడ వానిని దండ్రిగఁ జూచుచున్నవాఁడ. శాస్త్రవిధానముచే జాతకర్మాది సంజాత మెల్లఁ బుత్రప్రీతిచే నాతఁడే నాకుఁ జేయించినవాఁడు. ద్విజులచేత నాకు సుషేణుఁడని పేరు పెట్టించినవాఁడు. ఆతఁడు చెప్పినట్టి కన్యలన యౌవనవేళ నేను బెండ్లియాడినవాఁడను. ఆసతులయందుఁ బుత్రపౌత్రులను గూడఁ గన్నవాఁడను. నా మనస్సును నాకామబంధనమ్ములును వారిమీఁదన లగ్నంబు లయ్యెను. మహానుభావా సకలభూమండలము నాకు దొరకినను స్వర్ణరాసులుదొరకినను హర్షముచేతఁగాని భయముచేతఁగాని నే నల్లబంధనములు ద్రెంపనుత్సహింపఁజాలను.

ధృతరాష్ట్రవంశంబునందు దుర్యోధనుసమాశ్రయంబుచేత రాజ్యంబు పదుమూఁడుసంవత్సరము లకంటకమ్ముగ నాకుఁ గుడువంగఁ గలుగనయ్యెను. సూతజాతిపురుషులతోడన కలసి యనేక యజ్ఞములు చేసితిని. వారితోడన కలసి యావాహవివాహములు సలిపినవాఁడను. నన్ను నమ్మి సుయోధనుఁడు పాండవులతోడ వైరమ్ము పెట్టికొని నిర్భీతిగా యుద్ధప్రయత్నము లాచరించెను. ఈకారణంబుచేఁ జనుమా బీభత్సుతోడ ద్వైరథంబున నెదిరి పోరుటకు నన్నుఁ బరమశాత్రవుఁడుగా దుర్యోధనుఁడు కోరికొనియెను.

చ. అనయము చావువచ్చు ననునట్టి భయంబునఁ గాని బాంధవం
  బనుమిషచేతఁ గాని యని నా నజయం బనుభీతిఁ గాని నా
  కనువుగ రాజ్య మబ్బు నను నాసనుగాని జనార్దనా సుయో
  ధనునెడ బుద్ధిమంతు నెడఁ దప్పఁగ సత్యము నుత్సహింపఁజా.

అన్యోన్యవధ మాచరించుటకు మే ముభయులమును బ్రతిజ్ఞచేసియుంటిమి గావున నే నిప్పుడు బీభత్సునితో ద్వైరథంబు చేయనైతినయేని యోాయమేయబుద్ధీ యాతనికిని నాకును నిద్దఱకును దగని యపకీర్తి వచ్చును. నామేలు కొఱకే చెప్పితి వీమాట లసంశయమ్ము. పార్థులు

దామును నిట్లు చేయఁగలవారు. ఇది తథ్యము. అయినను నేను గుంతీ
సుతుండ ననునీవిధమైన సంభాషణము మనలోనే యునుపుము. యుధి
ష్ఠిరునకుఁ దెలియనీయకుము. ఏమిటికంటే నేను గొంతికి జ్యేష్ఠపుత్రుఁడ
నని తానెఱిఁగెనేని జితేంద్రియుండును మహాధర్మాత్ముండును నగునాతఁడు
రాజ్యమును గ్రహింపఁడు. ఈమహారాజ్యము నాకీ విచ్చితివేని యేను
దుర్యోధనునకే దాని నిచ్చువాఁడను. అట్లుగాకుండ ధర్మాత్ముఁడైన ధర్మరా
జును రాజుఁ గానిమ్ము!

గీ. ఎవని నేత హృషీకేశుఁ డెవనియోద్ధ
లలఘుభుజులైన భీమార్జునులును గవలు
ద్రౌపదేయులు నైరి యాధర్మరాజ
యీపృథివియెల్లఁ దగినవాఁ డేలుటకును.

దృష్టద్యుమ్నాదిమహారథు లెల్లరును సన్నిటికిం గూడఁ బెన్నిధి
యైన నీవును నీమహాక్షత్రసముదాయ మెల్లను ధర్మరాజువంకఁ గూడితిరి.
భ్రాజితంబైనరాజ్యంబు వానిదే యగును. జగతిలో దుర్యోధనుఁడు
శస్త్రయజ్ఞం బొకండు సేయఁగలవాఁడు. అల్ల యజ్ఞమునం దమరవం
ద్యుఁడవైన నీ వుపద్రష్ట వగుదువు. అందు మహాధ్వర్యంబుగూడ నీదియే
సుమా! సాత్యకి ద్వితీయాధ్వర్యుఁడై నీపంపు సేయువాఁడు. తగుదు నని
దుర్యోధనుఁడు దీక్షితుఁ డగును. వానిసేనయే వానిభార్య. రాత్రికం
బగు యజ్ఞకర్మంబు ప్రారంభ మైనపుడు ఘటోత్కచుండు శామిత్రంబుచే
యువాఁడు. దృష్టద్యుమ్నుఁడు దక్షిణ యగును.

గీ. పార్థునను ధార్తరాష్ట్రప్రియార్థ మేను
మాధవా యంటి ననరానిమాట లకట
అల యకార్యకరణమున నాత్మలోనఁ
బరితపించుచు నున్నాఁడ బహువిధముల.

క్రీడిచేత నన్ను హతుఁడైనవాఁడుగ నెపుడు గందువో యపుడు
యజ్ఞానంతరము జరుగవలయు చయనారంభ మగును. దుశ్శాసనుఁడు
ఘోరమైన బొబ్బపెట్టుచుండఁగ వానిరుధిరము భీమునిచే నెపుడు గ్రోలఁ
బడునో యపుడు సోమపాన మగును. భీష్మద్రోణులను శిఖండి ధృష్ట

ద్యుమ్నులు కూల్చునప్పుడు యజ్ఞావసానమగును. మహాబలుండైన భీమసేనుఁడు దుర్యోధనుని జంపునపుడు యజ్ఞము సమాప్తియగును.

మ. ప్రణుతయశోవిశాల ధృతరాష్ట్రసుస్నుషల్ మఱి వాని ప్రస్నుషల్
ఘనులగు భర్తలున్ సుతులుఁ గాలునిప్రోలికిఁ బో ననాథలై
యనయము శ్వానగృధ్రకురరాకులమౌ క్షితి నేడ్వ రాణితోఁ
దనరుపువోయి యయ్యవభృథం బగుఁజుమ్మి జనార్దనాతగన్.

గీ. విద్దెచేతను వయసుచేఁ బెద్దలైన
రాచవారల నెల్ల నోరాజసింహ
వ్యర్థ మగు చావు చావనీయకుమ యిండ్ల
ననఘ నీమూలముఁనఁ జేసి యక్కటకట.

గీ. నిండయి వెలుంగు నీక్షత్రమండలంబు
భువనముల మూఁటిలో గూడఁ బుణ్యమైన
యాకురుక్షేత్రమందు మహాయుధముల
మొత్తికొని చావఁగానిమ్ము మోక్షదాయి.

మ. అనఘా యెయ్యది చేయఁగావలతు వీ వద్దాని నాక్షేత్రమం
దనయం బారఁగ నయ్య చేయఁగదె యన్నా దాన భూమండలం
బునయందుం గల యెల్లక్షత్రియగణంబుం గూడ సంఘంబుగాఁ
దనరన్ స్వర్గసుఖంబులం గన సమర్థంబౌను దామోదరా.

క. పేళ్ళుం గొండలుఁ దగనె
న్నాళ్ళుండును జగతిలో జనార్దన తౌన
న్నాళ్ళును మన మీమేల్పడ
వళ్ళవలనికీర్తి యెల్లఁ బరఁగఁగ నుండున్.

ఈమహాభారతాహవంబెల్లఁ గృష్ణా భూమిమీఁద బ్రాహ్మణులు వర్ణనము చేయుదురుగాక! ఆహవముల నుపార్జించునట్టి యశము క్షత్రియులకు ధనంబై జరగుచుండును. మనయీసంభాషణము రహస్యముగ దాఁచి యుద్ధముఁ జేయుట కయ్యర్జును నాయెదుటకుఁ దెమ్మా!

అని యిట్లు స్వార్థపరిత్యాగము సేయుచుఁ బాండవులయెడ స్నేహము సూపుచు యశఃకామియై యకాముఁడై కర్ణుఁడు పలికినదంతయు విని శ్రీకృష్ణుండు చిఱునవ్వు నవ్వుచు భీకరంబుగ నిట్లనియెను. నీకు రాజ్యప్రాప్తికిఁ గా నుపాయంబు నేను సంతోషముతోఁ జెప్పిన నీతల కెక్కదయ్యెను. కర్ణా! రాజ్యము సర్వము నేనే నీకీయఁగఁ దానిని నీవొల్లవో? ఇఁకను బాండవులకు జయ మగును. ఇందించుకయు సందియంబు లేదు. అర్జునుని వానరభ్రాజితంబైన జయధ్వజం బిప్పుడే యెత్తఁబడియెను.

చ. తనరఁగ విశ్వకర్మ యలదానను నిల్పినవాఁడు మాయ దా
న నది ప్రకాశమానమయి నాకపతిధ్వజమట్లె నిల్చుఁ దా
ననిశము దానిమీఁదను భయానకవామ జయావహంబులై
చనియెడు దివ్యభూతములు చాలఁగ నున్నవి ధర్మనీయముల్.

మ. తనరన్ నిల్వను నడ్డ మా ధ్వజము రాధాపుత్ర తానేకయో
జనమా రూపముదాల్చి యగ్నిశిఖలన్ సర్వాశలం దా నిరో
ధనముం జేయుచు శైలవృక్షములచేతన్ బొందకే యడ్డమున్
ఘనసౌభాగ్యము దాల్చినట్టి యదియై కర్ణా వెలుం గొందుఁజూ.

మ. అని శుభ్రాశ్వముఁ గృష్ణసారథికమౌ నా తేరిపైనుండి ఫ
ల్గునుఁ డైంద్రంబును నాగ్నిమారుతములం గొట్టంగఁ గం దెప్డుపి
డ్గును బోల్గాండివనాద మెప్డు విను దప్డున్ శూన్యమే యౌఁ జుమీ
వినుతం బైనకృతంబు ద్వాపరమునన్ విఖ్యాతమౌ త్రేతయున్.

మ. అనిఁ గుంతీసుతు ధర్మసూను జపహోమాద్యన్వితున్ సూర్యతు
ల్యుని దుర్ధర్షు స్వసైన్యపూగమును నెంతో గాచుచున్ వైరిసే
నను దున్మాడఁగఁ గందు వెప్పు డపు డన్నా యుండఁబోవే సుమా
వినుతం బైన కృతంబు ద్వాపరమునన్ విఖ్యాతమౌ త్రేతయున్.

మ. అని దుశ్శాసనునెత్రు ద్రావి యవురా యాభీమసేనుండు తా
ను నలిన్ వైరిగజఘ్నుమౌ మదపుటేనుంగుం బలెన్ నృత్యమున్
దనరం జేయఁగఁ గందు వెప్పు డపు డన్నా యుండఁబోవే సుమా
వినుతం బైన కృతంబు ద్వాపరమునన్ విఖ్యాతమౌ త్రేతయున్.

మ. అని వేవేఁ జొరఁబాఱు ద్రోణుఁ గృపు నన్నా భీష్మునిన్ సైంధవున్
జననాథుం డగుతత్సుయోధనునిఁ దా సంరంభ మొప్పార న
ర్జునుఁ డై వడ్డము గొట్టఁగందు వపుడే శూన్యంబులై పోవుఁ జూ
వినుతం బైనకృతంబు ద్వాపరమునున్ విఖ్యాతమౌ త్రేతయున్.

మ. అని నేన్గుల్ వలె వైరితేరులను గర్ణా వ్రయ్యలం జేయుచున్
ఘనులై వెల్గెడు మాద్రిపుత్త్రు లెపు డన్నా కౌరవానీకమున్
దనరన్ క్షోభము వెట్టఁ గందు వపుడే తథ్యంబుగాఁ బోవుఁ జూ
వినుతం బైనకృతంబు ద్వాపరమునున్ విఖ్యాతమౌ త్రేతయున్.

అని బీభత్సరసం బుట్టిపడఁ బలికెను. కృతయుగమున నంద ఱును గృతకృత్యులే, ధర్మార్థకామములను నెవ్వఁడు నపేక్షింపఁడు. త్రే తయందు ధర్మమే ప్రధానము. అర్థకామము లానుషంగికములుగా నపే క్షింపఁబడును. ద్వాపరమం దర్థకామములే ప్రధానములు గా నపేక్షిం పఁబడును. ధర్మము వాని కంగముగా నపేక్షింపఁబడును. ఇందు గృతము లేదనుటచే మోక్షభ్రంశ మగునని భావము. త్రేత లేదనుటచే ధర్మభ్రంశ మగు నని భావము. ద్వాపరము లే దనుటచే నర్థకామములు గలుగ వని భావము. ఏమిటి కంటే నీయుద్ధములో ధార్తరాష్ట్రుల కందఱకు న వశ్యము మరణము సంభవించుటవలనఁ, బాండవులు కార్యాకార్య వివ క్ష చేయకయే ధార్తరాష్ట్రులను సర్వసంహారము చేయుదు రని భావ ము. నీగొంతు కఱపఁ గోయుదురు సుమీ యని భావము. ఇట్టి భా వంబుతోఁ బరమేశ్వరుం డైనకృష్ణుండు భీకరంబుగఁ బలికెను. ఈరీతిని

పాండవజయము నిర్ధారణచేసి యుద్ధసన్నాహము సేయుఁడని భీ ష్మాదులతోఁ జెప్పుమని శ్రీకృష్ణుండుఁ గర్ణునితోఁ జెప్పుటయుఁ గర్ణుండు కానున్న పృథివీవినాశమునకుఁ దాను మొదలుగాఁగలవారు మూలము లని కృష్ణునికోఁ జెప్పి పాండవజయసూచకనిమిత్తములను వర్ణించి వానిం గాఁగిలించికొని తనయింటికి మఱలిపోయెను.

---

# గ్రంథస్వీకారము.

1. మోహలేఖ. 2. శ్రీకన్యకాపరమేశ్వరీస్తవము. కవి, బాల కవి అల్లమరాజు నారాయణరావుగారు, బెజవాడ. 3 శ్రీ విజయవాడ కనకదుర్గాకంఠమాల- గ్రంథకర్తలు. కుందుర్తి వేంకటశాస్త్రిగారు, అల్ల మరాజు నారాయణరావుగారును. పేరులనుబట్టి యీ గ్రంథవిషయము తె లియుచున్నది. కన్యకాపరమేశ్వరీస్తవము గీతమాలిక. తక్కినవి వృత్తము లు. కంఠమాల సర్వత్ర నకారప్రాసయుతములగు వృత్తములతోనున్నది. వెల. మోహలేఖ రు 0 0-6. కన్యకాపరమేశ్వరీస్తవము రు 0-2 0. కంఠమాల రు 0 0 6- మచ్చు.

మ. కనిపాల్ యుగ్గులు వోసి పెంచి కళలన్ గాఢంబుగా నేర్పి పె
  త్తనదారుల్గను జేసి భాగ్యమిడి తంత్రమ్ముల్ ప్రసాదించి కీ
  ర్తిని జేకూర్చెడు తల్లి దండ్రులను భక్తిన్ బూజలన్ సేవలన్
  దనియం జేయని యాత్మజుల్ గలిగినన్ లాభం బభావంబుగా
  ఘనశక్తీ బెజవాడ శ్రీకనకదుర్గా తల్లి రక్షింపవే.

ఈనారాయణరావుగారు రచియించినది ౧౦౧ కందపద్యముల "వాణీసుధాలహరి" యనునీతిబోధకలదు. అది యింకను నముద్రితము. దానిం బ్రకటించుటలోఁ గవిగారి కెవ్వరు సాయపడి ఖ్యాతినందనుండిరో తెలియదు.

4. ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము:—ద్విపద. ఆదోని, గార్లది న్న సుబ్బరావుగారు రచియించినది. ఈయన "రామకుమారాభ్యుదయా దు"లు పెక్కులు రచియించియున్నారు. ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానమ నఁగా- హరిశ్చంద్రుఁడు కాశినుండి వచ్చిన పిమ్మటికథ. ఉత్తరరామాయ ణములో రావణాదులవృత్తాంతము దెల్పఁబడినట్లే యిందు- చంద్రమతి, లోహితాస్యుఁడు, వీరబాహుఁడు మున్నగువారి పూర్వచరిత్రము తెల్పఁ బడినది. కొమాండూరి అనంతాచార్యులుగారి వచనమునుబట్టి యీద్విపద కావ్యము రచింపఁబడినది,

ఈద్విపదకావ్యమునకు మూలములు పెక్కులు గలవు. కాని, కవిగారి కివ్వరును గోరినను దెల్పకుండి రనుట శోచ్యము. తాటస్థ్యమును వహించుట మనవారిలోఁ జాలమందికిఁ గలదు. తక్కెళ్ళపాటి లింగకవి పద్యకావ్యము గలదు. దాని నముద్రితగ్రంథచింతామణిలో నెల్లూరఁ బూండ్ల రామకృష్ణయ్యగారు ప్రకటించి యుండిరి. చంద్రశేఖరకవి ద్విపదయొకటి యున్నదఁట. వీనినిబట్టి రచియించినదే మనయనంతాచార్యుల వారివచనముగా నగపడుచున్నది. హరిశ్చంద్రచరిత్రము పూర్వోత్తరభాగములంగూర్చి లింగకవి గ్రంథపీఠికలో రామకృష్ణయ్యపంతులుగారు విరివిగా లిఖించిరి.

సుబ్బరావుగారు తొల్లి ద్విపదకావ్యములను రచించినకవులం దెల్పుచోఁ గాలక్రమమును విడనాడిరి. అందుఁ బాల్కురికి సోమనాథుఁడు, రంగనాథుఁడు, గౌరన, యిట్లుక్రమముఁ దెల్పిన నెంతయు నుచితముగ నుండియుండును. శ్రీనాథుఁడు "వచియింతు వేములవాడభీమవరభంగి" నని తొలుత భీమకవిం బేర్కొనుటచే నిప్పుడుకొందఱు భ్రమపడి నన్నపార్యుని వెనుకకుఁ ద్రోయుచున్నారుగదా:

ఈపుస్తకము నాకృతి ముద్దులుమూటగట్టుచున్నది. ద్విపద చక్కగను ధారాళముగను నున్నది. వ్యర్థపదములు తఱుచుగ లేవు. రచనము నిర్దుష్టము. రాయలసీమలోని కవులకున్నశ్రద్ధ మనప్రాంతముల కవులకు లేక యూబిలోని నిట్రాడులగుచున్నారు. రచనఁ జిత్తగింపుఁడు.

"దేవి నీ కిపుడు ప్రాప్తించిన వ్యసన, మేవారలు నపనయింపఁగాలేరు
నావిన్నపంబు వినం దగునమ్మ, భూవిభునెడఁ గోపమును మానుమమ్మ
ఈతనియెడదోష మింతైనలేదు, జ్యోతిష్కులం దప్పు సుంతైనలేదు
ఎవరిధర్మంబు వారిల నాచరింపఁ, గవలె నటంచు భగవదాజ్ఞగాదె. పు ౭౨

చంద్రమతి పూర్వజన్మమున నొకకాఁపువనిత యనియు నప్పటిపేరు, కలకంధరయనియుఁ గలదు. ఆమె యేకులరాట్నము వడకుట లింగకవి సీసపద్యములో కంటె నిందు మిన్నగ వర్ణింపఁబడియున్నది.

"తోడి చేడెలఁ జూచి దొడ్డరాటంబు, వేడుకఁదానును బెట్టుకొనుచు వ
నేకుల తుపమోగ మేకులవృత్తి, కేకొల గలదని యేకులు వడుకు

రాటము ముందట రతనంపుఁ జిన్న, పీటనైఁగూర్చుండి బిసరుహపాణి
నుడికాలరాట్నంపు కొనపీటఁద్రొక్కి, యెడమహజ్జ నిలువు నిలఁ జిక్కఁబట్టి
కడియము ల్గాజులు కట్లు తోడాలు, బడిబడి ఘల్లనిధ్వనిసేయుచుండఁ
గుడిచేతితోఁ బిడిఁ గొని త్రిప్పిత్రిప్పి, యెడమకేలునఁ నేకు నెగయీడ్చియీడ్చి
తనచూడ్కి యేకుతో దారంబుతోడ, ననుగమింపఁగనే దార మప్పుడు నపుడు
కదురుకుఁ జుట్టిన క్షణమాత్రమందు. పుట ౧౪౧

ఈకృతింగైకొనిన శ్రీయుతరాబోటి రామయ్యగారి సాయమున నిట్టిసుందరపుస్తకము వెలువడుటచేఁ బాఠకులస్తుతికి వీరెంతయుఁ బాత్రులు.

దీనివెల రు 1-8-0 (చాలనెక్కువయని తలఁచెదము). బళ్లారిజిల్లా ఆదోని రాన్‌జీముద్రాక్షరశాలలో దొరకును.

5. శ్రీవేంకటేశ్వరశతకము:—కర్త శ్రీయుతనల్లా చినరెడ్డినాయఁడుగారు, అమలాపురము. వీరిగురువులు బ్ర॥ మల్లాది సూర్యనారాయణశాస్త్రులుగారఁట. వారిని "విరచించె నెవ్వఁడుత్తరరామచరితాదికములైన బహువిధకావ్యములను" అని 4 వ పద్యములోఁ గొనియాడియున్నారు. కావునఁ బండితశిష్యులకుఁ గవితలో లోపము లుండవుగదా: కల్పనలు రసవంతములు నీతిభక్తియుతములునై యున్నవి. మాదిరి—

సీ. నీట జాడలుదీయు నెఱజాణవైయెను
గొండ లప్పలఁ దేల్చు గండఁడైన
నువ్వెత్తు ధర యెత్తు నుక్కడీఁడైనను
సింగమై చెలరేఁగు జెట్టియైన
జగమెల్ల నడుగుదాఁటఁగనీని ఘనుఁడైన
ఘోరాంబునిధిఁగట్టు వీరుఁడైన
నరిరాజవంశ మూటార్చుపోటరియైన
నూళ్లేళ్లలోఁ గల్పు నుగ్రుఁడైనఁ
గాఱుచిచ్చుల దిగమ్రింగు గండ్రయైన
ఖలుల నిశ్శేషముగఁ ద్రుంచు బలియుఁడైనఁ
గవిముఖంబునఁ గొల్చెట్లు గాంచుఁ గీర్తి
వేంకటేశ యనంత రవిప్రకాశ.

దీనివెల రు 0-3-0. తూర్పుగోదావరిజిల్లా అమలాపురములో గ్రంథకర్తగారియొద్ద దొరకును.

6. నెహ్రూచరిత్రము.

శ్రీమాన్ కొమాండూరి శఠకోపాచార్యులు ఎం. ఏ., బి. ఎల్. గారు రచియించినది.

కవిగారు జగత్కథానములు రచించి జగత్ప్రసిద్ధినిగనవారు. కథానాయకులను జెప్పవలసినదేమి! పండితజవహరులాల్ నెహ్రూగారు త్రికాలమున బంచఖండాత్మకమైన పృథ్వీభాగమున వెలుఁగుచున్నవారు. లోకమంతయు నాబాలగోపాలము నెఱిఁగియున్న వీరింగూర్చి వ్రాయవలసినదిలేదు. మేము వ్రాయునట్టిది ప్రత్యక్షముగాఁ గాంచుచున్న లోకులకు రుచింప దని చెప్పుచున్నాము. ఉత్తరహిందూస్థానప్రాంతముహిందీభాషలో నహర్ అనఁగాఁ గాలువయఁట దానినింబట్టి వీరివంశమునకు "నహ్రూ" అనుపేరుగలిగిన దనువిషయములోకమునకుఁ గ్రొత్తయగునని తలంచెదము. "కాశ్మీరమునుండి రాజకౌలు అనుబ్రాహ్మణుఁడు ఢిల్లీపట్టణముచేరి మొగలుచక్రవర్తికడఁ బండితుఁడై యొకజాగీరును యమునకాలువగట్టున నొకగృహమును సంపాదించెనఁట. ఆయన పాదుషాపిల్లలకు పారసీభాషను నేర్పుచుఁ గాలువగట్టునగృహమున నివసించుచుండెనఁట. అందువలన నావిప్రకుటుంబమునకు కౌలు నెహ్రూ లనుపేరుకలిగి క్రమక్రమముగ కౌలుపోయి నెహ్రూపదము నిల్చెనదఁట. ఆపండితకుటుంబ మనుగనిలో వెలువడినయది మోతీ-ఆమోతీ (ముత్యము) నుండి యీ "జవహర్" (రత్నము) ఉద్భవమై వన్నెగాంచినది. ఇది బ్రహ్మజాతిరత్నము. ప్రఖ్యాతికిఁ గొఱంతగలదె! శ్రీమాన్ శఠకోపాచార్యులువారు మఱియు నిట్టి ప్రఖ్యాతపురుషులచరిత్రమును బ్రకటించి లోకోపకృతి యొనర్తురుగాక. దీనివెల అణాలు ౮. కాకినాడలో గ్రంథకర్తగారియొద్ద దొరకును.

—శ్రీరామునిశీలముఐదుకుల చరిత్రము బ్ర. దప్పూరి జగన్నాథశర్మగారు రచించినవి. మొదటిదానికిఁ జెన్నపురి యాంధ్రసభవారివలన బహుమాన మీయఁబడినది. శ్రీరామునిబాల్యము, బంతియాట, అల్పులయెడ హృదయవైశాల్యము, సత్యోత్కర్షమునకై సుఖనిరాకరణము, పరస్త్రీలయెడ మాతృభావము, ఉత్తమాచారములం దాసక్తి, మిత్రసంపాదనమునందు దూరాలోచనము మున్నగు విషయములు గలవు, 30

పుటల చిన్నపొత్తము. వెల రు 0-4-0. రెండవది మైలకులచరిత్రము. అయ్యెరకలని సాధారణముగా వాడఁబడు కులమువారి పూర్వవృత్తాంతమిందు నిదర్శనములతో వ్రాయఁబడినది. ఈమైలకులజులకుఁ జాత్రుల ను బిరుదనామము గలదఁట. పుస్తకము చిన్నదియే గాని విషయము విపులముగా నున్నది వెల రు 0-2-0 లు కవిగారియొద్ద కాకినాడలోఁ దొరకును

## ఇంగ్లీషు కన్నడము నిఘంటువు.

— మైసూరు విశ్వవిద్యాలయమువారు ప్రకటించునది —

కర్ణాటభాషలో కిట్టెల్ గారి కన్నడ-ఆంగ్లేయనిఘంటువు సుప్రసిద్ధమైనది. అది కన్నడభాషావ్యుత్పత్తులను గూలంకషముగఁ దెలుపుచు వానికి సరియైన యాంగ్లేయపదములను గూడఁ దెలుపుచున్నది. ప్రస్తుతము మైసూరు విశ్వవిద్యాలయము, మైసూరుప్రభుత్వమువారిసహాయమున సమగ్రమగు నాంగ్లేయకన్నడ నిఘంటువును సిద్ధముచేయుటకు నిశ్చయించి- అందు మొదటిభాగము 96 పుటలు (డెమ్మి $\frac{1}{4}$) గలభాగమును బ్రకటించినది. ఈనిఘంటునిర్మాణము సుప్రసిద్ధకర్ణాటపండితుల సంపాదకీయ వర్గమున కొప్పగింపఁబడినది. ఇంగ్లీషురాని కన్నడుల యుపయోగార్థము, ఇంగ్లీషునందుగల శాస్త్రీయసాంకేతిక చారిత్రక సాంఘిక జ్ఞానధనమును- వినియోగించుటయే యీసంపాదకీయవర్గమువారి ముఖ్యాశయము- పదములను సంగ్రహించునపు డీసంఘమువారు ఆక్సుఫర్డు ఇంగ్లీషుసంగ్రహనిఘంటువును మాదిరిగాఁగొనుచున్నారు. శాస్త్రీయసాంకేతికపదములకు సమానార్థకములు కావలసివచ్చినపుడుసంఘమువారు సంస్కృతములోను మఱియితరదేశభాషలయందునుగల నిఘంటువుల నుపయోగించుచున్నారు. కొన్నిదేశభాషలయందు శాస్త్రీయసాంకేతికపదములను గూర్చి విశేషముగఁ బని జరిగి యున్నను జేయఁదగిన దింకను గలదు. ప్రస్తుతనిఘంటువునందు- ఇట్టిపని కొంతజరిగినందువలన నిదివఱలోఁ బూర్తి యైనయెడల చేయఁదగిన పనిగూడఁ బూర్తియగుట తెల్లము. మాయొద్దికివచ్చిన భాగమును బరిశీలింపఁగా నీనిఘంటునిర్మా

ణము సరియగు పద్ధతులపై నడచుచున్నదనియు సంపాదకీయవర్గమువారీయుద్గ్రంథమును బూర్తిగావింతురనియు నమ్ముచున్నారము.

### THE MYSORE UNIVERSITY

## ENGLISH - KANNADA DICTIONARY.

Kittel's Kannada-English Dictionary is a well known Lexicon. It deals with all the words in the Canarese language in a fairly exhaustive way and gives their English equivalents. The Mysore University has with the support of the Mysore Government now undertaken to compile an exhaustive English-Kannada Dictionary and has just issued the first part of it comprising 96 pages ($\frac{1}{4}$ Demy). The work is entrusted to a committee of editors chosen for their scholarship. The chief aim of this committee seems to be to make 'The rich store of knowledge—scientific, technical, historical, sociological etc., easily available in English available to the Canarese people who have not had the benefit of English Education'. The committee have adopted The Concise Oxford English Dictionary as their guide in the matter of selection of words. In regard to the equivalents of the scientific terms, the committee is making use of dictionaries and glossaries available in other vernaculars and in Sanskrit. There is no doubt that much work has been done in this direction in some of the vernaculars, but a great deal more remains to be done. The need for this work being completed as early as possible is obvious. Judging from the part now before us, the Dictionary under review seems to be done on right lines and we wish the Editors Godspeed in their meritorious work.

---

గీ. పురిని బున్నమ రేలు బంగరువు మేడ
జాహ్నవీనిర్మలామృతశాలి యైన
ధవళకరమండలకమండలువు ధరింప
నలవిరించికి ంచు.

చ. ఉవిదలు రేలు సౌధశిఖరోపరికాంచనచంద్రశాలలం
దివుట వితానితోడుత సదేశసమాగతచంద్రమండల
స్రవదమృతంబు చేతఁ గొని చందనముం బిసాండఁజేసి మై
సవరగఁ బూయుచుండ్రు ఘనసౌరభము ల్నభ మెల్లఁగప్పఁగన్. ౨౮

చ. పురిఁ గలరాజపుత్త్రులు నభోగతి వచ్చు విహంగమంబులం
దిరముగఁ జూచి యుండుకడఁ దేలకయుండఁగ నుండవిండ్లఁ గ
స్తురినిగరంపుటుండ లిడి తోట్టన నేయుదు రెల్లదిక్కులం
బరిమళము ల్గుబుల్గొనఁగ బాపురెయందు సుర ల్నుతింపఁగన్. ౨౯

క. హాటకమణిసౌధంబుల
నాటకశాలల నటించు నగరవధూటీ
కోటితులాకోటిధ్వని
మాటికి గుబ్బతిలుఁ బర్వి మబ్బులలోనన్. ౩౦

ఉ. శ్రీలఁ జెలంగు నప్పురము చెంతలఁ గాంతలతాంతమాలికా
శాలి వనాలిసోలికల సారెకు సోలి పిసాలినాలిను
న్నాలిచరించు వేడ్క లెసఁగం గుసుమంబులు గోయుపట్టన
స్త్రీల కపోలఘర్మజలశీకరము ల్వలుమాఱుఁ గ్రోలుచున్. ౩౧

సీ. విటులకుఁ గెలనితంగెటిజు న్ననఁగ మించు
తేనియ లొలుకు వాతెఱలతీరుఁ
గోడెకాండ్రకును ముంగొంగుబంగా రన
మిసమిస ల్గ్రమ్ము నెమ్మేనిరేఖఁ
బల్లవులకు సమీపసుమేరుగిరు లన
విలసిల్లు గబ్బిగుబ్బలబెడంగు
ననుపుకాండ్రకును జెంతల కల్పలత లన
నొఱపులు నెఱపు బాహువులపొలుపుఁ

బూని సరసుల కఱచేతిమానికంబు
లనఁగ నమృతంబునడబావు లనఁగఁ బెన్ని
ధానము లనంగఁ గంతునిదంతు లనఁగ
వెలవెలందులు మింతు రప్పీటియందు. ౨౮

క. అందు నిరవొందు హిమవ
న్మందరమలయోద్భవములు మత్తేభంబుల్
మంద్రమృగభద్రజాతు ల
మందకటస్యందమానమదసింధువులై. ౨౯

చ. పురిఁ జెలియించు భద్రగజపుంజము ముందఱ డిండిమధ్వను
ల్నిరతము మించుఁ దత్తటవినిర్గళదుత్తటదాననిర్ఝరీ
చరదలిఝుంకృతిం గలసి సారెకుఁ దద్ఘనకుంభ...నో
ద్ధురతరవీరలక్ష్మికి గతుల్దగఁ దాళములొత్తు కైవడిన్. ౩౦

సీ. మోచుదిశాగజంబులకు విశ్వంభరా
వలయభారము గొంత చులుకగాఁగ
వెల్లయేనుఁగునకు వేడుక ల్గొలపించు
పాంసువర్షవినోదభంగి గలుగ
వేలుపుమన్నని పీటిలోపల నున్న
తరులకు భూరుహాత్వంబు దొరకఁ
జదలేటినీటి యబ్జకులంబునకు నెల్లఁ
బంకజభావంబు పరిఢవిల్ల
నిబ్బరం బగు రవళిచే నింగి కెగయ
సారెకు ధరాపరాగంబుఁ జల్లుకొనుచు
నప్పురము రాజమార్గంబు నందు మెలఁగు
నిండు మదములు గురియు వేదండఘటలు. ౩౧

గీ. ఘనములగు గండశైలము ల్దదళికలును
బాదపముల మేఘములు దంతపటిమ వంశ
గౌరవము పైపరాగము లలిగి మెలఁగుఁ
గుంజరంబులు పురి నడగొండ లనఁగ. ౩౨

చ. నిరతము మీటి తొండములు నింగికిఁ జాఁచుట యంబరాపగా
స్తరధవళాబ్జమంచుఁ దమనాథుని బట్టఁగఁ గావె మానుఁ డీ
కరణియటంచుఁ దారకలు కాళ్లఁ బెనంగు తెఱంగునోఁప నూ
పురముల ముత్తెము ల్మెఱయఁ బొల్పుఁ బురిన్మదవన్మదేభముల్. ౩౩

ఉ. అంబర మంటు నన్నగరి హస్తికులంబు సితాంబుజాతమో
హంబునఁ బట్టుఁ దన్నని సుధాంశుఁడు పూర్ణత డించి పూనుఁ గా
ర్శ్యంబు, సమగ్రుఁడో, మఱియు సారె బిసం బని పట్టునందు ని
త్యంబును నిట్ల యుండు నొకయప్పుడుఁ దాఁ గనఁ డేకరూపమున్. ౩౪

మ. జవలీలం దనతోడ విగ్రహము నశ్రాంతంబు గావించుగం
ధవహుం గ్రోలు మహోపకారి యగు నాదర్వీకరస్వామికె
క్కువ యౌఁగా బహువంచనో మవెని లోకు ల్మెచ్చ వాజివ్రజం
బవని న్సోఁకక దాఁటి మింటఁ జను నత్యాశ్చర్యచర్యాం బురిన్. ౩౫

సీ. ఎవ్వారిఁ జూచిన హీరహారికిరీట
హారకుండలముల నలరువారె
యెవ్వారిఁ జూచిన జవ్వాది బుగబుగల్
గలుగుకుంకుమగంధ మలఁదువారె
యెవ్వారిఁ జూచిన దవ్వుల వాసనల్
విసరుపూసరులచేఁ బొసఁగువారె
యెవ్వారిఁ జూచిన నిండుకుందచ్ఛాయఁ
గనుపట్టు వెలిపట్టు గట్టువారె
యెవ్వరిని జూచిన మహామహేంద్రనీల
జాలజాలకయుత హేమసౌధయూథ
సీమ సీమంతినులఁ గూడి కాముకేళి
వేడుకలఁ జెందువారె యప్పీటియందు. ౩౬

వ. ఇప్పగిది నపూర్వశోభావిభవంబునం గనుఁగొననొప్పు నప్పురంబున
కధీశ్వరుండు. ౩౭

సీ. తన దానమహిమ చింతామణి కామధు
క్సంతానముల కోజబంతి గాఁగఁ

దనహేతి సకలదిగ్ధరణీశలక్ష్ములఁ
దో తెచ్చుటకుఁ దగుదూతి గాఁగఁ
దననీతిగుణి యుగంధరముఖ్యులకు నెల్ల
శవణిల్లు పఠితపాఠంబు గాఁగఁ
దనకీర్తి ఘననృపాస్థానరంగములకు
నవ్యమౌక్తికవితానంబుగాఁగ
నలరు నాస్వర్గమార్గనిరర్గళైక
రఘుఁడు సంతతరాజాధిరాజదత్త
సారవస్తుసమగ్రమనోరథుండు
దైవతనుతప్రథుండు నా దశరథుండు. ౩౮

సీ. తనకరుణావలోకనలీల ధారిణీ
తలము లోకులకెల్ల దారి గాఁగఁ
దనవినిర్మలకీర్తి ధవళాంశురాణివా
సములకు నేలిక సాని గాఁగఁ
దనవాలు సురకాంతలను వరించు విరోధి
కోటికి మహాహూర్తికుండు గాఁగఁ
దనప్రతాపము హుతాశనవనజాతబాం
ధవులకుఁ గులదైవతంబు గాఁగ
వర్ణన యొనర్పఁ దగుఁ జక్రవాళశైల
వలయితమహీతలనృపాలవర్గఫాల
ఫలకభాగశుభాక్షరాపాదిపాద
నఖరశిఖరుండు దశరథనరవరుండు. ౩౯

మ. చరమాహార్యముఁ బూర్వశైలము జయస్తంభంబు లాచక్రవా
ళరసాచక్ర మవక్రవిక్రమభుజాలంకార మాశాంతసిం
ధురము ల్కీర్తివధూటిమేడలు పయోధు ల్రత్నపుంబంటచే
లరిరాజు ల్పనిపాటలం దిరుగుబం ట్లామేదినీభర్తకున్. ౪౦

గీ. అతనికిని ధృష్టివిజయజయంతు లనఁగ
నర్థసాధకాశోకసిద్ధార్థు లనఁగ

మంత్రపాలకుఁ డనఁగ సుమంత్రుఁ డనఁగ
మంత్రు లైనమంత్రు గలరు సమగ్రమతులు. ౪౧

ఉ. వెండియు నానృపాలునకు వేఱె యమాత్యులు గల్గియుందు రా
ఖండలమంత్రిధీవిభవఖండనపండితు లాహవక్రియో
ద్దండులు దండనీతిసముదారవిచారకళాధురంధరుల్
కుండలిసార్వభౌమనిభకోవిదసన్నుతవాగ్విజృంభణుల్. ౪౨

ఉ. స్వామిహితంబు శౌర్యమును సత్యము నింద్రియనిగ్రహంబు వి
ద్యామహిమంబు ధర్మము నుదారత ధీరత నీతిరీతి యు
న్నామమృదూక్తిజాలసరసత్వము గల్గివ(యట్టి)యానృప
గ్రామణియంతరంగగతిఁ గైకొని మింతురు వారలెంతయున్. ౪౩

సీ. కలనైన ననృతంబు వలుకంగ నేరరు
నేర్తురు సత్యంబు నిలువఁ బలుకఁ
బరధనంబుల కాసపడ రెట్టిపట్టుల
నాససేయుదురు పుణ్యములకైన
వెఱవ రెంతకడింది పేరాఱులకు నైన
వెఱతురు దురితంపుఁదెఱఁగులకును
గుటిలచిత్తులఁ జేర్చికొన రేమఱియు నకు
టిలచిత్తులనె జేర్పఁదలఁతు రెందు
నధిపుమాటలు మీఱక యర్థములను
గోశగృహములు నిండంగఁ గ్రుమ్మరింతు
రమ్మహామంత్రు లఖిలశాస్త్రావలోక
జాతపరిపాకనీతినిష్ణాతమతులు. ౪౪

శా. ఆమంత్రు ల్నయవంతులై సకలకార్యాలోచన ల్సేయఁగా
హేమంబు ల్ధనము ల్విభూషణములున్ హేరాళమై యుండఁగా
సామంతక్షితికాంతు లెంతయును విశ్వాసంబుమైఁ గొల్వఁగా
భూమీమండల మేలె నానృపతి యంభోరాసులే మేరగన్. ౪౫

క. దశశతదృగ్విభవుఁ డా
దశరథపృథ్వీధవుండు దగఁ దరుణవయో

దశయుంద రిపుల గెలిచెఁ
దశదిక్కులయందుఁ గీర్తిధవళిమ లలమున్. ౪౬

క. కేకయకోసలమగధ
క్ష్మాకాంతుల కన్యకలను సంభ్రమ మొప్పం
జేకొని పెండిలియాడె శు
భాకారవిలాసమదనుఁ డవ్విభుఁ డంతన్. ౪౭

క. ఆనరపతి సకలక్షితిఁ
దానేలుచు విభవమునకుఁ దగినట్టిసుతుం
గానక ఘనసంతాపము
మానక యుల్లంబులోన మల్లడిగొనఁగన్. ౪౮

ఉ. ఒప్పను చెల్లఁజేసితిఁ బయోనిధివేష్టితభూమి నంతటం
గప్పము గొంటి నద్దెసలఁ గల్గినరాజులచేత వైభవం
బొప్పుచు నుండుఁబో తనయుఁ డొక్కరుఁడైనను గల్గెనేని నా
డెప్పర మైనపుణ్యము ఘటింపఁగఁజేయునె పుత్రసంపదన్. ౪౯

క. బాలకు ఫాలకుటిలలం
బాలకుఁ బాలకును మణిమయుంబగు గిన్నెం
గేలఁగొని దాది వెంటనె
బాలిం దిరుగంగఁ జూచుఫల మబ్బునొకో. ౫౦

క. రంగు మెఱుంగుల బంగరు
ముంగిట నుంగుటము లూఁది ముద్దుగులుకు లీ
లం గలకల నవ్వుచు మెలఁ
గం గొమరుని జూచుకౌతుకము గలుగునొకో. ౫౧

చ. కలుగునొకో చకోరహితుఁ గన్గొని తెమ్మని పోరువెట్ట దా
దులు గికురించి యద్దమునఁ దోఁచినచందురుఁ జూప రెండుచే
తులఁ గొనిపట్టి సంతసముతోఁ దనచేతికిఁ జిక్కెనంచు న
గ్గలికఁ జెలంగు బాలకుని గన్నులఁజూడఁగఁ గల్గుభాగ్యముల్. ౫౨

క. అని యిట్లు సుతులు లేమికి
మనమున వగ నిగుడ నాప్తమంత్రియగు సుమం

త్రుని బిలిచి యొక్కనాఁడి
ట్లనిపలికెం దనదుహృదయ మంతయుఁ దెలియన్. ౫౩

చ. వినుము సుమంత్ర నీవెఱుఁగ విశ్వధరాతలచక్ర మంతయుం
బనిగొనఁ జేసి పేర్మి దగఁ బ్రాభవ మిచ్చితి నన్నుఁజాల న
మ్మిన సుజనాళికిం దురగమేధ మొకండును దక్కఁ దక్కఁగ
ల్గిన క్రతువు లున్నదక్షిణలు గీల్కొనఁ జేసితి నెంత సేసినం
దనయుఁడు లేఁ డొకండయిన దైవకృతం బిటులుండె నేమనన్. ౫౪

క. సుతుల ననుముద్దుఁబలుకులు
శ్రుతులకుఁ జవియైనయట్లు చూడఁగఁ జవిగా
వితరులు వేడుక నెంతే
చతురతమైఁ బలుక నంత చవి భువిఁ గలదే. ౫౫

క. ముద్దునగుమోము నందపు
బొద్దుమెఱుఁగుమేనుఁ జిన్నిబొజ్జయు నెంతేఁ
బ్రొద్దులు జరపెడి జిలిబిలి
సుద్దులు గలబాలకులను జూడ న్వలదా. ౫౬

క. చప్పటులు చఱచి యిటు మా
యప్పలు రమ్మనుచుఁ బిలువ నలకలు నుదుటం
గప్పఁగ నందెలు మొరయఁగఁ
దప్పటడుగు లిడుచు వచ్చు తనయుఁడు వలదా. ౫౭

వ. అని యిట్లు సుమంత్రునితోడం బలికి మఱియును. ౫౮

క. తక్కఁగల మంత్రివరులను
గ్రక్కునఁ బిలువు మని పల్లఁగొఁ గట్టికవా
రొక్కరిఁ బట్టంగఁ బనుగు
రొక్కటఁ జని వారిఁ బిలువ నుత్సాహమునన్. ౫౯

సీ. వెన్నముద్దలు వోలె సన్నసుగ్గడితంపుఁ
దెలిచల్వబటువుపాగలు పొసంగ

నునుసాలెయఱచట్టలును వాని కొనరిన
వలిపెపచ్చడములుఁ జెలువ మెసఁగ
నొండొంట నరవచ్చుచున్న చెంపల గొప్ప
నీలాలప్రోగులనిగ్గుదొలఁక
నృపముద్రలఁ జెలంగు నపరంజిముద్దుటుం
గరములు కరములఁ గరము మెఱయ
శుద్ధవేషంబుతోడఁ బ్రసిద్ధులైన
సచివు లధిపుహజారంబుసరణి దఱిసి
క్రమ మొనరఁ గొన్నికక్ష్యాంతరములు గడచి
యంతపొగ్గళ్లు వచ్చి ర మ్మనుచుఁ బిలువ. ౬౦

క. హేమమయ మందిరంబునఁ
గామిను లిరువంక మేనికళలు దొలంకం
జామరలు వీవఁ గొలువై
శ్రీ మెఱయుచు నుండు నృపతిఁ జేరి వినీతిన్. ౬౧

వ. మ్రొక్కి సమ్ముఖంబున మణిమయస్తంభంబుల హత్తుకొని నిలిచినం గనుంగొని నృపపుంగవుండు వారలతోడ నట్లన పలికి పుత్రార్థం బశ్వమేధంబు సేయవలయు సుమంత్ర మంత్రజ్ఞులైన భూసురవరుల నాగురువుల నందఱం దోడితెమ్మనిన సుమంత్రుండు నప్పుడ పుడమిలోపలం బ్రసిద్ధులు నఖిలమంత్రపద్ధతిప్రవీణులు నగుబ్రాహ్మణుల నధికతపోనిష్ఠు లగు వసిష్ఠవామదేవజాబాలిప్రముఖులం దోడుతెంచినం గాంచి దశరథుండు వారల నెదురుకొని తెచ్చి యుచితాసనంబులం గూర్చుండ నియమించి నమస్కరించి యి ట్లనియె. ౬౨

గీ. భూమిసురులార సంతతి లేమిఁజేసి
తత్తళింపం దొడంగెడుఁ జిత్త మిపుడు
తురగమేధంబు సేయ నుద్యోగ మున్న
దమ్మఖవిధాన మి ట్లని యానతిండు. ౬౩

వ. అనిన వార లి ట్లనిరి. ౬౪

(62) "కందులకును నెఱ్ఱమట్టి కావలయునె కా"

క. ముందుగ మాటలబిగువులు
నెందుకురా గూడ దీవు నేర్పడి నాతో
సందఱుఁ బొర్లరె మట్టిని
గందులకును నెఱ్ఱమట్టి కావలయునె కా.

మల్లయుద్ధమందు సాధనకాఁడు మఱియొకనిం జూచి నీదిట్టతనము నాతోఁ జెల్లదు. ఎఱ్ఱమట్టిలోఁ బొరలినవారి నెందఱినో చూచినాఁడను. కందులుకూడ నెఱ్ఱమట్టి పూసికొని యున్నవి. నీ వెంత నీసాధన యెంత యని తిరస్కారము.

(63) "రాముని కోపము వసిష్ఠుల నొప్పించెన్"

క. సేమముగ విందు పెట్టిన
నామౌనివరేణ్యుగోవు నడిగిన నీమిన్
ఏమఱక యుద్ధభూమిని
రాముని కోపము వసిష్ఠుల నొప్పించెన్.

రాముని=రాజమౌని. విశ్వామిత్రుఁడు, రాముని=విశ్వామిత్రుని కోపము; వసిష్ఠునకు బాధక మయ్యె ననుట. కాని రాముని=దశరథరామునియొక్క అని కాదు. యుద్ధభూమిని, రా=రాఁగా మునికోపము అనియుం జెప్పవచ్చును.

(64) "కరపదవదనముల నొక్క కట్టియ దూసెన్"

క. సురతాణి లగ్గవెట్టఁగఁ
గఱకొ ములు నాటఁ బంటఁ గఱచుక తీయన్
పెఱవాఁడు వేయ నప్పుడు
కరపదవదనముల నొక్క కట్టియ దూసెన్.

ముల్లు నాటికొనినందున నొక్కఁడు కాలిని జేతిలోఁ బట్టుకొని పంటితో నాముల్లూడఁదీసికొనుచుండ వేఱొకఁ డాతనిపై నంపకట్టియ వైవ ముల్లుతీసికొనువాని కరము, పదము, వదనము నీమూఁటియందు నొక్క బాణమే గుచ్చి చనినది.

(65) "పులినిబడె గుండు పందియు నెలుఁగు నీల్గె."

గీ. పులికిఁ జూఱుకంటఁ జెంతల మెలఁగువాని
పైఁబడక మాన దిది వినఁబడిన మాట

మాటుమునుండుగునఁ బొలకువ మీటమీటఁ
బులినిఁ బడె గుండు పందియు నెలుఁగు నీల్గె.

పులి, పంది, యెలుఁగును నీరుత్రాగుచుండఁగా వేఁటకాఁడు మాటుననుండి తుపాకి మీట మీటినాఁడు. గుండు పులిమీఁదఁ బడినది. అది కోపముచే దగ్గఱనున్న పందిని, ఎలుగును జంపి తాను జచ్చినది.

(66) "వీఁపునఁ జను లుండె గోళ్ల వెంౘ్రుక లుండెన్."

క. ఆపురుషుం డాపడఁతిని
వైపుగ సిగ వేయు మనుచు వచియించెను దా
రాపద్మాక్షికిఁ జనులు
వీఁపునఁ జనులుండె గోళ్ల వెంౘ్రుక లుండెన్.

సిగవేయుటకు వెనుక నున్న దానిస్తనము లాతనివీఁపున నున్నవి అమెగోళ్లలో వెంౘ్రుకలున్నవి.

(67) "రథమునును బండి తినుట చిత్రంబుగాదె"

గీ. సారసాక్షిరో నీమగఁ డూరలేఁడు
బహుదినాలుగ నదియు నీపట్ల వాసి
శంకరునివింటితునక శరచ్ఛవిని గనుట
రథమునును బండి తినుట చిత్రంబుగాదె.

ఒకస్త్రీ గర్భముదాల్చి బయ్యంకలగుణముచే మన్నుతినుచున్నది. అమె మగఁ డూరలేఁడు. ఉండిన భయముచేఁ గొంతమానును, అని భావము. శంకరునికి భూమి రథము సూర్యచంద్రులు బండ్లు అని త్రిపురసంహారకాలపురాణకథ గలదు. రూపకాతిశయోక్తిగా రథమును అనఁగా భూమిని (మట్టిని) బండి=అనఁగాఁ జక్రమైన చంద్రుఁడు (ముఖము) తినె ననుట.

(68) "అశ్వినికి వెన్నలో నుండునది యొసంగె."

గీ. ఎచటనే యుండివచ్చె నీయెమ్మెకాఁడు ?
పుబ్బ కావలిదిక్కుకుఁ బోయివచ్చె.
నేమి కానుక యొసఁగెనే యింతి నీకు ?
నశ్వినికి వెన్నలోనుండునది యొసంగె.

పుబ్బ కావలిదిక్కు—ఉత్తరదిక్కు. అశ్వినికి వెన్నలోనుండునది=బరణి.

(69) "అల్లె ఖేటకమును గూడ నైనఫలము."

గీ. పతి యిచట లేనివేళ రేపకడయందు
సర్పమణిఁ దెచ్చి తా రొమ్ముచక్కి నిడిన
నర్పణముసేతు గరుడ నీకధికభక్తి
నల్లెఖేటకమును గూడ నైనఫలము.

నాథుఁ డింటలేని యీసమయమున సర్పమణిన్=భుజంగరత్నమును (జారనాయకుని) దెచ్చి తాన్- రొమ్ముకడ నిడినయెడల, గరుడ=ఓవినాయక! (వి=పక్షులకు నాయక=ప్రభువా) నీకు అధికభక్తిన్ అల్లెఖేటకమునుగూడన్, అల్లె=నారి, ఖేటకము=కేడము (డాలు) నారి కేడము నను రెండుపదములుంగూడినప్పుడు అయిన ఫలమును అనఁగా నారికేడమును=టెంకాయను నీకర్పణచేయుదును. భుజంగులు=సర్పములు జారులు. ఖేటకశబ్దమునుండి కేడెమైనదని యందురు. ఖేట కేడ కావచ్చును. నారికేడము డళలకు భేదము మాన్చిన నారికేళము కాఁగలదని సమర్థింపఁదగును.

(70) "అన్నను సవతి యని పోరునల్లె యయ్యెన్."

క. వెన్నుఁడు మోహినిగా నా
చున్నయెడన్ శివుఁడు చూచి సొక్కుచుఁ దాఁబై
కొన్నఁ గని డెంద మోర్వక
యన్నను సవతి యని పోరునల్లె యయ్యెన్.

అన్నగారిని సవతి యని పోరుట యెందైనఁ గలదా, కలదు. విష్ణుదేవుఁడు పార్వతికి, అన్నవరుసవాఁడఁట. ఆవిష్ణువు మోహినివేషము వేసినపుడు శివుఁ డామోహినిని మోహింపఁగాఁ బార్వతి నాయన్నయే నాకు సవతి యయ్యె నని కలహించె నని చమత్కారము.

(71) "ఇనతనయునిఁ జూచి రాముఁ డిట్లని పలికెన్."

క. ఇనతనయుఁడు రామునిఁ గని
తనయన్నను నీవు గూల్చుదా రెట్లన్నన్
మును సాలమ్ములఁ గూలిచి
యినతనయునిఁ జూచి రాముఁ డిట్లని పలికెన్.

ఎట్లు నీవు వాలిని జంపెద వని సుగ్రీవుఁ డడిగిన ముందుగా నేడుసాలవృక్షములం గూల్చి, యినతనయునితో 'నిట్లు' అని రాముఁడు పలికె నని సమాధానము, అభినయరూపమునఁ జెప్పెననుట.

(72) "వజ్రము వెన్నక్కఁ గెంపువలెఁ గన్పించెన్"

క. వజ్రసమనాస వినుమీ
వజ్రీఁడు మదాంధరిపుల మార్గాని పొడువన్
వజ్రముపో ల్జముదాడిని
వజ్రము వెన్నక్కఁ గెంపువలెఁ గన్పించెన్.

ఒకశూరుఁడు =శత్రువులను జముదాడిచేఁ పొడుచునపు డది దూసి వెన్కకుఁజన వారియొడళ్లనుండి నెత్తురు కాలెను. ఆనెత్తురుపూసికొని యాజముదాడి వజ్రము కెంపు వలె నెఱ్ఱఁగ గనుపట్టెను. అని సమాధానము. జముదాడి వజ్రము=చివర, కొన.

(కఠినప్రాసశబ్దచిత్రాక్షరయతివంచనా సమస్య.)

(73) "గ్లావిమలాక్ష వేంకటనగాధ్యక్షా"

క. దిగ్గలనాకబరీధర
స్రగ్గాలితకీర్తిజాల సద్గుణశీలా
విగ్లపితరక్షమార్గాం
డగ్లావిమలాక్ష వేంకటనగాధ్యక్షా.

(74) "విధ్యండము లీక్షరీతి విశ్రుతమయ్యెన్."

క. అధ్యాత్మవిద్య యుపనిష
దధ్యయనముఁ జేయఁ జేయ నర్థము బయలై
సాధ్యం బైనను దలఁచిన
విధ్యండము లీక్షరీతి విశ్రుత మయ్యెన్.

విధ్యండము=బ్రహ్మాండము. లీక్షరీతిన్=ఈరువలె పే. ఈరనఁగాఁ బేనుగ్రుడ్డు.

అధ్యాత్మవిద్యాపరిశ్రమముచేసినవారికి బ్రహ్మాండము, ఈరువలె సూక్ష్మముగా నగపడు నని భావము.

కఠినప్రాస పునరుక్తరూపవిషమసమస్య.

(75) "గోగ్రణిగోఽగ్రణీగవాగ్రణియనియెన్."

క. అగ్రజ గోశబ్దముపై
నగ్రణిశబ్దంబు గూడ నదియె ట్లగుసం
ధిగ్రహణముఁ దెలుపు మనన్
గోగ్రణి గోఽగ్రణీ గవాగ్రణి యనియెన్.

(76) "గోఅగ్రణి నెక్కి శివుఁడు గొబ్బున వెడలెన్.

క. భో అమృత భో బ్రహ్మన్
భో అంబరచారిణాంవిభో సర్వేదే
వా ఆయాతవ్యా యన
గోఅగ్రణినెక్కి శివుఁడు గొబ్బున వెడలెన్.

(77) బాహ్లీకహాయమెక్కి రాజు పౌఁజుకు వెడలెన్."

క. ప్రహ్లాదవరదుఁ గొల్వఁగ
నాహ్లాదము మానసంబునందు జనింపన్
బాహ్లీకరసవర్ణం బగు
బాహ్లీకహాయ మెక్కి రాజు పౌఁజుకు వెడలెన్.

(78) "కల్హారమరందమట్లు కల్గికిఁ బల్గుల్"

క. బల్హాయి తోఁచునట్టి యొ
డల్హాయలై నట్టి నిల్గడల్ గనుఁగొన్నన్
మేల్హాదంటి నిఖాబురె
కల్హారమరంద మట్లు కల్గికిఁ బల్గుల్.

(79) "చందురులోఁ గందు మిగుల సమ్మదవృత్తిన్"

క. ఎందుకుఁ బలుమాటలు మీ
కిందఱకును భ్రాంతియేల యీయింతిముఖం
బందము వేఱే లే యల
చందురులోఁ గందు మిగుల సమ్మదవృత్తిన్.

ఇది ఆగోపనసమస్య. ఈయింతిముఖలక్షణము చంద్రునియందు కందున్=చూచెదను కనుఁగొందును అని భావము, కాని చంద్రునిలో కందు=కళంకము అని కాదు.

(80) "దోన పులి మొన యమ్ము శాఖి తుద లని పలికెన్"

క. వనజాంబకుండు ననుఁగని
కినుకం గసలుచును గనులఁ గెంపు జనింపన్

ననతూఁపు లేసి రమ్మను
దొనపులి మొనయమ్మశాఖితుదలని పలికెన్.

ఇది-అంతర్లాపిసమస్య-దొన, పులి, మొన, అమ్మ, శాఖి, ఈశబ్దములతుదలు, అంత్యాక్షరములు, నలినముఖి అనియగును. ఒక స్త్రీ తన చెలికత్తెను జూచి దానితో ఓనలినముఖి నన్ను మన్మథుఁడు రమ్మను నని పలికె నని భావము.

(81) "నారదవంద్య కాంతిజితనారద కౌఁగిలి నీయవేమిరా"

క. మదనుఁడు కోపముచేతం
గదనంబును జేయఁ దొడఁగెఁ గ్రక్కుననోనా
రద వంద్య కాంతిజితనా
రద కౌఁగిలి నీయవేమిరా యిదియేరా.

ఇది వృత్తగోపనము—ఉత్పలమాలవృత్తమువలె సమస్య కానిపించును, గాని, కందపద్యములో నిమిడిపోయినది.

(82) "కలిమిబలిమి ఫలముచలము కళుకుకులుకు ఠీవి యీవి కలిగి మెలఁగి నీవలరుమిాఁ."

క. కలిమి బలిమి ఫలముచలము
కళుకు కులుకు ఠీవి యీవి గలిగి మెలఁగి నీ
వలరు మిాఁకఁ బలుమఱును గలు
ములను గల కలికి ప్రతిదినము కరుణ నేయన్.

ఇది వృత్తగోపనగతిభేదసమస్య

(83) "అనఘులు హరిహరు లనయము దయచే మనుపఁ జెలువు గులుకును జగతిన్."

క. వనజాస్య వింటివా తెలి
యను నాయనఘులు హరిహరు లనయము దయచే
మనుపఁ జెలువు గులుకును జగ
తిని నాచెలువకును సాటి తెఱవలు గలరే.

ఇదియును వృత్తగోపనసమస్యయే. "అనఘులు హరిహరులనయముదయచే" నని మణిగణనికరముగా దోఁచును. కాని కందపద్యమే. అనఘులు హరిహరు లనయము దయచే

కొని మనుషఁ జెలువుగులుకును జాతిన్ అని మూలములో మణిగణనిగరము రెండుచరణము లీఁబడినవి. కందపద్యములో కొని యను రెండక్షరములు తీసివైచినఁగాని సరిపోదు.

(84) "కలికీ ననుఁజూచి విడెము గైకొను మింకన్"

క. వలరాజు చేతికోలఁదిని
జలమున నాపైని బాణజాలము వేసెం
గలమాట చెప్పి తిప్పవె
కలికీ ననుఁజూచి విడెము గైకొను మింకన్.

(85) "బావిని బట్టములు దానిపైకడఁ గొండల్"

క. దేనర పరాకు విను మిది
గో విద్యను నైంద్రజాలికుఁడు నేనని మా
యాపిలసనమునఁ జూపెద
బావిని బట్టములు దానిపైకడఁ గొండల్.

(86) "ముక్కులు నాలుకలు మూఁడు పొలఁతికిఁ గంటిన్"

క. అక్కట యిదేమొ తెలియను
నిక్కముపలెఁ దోఁచెఁ గలను నిన్నఁటిరేయిం
జెక్కులు పదారు నెనిమిది
ముక్కులు నాలుకలు మూఁడుపొలఁతికిఁగంటిన్.

(87) "విధవా నీమగఁడు నిండు వేకటి గదవే"

క. విధురథసంబుద్ధి త్వదీ యధవుఁడుఁ పూర్ణమగుగర్భ మన్యాభిధచే
మధురాక్షి తెలుపుమంటివి విధవా నీమగఁడు నిండువేకటి గదవే.

విధురథసంబుద్ధి=విధవా (వి=పక్షి, ధవ=ప్రభువు) గరుడ! త్వదీయధవుఁడు=నీమగఁడు. పూర్ణగర్భము=నిండువేకటి-అని క్రమాలంకారము-అన్యాభిధచే=మాఱుపేరులతో వచ్చినది. విధురథుఁ డనఁగా విష్ణురథుఁడు, గరుడుఁడు, గరుఁడునిసంబుద్ధి, విధవా! పక్షిరాక్షి!

(88) "చేతోజాతదవానలంబుడుపవే నీమాటి యీమాటికిన్
స్రోతస్సంధుల నంబుయంత్రనతికృతోర్ప్రిద్గీతగేయాఘముల్
జ్ఞాతిశ్చే దనలేన కిమ్మనెడి వాచారూఢి సత్యమ్ముగన్."

శా. జ్ఞాతిశ్చే దనలేసకిమ్మనెడి వాచాయూథి సత్యమ్ముగం
జేతోజాతదవానలం బుడుపవే సీమాటయీమాటికిః
స్రోతస్సంభుల నంబుయంత్రనతిక్రృత్ప్రోద్గీతగేయశాఘముల్
రీతిందప్పను మబ్బుగ్రమ్మె వెతలః శ్రీపుత్రు నః ద్రోయకే.

బ్రహ్మ సరస్వతిని బ్రార్థించెనుట. బ్రహ్మకు మన్మథుఁడు జ్ఞాతి యని-

(89) "చిటికెనవ్రేలియుంగరము చేడియ కొడ్డెనమాయె భూవరా
కటకచరత్త్రరేణుకరకంపితసాలము శీతశైలముం
గటకట దోసపం డినుపకట్లకుఁ దాళునటే తలోదరి."

చ. చిటికెనవ్రేలియుంగరము చేడియ కొడ్డెనమాయె భూవరా
కటకట దోసపం డినుపకట్లకుఁ దాళునఁటే తలోదరీ
కటకచరత్త్రరేణుంరకంపితసాలము శీతశైలముః
ఝటితిని గాంతు నేనని నిజాంగనతోడను దెల్పు వేగమే.

పార్వతి తనపుట్టినయింటిలో (హిమవత్పర్వతమున)నుండి చెలికత్తెతో నాయకునికి వార్తయంపినది. ఆచెలి శంకరుం గని, భూవరా! పార్వతీదేవికిఁ జిటికెనవ్రేలియుంగరము ఒడ్డాణమాయె నని తన కార్శ్యముం దెలియఁజేయ, శివుఁడు, అనుశయమునొంది, తలోదరీ దోసపండు, ఇనుపకట్లకుఁ దాళునా, అనఁగాఁ, బార్వతి విరహవేదనకు సహించునా యతిశీఘ్రముగా వచ్చుచున్నాఁడనని చెప్పుమనియె నని భావము.

క. ఈకృతి యతికఠిన సమ స్యాకృతిఁ జదివినను విన్న నఖిలార్థము శ్రా
నేకృతికైన శీఘ్రమె శ్రీకృతి విజ్ఞాతరయను బృహదంబదయః.

గద్యము. ఇది శ్రీబృహదంబికా పాదారవిందనిరంతరసంసేవనావిశేషలబ్ధ మహాసామ్రాజ్య ధురంధర, సకలభూపాల సభాభాసుర యశోబంధుర, హనుమద్గరుడ మకరమత్స్య పతాకాది మహారాజలక్షణ నవవిధాంగ భేరీప్రముఖ నిఖిలవాద్యగంభీర నినాదశ్రవణమాత్రవిరోధి గర్భ నిర్భేదన విచక్షణ, పాండ్యభూపాల దక్షిణ బాహాయమాన సకలభూపాల సంస్తూయమాన, వాత్స్యాయన ప్రభృతి శ్రుత్యంత పర్యంతరపరిచయ సముత్తేజిత ప్రతిభా విశేష ప్రబంధ శతసమానవచోనిర్జితాదిశేష, ఆశుగచనీయ మధురాది కవితాధౌరేయ, కవిజనవిధేయ, రణరంగవిజయ రఘునాథ విజయరఘునాథ తొండమః మహీనాథ తనూజ, రసికతాభినవభోజ కోటికులదీప శ్రీరాయరఘునాథ భూపప్రణీతంబైన కవిజనోజ్జీవనియను కావ్యంబునందు సర్గంబు నేకాశ్వాసము.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు — ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురముమహా రాజావారు; పరిషద్వ్యవస్థాపాధ్యక్షులు.
కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.
కీ. శే. శ్రీ బొబ్బిలిమహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు–ఉయ్యూరు జమీందారువారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభావర్గము.

### కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.
వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

### —కార్యనిర్వాహకసభాసభ్యులు.—

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయఁడుగారు, (కోశాధ్యక్షులు)
పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ. ”
చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.
కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు.
శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., ఎల్. టి.
దర్భా వేంకటశివరామరాసుగారు, బి. ఏ., బి. యల్.
అళక్కి వేంకట్రామయ్యగారు.
కేశవరపు కామరాజుగారు.
కోకా వేంకటసుబ్బారావునాయఁడుగారు.
వేలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.
పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.
పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మారావునాయఁడుగారు

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౨౫. { ధాతృనామసంవత్సరము. మార్గశిరపుష్యమాసములు } సంచిక ౫.



కొత్తపల్లి సూర్యరావుచే [illegible]లయమునఁ ప్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

ఆ 1936 సం. డిసెంబరు, 1937 జనవరి మాసములు.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౫. { ధాతృనామసంవత్సరము. మార్గశిరపుష్యమాసములు. } సంచిక ౫.

## పాశ్చాత్యవిజ్ఞానయుతులు, నాటిపద్యాదులు.

—: కాశీభట్ల కృష్ణరాయశాస్త్రిగారు :—

హృద్యంబుగ ననవద్యంబుగ గద్యంబు రచింపఁ దలంచి భావప్రధాన మనియో రసప్రధాన మనియో వాదించి యాంగ్లభాషావిష్కృతభావాడంబరఘోరణీప్రవాహదుర్వారనిపాతప్రభూతపరిపాటి నానాసమ్మేళనాందోళనములోఁ బ్రాయుచున్నారు. వీరేశలింగాది మహామహులాంగ్లసంస్కృతు లయ్యు నాంధ్రసంప్రదాయశిక్షితు లయి యాంధ్రసాంప్రదాయిక దివ్యసత్త్వారాధనీయ గుణానుబంధపూజ్యశీలు రగుటఁ దత్తద్రచనారీతు లుదారవ్యక్తిస్ఫూర్తుల నొప్పెను. అట్లు కాక యొకవిధమగుబింకము మనఁ బెట్టుకొని మద్రాశాలైకగురుకులవాసులై యాంగ్లముగ్ధులై పాశ్చాత్యభావనామూర్తులై యొప్పు కొంద ఱాంధ్రమునకు నన్నివిషయములలోఁ సంస్కారములఁ బ్రారంభించుచు నవత్వ మిచ్చుచున్నారు. ఆనవకళాప్రతిభాప్రకాశము తత్సహృదయైకహృదయంగమ మగునేమో కాని శాస్త్రీయసంప్రదాయాచారబద్ధముగ భారతీసమారాధకు లగువారికిఁ దలతిక్కగనే యున్నట్లు స్పష్టపడుచున్నది. క్రమముగఁ దెల్పెదను. ప్రకృత మీరచనలఁ జూచుకొందము.

పద్యములను వ్రాయ మొదలిడి భాషాపరిచయకష్టమున యతులును ప్రాసములు నఱసున్నలు శకటరేఫములు, నేల యని వాదింపఁ దొడఁగిరి. గ్రాంథిక మేల ? వ్యవహారమే ప్రయోగింపఁదగు ననిరి. గణము లేల ? మాత్రాగణములే చాలు ననిరి. సిలబి ల్పద్ధతి మంచి దనిరి. బ్లాంకువెర్సులే లెస్స యనిరి. భాషావిషయ మెట్లున్న నేమి? భావము విశాలముగ నుండవలయు ననిరి. అన్నింట స్వైరవిహారము చేయవలయు ననిరి.

ఆస్వైరవిహారపాటవము దుష్ఫలకమై యన్నింటఁ బొడమినను భాషావిషయమున నగతికత్వహేతువుచే నఖండవీరస్వైరవిహారము సాఁగుచున్నది. వాచ్యవాచక, వ్యంగ్యవ్యంజక, లక్ష్యలక్షకభావములు లేక వ్యర్థనార్థకములుగాక శబ్దములు ప్రయోగింపఁబడుచున్నవి. చూడుఁడు.

"కన్నీటికెరటాల వెన్నె లేలా? నిట్టూర్పుగాడ్పులో నెత్తావి యేలా?"

ఏలా ? అనుచు సందేహడోలాశ్రయవిహారము చేయుటేలా ? ఎంతమహోగ్రదుఃఖమునందును సుఖలేశ మూహించి యాశాబద్ధుఁడగు నని బోధించుటకే కదా ! అగుఁ గాక. ఆవెన్నెలలు కెరటాలకు సహాచరితములా ? ఈయాశయద్విషయకము- ఆనందబాష్పములు కాఁగూడదా ? కన్నీరు మున్నీరై కెరటాలుపుట్టెనా ? అగుచో దుఃఖభావమేకదా ? మరణశోకమా ? సామాన్యమా ? కాక యీర్ష్యావిష్టహృదయ యగు నొకనాయిక యేడ్పా ? ఈవిషయ మసంబద్ధముగ లేదా? దుఃఖసామాన్యసంబంధ మందురా ? విషాదమాత్రపర్యవసితములును గలవు. పునస్సమాగమరహితస్థితిని శోకించుభావము పూర్తిగ నున్ననే కరుణ మనఁబడును గదా? ఆకరుణరసమున వెన్నెల లేదే. వెన్నెలజిగిమిలమిలమను పొందికయే వర్ణ్య మనుకొందము. అప్పుడును వ్యక్తిసందిగ్ధమే. ఇఁక ధ్వన్యాశలమాట నెట్టవలసినదే. అయినను గానవిశేషము గల దని స్థానమువారిప్రభావమువలన ననవలసివచ్చు నందురేని నౌ ననియు గానలౌల్యము విలక్షణమై శాబ్దిపై నధిక మాధారపడియుండు ననియు నందుము. రచనాపరిపాటియుఁ జెడినది. కెరటాలకు- అని ద్వితీయ

ప్రథమచరణమునఁ గలదు. ఇతరమున "షష్ఠి"యుఁ గలదు.

నిట్టూర్పుగాడ్పులో నెత్తావి యేలా.

వెన్నెలవంటినిర్దిష్టవిశిష్టస్వరూప మీ నెత్తావిలో లేదు. నెత్తావి యద్విధమో తెలియదు. 'గాడ్పు' పదము నిట్టూర్పు నతిశయింపఁజేయుటకా ? నిశ్శ్వాసప్రభంజనమును ఝుం ఝూమరుత్తను జెప్పుటేమి? ఫెళఫెళార్భటులలో మెరపేలా ? అనుచున్నారు. ఐకకాలికములా యానుపూర్వికములా ? ఉరుములమెఱపుల యుల్లాసమా ? పూర్వచరణము నం దున్న యధికరణకారకసామర్థ్య ముత్తరచరణంబుల లేదు. కెరటాల నధికరించి వెన్నెల యున్నట్లు ఫెళఫెళలయందు మెఱపుండదు. ఇట్లే కారకదౌర్బల్యము. క్రమక్రమముగఁ బ్రబల మయ్యెను. ఫెళఫెళలతో మెఱపనియా ? అశనిపాతంబులో నంబువేలా? పిడుగులో నీరేలా ? అని యడుగుచున్నారు. పిడుగులో నీ రేమిటిది ? హాలాహలములో నమృతమున్న దని యెందుఁగలదు ? ఈ యేలపాటలోఁ గ్రొత్తఁదనము గాని భావవిస్తృతి గాని లేకుండుటే కాక భావవైకల్యము గలదు. మొదటి చరణమున నే భావమో యన్నింట నా భావమే కలదు. ఇట్లు తత్త్వాల ధోరణి కంత మాతనియిష్టమే. పాడిన సొంపును లేదు. మానిన వంపును లేదు. చీఁకటిలో మినుకుచుక్కేలా? మండువేసవిలోను గండుకోయిల లేలా? వేఁపనూనె కంతవెగటుగుణ మేలా ? వెఱ్ఱివాని కంతవైరాగ్య మేలా? ఉప్పుసంద్రములోన గొప్పరత్నము లేలా ? ఉల్లోలకల్లోలకదనరంగోత్తాలభీకరాయుధ సంఘర్షణములో గెలుపులచ్చి యేలా ? అని పాడి వినువచ్చును. కవిస్వభావనాభావుకదివ్యప్రపంచమున విహరించుచు గానము చేయుచున్నాఁ డన్నచోఁ దద్గానజాతివిశేషము సువ్యక్తము గావలయును. ఉదాహరణముగ నీక్రింద వ్రాయుదును. "కన్నీటికెరటాల ఆవెన్నెలేలా ?" అని నిర్దేశించినచో విశిష్టత యుండెడిది.

గీ. నవ్యత యనారతంబు నానందదాయ
కముగదా జనతతికి రక్తాక్షినామ
నూత్నవత్సరమా రమ్ము... స్వాగతమ్ము
పీడవదలఁ బిశాచము పిల్చినట్లు
నీవు మాత్ర మంతకంటె నధికము గావురక్తాక్షి...

ఏమి స్వాగతము. రక్తాక్షి పీడ తరువాతవచ్చినపిశాచ మఁట. ఈ పిశాచమునకు స్వాగత మేల ? ఇది స్వాగతములో దురాగతము. ఆంగ్ల

లమర్యాద యట్టిదై యుండ నోపును. "Please" అనుపదమును జేర్చి యెంతకఠినముగనో వ్రాలనోడరు.

> "Please, do not talk too much.
> Please go out of my room
> You act foolishly please."

ఈప్లీసుపదమున కేమైన శక్తి గలదా; అట్టిసంప్రదాయమున రచింపఁబడి యుండదా ? "ఆరక్తాక్షిస్వాగతము". ఇఁక రమణీయత యనునది విజ్ఞులే యూహింపవలయును. ఆరక్తాక్షిని వే ఱొకరు రమణీయముగ "పాపాత్ము లగువారి పాలిరక్తాక్షి, భారతద్రోహులపాలి రక్తాక్షి, స్వమతధిక్కారులపాలి రక్తాక్షి," అని వినుతించి కవితాధోరణీవిలాసమును బ్రదర్శించిరి.

నాబాలకృష్ణుండు నలు పైన నేమె
నాకాంతు ముద్దాడ నలు పంటునమ్మ.

అని కలదు. నలు పిష్టము మొదటిపాదములో- రెండవపాదములో నలు పనిష్టము, ఏమి రచన.

శబ్దించు నెద్దో హృత్సరసీజమునను
జీవనప్రసవమ్ము చిఱుగకమున్నె
మకరందఘుని రూపుమూరకమున్నె.

శబ్దించు నెద్దో యనఁగనే శ్రోతల కెట్లు స్ఫురించునో- పువ్వు చినుఁగుట యేజాతీయమో- జీవనప్రసవమ్ము చివుకకమున్నె యన్న నెట్లుండునో ? మకరందము మార్పేమొ ? ఏధ్వనియో; కలగూరగంప డింపుడుపాటు గాక కవితాపాటవమే యిట్టిది ; "ఆపరాధీనతాసూత్ర మాదె కలవు వెలుఁగుపెన్నిధులు" అని యొకకవి వ్రాసెను. పరాధీనత్వమునకు సూత్రారోపణ మేమి; తదంతర్గతము లై పెన్నిధు లుండుట యేమి; ఈసూత్రమునకును బెన్నిధికిని నాధారాధేయసంబంధ మెట్టిది ; ఆంగ్లములో "Principle" శబ్దము స్మృతికి రాఁగ దానియాంధ్రీకరణ మిది కాఁబోలును "మల్లికాసుమతారాప్రఫుల్లసురభికౌముదీదీప్తి, నొకరకము వారరసిరి. ఏమిదీప్తియో; ఆసమాసార్భాటములో నే మున్నదో;

గాన పత్త్రాంచలలసమద్వాంతగీతామృతాస్వాదనపరు లెట్లేని రచింతు రని యెఱింగి "సలాము" కొట్టవలసినదే.

సిరము పాదములతోఁ జేరిపోయినదాఁక
　　మోదంబుతో నిన్ను మ్రొక్కనిమ్ము
ఎలుఁగు గద్గదికతో నింకిపోయినదాఁకఁ
　　జెలివితో నిన్నుఁ బ్రార్థింపనిమ్ము-

అనన్యైకాంతికభక్తిరసము ప్రవర్తింపఁ బైరీతి రచించిరి. వీ రాంగ్లముగ్ధులు కాని నాంధ్రసంప్రదాయాభిరతి కలిగి లేనివా రగుట నొకవింతపోకడమితో రాణించు వీరికవితలో నసందర్భములు పెక్కు గలవు. సిరము పాదములతోఁ జేరిపోవుట యన నేమి; నమస్కరించువాఁడు వంగి వంగి క్రుంగి క్రుంగి తనశిరస్సు తనపాదములపైఁ బడునట్లు నమస్కారము సేయుట యెందేనిఁ గలదే. సాష్టాంగనమస్కారము పూర్వులు వర్ణించిరి కావున సష్టాంగనమస్కారమనిదీనివర్ణించిరా; నడుమువిఱుగ నమస్కారమా నిఖిలాంగకమ్ములు నిన్నుఁ జేరునంతకు మోదంబుతో నిన్ను మ్రొక్కనిమ్ము, అనియో మోదంబుతో నిన్ను మ్రొక్కుకొందు, అనియో వ్రాసిన నెట్లుండునో కాని పాదాలతోఁ జేరిపోవుట యనుమర్యాద బాగుగ లేదు. ఎలుఁగు గద్గదికలో నింకిపోవుట రసవత్తరముగ నుండును.

"నీనాట్యమ్ములు నామనస్థలినె కానిమ్ము నీగానలీ
లానైర్మల్యమనోహరశ్రుతులు గాల్వల్గట్టి నాకంఠమం
దే నిండంగనదింపు మోయి మధుమూర్తీ నీకటాక్షద్యుతుల్
రానిమ్మోయి మదీయజీవితతమిస్రద్వారముం జీల్చుచున్".

ఓయి మధుమూర్తీ రానిమ్మోయి నీకటాక్షకాంతులు. అని యెంత యవినయముగ నడుగుచున్నాఁడో; గూనలో బియ్యము రాగిచెంబులో వేయవోయి ఓయి వేలవాఁడా, అన్నట్లు నీటు, ఠీవి, టెక్కు, కన్పట్టుచున్నది కాని భక్తి లేశమును లేదు. "ఓయి" కవిత్వకళ యిప్పు డందఱును బ్రదర్శించుచున్నారు. పోయియు "ఓయి" వంటియగ్రస్థానమునే పొందెను. చెప్పకుపోయి, చేరిపోయి, తన్నుకుపోయి, తప్పిపోయి, పెక్కు లుపయుక్తము లగుచున్నవి. నవ్యసాహిత్యములో "ఓయి" మ

హాశక్తియె తాండవించుచున్నది. పోనిండు. ఆమధుమూర్తికి నేయే యాజ్ఞలు చేసిరో వినదము. ఓయి మధుమూర్తీ; నీనాట్యమ్ములు కానిమ్ము. రంగస్థలము కావలయునా; నామనస్థలము గలదు తే ఆడు......... ఇఁక గానము చేసి శ్రుతులు నాకంఠములో ధ్వనింపుము. నాజీవితతమిస్రద్వారమును జీల్చుచుఁ బొమ్ము.........ఏమిధ్వనియో! తనయందు దేవుఁడు నిత్యము నుండవలయు నని యాజ్ఞాపించుచున్నాఁడు. గొప్పభక్తుఁడు. ప్రపత్తి కుదిరినది. నాట్యమాడు మని యనుచున్నాఁడు. కాని స్థలము నుచితము గావింపలేడు. భగవంతుఁడు నటకుఁడే యైన రంగస్థలము వలదా? అర్థసంపద లేని వా రేమిచేయఁగలరు. రంగనిర్మాణము చేయనేరక మనఃస్థలినె యాడఁ జూపిరి. పాటలశ్రుతులఁ గంఠమందుఁ గావింపవలయు నన్నారు. గాన లీలానైర్మల్యమనోహరశ్రుతులు కాల్వలట్టుట యే మొ వింతగ నున్నది. తాల్వాదిస్థానము లుచ్చారణాధారములై యుండఁ గంఠమునందే నిండ నడింపవలయు ననుట యేమి; కాల్వగట్టి నింపి నడిచుట యేమివర్ణనము; కటాక్షమ్యుతులు ద్వారమును జీల్చుటయేమి; గుమ్మములు పొడిచి తలుపులు తెఱచిన తస్కరులయట్లీపనియేలా; కవాటము లని లక్షణార్థమా; కడపటికిఁ బొమ్మని శాసించుట యేల; ఏమిభక్తిరసమో!

మనస్సాగరము తాండవవిశారదత వహియించు నని యొకకవి యనుచున్నాఁడు. సాగరమును దత్తాండవమును నభినవకలాప్రతిభ యై యుండునో;

"రక్తిఁ బల్లవనికరమ్ము రమ్మని జీరు
నధరమ్ముపై మందహాసరుచులు"

ఇత్యాదిగ హరితుఁడుకవిగారు వ్రాసిరి. గుప్తనాములై భాగ్యదేవతారాధనావర్ణనము గావించిరి. దేవతలను వర్ణించుపట్టునఁ బాదాదిగ నుండవలయు ననుట భారతసంప్రదాయ మని యెఱుంగరో యెఱింగియు సంస్కరించిరో; పోనిండు. మ దహాసరుచు లెఱ్ఱగా నున్నపెదవిపైఁ దళ్కొత్తె నని వర్ణించుటలో 'రక్తి-పల్లవ' శబ్దము లశ్లీలార్థకము లగుచున్నవి. "రక్తి" శబ్దసంయోగము పల్లవశబ్దనానార్థాన్వితమవిటపదార్థావబోధనాజ్ఞాపకముగ నున్నది. "జీరు" సరళాదేశ మేదేశమో.

యౌవనోత్తాలోర్మ్ము లల్లన నంతకంతకు నణఁగుచున్నవి
మందరమ్ముగ దరియుచున్నది మరణ యామవతి—

ఈరచయితలు తమలో నుబ్బిపోవు సాహిత్యవేత్తలు. భాషావై దుష్యమును జూపఁదలఁచి పదముల యోజన మనుచితముగఁ జేయుచు నధికపదముల నల్పభావమును బ్రదర్శింతురు. కథకులై యేదియో వ్రాయుదురు. యౌవనానంతరభావి మరణమని నియతమైనదా; మరణ యామవతి దరియుచున్న దని యధీరహృదయమును బ్రదర్శించుచున్నారు. "అల్లన నంతకంతకుగా గడచిన మాటలు కవితగాదా; "మరణ యామవతి" స్త్రీత్వము యమద్దిష్టమో; స్వారస్యము రసికతలేక యేదో యాడంబరముగ వ్రాయుదురు.

"పాదంబు కడుపులో బ్రహ్మాండమెల్ల
నిండను మంజీరనినదంబుతోడ,
నెమిలిపింఛము భవ న్నీలాంశుకమున
బంగారుశాలువు బాహుయుగ్మమున
వెన్నకాదాలాటి స్విన్నమానసము,
మధురలోఁ బాముతే మరపింపలేదు.
వీవ్రుతంబుసేము, తద్విశ్వరూపంబు, ......

"బాహుబలమున సంతరించుచు నుంటి" దీని కంత మెన్నఁటికో—
ఎవ్వరు కాతరిల్లెదరు, ఏమి నీకరుణాకటాక్షము స్వామి ధన్యోహం."

శబ్దాడంబరమాత్రభావశోషితస్వరూపమునకుఁ బైనుదాహరించినవి చాలును. పాదంబు కడుపులో మంజీరనినదముతో బ్రహ్మాండము నిండుట యేమిసంబంధమో యెఱుకపడదు. మంజీరధ్వని బ్రహ్మాండసమాకర్షకమనియా? తనయుదరముననే లోకము లున్నవని యాద అనుట విని విసివి పాదగర్భములోఁ బెట్టిరా? ఇది వైదికమని యందురా? "పాదంబు కడుపు" ఏమియోజనము! గర్భాలయ మన్నదానిని 'కడుపుటిల్లు', చేసిన ట్లుండును.

భవన్నీలాంశుకమున నెమిలిపింఛ మున్న దన్నఘట్టము దుర్ఘటముగనున్నది. బాహుయుగ్మమున శాలువవేసికొనెనఁట, క్రాపింగు, ఫ్రెం

చిక్కటింగులు, కారాకిల్లీ, క్రమక్రమముగ వర్ణింపఁబడు నేమో? ఏమిచేయుదు. చిత్రము లన్నియు నిప్పుడు మరణదుఃఖానుభవసమయమునం దట్లు జుట్టు విరియఁబోసికొనియే యుండును లెండు. నటకులును దానినే యనుకరించుచున్నారు. కావునఁ గృష్ణునివేషము సంస్కరింపరా? నీలవర్ణము, శిఖిపింఛము, మురళి, యింకను గొన్నిదినము లుంతురో త్రుంతురో సంస్కృతదేకాధారాధీనము.

వెన్నకాదు, ఆలాటిస్విన్నమానసము. వెన్నకాదు. అది వెన్న వంటి స్నిగ్ధమానస మను తాత్పర్యము సంగ్రహించి సందేహాస్పదము నుగావించిరి. ఆలాటి యేపెద్దలాటియో? "స్విన్న" పదమేలదొర్లి పడినదా?

"మధురలోఁ బారు లేమరపింపలేదు" పౌరుల నేమఱపింపలే దని యా యిా ప్రేరణము పాదపూరణమా? పీవృత్తపదము వివృతమాపాంతరమా? అహా రీతిసారళ్య మెంతలెస్సగ నున్నది? నిరంకుశు లరంకుశమ్ము పాటింతురా? ఈఁదుచున్నాననుటకు సంతరించుచున్నా నని ప్రయోగించిరి, సరళమే; కాతరిల్లెదరు భయపడెద రని యర్థము. ఇాచాలు నిల్లుల భావకవుల ప్రపంచములోఁ బెచ్చుపెరిఁగిపోవుచున్నవి. "స్వామిధన్యోహం" అనుకరణము లేదు. దండకములయంతమున "నమస్తేనమః" అని యున్నది కావున "ధన్యోహం" అని నిరనుకరణముగ రచించిరా? చిత్తము?

ఇట్లే వీఁరచనములు సందిగ్ధములుగను ననుచితములుగను నుండును. ఆవర్త మనుపేరితో నొకపెద్దసుడిగుండములో నొకభక్తుని నాత్మహత్య గావించుకొనుటకు దింపి చంపిరి. ఏమివస్తువు?

రాధపిలుపని వ్రాయుచుఁ గృష్ణుఁ డాపుష్పమున లేఁడనియు నంతట నున్నాఁడనియు నెక్కడలేఁ డనియు నేమేమొ యవకతవకగ బోధించిరి. శీర్షనామ మొకవిధము, శరీరలక్షణ మిం కొకవిధముగను బూర్వోత్తరసందర్భవిరుద్ధముగను జెప్పుటలో దిట్టలగుచున్నారు. వీరిధోరణు లన్నింట నిట్లే యననుబంధముగ నుండును.

"వేదనాదంబుతోఁ దేటివిప్రుఁ డెగిరి
చిన్నిజిలుగులరెక్కలచేతు లెత్తి
మేలిదీవెన లిడె నూత్నమిథునమునకు-"

ఇందలి నూత్నమిథున మెంతవింతగ నున్నదో కనుఁడు. ఆవిప్రుఁ డెగిరి చేతులెత్తి దీవించెనఁట. అంతట రూపకము గలదా? ప్రణయ దేవత పొంగి ముగ్గులు పెట్టెనఁట. దేవత కుత్సాహము కలిగిన ముగ్గులు పెట్టునా?

"గాలిమొలకల చాలు రేగెను కలికి కేవల పిష్టమో?"

మొలకగాలులు రేఁగినవఁట. కలికికి ఏవలపిష్టమో? అని యనుచున్నారు. విషయము నీఁడ, యనియు విసిగమము, ఏవల పనియు నను చిత్రముగ వ్రాయుటయే కాక "కలికి—కేవల పిష్టమో" అని పిండి ముద్దను గూర్చి మార్చిరి. ఆహా! ఏమిరచనము!

గీ. ఏది నీ కక్కపెట్టిన దాదిరూపు, చిత్తముండనిమాటల యుత్తముండ
సొంపు గులుకనిపద్యంబు కంపదేల, సరస వాచానిరూఢ ప్రశస్త చరిత.

ఇత్యాదిపద్యంబులయం దర్థము లున్నట్లు "కేవలపిష్టము" లోఁ బిండిముద్ద లేదా? ఇది పిష్టకష్టకృతి యనుకొందము.

"ఆకులో ఆకునై - పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై - నునులేత రెమ్మనై
ఈయడవి ఎక్కైన - దాగిపోనా ఇచటనే - ఆగిపోనా"

అడవిలో దాఁగుటకో నాఁగుటకో శంకించుభారము. ఆకులోఁ దానొక యాకగుట యనఁగ నాకగుట యనియా? "లో" షష్ఠియా సప్తమియా? ఆకులలో నొకయాకగుటయా నాకునందా కగుటయా? అర్థవిచారము చేసిన భావపుష్టి నశించితీఱును. ఆకులో నాకుఁ బువులోఁ బువ్వ నగుధోరణి మాఱి "నునులేతరెమ్మ" యగుట యేమో; రెమ్మలో రెమ్మయున్న రసభంగ మనియా?

"గలగలని వీచు చిఱుగాలిలో కెరటమై
ఈకరణి వెఱ్ఱినై యేకతమ తిరుగాడ."

ఏకాంతసుఖ మనుశీర్షము క్రింద వ్రాయఁ దలఁచి పర్యవసానముగ వెఱ్ఱి యగుట సుఖాత్యంతికభావవిశేషముగ రచించిరి. ఉన్మాదమని మెఱుక యగుచో విషాదము సంభవించును. గాలిలో కెరట

మగుట నాంగ్లభావ మనుకొందును...... వేదాంతార్థసౌందర్య మం దున్నదని వ్యాఖ్యానించుచో నేమన్నను వేదాంతములో దిగవచ్చును.

ఈధోరణిలో నెంతయో వ్రాసి వేదాంతార్థము చెప్పవచ్చును. ఇంతేల, బూతాడి పుణ్యార్థమును జెప్పవచ్చును. ఇట్టిరచనములా భావుకములగుచున్నవి; కీడుమూడుతఱి ధీరచిత్తుఁడు దేవదేవునిఁ గొ పాడుమని వేఁడఁదగునే యని యొకకవిగారు శంకించుచున్నారు. మాంపాహి యన రాఁదట......

"సరసరసాలనూతన కిసాలయభోజనమారగించి సుందరతరమల్లికాకుసుమదామము లన్నకరందనిర్ఝరాంతరములఁదానమాడుచు లతాచయడోలల నూఁగుచున్— కూయుచున్నదఁట. ఏమిభావసౌందర్యమో? కోకిలభోజనముచేసి స్నానమాడుచు నుయ్యెలలూఁగుచుఁ గూయుచున్నదఁట. ఏమిసంప్రదాయమో ? పంచమస్వరసార్థక్యమునకా భోజనాదిక్రమము? కుసుమధామములలో నిర్ఝరముల నీకవిగారు సృష్టించిరి......

ఆంగ్లములో సొంపైననాంధ్రములో సొంపగునా ? ఏమిత్తర్కము? నేఁడించుమించుగఁ గవివరులాంగ్లముగ్ధులే కాని కేవలాంధ్రులు మనసవనాగరకదృష్టిలోఁ గానేరరు వారిరచనలే ప్రచారార్హములు. ప్రచారకులును దత్సహృదయు లగుచున్నారు. ఇంతయేల ? ఆంధ్రాదివార్తాపత్రికలయు భారత్యాదిమాసపత్రికలయు నధిపతు లరయ నరయ నాంగ్లమాత్రాభీప్సాపరిపాకచిత్తులన్నఁ గినియ రనుకొందును.

దేశము:- తనదేశమును దన్నామమును నాంగ్లప్రతికృతిగఁ జేయఁదలంపే మెండయ్యెను. సాలూరు"సాలూర్"-విశాఖపట్టనము-"వైజాగపటమ్" ఇత్యాదిహాలంతనామకరణాభిరుచి హెచ్చుచున్నది. గృహసౌధాదికము లింగ్లీషువారిమాదిరివే యని యందఱుంగుదురు. దేవగృహ మనుమాట లేకపోవుటయే కాక దేవస్థాన మని ప్రత్యేకనిర్మాణ మొండును గానము.

# కర్ణధర్మరాజవృత్తము.

## II

కీ. శే. తా. లక్ష్మీనరసింహారావుపంతులుగారు.

ఓహోహో! చూచితిరా కర్ణునిసద్వృత్తము. అవతారపురుషుం డైనకృష్ణు ననుసరించి మహానుభావు లనేకులు మహావరంబులు వడసి కుబేరు లైరి. సాత్యకియును భోజులును కుకురులును జైద్యాంధకులును వార్ష్ణేయులును సృంజయులును కృష్ణుని పరమయుక్తంబయిన బుద్ధి నాశ్రయించి యరులం బోకార్చి మిత్రసంఘములకు సంతోషము నిచ్చిన వారైరి. మఱియు నుగ్రసేనుండును సర్వవృష్ణ్యంధకులును యాదవులును మనస్వు లగుచుఁ బరాక్రమమున వెలుఁగొందుచు సత్యపరాయణత్వమున నుండఁ గల్గి దేవేంద్రుతో నెనయై భోగము లందినవారైరి. క్రూరుం డైన జరాసంధుని వధియింపించి వానిచే బల్యర్థమై వధింపఁబడుటకుఁ జెఱలో నుంపఁబడిన రాజుల నెల్ల విడిపించి దయాసముద్రుండై మంగళస్నానంబులు సేయించి భోజనతాంబూలంబులం బరితృప్తులం జేసి రథాశ్వసామజాధిరూఢులం గావించి నిజరాజ్యంబులకుఁ బూజ్యులం జేసి పంపినవాఁడుగదా! ఇవిగాక కృష్ణుని యమానుషకృత్యంబులు:—తన గురువైన సాందీపని పుత్రు నెన్నఁడో చచ్చినవానిని బ్రదికించి గురుదక్షిణగా నిచ్చుట లోనుగాఁగల యత్యద్భుతంబులైనవిగలవుగదా! ఈమహానుభావుని మాహాత్మ్యంబును నౌదార్యాదిసుగుణంబులును వర్ణింప నెవరితరము? అట్టి మహాపురుషుఁడు ప్రసన్నుఁడై పృథివీరాజ్యము నీకిచ్చెదనన్నఁ గర్ణుఁ డపేక్షింపఁ డయ్యెను. ఇందుఁ గర్ణునిస్వార్థపరిత్యాగము వర్ణనీయ మయినదిగదా!

మ. జలజాతప్రభవాదులున్ మనములోఁ జర్చింప నశ్రాంతమున్
"బలుకన్ లేని జనార్దనాహ్వయపరబ్రహ్మంబు."

అని బ్రహ్మపుత్రుఁ డైననారదునిచే వర్ణింపఁబడ్డ శ్రీకృష్ణుండు నీకు సమస్తరాజ్యం బొసంగెదను, నేను నీపరివారజనంబులో నుండు

వాఁడ వని తనకుఁ దానై మృదుమధురంబుగఁ బ్రేమపూర్వకంబుగఁ బలు
కనెవ్వఁ డైన నొల్లకుండునా ? కర్ణునియొల్లకునికి యాతని యాత్మత్యా
గితఁ బ్రకటించుచున్నది. మఱియుఁ దాను సూతవంశజు లైన తనపెం
పుడుతలిదండ్రు లగు రాధాధిరథులను విడనాడ ననుటయు వారికి స్వర్గ
సుఖము కొఱకు వేయవలయు పిండంబులు పడఁగొట్టఁ గడఁగఁదగ
దనుటచేఁ బితృభక్తిఁ గలవాఁ డనియుఁ బ్రకటించుచున్నది. యీవిష
యమై కృష్ణుని మంత్రంబు విన ననుటలోఁ గృష్ణునియం దెంతభక్తి చూ
పినవాఁడో చూడుఁడు.

గీ. ధర్మవిదుఁడును సతతంబు ధర్మశాస్త్ర
ముల శ్రవణమందు రతుఁడౌచుఁ బొలుచుచుండు
వాఁడునైనట్టి మనఁబోఁటి వాఁడె యల్ల
కాంత పిండంబు పడఁగొట్టఁగడఁగ నగునె.

అని తన్నుఁగూడఁ గలిపికొని కృష్ణునియం దెంతగౌరవ ముంచి
చెప్పినవాఁడో చూడుఁడు.

మఱియు ద్రౌపది నిన్నాఱవయవసరమునఁ గలయు నని కృష్ణుఁ
డు చెప్పినదాని కొల్లమి కర్ణుని యకామత వెల్లడించుచున్నది.

ఇందుఁ గర్ణుఁడు ధర్మరాజుకంటె ను శ్రీకృష్ణ పౌత్రుఁడైన యని
రుద్ధునికంటెను విశిష్టుఁ డని ప్రకటన మగుచున్నది. ఏమిటికంటేఁ దన
తమ్ముఁడైన యర్జునుఁ డనన్యసామాన్య ధనుర్విద్యాసామర్థ్యంబుచే భార్య
గాసంపాదించికొన్న ద్రౌపదిని మాతృవాక్యపరిపాలన మనుమిషచే సిగ్గు
లేక ధర్మరాజు తనకుఁ గూడ నుమ్మడిభార్యగాఁ గామించి గ్రహించెను.
అనిరుద్ధుఁడు ద్వారకాపట్టణములో నిజసౌధంబున నిద్రవోవుచుండు
సమయంబునఁ జిత్రరేఖ తిరస్కరిణీవిద్యచే నందు ప్రవేశించి బాణాసురుని
కూఁతు రుషాకన్యను నిన్నుఁ గూడినట్లు స్వప్నము వచ్చిన దని చెప్పి
దానియొద్దకు నిన్నుఁ గొంపోయెద నని నుడువుట తడవుగఁ జిత్రరేఖ
ముక్కును మొగమును దా నెన్నండు నెఱుఁగనివాఁ డైనను వెకలియై
తోడనె యంగీకరించి యానిమిషమందే యనిరుద్ధుఁడు తనభార్య ను విడ
నాడి యద్దమరేయి చిత్రరేఖతో బాణాసురుని పురికిఁ బోయి యుషా
కన్యను దానిసౌధంబున రహస్యంబుగఁ బరిగ్రహించె.

కర్ణునిభృత్యత్వము:—

కర్ణుఁడు దుర్యోధనునకు భృత్యవర్గములోనివాఁడు. సామంత రాజు; సచివుఁడు; భృత్యత్వములో నున్నను శ్రీకృష్ణుఁ డిచ్చెద నన్నమహా రాజ్యపదవి నొల్లమిచే లోకమునం గలభృత్యులలో నెల్ల నితఁ డగ్ర గణ్యుఁ డని ప్రకటించుచున్నది. ఆతఁడు శ్రీకృష్ణునిమంత్ర మనుసరించి తోడనె పోయి మహారాజ్యపదవి గైకొనెనేని వానిని దుర్యోధనుఁ డేమిచేయఁగలఁడు ? అప్పుడు కర్ణునకు వాఁడు భృత్యుఁడు కావలయు వాఁడేకదా ? ఓహో యేమి యీకర్ణుని బుద్ధి! మఱియుఁ గర్ణునిసత్య ధారిత :—

"అనయము చావువచ్చును" అని పయిని జెప్పిన పద్యమువలనఁ గర్ణునిఁ సత్యధారిత స్పష్టమగుచున్నది ఈవిషయమ్మున ధర్మరాజు కర్ణునిఁ బోలఁగలఁడా ? ధర్మరాజు నీ వెప్పుడు వధ్యుఁడ వగు దని తా నడిగిన పిమ్మట శ్రుతికఠినమును దుఃఖకరమును నగువార్త విన్నప్పుడు తాను యుద్ధముఁ జేయక శాంతి నొందెదనని ద్రోణాచార్యుఁడు చెప్పియునికిచే "అశ్వత్థామాహత" యని పెద్దయెలుఁగునఁ గేకవేసి యనృతము పల్కి ధర్మరాజు తనగురువైన ద్రోణాచార్యుని మరణమునకుఁ గారకుఁ డయ్యెను. రాజ్యప్రాప్తికై యనృతము పల్కి గురుద్రోహము చేసెను. కర్ణుఁడు బ్రాహ్మణుండ ననిబొంకి పరశురామునియొద్ద శస్త్రవిద్య నేర్చె ననియును, దానిచే వానిసత్యము చెడిన దనియును గొందఱందురు. అది పొరపాటు. శస్త్రవిద్యాదానమునకు బ్రహ్మక్షత్రియులు తప్ప నితరు లేమాత్రము పాత్రులు కా రని పరశురాముని నియమము. ఇందు, కర్ణుఁడు ధర్మరాజాదులవలెనే క్షత్రియుఁడు కాని హీనకులుఁడు గాఁడు. బ్రాహ్మణుఁడు కాక బ్రాహ్మణుండ నని చెప్పినంతమాత్రమున శస్త్రవిద్యాపరిగ్రహమునకు వాఁడు పాత్రభూతుఁడు కాకపోఁడు. కుంతీపుత్త్రుఁడ నని వాని కెఱుక లేనియంతమాత్రమున వాని కుంతీపుత్త్రత్వము చెడలేదు. వాఁడు క్షత్రియుఁడు కాకపోలేదు. వాని బొంకు పేరికి బొంకు గాని నిజముచేత బొంకు కాదు. అజ్ఞానముచే బొంకి వాఁడు సంపాదించినది జ్ఞానముచేఁ దాను బొంకక నిజమాడెనేని సంపాదింపఁగల్గిన శస్త్రవిద్యా

భ్యాసమే గాని యన్యము కాదు. ధర్మరాజు బొంకు గురుపుత్రుఁ డైన యశ్వత్థామ తనయెుఱుకను జీవించియుండఁగనే వాఁడు చచ్చినవాఁ డని పెద్దయెలుఁగున బుద్ధిపూర్వకముగఁ బలికి గురుహత్యా పాపమును నసుఖమునకుఁ గారణమైన పార్థివత్వమును సంపాదించెను. కర్ణునిబొంకు ఉపేక్షింపఁదగి యున్నది. ధర్మజునిబొంకు క్షమింప నర్హముగాని పాపకృత్యమై యున్నది. ఆబొంకుచే ధర్మరాజు వ్యాసమతమునుబట్టి తనవృత్తిపోవు నని భయపడి బొంకు మనుజాధముఁడును దనప్రాణము పోవు నని భయపడిబొంకు మనుజమధ్యముఁడును నైనవాఁడు.

కర్ణుని పితృభక్తివిషయమై యొకటి చెప్పెద:—

వ్యాసమహాముని ధర్మములు చెప్పుచో "ఉపకారము గని తరువాత నుపకారిని లక్ష్యపెట్టనివారి"లోఁ బెండ్లియాడి తల్లి నలక్ష్యము చేయు కొడుకు నొకనిఁ జేర్కొన్నవాఁడు. ప్రజాగరపర్వములో- అధ్యా 33-శ్లో ౯౨ ౯3. వానికి నా తెలుఁగుపద్యములు.

క. కర ముపకృతి గని యారురు
  తరువాతను లెక్కగొనరు ధర నుపకారిన్
  సరి విద్యనేర్చి శిష్యుఁడు
  గురువును, బెండ్లాడి తల్లిఁ గొడుకును మఱియున్.

క. కామము తీఱినపతి పెం
  డ్లాముఁ గృతార్థుండు సాధనమయిన వాఁడే
  డా మనుజు నేఱు దాఁటిన
  యామనుజుఁడు నావ రోఁగి యక్కట వెజ్జున్.

ఇక్కడ రాధ తన్నుఁ గన్నతల్లి కాక పెంపుడుతల్లి యైనను క్షత్రియజాతిస్త్రీ కాకున్నను సూతజాతిలోనిది యైనను దన్నుఁ బెంచినంతమాత్రమున దాను రాజ్యపదవీ గరిమంబున నున్నవాఁ డైనను దాని యెడ నెంతభక్తి చూపినవాఁడో చూడుఁడు. తన్నుఁ గన్నమహారాజన్యయైనకుంతి తనకు రాజ్యము రప్పించుట కెన్నిశ్రమలు పడ్డదో యవి యించు కయినఁ గృతజ్ఞతచే నాలోచింపక రాజ్యప్రాప్తి యైనపిమ్మట నెంత యనాదరణ మాయమ్మయెడ ధర్మరాజు చూపినవాఁడో చూడుఁ

డు. యుద్ధానంతరంబ తిలోదకములు విడువ వలసినప్పుడు మున్నుగా నీయన్నయైన కర్ణునకుదకము విడువు మని తల్లి చెప్పుటయు యుధిష్ఠిరుఁ డత్యంతకుపితుండై యయ్యెను నే గాక లోకములోని స్త్రీల నందఱను శపించినవాఁడు. ఆఁడువారియొద్ద రహస్యము దాఁగఁగూడ దనియుఁ గుంతి చండాలురచేతఁ బూజపడయుఁ గాక యనియును శపించినవాఁడు. కర్ణుఁడు తన కన్న యని యుద్ధమునకుఁ బూర్వము కుంతి చెప్పియుండె నేని ధర్మరాజు యుద్ధము చేయఁడు. వానికి రాజ్యము రాదు. మఱియు వాఁడు జీవనోపాధిగ వృష్ణ్యంధకరాజ్యములలో నింటింటఁ దిరుగుచు బిచ్చమెత్తికొనవలయువాఁ డగును. ఇట్టి దురవస్థఁ బొందకుండఁ దన్నుఁ గాపాడిన తల్లికి ధర్మరాజు తాను జేయవలసినపూజ యిదియా! అకటా యాతఁడు తల్లియెడ నెంతకృతఘ్నుఁడు! ఏఱుదాఁటి తెప్ప తగులఁబెట్టి నవాఁ డయ్యెను. తనయన్నను వధించినదానికిఁ దనకు నిశ్చయముగఁ బరితాపము గల్గెనేని తనకు రాజ్య మక్కఱ లే దనియు వనవాసి నయ్యె ద ననియు బుడిబుడిదుఃఖములతో ననేకపర్యాయములు చెప్పిచెప్పి మహానుభావుఁడైన శ్రీకృష్ణునిచే మాటిమాటి కుపశమనవాక్యములు పడ యనేల? వానికి దుఃఖోపశమనము గల్గఁజేయుటలో నాదేవదేవుఁడు చూపిన మహాశాంత మత్యద్భుత మైనది. నేనే కృష్ణుని యవస్థలో నున్నయెడ నేను విసివిసివి యడవికిఁ బొమ్మని ధర్మజునితోఁ జెప్పువాఁ డ నగుదును. ఆజగన్నాథునిశాంతముఁ జూడ భక్తులయం దాభక్తవత్సలునకుఁ గలయపారప్రేమ సూచించుచున్నది.

ఇంకఁ గర్ణునిదయాళుత్వవిషయమై యించుక చెప్పి గ్రంథవిస్తరభీతిచే విరమించుచున్నాను.

విదురుఁడు కుంతియొద్దకుం బోయి ధృతరాష్ట్రుఁడు సంధి కొడంబడమింజేసి యుద్ధ మగు ననియు యుద్ధములో మహావీరనాశన మగు ననియుఁ జెప్పి శోకించుటయుఁ గుంతి మనస్సులోఁ గళవళపడి యిట్లుచింతించెను.

దేనిఁ బొందుటకయి మహాజ్ఞాతివధము సేయవలయునో యట్టి లక్ష్మి కొల్పనాయేమి? కయ్యంబులో సకలబంధురాజికి ఘనపరాభవం

బగును. పాండవులును చైద్యులును పాంచాలురును యాదవులును గల
సి భరతకులులతోఁ గయ్యమాడవలయును. ఇంతకంటె దుఃఖ మేది
గలదు ? యుద్ధ మాడినఁ బాపము సంభవించును. యుద్ధ మాడకున్న
మాకుఁ గూడు లేదు. భూమిలోఁ జావుకంటె లేమి మిగులఁ గష్టంబు.
జ్ఞాతివధము సేత జయము కాదు. ఇది తలంచికొనఁగ నాదు దుఃఖ మె
చ్చుచున్నది. భీష్ముఁడును ద్రోణుఁడును గర్ణుఁడు ను గౌరవులప ట్టయిరి.
దీనిచే నాకు బెంగ పెరుఁగఁజొచ్చెను. ద్రోణుఁడు గురు వగుటచే శిష్య
కోటితోఁ బోరఁ బోఁడు. పాండుసూనులమీఁదఁ బితామహుఁడు పక్ష
పాతము దాల్పఁగలఁడు. ఇంకఁ గర్ణుఁ డొకఁ డున్నవాఁడు. వానిదృష్టి
యిందు వంచితం బయ్యెను. వాఁడు దుర్యోధనుని మోహమునఁ బడి
పోవువాఁడు. పాండవులతోడఁ బగ గొనుపాపి యహాము వారి కనర్థకర
ములగు పనులు సేయుమూర్ఖుఁడు. బలవంతుఁడు. ఇది యొక్కటియే న
న్నిపుడు దహించుచున్నది. వానిని బ్రసన్నునిఁ జేయుటకు నేను వాని
కడ కేగి వాస్తవంబు దెల్పెదను. వానిమనస్సును బాండవపక్షముగఁ
ద్రిప్ప యత్నంబుఁ జేసెదను. కన్నెనాఁటను దండ్రియింట నున్న నేను
సలిపినపరిచర్యకు సంతసించి భగవంతుఁడైన దుర్వాసుఁడు దేవతాహ్వా
నమంత్ర మొకటి నా కిచ్చినవాఁడు. దానిఁ దలంచి మ్రొక్కి మంత్రము
పఠించి కౌతూహలమునను నజ్ఞానమునను సూర్యు నాహ్వానమాచరింప
సాక్షాత్కరించి యాతఁ డిచ్చినకానీనుఁడైన నాకొడుకు కొడుకుగ
రక్షింపఁబడినవాఁడు. భ్రాతలకు హితంబుగను బథ్యముగను నేను జెప్పి
నమాటఁ గర్ణుఁ డేలవినఁడు ?

అని యిట్లాలోచనచేసి యుత్తమమైననిశ్చయమ్ము చేసినదై ప్ర
యోజనము మనస్సున నిలిపినదై కుంతి భాగీరథికిఁ బోయెను. పోయి
సత్యరతుఁడును దయాళువునైనకొడుకు కర్ణుని వేదాధ్యయననిస్వనమ్ము
కర్ణపర్వంబుగ విని ప్రాఙ్ముఖుండును నూర్ధ్వబాహుండు ను నైన యతని
వెనుక నిల్చుండి యతివినమ్రమై కార్యార్థ మతనిజప్యావసాన మయ్యె
నఁ బ్రతీక్షించుచుండెను.

సత్కారార్థసంస్కారము లేనాఁడును జేయింపక పైఁగా స్వకార్యార్థముం గుఱించి నేఁ డీరీతిని నీకు నీవై యేతెంచి నను బనిగొనఁ బ్రయత్నముచేసితివే ? తల్లిసేయు హితము నెన్నఁడును నాకుఁ జేయవైతివి. ఆత్మహితార్థము నీతియుతమతివై నన్నిపుడు పిలిచితివి. కృష్ణసారథి యై నక్రీడిం జూచి యెవఁడు భయపడకుండును ? పార్థులతో నే నిప్పుడు గలియుట భయపడినవాఁడ నని దూఱువడుట కగును.

క. ఏ వారి కన్న నని ము, న్నే వారె ఱుఁగంగ రైరి యిపు డాలమురాఁ
గా వారి కన్న ననుచును, నే వారిం గలయ రాజు లేమను వారల్.

నాకోర్కె లెల్లఁ దీర్చి నన్ను గౌరవించి సుఖపెట్టు గాంధారేయుల యాదరణ నేరీతిని విఫలము చేయువాఁడను ? పరులతో వైరము పెట్టికొని వారు సమస్తవసువులు వాసవునిఁ బోలె న న్నుపాసించి నాకు నమస్కరించుచున్నారు. నాబలముచేతఁ బగవారిని గెలువఁగల మని వారు నమ్మియున్నవారు. వారికోరికి యేరీతిని భగ్నము చేయువాఁడను ? నేను దెప్పుగా నీమరత్యయయుద్ధసముద్రము వారు దాఁటఁగోరుచున్నారు. అది యపార మగుటఁజేసి యల్లపారకాముల నెట్లు విడుచువాఁడను జెపుమా ? ధార్తరాష్ట్రోపజీవు లయినవారల కంచఱుకును గాలము సంప్రాప్తమయినది నేఁడు. ప్రాణములు ఢాఁపక వాని ఋణము నా కెట్లయినను దీర్చికొనవలయును.

చ. జనవరు సర్వరై గుడిచి చాలఁగఁ బెంపు వహించి యొంతయు
దనరఁ గృతార్థులై పెఁగి ధారుణిఁ గొందఱు రాజసేవకుల్
పనివడిన ప్పిసీ కృతము పాటనసేయక పాపచిత్తులై
మనము విరోధిపక్షముగ మార్చుచునున్ వెరుదీయువా రహహా.

అల్లపాపకర్మ లల్లరాజకిల్బిషు లల్లభర్తృపిండహారులు నైనవారికెల్ల నిహపరములు లేవుసుమా. నీతోడ వంచనాపూర్వకమ్ముగఁ బల్కువాఁడను గాను. దుర్యోధనునిపక్ష మూని నీపుత్రులతో నాశక్తికొలఁది యుద్ధ మాడువాఁడను. నీపల్కు లాభకర మయినను నీవు చెప్పినట్లు చేయఁజాలను, గాని, సత్పురుషోచితం బైన వృత్తమును గాని దయనుగాఁ విడువను. నీ విట్లు నన్నుఁ గోరుట నేను విఫలము చేయను. నీకొడుకుల్లలో

నెవ్వరు నాకు వధియింప నర్హులును శక్యులు నగునురు వారిని వధియింపక విడిచిపెట్టెదను. వా రెవ రంచువేసి యర్జునుఁడు గాక తక్కిననలువురును. పాండవకులములో నర్జునుతోడన సమకట్టి యుద్ధ మాడుదును. యుద్ధములో వాని నంతమొందించి రాజ్యఫలమైనను బడయువాఁడను. ఆతనిచేతఁ జచ్చి కీర్తిఫలమైనను బడయువాఁడను. నీపుత్రుల సంఖ్య యేనుకంటె నెన్నఁడును దక్కువకాదు నమ్ముము. నరునిబదులు నే నైనను నా బదులు నరుఁ డైనను నుండువారము.

అని యిట్లు కర్ణుఁడు ప్రాణమున కాశింపక రాజ్యమున కాశింపక మానాభిమానియై సత్యధారియై తనకు దుర్జయుఁ డని తా నెఱింగిన యర్జునుతోఁ బోరు మానసొల్లక ధర్మయుక్తముగ దయార్ద్రబుద్ధితోఁ బలుకుడుఁ గుంతి యర్థలాభ మొందఁ గోరికి గలదై

క. ఎలమి నభయమ్ము తమ్ములు
　నలువురకును శత్రుకర్ణునా యొసఁగితి వీ
　వలదాని మఱవకు సుమీ
　కలన నలుఁగు లేయునట్టికాలమునందున్.

అని యాతనివర మతనిజ్ఞప్తికిఁ దెచ్చెను. తెచ్చి శుభమును నారోగ్యమును నీ కౌనుగాక యని కొడుకును దీవించెను. అట్లే కొడుకును నుడివెను. అంత వా రిరువురును దమతమ గృహంబులకుఁ జనిరి.

చూచితిరా కర్ణుని దయాళుత్వము. ఊయి పుచ్చికొని కొట్టిన వానిని వెన్నపుచ్చికొని కొట్టవలయు నని లోకములోఁ బేరికిమాత్రము సామెత యొకటి కలదు. ఆసామెతసందర్భం బీకర్ణునివర్తన మొక్కటియే నాకుఁ గానిపించుచున్నది.

కర్ణుఁడు పాండవుల ననరానిమాట లన్నాఁ డనియుఁ దుష్టుఁ డనియుఁ గొందఱు అందురు. శత్రువులవిషయమై యుద్ధోద్యోగములోను యుద్ధములోను బీరపుమాటలు స్వాభావికముగా ననికొనుట మర్యాదయైయున్నది. మహాత్ముఁడు నవతారపురుషుఁడు ను నైన పరశురాముఁడు భీష్మునితో యుద్ధముచేయునపుఁ డేమన్నాఁడో చూడుఁడు.

గీ. అంపు మచ్చితబాణశతాచితుండ
వై మృతిం గని గృధ్రకంకాదిపక్షి
భక్షితుండ వౌచుఁ బొలమునఁ బడిన నీదు
కాయమును గంగ నీతల్లి గాంచుఁగాత.

సీ. నిర్భాగ్యుఁ డైనట్టి నినుఁగన్న యాతల్లి
యాభగీరథరాజునాఁడుఁబడుచు
సిద్ధులుఁ జారణుల్ సేవింపఁగా వచ్చి
యనఘ మహాభాగ యల్లదేవి
యుద్ధకామము చేత నుబ్బి తబ్బిబ్బయి
హతుఁడవై నాచేత నాజిలోన
దిక్కులే కిలమీఁద నక్కటా పడియున్న
నిను గాంచినట్టిదై నేఁడు భీష్మ
యింకఁ గంటికి నేలకు నేకధార
గాఁగఁ గన్నీళ్లు వలవల గార్చుచున్న
దగుచు నేడ్చుచుఁ గావుత మక్కటకట
తగనికష్టము వచ్చె నీతల్లి కిపుడు.

గీ. యుద్ధ మనఁ బ్రాణ మిచ్చెదవోయి భీష్మ
రమ్ము నాతోడఁ బదపద రథము మొదలు
గాఁగలుగు నట్టి పరికరగణము గొంచు
భారతర్షభ దుర్మద పౌరవేంద్ర.

ఇట్లు బీరములు పల్కిన మహానుభావుఁడు భీష్ముని జూపఁగలిగెనా. ఆయనతుచ్ఛుఁడా. ఆయనపల్కులు భీష్మునికవమానకరము లైనవా! భర్త యోడిన ద్రౌపదిని నన్యుని వరింపు మని కర్ణుఁ డనుట తప్పైనదో! భర్త యైన యుధిష్ఠిరుఁడు భార్యనోడుట తప్పా? ఆతఁ డోడినభార్య నన్యుఁ గోరికొను మని కర్ణుఁ డనుట తప్పా ? ఈరీతివే స్వల్పవిషయములు గ్రహించి కర్ణుని నిందింతురు.

మఱియుఁ బాండవులు జూదపుసమయమును బట్టి తమయజ్ఞాతవాసమునకు నిర్ణయింపఁబడ్డ కాలమయిన యొకయేఁడు సంపూర్ణముగఁ

గడవకమున్నే కాన్పించినారని గోగ్రహణారంభసమయమందు దుర్యోధనునకు సంశయము పుట్టినది. ఆసంశయము భీష్ముఁడు తీర్పఁగలవాఁడని ద్రోణుఁడు చెప్పుటయు నుదనకుఁ గలజ్యోతిశ్శాస్త్రపాండిత్యప్రకర్షము చూపి పదుమూఁడుసంవత్సరములలో వచ్చిన యధికమాసములు గణింపఁగా నప్పటి కైదునెలలుఁ బండ్రెండుదినము లధికము లయినవని యును దానిచే సమయము యథాశాస్త్రముగ నడపఁబడియె ననియును నాదినమునకుఁ బూర్వదినముతోఁ బదుమూఁడుసంవత్సరములు నిండె ననియు భీష్ముఁడు తీర్పుతీర్చినవాఁడు.

ఆతీర్పు నిష్పక్షపాత మయిన దనుట చింత్యము. సంవత్సర మని వక్కాణించి మితిపెట్టినప్పుడు పండ్రెండు నెలలను బట్టి గాక సంవత్సరమును బట్టియును నెల యని వక్కాణించి మితిపెట్టినప్పుడు ముప్పది దినములను బట్టి కాక నెలను బట్టియును లెక్క చూడవలయుఁ గాని యొండు విధముగఁ జూడఁగూడదు. యీవిషయ మిప్పటి రాజభృత్యు లెల్ల లెస్సగ నెఱింగినదియే. ఈమానముచేత లెక్క చూచియే ద్రుపదపురోహితుని తోఁ గర్ణుఁడు.—

గీ. తొల్లి దుర్యోధనునకు నైద్యూతకేళి
　సేసి యోడించెఁ దా యుధిష్ఠిరుని శకుని
　సమయమును బట్టి తానల్ల యమతనూజుఁ
　డడవిలో నివసింపంగ నరిగినాఁడు.

క. సమయము నడప కిపుడు రా
　జ్యముఁ దనతండ్రి దగుదాని నాతఁడు వడయం
　గమకించె ద్రుపదమాత్స్యుల
　చమూసమూహములఁ జేరఁజని మూర్ఖుండై.

గీ. బలిమిచేసిన బెదరి యోపండితుఁడ
　యీసుయోధనుఁ డడుగైన నీఁడు తుదకు
　ధర్మమున నైన నీతఁ డీధరణియెల్ల
　నెట్టిపగవానికైనఁ దా నిచ్చు నెలమి.

క. తమపిత్రుపై తామహరా
జ్యము మఱలం బడయఁ గోర్కి యమ్యైన యేనిం
దమప్రతిన చొప్పునం గా
లము నవిలోజరపఁగావలయుఁ గౌంతేయుల్.

క. అప్పుడు నిర్భయులై తా
మొప్పుగ రారాజుచేత నుండఁగఁదగు వా
రిప్పుడు కేవలమూర్ఖత
నొప్పదు తాల్పఁగ నధర్మయుత మగుబుద్ధిన్.

అని నిర్భయముగఁ జెప్పినవాఁడు.

వ్యాసోద్యోగపర్వములో నిరువదియొకటవ యధ్యాయములోని 10—11-12—13—14, పద్యములు చూడవలయును. ఆమూలపద్యము లనుబట్టి తెనుఁగున నేను రచించిన పద్యములే యివి. దీనింబట్టి కర్ణుఁడు తుచ్ఛుఁ డని చెప్పవచ్చునా? కర్ణునియీమాటలకు సరియైన యుత్తర ము చెప్పినవాఁడా భీష్ముఁడు? కర్ణునిమాటలు పూర్వపక్షము చేసినవాఁ డా? చేయఁడయ్యెను. చేయక—

క. ఈమాట లేమి కార్యం
బామేటి మగం డొకండ యర్జునుఁ డని లోఁ
డా మన యాయ్వర గెలువం
డే మొన్నను దలఁచికొమ్మ యెద నది సూతా.

క. ఆనాఁడు విరటుపురమునఁ
గానీనా నీవు నీవె కయ్యములోనం
గానవె యాజయశీలుని
చే నప్పుడైనట్టి వీరచేష్టలనెల్లన్.

కం. ఇది యీబ్రాహ్మణు చెప్పిన
యది యీగతిఁ జేయమేని యని వారలచేఁ
దుదిఁ జచ్చి నోట మన్నే
యదిరా కట్టికొని పోదు మట మనమెల్లన్.

అని మాత్రము చెప్పినవాఁడు. ఇవి యయ్యధ్యాయములోనే 16-16(a)-17 నగుపద్యములు. ఇవి ద్రుపదపురోహితుని మాటలకు సమత్తరములా, కావు. ఆమాటలకు సంబంధించి లేవు. తనవాదమునకు బల మున్నయెడ ద్రుపదపురోహితునివాదము భీష్ముఁడు పూర్వపక్షమే చేయును. అట్లు చేసినవాఁడు కాఁడు. పాండవులకు సమయభంగ మైన దని బలరాముఁడు కూడఁ జెప్పినవాఁడు. అభిమన్యుని వివాహానంతరంబ విరాటరాజు కొలువుకూటంబున శ్రీకృష్ణుం డధ్యక్షుం డయి పాండవుల రాజ్యప్రాప్తివిషయమై దూతను గౌరవులయొద్దకుఁ బంపవలయు నని తీరుమానించినపు డాతఁ డే మన్నాఁడో చూడుఁడు—

ఉ. ఎన్నఁడు వారి కల్ల యొకయింతయుఁ బుట్టఁగఁ జేయరాదు రా
జ్యోన్నతిచే మదించి కడుద్యూతమునందుఁ బ్రసక్తుఁడౌచుఁ దాఁ
బన్నుగఁ గోలుపోయె ధరఁ బాండవవర్యుఁడు వీరిపంతపుం
బన్నముచే బలీయులుగ వారల కయ్యది సంక్రమించెఁ జూ.

వ్యాసోద్యోగపర్వమున రెండవయధ్యాయములో నెనిమిదవ పద్యము. ఇందు సమయభంగ మైన దని చెప్పిన కారణమున బలరామునిఁ దులువ యని చెప్పవచ్చునా? కూడను కూడదు. కావునఁ గర్ణుఁ డుత్తముఁ డయిన ప్రెగ్గడయును భటుండును గాని యధముఁడు గాఁడు.

# బాలకవి శరణ్యము-రెండు నైషధ ప్రయోగములు.

కిడాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

శ్రీ గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారు తమ బాలకవి శరణ్యమున (పు. 89) 'చేతురు. కోతురు' మొదలగు శబ్దముల ప్రామాణికత్వమును జర్చించుచు, లాక్షణికులసర్వజ్ఞత్వమును, బరిష్కర్తలవహాఘ్యమును గర్హింపుచు నీక్రిందివాక్యముల వ్రాసిరి.

'శ్రీనాథుని' నైషధమునందు (2-88) వ పద్యములో పూర్వముద్రణమున సేతురు అనేపాఠ ముండగా బ్ర॥ వేదము వేంకటరాయశాస్త్రిలవారు తాము పరిష్కరించి అచ్చువేయించిన పుస్తకములో పాఠము సవరించి వ్యాఖ్యానములో పూర్వముద్రణపాఠమున చేతురు-అపశబ్దము-చేయుదురు- సాధువు. అని వ్రాసినారు. మేము చూచిన తాటాకుపుస్తకములలో 'చేతురు' అని ఉన్నది. ఎన్నోపద్యాలు వీరిపరిష్కరణమువలన మారిపోయినవి. ఏమిజెప్పను.'

నైషధములోనిపద్యమిది.

తే. హంసతూలికాతల్పంబు నందు మేను
    సేర్చినప్పుడు నేత్రరాజీవయుగముఁ
    జేరి చుంబించి మోహింపఁజేయ నతని,
    నతివ, నిద్రయు నీవు నే మాదు రొక్కొ ? (2-88)

ఇది వేదమువారి ముద్రణమున గలపాఠము. వ్యాఖ్యానమున 'చేయ రతని' 'చేతు రనిన' యనుపాఠములు నిరసింపఁబడినవి. వావిళ్ళవారి ముద్రణమునఁ 'చేయుదురన' అను మఱియొకపాఠము గనపడుచున్నది. పరిషద్భాండాగారమునఁ గలమూఁడు తాటియాకుప్రతులఁ బరిశీలింప వానియందు 'మోహింపఁజేయునతని' అనియే గలదు. (గ్రంథ

సంఖ్య- 99, 887, 3920,) 'చేతురు' అని యాతాళపత్ర ప్రతులం గన్పడదు. 'మేము చూచిన తాటియాకుపుస్తకములలో 'చేతురు' అని ఉన్న' దని పంతులుగారు వ్రాసియున్నారు. ఏ యేప్రతుల వీరు చూపిన పాఠము గలదో, యవి యెచట నున్నవో తెల్పినచో బాగుగనుండి యుండును. పరిష్కర్తలకు గ్రంథముల సవరింప నెట్టిస్వాతంత్ర్యము కల దనువిషయమును గూర్చికాని లాక్షణికులసర్వజ్ఞత్వమును గూర్చిగాని నేను విమర్శించుట లేదు. వారు దహరించిన ప్రయోగములు కలవా లేవా యను విషయమే మనకు ముఖ్యము.

(2) 'శృంగారనైషధములో (6-33) శ్రీనాథుడు వినీవినని భంగి అని ప్రయోగించినాడు. సీతారామాచార్యులవారు వినిన్వినని అనేపాఠము ఎత్తుకొని ప్రౌ. వ్యా. 116 లో అనుశాసించినారు. కళాప్రపూర్ణ వేదం వేంకటరాయశాస్త్రిలవారు క్త్వార్థకముపైనువర్ణము యువర్ణహీనముగా నుండుట ప్రశస్తముకాదనిన్ని ఆచార్యులవారు అభారతప్రయోగ ముద హరించినారనిన్ని ఆక్షేపించినారు.' (పు. 253-254)

సీతారామాచార్యులవారి యనుశాసనము, వినిన్వినని యను దాని ప్రామాణికత్వ మటుండఁ, బరిషత్పుస్తకభాండాగారమునఁ గల మూఁడుప్రతులయందును 'వినిన్వినని భంగి' అనియే గలదు. 'వినీవినని' యనుప్రయోగ మెచ్చటనుగానరాదు. ఇదియు నెచ్చటిదో వీరు దెలిపి యుండ లేదు.

పండితులు గాని గ్రంథభాండాలయాధికారులుగాని శృంగార నైషధపుప్రతులలోఁ బై సందర్భముల నెట్టిపాఠాంతరములు గలవో తెల్పి పినచోఁ గృతజ్ఞులము.



# ఆముక్తమాల్యదలో నొకపద్యము.

ఆముక్తమాల్యదయందుఁ బ్రథమాశ్వాసమునఁగల (1-15)

ఆ. తెలుఁగదేల యన్న దేశంబు దెలుఁ గేను
దెలుఁగువల్లభుండఁ, దెలుఁగొకండ
యెల్లనృపులుగొలువ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగులెస్స.

అను పద్యమునకుఁ బండితులు భిన్నార్థముల వ్రాసియున్నారు.

(1) వేదమువారి గ్రంథమున- తెలుఁగొకండ యనునది ప్రత్యేకముగఁ గైకొనఁబడి, తెలుఁగొ=తెలుఁగు భాషయన్ననో, కండ=పులకండము అని యర్థము వ్రాయఁబడినది. ఇది సమంజసముగఁ గన్పడదు. దేశభాషలందుఁ దెలుఁగు లెస్సయని నాల్గవపాదముననుండ, దెలుఁగు పులకండమువంటిదని వ్రాయనవసరము గన్పడదు.

(2) ఆముక్తమాల్యదకు గట్టుపల్లి శ్రీనివాసకవిరచించిన వ్యాఖ్యానమునకు వ్రాఁతప్రతియొకటి పరిషద్భాండాగారమునఁ గలదు. అందు-

'నేను తెనుగువల్లభుఁడను। అటుగనక। తెనుగొకటే। కావ్యమొక్కటే తెనుగా। సకలమున్ను తెనుగనుట। మరిన్ని సకలదేశాధిపతులున్ను నిన్ను కొలిచేటప్పుడు వారితో ఆయాభాషలతో మాట్లాడేటప్పుడు దేశభాషలలో తెనుగుమంచిదని యెరగవా అనుట' అని వ్రాయఁబడినది. దీనిలో, తెనుఁ గొకండ యనుదానికి వ్రాసిన యర్థము కూడ సందర్భరహితముగ నున్నది.

(3) వావిళ్లవారి ముద్రణమున (1907) రుచిసమాఖ్యాన మను వ్యాఖ్యానముగలదు. అందు 'తెలుఁగొక్కటియే అనఁగా నదివింతగాదనుట—ఎల్లనృపులు గొలువన్=సకలరాజన్యులు సేవింపఁగా, బాసాడి=నీవు సంభాషించి, యెఱుఁగవే=కాక్వర్థమువలన సకలదేశభాషల నెఱుఁగుదువనుట, దేశభాషలందుఁ దెలుఁగులెస్స' అని కలదు. ఈవ్యాఖ్యా

నమునఁగూడ 'అనఁగానది వింతగాదనుట' యనుటలో విశేషార్థము స్ఫురించుటలేదు.

ఈపద్యమునఁ బాఠాంతరము లున్నటులు గన్పడుట లేదు. అట్టి యెడ రెండవపాదాంతమున 'తెలుఁగొకండ' యని విరామముతోఁ బఠించుట సందర్భరహితముగనున్నది. తెలుఁగదేలయన్న దేశంబు తెలుఁగు, నేను తెలుఁగువల్లభుఁడను, యెల్లనృపులు గొలువఁదెలుఁగొకండబాసాడి దేశభాషలందుఁ దెలుఁగు లెస్స యటంచెఱుంగవే యనునర్థమును గైకొనినచో నన్వయకాఠిన్యము గాని సందర్భరాహిత్యము గాని యుండదేమో ? ఇట్టియర్థమును గైకొనిన కృష్ణరాయలసభలో నాంధ్రమే రాజభాషయని తెలుచున్నది(Court language)ఆంధ్ర మాతని మాతృభాష యగుటయే యందులకుఁ గారణ మని మన మూహింపవలయును. వివిధభాషలు గలదేశములలో నొకభాష రాజభాషగఁ బరిగణింపఁబడుటయు వింతగాదు. నేఁటిన్యాయస్థాన విద్యాలయముల నాంగ్లమునకుఁ గల ప్రముఖతయే దీనికిఁ దార్కాణము. అందును సార్వభౌమునకు మాతృభాష యగుటచేఁ గృష్ణరాయల యాస్థానమున నదియే యగ్రస్థానమును వహింపనొప్పును. ఈసందర్భమున వేంకటరాయశాస్త్రులవారు 'ఆడి-తెనుఁగును రాజులతో నాడి నేర్చెనే గాని చదివి నేర్చినవాఁడుఁగాఁడు - నృపులు అనుటచే తెనుఁగు ఆతని ఇంటిభాషగాదు' అని వ్రాయుట ప్రమాణరహిత మనియు, మూలమునకు విరుద్ధ మనియు నెఱుంగవలయును. ఎల్లనృపులుఁ గొలువ బాసాడి యనుచో నాంధ్రము కృష్ణరాయల మాతృభాష కాదని యేల స్ఫురింపవలయును ? విజ్ఞు లీవిషయముల నిదమిత్థ మని నిర్ణయింతురుగాక.

# రామాయణము—జైన బౌద్ధ గ్రంథములు.

కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

రామాయణమునందలి కథను జైనులును బౌద్ధులును తమమతానుగుణ్యమగు మార్పులతోఁ గైకొనిరని మనము తెలిసికొనవలసియున్నది. బౌద్ధుల జాతకకథలయందు రామాయణకథయు, దశరథుని శాపవృత్తాంతమును, ఋష్యశృంగునికథయుఁగలవు. దశరథజాతకమునకును రామాయణేతివృత్తమునకుఁ జాల భేదముగలదు. దశరథుని శాపవృత్తాంతము ననుసరించు కథయొకటి సామజాతకమునఁ గలదు (Jataka Stories No. 540). సాముఁడనుఋషికుమారుఁడొకఁడు, అంధులగు తనపితరుల సేవించుచుండెను. కాశీరాజగు పిలియక్షుఁడు మృగయావినోదియై బాణముతో నాతనిఁగొట్టెను. సాముఁడును శాంతుఁడై తనతలిదండ్రులకై విచారించి యాతనికి వారునుచో నెఱింగించి మూర్ఛనొందును. రాజందులకు విచారింపుచుండ నాయరణ్యదేవత సాముని తలిదండ్రులను భక్తిశ్రద్ధలతోఁ గొలిచిన నతని పాపము తొలఁగునని పలుకును. ఆసార్వభౌముఁడంత జలఘటంబును గొని వారింజేరి తన్నెఱింగించుకొని, వారొసంగిన సపర్యలనొంది, కుమారునిమరణమును వారికిఁ దెలుపును. వారు విషాదగ్రస్తులై తమ్మాతనిచెంతకుఁ గొనిపొమ్మని యాతనివేఁడిరి. సామునిమృతశరీరముచెంత వారు మంత్రములఁ బఠింప నిద్రఁజెందినవానివలె నాతఁడు పునర్జీవితుఁడయ్యెను. రాజాతనినాశ్రయించి యాతనివలన రాజధర్మముల నెఱింగి తన పట్టణమునకుఁ బోయెను.

మూలమునఁగల శాపవృత్తాంత మిటవిడువఁబడి, సామునియొక్కయు నాతని తలిదండ్రులయొక్కయు శాంతస్వభావమునకు, సత్ప్రవర్తనమునకుఁ బ్రాముఖ్య మొసఁగఁబడినది. ఋష్యశృంగునికథయు రెండుజాతకములఁ గలదు (No. 523, 526). నళినికాజాతకమున ఋష్యశృంగుఁడు (పాళీలో ఇసిసుంగుఁ డని కలదు). అలంబుస యను నచ్చరకన్నె

మాయలంజిక్కి మోహితుఁడాయెననికలదు. రామాయణమునఁగల శాంతావృత్తాంత మిందు లేదు. ఋష్యశృంగుఁడొక యాఁడు లేడికి జన్మింప నొక ఋషి దయార్ద్రచిత్తుఁడై యాతనిఁ బెంచె నని కలదు. ఈవృత్తాంతమే బార్హుట్ (Barhut Stupa) స్తూపమునఁ జిత్రింపఁబడినది.

జైనులును రామాయణకథను మార్చి వివిధకావ్యముల రచించిరి. అందుఁ బ్రాచీనమగునది విమలసూరి రచితమగు పఉమచరియ(పద్మచరిత) మనునది. ఈగ్రంథము మహావీరుని నిర్వాణానంతరము 530 సంవత్సరములకు రచింపఁబడె నని యందే తెలుపఁబడియున్నది. ఇది జైనమహారాష్ట్రి యనుప్రాకృతభాషలో నార్యావృత్తములలో రచింపఁబడెను. రాముఁడే పద్ముఁడు. వాల్మీకిరామాయణమున నసత్యములు పెక్కులుండుటచే మహావీరుని శిష్యుఁడగు గౌతముఁడు బింబిసారునికిఁ దెలిపినరీతిని దా నాగ్రంథమును రచించితి నని కవి గ్రంథాదిని వ్రాసెను. వానరుల నొక మానవజాతిగ వర్ణించుట పొసఁగదని వారు విద్యాధరవంశజు లనియు, గృహపట్టణద్వారములందును కేతనములందును కపిచిహ్నమునుంచుటచే వారు వానరులని పిలువఁబడిరని కవి యుత్ప్రేక్షించియున్నాఁడు. రావణాదులును రాక్షసులుగారు. విద్యాధరులపాలనమున నుండిరి. రావణునితల్లి యాతనికంఠమున నొకముక్తాహారము నుంచెననియు నందాతని శిరస్సు తొమ్మిదిసారులు ప్రతిబింబితమగుటచే నాతఁడుదశగ్రీవ దశానన శబ్దవాచ్యుఁడాయెననియు గల్పింపఁబడినది. ఆతఁడొకగొప్పజైనభక్తుఁడు. జైనదేవాలయములఁ బునరుద్ధరణ మొనర్చెను. హనుమంతుఁ డతనికి యుద్ధములసహాయ మొనర్చెను. దశరథున కనంతరథుఁ డనుసోదరుఁడుండెను. అతఁడు వార్ధక్యమున రాజ్యమును విడిచి జినభక్తుఁడయ్యెను. దశరథునకు అపరాజిత, సుమిత్ర, కైకేయి యనుముగ్గురుభార్యలు కలరు. అం దపరాజితకు, పద్ముఁ డను రాముఁడును, సుమిత్రకు లక్ష్మణుఁడును, కైకేయికి భరతశత్రుఘ్నులును జన్మించిరి. సీతయు నాఁగటిచాలున దొరకియుండలేదు. జనకునకు నాతని భార్యయగు విదేహకును బుట్టిన కూఁతురు. వా రామెను పద్మునకు వివాహము చేయ నిశ్చయించిరి. కాని

విద్యాధరులరాజగు చంద్రగతి యను నాతఁడామెకొఱకువచ్చి తనకార్ము
కమును జనకునకు నొసఁగెను. దానిని భంగమొనర్చిన రాకొమరునకు
సీత నిచ్చెదనని జనకుఁడనెను. పద్ముఁడు ధనుర్భంగమొనర్చి సీతం బెండ్లి
యాడెను. తరువాతివృత్తాంతమునఁగూడ నిట్టిమార్పులు పెక్కులు గలవు.
భరతు నతనితల్లియగు కైకేయియు, సోదరుఁడగు పద్ముఁడును రాజ్యము గై
కొనుమని యాజ్ఞాపింప నాతఁడు పద్ముఁడు మరల వచ్చువఱకు రాజ్య
ము నేలుట కంగీకరించును. సీతాపహరణము, హనుమంతుని యన్వేష
ణము, రావణవధ, సీతాసమాగమము, పౌరులామెను దోషిగఁ దలఁ
చుట, వనవాసము, కుశలవుల జననము మొదలగునవి పెక్కుపాఖ్యా
నములతో వర్ణింపఁబడినవి.

విమలసూరి యొక్క కథయే తరువాతి రామకథలకు మూలముగ
నుండెను. దాని ననుసరించియే రవిసేనుఁడు తనపద్మపురాణమును క్రీ. శ.
యేడవశతాబ్దమున రచించెను (678 A. D). ఇందును రాముఁడు పద్ముఁ
డని పేర్కొనఁబడియెను. కుశలవులు లవణాంకుశులయిరి. జీవహింస మాం
సాహారవర్జనము, మొదటి జైనతీర్థంకరుఁడగు ఋషభుని మహిమానువ
ర్ణనము మొదలగువిషయములు చాలఁగలవు. ఈరామకథయే గుణాఢ్యు
నియుత్తరపురాణమున నఱువదియెనిమిదవపర్వమునఁ గలదు.

హేమచంద్రుఁడు (పండ్రెండవ శతాబ్దము) తన త్రిషష్టిశలాకాపు
రుష చరిత్రమున నేడవపర్వమున నీకథను మఱల రచించెను. దీనినే
హేమచంద్రుని రామచరితమనియు, జైనరామాయణమనియుఁ బిలుతు
రు. అదియు రాక్షసవానరుల వృత్తాంతములతోఁ బ్రారంభమగును.
నాల్గవసర్గము మొదలు పదియవ సర్గాంతమువఱకు సీతారామలక్ష్మణు
లకథ వర్ణింపఁబడినది. ఈగ్రంథము ననుసరించియే పదునాఱవశతాబ్దము
రాజవిజయసూరి శిష్యుఁడగు దేవవిజయగణిచే రామచరిత్రము గద్యకా
వ్యము రచింపఁబడినది. కృష్ణదాసుని పుణ్యచంద్రోదయ పురాణమను
మఱియొక గ్రంథము కూడఁ గలదని రాజేంద్రలాలుమిత్రగారు వ్రాసి
యున్నారు.

# గ్రంథస్వీకారము.

## 1 ఆంధ్రుల చరిత్రము: అయిదవ సంపుటము.

(కాకతీయాంధ్రరాజయుగ చరిత్రము.)

గ్రంథకర్త—శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు.

---

శ్రీవీరభద్రరావు పంతులుగారు 1912 వ సంవత్సరములోఁ బ్రకటించిన యాంధ్రులచరిత్ర రెండవభాగములోనివిషయములనే యిటీవలఁ బ్రకటింపఁబడిన శాసనములలోని నూతనచరిత్రాంశములు క్రొత్తవిషయములును జేర్చి యితిహాసతరంగిణీ గ్రంథమాలలో మొదటిపుస్తకముగా నీ గ్రంథమును బ్రకటించియున్నారు.

మొదటిప్రకరణములోఁ గాకతిశబ్దవిచారణయుఁ, గాకతీయవంశమునకు మూలపురుషుఁడు కాకర్త్యగుండ్యన యగునా కాదా యను విషయమును జర్చింపఁబడినవి. రెండవప్రకరణములో లక్ష్మణరాయపరిశోధకమండలివారు ప్రకటించిన "తెలింగానా శాసనముల"లోని గూడూరు మాటేరు శాసనములలోని విషయములపై విపులమగు చర్చ గలదు. విరియాలవంశము కాకతీయరాజవంశముకంటె భిన్నమైన దనియుఁ గాకతిరాజవంశమే తరువాతి బ్రహ్మణ్యరాజవంశమైనదనియు వీరభద్రరావుగారి యభిప్రాయము. మూఁడవప్రకరణమందుఁ జక్రకోట్యమండలచరిత్రమును నాల్గవప్రకరణమునఁ గాకతీయరాజుల పరిపాలనారంభమునాఁటి యాంధ్రదేశస్థితియు, కాజీపేటశాసనమువలనఁ గాకతీయరాజచరిత్రములోఁ గల్గిన మార్పులును జర్చింపఁబడినవి.

పంచమప్రకరణములో పలనాటివీరచరిత్రముచు ఆఱవప్రకరణము మొదలు పదునైదవప్రకరణమువఱకుఁ గాకతిరాజుల పరిపాలనాదికములును వివరింపఁబడినవి.

మహాదేవరాజు రాజ్యపాలన చేసెనా లేదా యనువిషయమును రుద్రమదేవి ప్రతాపరుద్రులను గూర్చియు, రుద్రమదేవిభర్త చాళుక్య

వీరభద్రుని గూర్చియు, కోనహైహేయులను గూర్చియు నూతనవిషయము
లనేకములు తెలియఁజేసియున్నారు. ప్రతాపరుద్రుని తల్లి ముమ్మడంబను
రుద్రమదేవికిని గలసంబంధము, ముమ్మడంబభర్త మహాదేవరాజునకుఁ
జాళుక్యవీరభద్రునకుఁ గలసంబంధమును గూర్చి చరిత్రచతురాననులు
చాలఁ జర్చించియున్నారు. గ్రంథము స్వల్పకాలములో నచ్చొత్తింపఁ
బడుటచేఁ గాఁబోలును కొన్నియచ్చుతప్పులు దొరలినవి. ఈతప్పులను
దీసివేసి కాకతీయులశిల్పకళ ఆర్థికపరిస్థితులపైఁ గొన్నిక్రొత్తప్రకరణములఁ
జేర్చి రెండవముద్రణములో దీని నింకను జరిత్రకారుల కుపయోగించునట్లు
చేయుదురుగాక. కాలనిర్ణయములోఁ గొన్నితప్పులు, ప్రమాణగ్రంథ
ము లుదాహరించుటలోఁ గొన్నితప్పులు గ్రంథమునఁ గలవు. వీనిని రెం
డవముద్రణమున సవరించి 'ఆంధ్రులచరిత్రము'లోని మిగిలినభాగములను
గూడఁ బ్రకటించి దేశీయులకృతజ్ఞతకుఁ బాత్రులవుదురుగాక.

వ. శ్రీ. రా.

---

## 2 ఆంధ్రకథాసరిత్సాగరము—పద్యకావ్యము.

### లా వా ణ క లం బ క ము.

పీఠికాపురసంస్థానాస్థానవిద్వత్కవు లగు వేంకటరామకృష్ణకవులు
రచించినది. ప్రస్తుతోపలబ్ధబృహత్కథాసార మగుకథాసరిత్సాగరములో
నీ లావాణకలంబకము మూఁడవది. ఆఱుతరంగములతో నిది ముగిసినది.
మొదటి రెండులంబకములను విడిచి మూఁడవదానినే ముందుగాఁ బ్రక
టించుటకు హేతువు తెల్పఁబడియుండలేదు; కావునఁ బాఠకులకు మొ
దటిరెండును రచింపఁబడనే లేదా రచియింపఁబడినఁ బ్రకటించుట కభ్యం
తర మేమి గల్గిన దను నూహలకుఁ గారణము కాకమానదు. ఆవిష
యము కొంత ముందు తెలుపవలసినది. మాకిచ్చిన భాగములో లేదో
మొదటఁ జేర్పనే లేదో పీఠికలేదు, విషయసూచికలేదు, వెలలేదు. దొ
రకుతావు వ్రాయలేదు. మఱియు నిట్టియుద్గ్రంథము ౨౫౦ ప్రతులు
మాత్రమే ప్రచురించిరి. పయివిషయములకుఁ గవులయాశయ మేదో
ముందుఁ దెలిసికొంద

ఈసంపుటములో వివిధవృత్తములు ౧౩౭౪, గలవు. కవిత చక్కనిది, యుభయభాషానైపుణి గలది. హృద్యపద్యగద్యగమనిక గలది. మృదుమధురపదయుతము— చూడుఁడు:—

చ. కర మనురక్తి వల్లభునిఁ గన్గొని దిగ్గున లేచి హర్షని
స్సరదురుబాష్పపూరములఁ జయ్యన నాతనికర్ఘ్యలీలఁగా
నరుగుచు నున్నభంగిఁ జని యట్టె తదీయగళంబునన్ మనో
హరనిజబాహుమాలికల నాదరమొప్పఁగఁ జుట్టి బిట్టుగాన్. 4-333.

దీర్ఘసమాసములు, నతికఠినపదములుం గానరావు. పురాణశైలిం గథ చదివినంతన దెలియుచున్నది, కఠినపదవ్యవధానమై యర్థమున కడ్డు వచ్చుట లేదు. ఇంతకంటె వ్రాసిన నది స్తుతియగును-

పద్యములమచ్చు:-

మ. కని శోకాతిశయంబుచే నవశమై గాత్రంబులూడఁ దీఁ
సిన చందంబున వ్రాల నానృపతి నిశ్చేష్టత్వముంబొంది చ
య్యనధాత్రీస్థలిపైఁ బడెన్; భయసముద్యత్కంపభూయిష్ఠమై
తనికెన్ వాసవదత్త డెంద మతిమాత్రం బబ్జపత్త్రాంబువై. 2-125

సీ. ప్రాణనాయక! నాఁటిరాత్రి దేవీగృహాం
గణమున విన్నవాక్యమ్ము నీకుఁ
దలఁపున నున్నదే? తప్పక నిన్నొక్క
నెల యైనపిదపఁ దన్నిలయమునకుఁ
దిరిగి రమ్మని కదా దివ్యవాణి వచించె?
మఱచితో నీవది మానసమున?
నేఁటితోఁ బూర్తిగా నెల్లాళ్లుఁ గడచెఁగా
వున నోప్రియా! యిట్లు వినుపవలసె
ననవుడు విదూషకుండు నెయ్యమునఁ జేసి
తన మనోహర పల్కిన తదుచితోక్తు
లాలకించి గతం బెల్ల నాకళించి
పరమసంతోషపరిపూర్ణ భావుఁ డగుచు. 4-184

చ. తెలియఁగవచ్చె నీకుఁగల తీయము నాయెడ నార్యపుత్త్ర! కే
వలమును నీవ నాకు నికఁ బ్రాణమవైతివిఁ కేల నాకు నీ
చెలువలు నియ్యెడన్ గలుగుసిద్ధులు? నే భవదీయ సద్గుణం
బుల విలువంగఁబడ్డ యొక పొత్తుల దాసిక నైతి నో విభూ! 4.340

గద్యంబున వేంకటరామకృష్ణకవులు రచించిన ట్లున్నను షష్ఠతరంగము కడపట—క. పలుకులవెలంది యెట్టటు పలికించిన నట్లు లేను బలికితి దోసఁగుల్ గలిగిన మన్నింపుఁడు— అనుదానిలో వేంకటరామశాస్త్రిగారొక్కరే రచియించినట్లు కనఁబడుచున్నది. ఈకృతిని శ్రీపీఠికాపురయువరాజుగారి కంకితము చేసినను ప్రథమతరంగము, రెండవపద్యములో "అనవరత భారతాదిమహాపురాణ పఠనరంజిత పరిశుద్ధభావులార! విషయగౌరవ విజ్ఞాన విమలధీ ప్రశస్తులారా! త్రిలింగదేశస్థులార!"

అని పేరిని గూడ సంబోధించుటయు షష్ఠతరంగాంతమునం గాక తక్కినతరంగాద్యంతములఁ గృతిపతిప్రశంస లేకుండుటయుఁ గ్రొత్తదారి.

ఈ కథాసరిత్సాగరము నిజముగాఁ గథలకు సాగరమే. ఇందు లేనికథలు లేవు, గాథలు లేవు, హాస్యములు లేవు, న్యాయములు లేవు. రాజనీతులు లేవు. లోకములోనున్న ముద్రారాక్షస, మల్లికామారుత, నాగానంద, రత్నావళీ ప్రభృతి సర్వనాటకములకు మూలమీసాగరమే. కాదంబరికథ యిందులోనిది. విక్రమార్కకథ లిందులోనివి, బేతాళపంచవింశతి యిందులోనిది, పంచతంత్ర మిందులోనిది. మనవారు ప్రకటించు కాశీమజిలీలను పేరుపెట్టినవి యిందులోనివి. భారత భాగవత రామాయణముల కథ లిందులోనివి. నవరసములతోడి సర్వవిషయములు నిందు లోనివి. ఇందులేనివి మన భరతఖండములో నెందును వేఱుగా లేవు. ఈ సాగరకథావీచి నొక్కింత యాధారము చేసికొని, యీయుదధిగాథాబిదువు నొక్కదాని నూఁతగొని మన పూర్వకవు లనేకములు పెద్ద నాటకము లాడినారు. వేంకటరామకృష్ణకవు లీపద్యకావ్యమును రచింపఁబూనుటఁ గడుమెచ్చఁదగినది.

గీ. అశ్వమేధంబుఁ జేయు మో యధిప యట్లు
శాశ్వతం బగుధర్మంబు సంఘటిల్లు
విశ్వనుత మైన సంతతి వెలయు నీకు
నీశ్వరప్రేరణంబె పో యీతలంపు. ౬౬

క. సరయూత్తరతటమున న
ధ్వరభూమి యొనర్పవలయు వరదక్షిణభా
సుర మగుతురగోత్తముఁ
బరికింపఁ దగినవారిఁ బనుపుము వేగన్. ౬౭

చ. అని యిటు లవ్వసిష్ఠముని యాదిగఁ గల్గిన మౌను లందఱుం
దనయులు నీకుఁ గల్గెదరు తప్పరు యాగము సేయుమంచుఁ బ
ల్కినపలు కాత్మసమ్మదముఁ గీల్కొనఁ జేయ నమాత్యవర్గముం
గనుఁగొని పల్కె నద్ధరణికాంతుఁడు సంతస మొప్పుచుండఁగన్. ౬౮

క. నాగురువులయానతిచే
సాగింపుఁడు యాగ మఖిలసంభారంబుల్
వేగ నొనగూడఁ జేయుం
డాగమకోవిదులఁ బిలువనంపుఁడు మఱియున్. ౬౯

క. ఈయజ్ఞ మఖిలనృపులకుఁ
జేయఁగవచ్చు నిది శాస్త్రసిద్ధ మలోపం
బై మెసఁగుచుండు యజ్ఞము
పాయక కర్తకు నభీష్టఫలము లొసంగున్. ౭౦

వ. విద్వాంసు లగు బ్రహ్మరాక్షసులు ప్రతిక్షణంబును రంధ్రాన్వేషంబు గావించుచు యజ్ఞంబునకు విఘ్నంబు చేయం జూతురు విఘ్నితం బైన యజ్ఞంబు కర్తకుం గొఱగామి సంఘటిల్లం జేయు నటుగావున నెందు నేమఱక సకలలక్షణలక్షితం బైన యశ్వంబుం దెచ్చి విడిచి యందునంను సావధానంబుగా శాంతికవిధానంబులు సేయుచు నభంగంబును సాంగంబును గా యాగంబు సాగింపుఁ డనిన విని వసిష్ఠాదులు మోదంబున నమ్మేదినీవిభుని వివేకంబుం గొనియాడుచు నిజ స్థానంబులకుం జనిరి తదనంతరంబ యమ్మహీకాంతుండు మంత్రులం

జూచి మీర లప్రమత్తులరై భూసురోపదిష్ట ప్రకారంబున సత్వరం
బుగ నధ్వరసంభారంబులు సంపాదింపుండని వారల ననిచి యంత నం
తఃపురంబున కరిగి తనపత్నులం బిలిచి పుత్త్రార్థం బశ్వమేధంబు సే
య నుద్యోగించితి నేఁడు దివసంబు మంచిది మీరలు యాగదీక్ష
గైకొనుం డని పలికిన. ౨౧

క. ఆకాంతామణు లందఱు
శ్రీకర మై యమృతరసము చిలికెడు నాఱో
ణీకాంతుపలుకు విని మో
దాకలనఁ జెలంగి రాననాబ్జము లలరన్. ౨౨

వ. అంత. ౨౩

క. హితుఁడు వివేకహితుండును
మతిమంతుఁడు నైన యలసుమంత్రుఁడు తానే
కతమున మఱునాఁ డాక్షితి
పతి డగ్గఱఁ జేరి యిట్లు పలికె వినీతిన్. ౨౪

గీ. వినుతచారిత్ర విను పురావృత్త మొకటి
ఋత్విగుపదిష్ట మది నీసు తేచ్ఛ కొనరు
వినియుఁ దడవయ్యె నేఁ దొల్లి మనసునందు
నిపుడు దలఁపయ్యెను బ్రసంగహేతువునను. ౨౫

—ఋశ్యశృంగచరిత్రము.—

వ. తొల్లి సనత్కుమారుండు భవత్సంతానప్రయోజననిమిత్తంబుగా ఋ
షులసన్నిధిం బలికినపలుకులు కొన్ని గల వవి యాకర్ణింపుము.

క. శుభచరితుఁడు కశ్యపుసుతు
విభాండకుం డనఁగ సుతుఁడు వెలయు నతనికిం
బ్రభవించె ఋశ్యశృంగుం
డభంగురతపఃప్రభావదఘసంఘుం డై. ౨౭

క. పితృశుశ్రూషణమున సం
తతవహ్నినిషేవణమునఁ దపమునఁ గడును
న్నతి కెక్కు నతఁడు వసుమతిఁ
బ్రతిలే దితని కని మునులు పలుమఱుఁ బొగడన్. ౨౮

క. ద్వైవిధ్యము నొందెడు నిఁక
నావరముని బ్రహ్మచర్య మాశ్చర్యముగాఁ
బావనమహనీయతపః
శ్రీవిభవ మొకింతయైనఁ జెదరక యుండన్. ౭౯

క. వైభండకిపరమతపో
వైభవ మేమనఁగవచ్చు వనజభవుండో
యాభవుఁడో యాకీర్తిన్
భూభువనంబున జనింపఁబోలుఁ దలంపన్. ౮౦

వ. ఈభంగి నాఋష్యశృంగుం డభంగుర తపోవైభవంబున నుప్పొంగుచు నిస్సంగుం డై నీవారముష్టింపచుం డయ్యుఁ దనపుట్టి చూపట్ల స్త్రీ పురుషవివేకంబు లేక లేఖరోకంబు వోగడ వనంబులం జరియించు చుండు నక్కాలంబునందు. ౮౧

గీ. అంగరాజ్యాధిపతియై చెలంగఁగలఁడు
రోమపాదుం డనంగ నాభూమివిభుని
పుడమినెల్ల ననావృష్టి పుట్టు నతఁడు
నాయ మెడలి ప్రజాపీడ సేయుచుండ. ౮౨

గీ. రోమపాదుండు తనదైనభూమి నెల్ల
వృష్టి లేకుంటఁ జూచి సంతుష్టి యెడలి
యంత శ్రుతవృద్ధులైన బ్రాహ్మణులఁ బిలిచి
పలుకు నిట్లని వినయంబు వొలఁకుచుండ. ౮౩

క. క్షామం బెన్నఁడుఁ గన మీ
క్ష్మామండలి నిప్పు డెట్టికర్మంబొ ప్రజా
స్తోమంబు వగలఁ బొగిలెడు
క్షేమం బెన్నఁటికిఁ గలుగు సీమకు నింకన్. ౮౪

వ. అతిఘోరం బగునీయనావృష్టిదోషంబు వాయం బ్రాయశ్చిత్తం బొక్కటి విచారించి యుపదేశింపుం డనిన నభ్యాభిసురు లందఱు నిందులకు విభండకసుతుండైన ఋష్యశృంగు రావించిన సువృష్టి గలుగు నమ్మునిపుంగవు రావించు నుపాయంబు సేయుం డని పలుకుదు రంత

నమ్మహీకాంతుండు మంత్రులంజూచి మీర లరిగి ఋశ్యశృంగు నిచ
టికిం దోడితెం డనిన వారును నమ్మునిశార్దూలు దుర్దమ తపోవిభవుం
బిలువ నేమెంతవారలము భయం బగు వారాంగనల నంచిన వార
లాఋశ్యశృంగుని దోడుకొని తెత్తు రిందుల నఘంబును లే దతండు
వచ్చినమాత్రన వర్షంబులు గురియు ధరణి కెల్ల హర్షంబగు నీ కూఁతు
రగుశాంతాకన్య నమ్మానికి వివాహమ్ము సేయు మని పలుకుదు రట్లన
యానృపాలుండు వేశ్యల ననిచి ఋశ్యశృంగుని రావించు నక్షణం
బున నిఖిలక్షోణి నెల్ల వర్షంబులు గురిసి సుభిక్షం బగు నారోమపాదు
నల్లుం డగు ఋశ్యశృంగమునివల్లభుండు వచ్చి పుత్రేష్టి సేయింప
దశరథమహీధవునకుం బుత్రులు గలుగుదు రని యిట్లు సనత్కుమా
రుండు పలికినాఁడు చిత్తంబున నది సత్యంబుగా నంగీకరింపుము. ౮౫

క. శాంతాకృతి యమ్మునిపతి
శాంతాసహితుఁ డయి యిటకుఁ జనుదేర మది
స్సంతాపమెల్లఁ దీఱఁగ
సంతానము నీకుఁ గల్గు జననాథమణీ. ౮౬

వ. అనిన విని సంతసిల్లి యాదశరథమహీకాంతుండు సుమంత్రున కి
ట్లనియె. ౮౭

గీ. శాశ్వతబ్రహ్మచర్యానుషంగుఁ డైన
ఋశ్యశృంగుని నెలయించి వేశ్య లెట్లు
తెచ్చి రవ్విధ మంతయుఁ దేరకొనఁగఁ
జెప్పుము సుమంత్ర కౌతుకం బుప్పతిల్లు. ౮౮

వ. అనిన విని సుమంత్రుండు ఋశ్యశృంగమునిపుంగవు నంగనలు తెచ్చి
నవిధం బంతయు సవిస్తరంబుగా విన్నవించెద వినుం డని సకల(మం
త్రిజనసమ)క్షంబున నాక్షోణీవరు నీక్షించి యిట్లని చెప్పం దొడంగె
నంగరాజ్యాధిపతి యైన రోమపాదుం డట్లు తనభూమి నతిఘోరం
బగు ననావృష్టి పుట్టుటకు విచారంబు నొందుచుఁ బురోహిత బ్రా
హ్మణుల రావించి వారలతో ని ట్లనియె. ౮౯

క. ద్వాదశవర్షక్షామం
బీదేశంబున జనించె నేకారణమో
యీదురితము వాయఁగ శ్రుతి
చోదితకర్మంబు లరసి చూడుఁడు మీరల్. ౯౦

క. ఇట్టియవగ్రహ మెన్నఁడుఁ
బుట్టదు భువి నీయఘంబుఁ బోఁజేయుటకున్
గట్టిగఁ బ్రాయశ్చిత్తం
బిట్టి దని వచింపుఁ డీర లిందఱు వేగన్. ౯౧

గీ. మినుకు మినుకున నొకనాఁడు మెఱుపుఁగనము
గగనమున నెందుఁ జే టంత మొగులు లేదు
చినుకు బంగార మయ్యె నే మనఁగఁ దూర్పు
గాడ్పు నొక్కింత మొదల దేకారణంబొ. ౯౨

క. కొండలవలె గోదమొగు
ళ్లొండొండఁ బ్రభాతవేళ నుదయించి క్షణం
బుండి యడంగెడు మఱి వెలి
యెండలు గాయంగఁ దొడఁగె నేమన నింకన్. ౯౩

సీ. చెలమ దోఁడిన నింత చెమ్మగ్రమ్మక వేఁడి
యిసుకపొలం బయ్యె నేఱు లెల్లఁ
గమఠకర్కటకమీనములు పైఁ బొరలంగఁ
జెఱువులు పంకంబు చిక్కె నింకె
వనరుహంబులు వాడి వత్తులై తూలంగఁ
గలఁకనీరును లేక కొలఁకు లిగిరెఁ
జలపట్టి వేయినిల్వులు ద్రవ్వినను నెందఁ
గూపంబులు జలంబుఁ జూపవయ్యెఁ
బైరు లిలవ్రాలి సురగాలిఁ బఱవసాగె
నలజలప్రాయదేశంబులందు నుండు
తరువు లెల్లను జోరువులై దళము లెడలి
నిలువులకు నెండె నొక్కింత నీడలేక. ౯౪

క. దేవబ్రాహ్మణపూజలు
గావింపుఁడు చాల దానఁ గలుగు శుభంబుల్
కావలసిన ధన మిచ్చెద
నీవేళకుఁ గాక ధనము లేటికిఁ బిదపన్. ౯౪

వ. అనిన వార లి ట్లనిరి. ౯౫

క. జపములు సేయించితి మే
మపరిమితంబుగ నవగ్రహం బిందుక యే
నపగతము గాదు నృపవర
యుపాయ మొక్కండు దోఁచియున్నది మాకున్. ౯౬

చ. వినుఁడు విభండకాత్మజుఁడు విశ్రుతధర్మవిదుండు బ్రహ్మచ
ర్యనియమవంతుఁ డబ్జభవునంతటివాఁడు సదాత్మయోగి ధీ
మనుఁడు ఋశ్యశృంగుఁ డనువాని వనంబునఁ సంచరించు న
య్యనఘుఁడు వచ్చెనేనియు భయంబెడలం గలుగున్ సువృష్టియున్. ౯౭

క. ఆయనఘుఁ డిటకు వచ్చును
పాయము గావింపుఁ డిదియ పరమార్థము భూ
నాయక యకలంకాత్మత
పోయుతుఁ డాతండు దలఁప భూదివిజులందోన్. ౯౮

క. వనిత యిది పురుషుఁ డితఁ డని
మనమున నెఱుఁగం డొకింత మౌనవ్రతుఁడై
వనమునన యుండు నమ్ముని
జనపదనగరంబులకును జనఁ డొక్కపుడున్. ౧౦౦

క. అఘనుఁ డిట కేతేర న
మోఘముగాఁ గురియు వర్షములు మహి క్షేమం
బౌఘనిధి యతఁడు దీనికి
శ్లాఘించు న్లోక మెల్ల సంతోషమునన్. ౧౦౧

వ. అనిన విని రోమపాదుండు ప్రమోదంబునం బురోహితామాత్యులం
జూచి మీర లరిగి యమ్మునికుమారుం దోడి తెం డనిన వార లి
ట్లనిరి. ౧౦౨

ఉ. ఓమనుజేంద్ర యాతఁడు మహోగ్రతపోనిధి యగ్నివంటివాఁ
డేమటు పోవఁగా వెఱతు మిప్పురిఁ గల్గినవారముఖ్యలం
గామకళారసజ్ఞతలు గల్గినవారల నంచితేని వా
రామునిఁ దోడ్కి తేఁగలరు హాసవిలాస విహారలీలలన్. ౧౦౩

గీ. మనుజనాయక తలపోయ మాయ లనఁగఁ
దోయజాక్షులె సుమ్ము చట్రాయి యైనఁ
గరఁగు వారలవిభ్రమకళలఁ గాన
గణికలనె పంపుఁ డిందు నఘంబు లేదు. ౧౦౪

వ. అనిన విని యమ్మహీపతి యట్ల కాని మ్మని వేత్రహస్తులం గనుంగొని వారాంగనలం దోడితెం డనిన వారు సత్వరంబుగా మదనతంత్రసిద్ధాంతమణిపేటి యగు వేశవాటికిం జని యచ్చోట హాటకమయంబులగు శ్రమకూటంబుల మణిఘటితతులాకోటిరటితంబులు మృదంగధింధిమిధ్వానంబులతో సంబాధింపఁ బసిఁడియంచు కాసెలు ప్రకాశింప మేలంబులుగూడి వివిధతాళంబులు హస్త నృత్తంబులు సలుపువారును మణికంకణక్వణనంబులు రాణింప వీణలుపలికించువారును డిపిరిదండియలు గైకొని గాణ దండి మెఱయ మంద్రమధ్యమతారస్వరంబులు సుధారసంబులు గురియ గానంబులు సేయువారును బ్రత్యక్షపాంచాలబాహాటశయ్యల నయ్యారె యనం బ్రబంధంబులు చదువువారును నొక్కొక్కదిక్కునం జక్కనికన్నెలకుఁ గొక్కోకరహస్యంబులు దెలుపువారును బచ్చఱగచ్చుటంచుల పంచతిన్నియల పన్నియలు మెఱయ విటులతోడం గూడి పన్నిదంబులు సఱచి పంతంబులు నిగుడ దంతంపుసారెలు పసిఁడిసరిగకుట్టుల పట్టుపాళీల నొడ్డి కరమూలరుచిజాలంబులు పిసాళింపం గంకణంబులు గల్లనం బాచికలు వైచి వినోదంబుగా జూదంబు లాడువారును నిద్ద ఱిద్ద ఱొద్దికయై యొక్కొక్కదారి బకదారిపులుఁగుల గులకరింపు బలువగలు గల కలహంస కారండవ క్రౌంచక శుకప్రముఖ పక్షివిశేషరవంబులుత్కంఠ మెఱయఁ గంఠనాళంబుల నభ్యసించువారును జిత్రఫలకంబులఁ జతురత్వంబు బెరయఁ జతురశీతి బంధంబులు లిఖియించువారును జీటికిమాటికిం గలహించి వచ్చు విటీజనంబులకు మంత్రంబులు

దగం దగవు లేర్పఱుచువారును నాకర్షణవశీకరణాద్యౌషధవిశేషం
బులు గూర్చి పాటవంబునం గరాటంబులం జేర్చువారును నొండొ
రుల నెఱుంగకుండ ననుపుకాండ్రు మచ్చికలం దెచ్చి యిచ్చు వెండి
మిన్న లెన్నికొని యుల్లంబు లలర వల్లంబుల నించి తల్లులకుం
గాన్కలు సేయువారును, జతురవచనరచనఁ బాటిగలచేటికలు మా
టిమాటికి విటులరాక లెఱింగింప నంగీకరించి ప్రత్యుత్తరంబు లొసం
గువారును గాముకులు ప్రేమంబున నెమ్మేనఁ గమ్మగందంబు లలందఁ
గొందఱు సురటులు విసర నిద్దంపుఁ జికిలియద్దంబులు చూచి తిల
కంబులు దిద్దుకొనువారును ముద్దురాచిల్కలకు భుజంగుల రాకొట్టి
పిలుచు వగలు నేర్పువారును నై యిచ్ఛావిహారంబుల నుండు వార
కాంతలం బిలిచి మిమ్ము నందఱ రాజసమ్ముఖమ్మునకు రమ్మని యాన
తిచ్చి రని పలికిన. ౧౦౫

సీ. మదనసంజీవని మంజువాణి ఖరాణి
రాయంచ యపరంజి రాయమెచ్చు
నెఱజాణ వింతనాణె మొయూరి బాగరి
కన్నెలేడి మిటారి కనకరేఖ
వగలాఁడి యొఱపఱి జగపాత్ర బిత్తరి
రతిసురథాణి వజ్రంపుఁ దళుకు
కస్తురివీణె చొక్కపు మానికపుబొమ్మ
ముద్దులరాచిల్క మోహనాంగి
కలికి సొబగులసోన చెంగలువబంతి
మేలి(టా)ఱా నక్కుతునుక క్రొమ్మెఱుంగుఁదీఁగ
యనఁగ నుతికెక్కి నగరికొల్వునకు వచ్చు
వేశ్యలందఱు నప్పుడ వేడ్క చెలఁగ. ౧౦౬

గీ. రా కళావతి రమ్ము చంద్రముఖి రావె
బాలకోకిల రాఁగదె పద్మగంధి
యనుచు నొండొరుఁ జీరుచు నతిరయమున
వెంట నుడిగంపులేములు వేడ్కఁ గొలువ. ౧౦౭

సీ. బిగువుఁ జన్గవమీఁటువగ లెల్లఁ గనిపించు
నలజాలుఁబయ్యెద లంద మొందఁ
జెలువంపునెఱికకుచ్చెలలపైఁ బచ్చరా
మొగపుల గొడిబారములు వ్రాసంగ
సన్నగేదఁగిరేకువన్నె చొప్పడు కీలు
జడలు పెఱుంపేల సందడింపఁ
చెక్కుల డగ్గఁబూసిన మేలిజవ్వాజి
నిగ్గువాసన దిశ ల్నిండికొనఁగ
గిలుకు మట్టెలు మొరయంగఁ గులుకునడలు
జీనిబంగారు సురటులు పూని కొను
పాదు డగ్గఱి కేతెంచి పార్శ్వములను
నిలిచి యందఱు మ్రొక్కి వినీతి మెఱయ. ౧౦౮

గీ. పచ్చి కస్తూరి బరిణలు దెచ్చి పెట్టఁ
గానుకగ నిచ్చి పద్మరాగంపు మొగపుఁ
గడియములు గల్లుగల్లనఁ గరయుగములు
మొగిచి నిలిచిన నృపతి లేనగవు నిగుడ. ౧౦౯

ఉ. కామినులార యిప్పు డొకకార్యము గల్గిన దీర లేఁగి శో
భామహితాంగలీలల విభండకసూనుని లోనుజేసి యీ
భూమికిఁ దోడితేవలయుఁ బుణ్యుఁ డతం డిట మెట్టినంతనే
సీమకు సేమమౌ ననుచుఁ జెప్పెద రెల్లజను ల్నిజంబుగన్. ౧౧౦

సీ. మృగవిలోచనలార మీనిడువాల్జడల్
వాతాశిమహిమ నివారకములు
నళినాక్షులార మీనగుముద్దుమొగములు
ద్విజరాజధైర్యావధీరణంబు
లలివేణులార తేనెలు మించు మీవచో
మాధురి శుకమోహసాధకంబు
కామినీమణులార మీమందయానము
ల్పరమహంసభ్రమాపాదకములు

దూరమున నున్నవారలై దొడ్డవార
లనెడి వారలు నై చూచి రపుడు జనులు. ౧౨౪

సీ. షడ్దర్శనీపరిశ్రమసమంచితబుద్ధి
వాసి గన్నట్టి విద్వాంసులకును
గర్ణామృతస్యంది కవితానిరూఢిచేఁ
బ్రౌఢిమించిన కవిరాజులకును
గాంధర్వసర్వస్వకళఁ గళంకము లేక
జాణలౌ జగజెట్టి గాణలకును
దత్తిలభరత మంతగాదిమతముల
వఱలెడినాట్యతత్త్వజ్ఞులకును
నిచ్చి యీకొల్వులంజల కీయఁ దగునె
పల్లకీలను హెచ్చుసంబళము బిరుదు
వాద్యములుఁ జూడ నృపులు సర్వజ్ఞులయ్యుఁ
దెలియలే రని కొందఱు వలికి రపుడు. ౧౨౫

వ. ఇట్లు పౌరు లెల్లఁ గనుంగొన రాజునానతిం గైకొని పైనంపు సొంపు లం గదలి రాజమార్గంబు గడచి చనుచుండ నయ్యవసరంబున.

సీ. కమ్మబాగాలును గత్తెఱ తెలవాకుఁ
గవిలెలు బలువన్నె గందవొడులుఁ
గపురంపుగిన్నెలుఁ గస్తురివీణెలుఁ
బన్నీటిచెంబులుఁ బసిఁడియంచు
రవికెలు జీనిసురటులు దంతపుదువ్వె
నలుఁ బట్టుకుచ్చుకుచ్చెలలకట్లుఁ
జికిలియద్దములు మంజిటికావులరణులు
మంజిడిచేలలు మఱియుఁ గలుగు
వస్తువులుదెచ్చి యేమును వత్తు మిచట
నుండనోప మటంచు నొండొండ సొలసి
పలుకు విటులను జేరంగఁ బిలిచి వారిఁ
గొంతదూరంబు గైదండ గొనుచు నరిగి. ౧౨౬

క. పుటభేదననికటస్థలి
నట నొకచో బహుళభూరుహచ్ఛాయ సము
త్కట మగు నుపవనమున నొ
క్కట యుంచుక సేపు నిలిచి కూర్చినటింపన్. ౧౨౮

చ. ఇటనట మోముద్రిప్పి వెతయొప్పుంగ దెప్పుచుఁ గన్నుఁగోనలం
బొటబొటరాలునశ్రుకణము లొక్కనగోళ్ళను మాటిమాటికిం
జిటుకుచిటుక్కనం జెదరఁ జిమ్ముచు గద్గదికం దొలంకు ము
చ్చటపలుకుల్ చెలంగ బిగిచన్గవసోఁకఁగఁ గౌఁగిలించుచున్. ౧౨౯

సీ. రాజునానతి మీఱరాదు గావున మాకు
నీవేళఁ బైనమై పోవవలసెఁ
బోయిన నేమి గొబ్బున వచ్చెదము మిమ్ము
నొకపూఁట చూడక యుండఁగలమె
మునిఁ దోడుకొని వచ్చు పనిగాన యరయంగఁ
బదినాళ్ళు పట్టెఁ బట్టు నచట
నేము పోయినకార్య మీడేఱ దేవళ్ళ
కును మ్రొక్కుకొనుఁడు మాకొఱకు మీరు
వగలఁ బొగులంగ వలదు రేవగలు మాను
మనసులోనన యున్నార లనుచు వారి
మగుడఁ బురమున కనిచి యమ్మగువలంత
మన్మథాప్తులఁ బ్రార్థింప మదిఁ దలంచి. ౧౩౦

సీ. ఒంటిగాకుండ మావెంటనే నడవుమీ
సుమచాప చాపబాణములు పూని
వనమార్గములను గావలి గాఁగ నిలువుమీ
సంతతంబు వసంత సంతసమునఁ
బవనమా ప్రాణంబుప్రాణమై యుండుమీ
హాయన మది నెడఁబాయు కెపుడు
వడఁ దాఁకకుండ మాకడనె చరించుమీ
చంద్ర వెన్నెలతేట చల్లికొనుచు

మెకములను గూడి వేడుక మెలఁగుచుండు
ఋశ్యశృంగుని బట్టఁబోవెదము కిడఁగి
యనుచు మన్మథ మధు మరు దమృతకరులఁ
బ్రార్థనలు చేసి యవ్వలఁ బయనగతుల. ౧౩౧

చ. చనిరి విభండకాశ్రమముచాయనె పోయెడిత్రోవ గాంచి య
వ్వనజవిలోచన ల్బిరుదవాద్యనినాదము పార్శ్వసీమలం
ఘనవనకుంజగర్భములఁ గ్రమ్మి గుబుల్గొనుచుండ నవ్యకాం
చనశిబికాధిరూఢలయి చక్కనిచెల్వలు వెంటఁ గొల్వగన్. ౧౩౨

వ. ఇత్తెఱంగున నవ్వారాంగనలు కనకపల్యంకికారూఢలై యిరుగెలం కులం బొంకం బగు కుంకుమవన్నెగాలితెరచీరలు దిగుపాఱకుండం బట్టు పన్నాగంబులమీఁదఁ బన్నుగా నెత్తి కట్టించి కట్టాణిముత్తి యంపు గుత్తంపుఁ గమ్మపంజులయంచులం దుళకించు వజ్రపుఁదళుకుల జిగిబెళకులంగలసి మాటికిం దేటమిటారి తెలిచూపుఁగోపులు ప్రేళ్లు దాఁట నిట్టట్టు గనుంగొనుచుఁ గదంబంపు మేపూఁతలపరిమళం బుల డంబు లతిదూరంబులుగాఁ బేరెంబులు వాఱ సారెకుం జెలి సాలెజిలుఁగుఁ బయ్యెదలు గదల సురటులు గొని విసరుకొనుచు వడ దాఁకకుండ నెడనెడం బన్నీరు చిలికిన చేసావడల మొగంబులు దుడిచికొనుచు నుడిగంపుఁ జేడియలచేతి నిద్దంపుటద్దంపుబిల్లలు గొని యప్పటప్పటికి సింగారంబులు చెదరకుండం జూచికొనుచుఁ గుసుమిత లతాకుంజపుంజగుంజన్మధురమధుప ఝుంకారధారాపూరి తంబు లగువనాంతరాళంబులఁ దఱిసి యొక్కదిక్కున వనోకహనిష్కు హాకుహరంబుల నొక్కట గుబ్బిలు నిజరతికూజితానుకారి పారావ తారావంబులు వినుచు నొక్కచక్కిఁ జక్కని కేకినాట్యంబు లవలోకిం చుచు నొక్కచోట నొక్కటొక్కటి తెక్కలం గప్పుచు మిక్కుటంపు మక్కువం జొక్కు చక్రవాకదంపతులసొంపు దర్శింపుచు నొక్కచాయఁ బాయక గుత్తంపుఁ బూగుత్తులు హత్తికొనం బున్నాగంబులం బెనం గొన్న కన్నెతీఁగియల బాగులు విమర్శించుచు నొండొక్కయెడం

బోడవుగా వివిధతాళంబు లుగ్గడించుచు గట్టువానట్టువ లనంజూపట్టు భరతంపుం బిట్టలకట్టళ్లు మెచ్చుచు వేణ్వోక్తసరసం గిసలయగ్రాస కషాయకంఠకలకంఠగానంబు లాలకించుచుం దటరుహాతరుభ్రంశి కుసుమవాసనావిశేషంబులం బాటిల్లు నేటికాలువలదండ నొండొండ కమ్మని చలిదివంటకంబులు భుజించుచుం దేటతెలినీరు గ్రోలుచుం గొలంకుల కెలంకుల నింపుదొలంకు సంకులకలహంస సారస క్రేంకారసారస్యంబులు మెచ్చుచు నందంద మందగంధవహాకిశోరంబులు శ్రమంబు లాఱంజేయుచుండం జని చని యవ్విభండకమహర్షి యాశ్రమంబున కనతిదూరంబున నొక్కయెడం బల్లకు లునిచి పాదచారంబున నరిగి యంత. ౧౩౩

సీ. యాయజూకనికాయహూయమాన నవీన
సాన్నాయ్యసౌరభ్యసంభృతంబు
పర్ణశాలాభ్యర్ణభాగసౌఖ్యనిషణ్ణ
రోమంథచలదోష్ఠరోహితంబు
శాఖాగ్రలగ్న కాషాయవల్కలకాంతి
నిత్యపల్లవితావనీరుహంబు
హోమధూమస్తోమ జీమూతమాలికా
లోకనోత్సవనటత్కేకిగణము
సకలనిగమ పదక్రమోచ్చారణజ్ఞ
శుకకృతాచార్య విశ్రాంతి సుఖమునైన
యలవిభండకమౌనీంద్రునాశ్రమంబుఁ
గనుఁగొనిరి వేడ్క నవ్వారవనిత లపుడు. ౧౩౪

సీ. ఉదయాద్రిపై దృష్టి యునిచి యామధ్యాహ్న
ముడుగక చూచుచు నుండువారుఁ
గళదఘ్నజలములోపలనె యాసాయంబు
వడఁకక మంత్రము లొనుడువువారు
బయలను వాన యొండయునాక స్థాణువు
ల్వలె నుండి ధ్యానంబు సలుపువారు

ఫలపర్ణములు చెంతఁ బడిన భక్షించుచు
నజగరవృత్తిమై నలరువారు
ఘనజటావల్కల గిజిగాండ్లు గూండ్లు
లిడఁగ లయయోగనిష్ఠులై యెసఁగువారు
నగుచుఁ దపములు సేయు మహర్షి వరులఁ
జూచి యాయబ్జలోచన లోఁ జోద్యపడుచు.

క. ఇది సకలపుణ్యసదనం
బిదెపో యలబ్రహ్మలోక మెంచఁగ ననుచున్
మది వెఱఁ గందఁగ నెంతే
మదవతు లయ్యాశ్రమంబు మహిమలు గనుచున్.

వ. అయ్యాశ్రమంబుఁ బ్రవేశించి యొండొరులతోడ.

క. నకనకఁ గౌనులు బెళకఁగ
సికతాకలశములఁ జలుపచెలువొందఁగఁ జె
ట్లకు నీళ్లు వోయుమునిక
న్యకలప్రభావంబు గాంచె నళినదళాక్షి.

క. బంగారు వెండి గొలుసుల
భంగింగంఠములఁ గోడెపాపలు పెనఁగన్
ముంగిసలు పర్ణశాలల
ముంగిళ్లం బరువులిడుచు ముద్దులు గాంచె.

గీ. మక్కువ చెలంగఁ దమలేఁగ లొక్కప్రక్కఁ
బులికొదమ లొక్కప్రక్కను బొమఁగుదూఁటి
చన్గుడుప నట్టు లిటునటు సాదిసారె
వాని మైనాకుచుండు గోవ్రజముఁ గాంచె.

సీ. ముదితాపసులచేతి యుదకుండికలు తొండ
ములఁ దెచ్చుగజపోతములను గాంచె
వలచుట్టికొనుచు నివ్వరియొండుగలకుఁగా
వలియుండు జింకపిల్లలను గాంచె

## ఆంధ్రసాహిత్యపరిషత్తు— ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురముమహారాజావారు; పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

కీ. శే. శ్రీ బొబ్బిలిమహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభావర్గము.

### కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

కిడాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ

### —కార్యనిర్వాహకసభాసభ్యులు.—

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయఁడుగారు, (కోశాధ్యక్షులు)

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ. ,,

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., ఎల్. టి.

దర్భా వేంకటశివరామరాసుగారు, బి. ఏ., బి. యల్.

అళక్కి వేంకట్రామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావునాయఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.

పిళ్ళారిసెట్టి గంగబ్రహ్మరావునాయఁడుగారు.

// శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు

శ్రీ పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని, రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమసంపుటము ముద్రితమై విక్రయమునకు సిద్ధముగా నున్నది. ఇందు, అకారము మొదలు, ఔకారమువఱకును గల యచ్చు లాదియందుఁ గల సంస్కృతాంధ్రశబ్దము లన్నియుఁ గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నింటికంటె నిది సర్వవిధముల నుత్తమమైనది. ఈ భాగము శబ్దరత్నాకరములో 186 పుటలలో నిమిడినది. దీనినిబట్టి యీరెండు నిఘంటువులకుఁ గల తారతమ్య మూహింపవచ్చును. ఈనిఘంటువునందు, సంస్కృతశబ్దములు పూర్వనిఘంటువు లన్నింటియందుకంటె మిక్కిలి యధికముగా నీయఁబడినవి. కావున సంస్కృతవిద్యార్థులకుఁ గూడ మిగుల నుపయోగకరముగా నుండును. ఇది యున్నచో సంస్కృతనిఘంటువు నపేక్ష యుండదు. ఆచ్ఛికపదములకుఁ గల యర్థభేదములఁ గనఁబఱిచి వానికిఁ బ్రమాణవాక్యములును బూర్వగ్రంథములనుండి విపులముగా నీయఁబడినవి. లభ్యమైనంతవఱకుఁ దేశ్యశబ్దములకు సంస్కృతద్రావిడాదిభాషలయందుఁ గల సజాతీయపదములు చూపఁబడినవి. కేవలము విడిశబ్దములే కాక సందర్భానుసారముగ సమస్తపదములు (Phrases) ను దానికిఁ గలయర్థములును బ్రయోగములును గూడ నీయఁబడినవి. జనకశబ్దములక్రింద జన్యశబ్దములు చూపఁబడినవి. ఏవిధముగఁ జూచిన నిది యిదివఱకున్న నిఘంటువు లన్నింటికంటె మిన్నయని మఱియొకసారి నిస్సంశయముగఁ జెప్పవచ్చును. దళసరికాగితములమీఁద నచ్చువేయఁబడినది. చక్కనియక్కరములు, తోలు, క్యాలికోలతో గట్టి బైండుచేయఁ బడినది. గిల్టు అక్షరములతోఁ బేరు గలదు. పుస్తకభాండాగారముల కిది యలంకారముగనుండును. విద్యార్థులకు సహకారి. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకే గాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగానుండవలయునను తలంపుతో సాదాప్రతి వెల రు. 5 లు, ఆర్టు పేపరు ప్రతి రు. 7 లు, మాత్రమే నిర్ణయింపఁబడినది. రైలు, పోస్టువ్యయములు, కొనువారే భరింపవలయును. కావలసినవారు, కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్తు కార్యదర్శులకు వ్రాయఁగోరెదము.

Printed by N. Achutaramiah at the Cocanada Printing Works, Cocanada

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౨౫. { ధాతృనామసంవత్సరము. / మాఘఫాల్గునమాసములు. } సంచిక ౬.



కాకినాడ

కొత్తపల్లి సూర్యరావుచే బరిషన్ముద్రాలయమునఁ

ప్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు ౩-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

ఫిబ్రవరి, మార్చి 1937.

# విషయసూచిక


1. విజ్ఞాపనము ౨౧౩-౨౧౪
2. కవిజీనోజ్జీవని-సమస్యలు ... ౨౧౫-౨౨౦
   క్రొత్తపల్లి సూర్యరావు.
3. సాహిత్యసంస్కారము ... ౨౨౧-౨౨౮
   కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు.
4. సౌగంధికప్రసవాపహరణము ... ౨౨౯-౨౪౪
   కుందూరి ఈశ్వరదత్తుగారు. బి. ఏ.
5. సంస్కృతవాఙ్మయచరిత్రసమాలోచనము ... ౨౪౫-౨౫౮
   ఈయుణ్ణి వీరరాఘవాచార్యులుగారు ఎం. ఏ.
6. జవ్వనము-యవ్వనము ... ౨౫౯-౨౬౨
   కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.
7. శైలివిలాసిని ... ౨౬౩-౨౬౭
   కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.
8. బ్రహ్మవిద్యా .. ... ౨౬౮
9. రఘునాథరామాయణము ... ... 57-72
   రఘునాథభూపాలుఁడు.
10. లక్షణసారసంగ్రహము ... 25.28
   చిత్రకవి పెద్దనార్యుఁడు.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

## కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౫. { ధాతృనామసంవత్సరము. మాఘఫాల్గునమాసములు. } సంచిక ౬.

## విజ్ఞాపనము.

పాఠకమహాశయులారా !

ఈసంచికతోఁ బరిషత్పత్రికకు ౨౫ సంవత్సరములు పూర్తియగుచున్నవి. రజతోత్సవసమయము వచ్చినది. ఇది యంతయుఁ బాఠకుల యాశీర్వాదబలము. అభిమానులకు దురభిమానము మెండయినను, నభిలాషము తగ్గినను, రుచి సడలినను, స్నేహితులు (భాషావిషయమున) వైరులైనను, స్వభాషాభిమానులు పరభాషాదరులైనను, గ్రాంథికవాదులు గ్రామ్యవాదులైనను, సంస్కృతమిశ్రితము తెనుఁగు తల్లిభాషకాదని తాము సంస్కృతసమాసములను గుప్పించువారున్నను, నెవ్వరేమైనను పెద్దలయాశీర్వాదమునను భాషాదేవి కరుణవలనను బరిషత్తును బత్రికయు నింతవఱ కవిచ్ఛిన్నముగా నడచుచున్నవి. స్థాపించిన మహనీయుల సత్యసంకల్పబలము—రజతోత్సవము గావింపనున్నది.

కాలానుసారముగా మార్పులు చేయవలయు ననువారు బైలువెడలిరి. కాలమే మార్పవలయును గాని తదనుసారముగ మానవుఁడా మార్చువాఁడు. మానవునిమార్పులు వెఱ్ఱితలలు వేయుటకే.

ఎవ్వ రెన్నివంకలు పెట్టినను, ఎవ్వ రెంతయాక్షేపించినను, నున్మార్గాములను, వారుపెట్టుతొందరలను సహించి శాంతముగా హంసము వలె సన్మార్గమున నడచుచుఁ బరిషత్తు వలుకుచు "యోజించికొనుము, నిజము నిలుకడమీఁదఁదెలియఁగలదు, వాగాడంబరముచాలు, ముగ్ధమాపిచ్చినమ్మకములు తగ" వని వాత్సల్యమునఁ జిఱునగవుతో లోకమునకు మౌనముగా సంజ్ఞలతోఁ దెల్పుచున్నది.

"శూరు న్నిర్దయుఁగా" నన్నట్లు వెఱ్ఱియాక్షేపణలకుఁ బ్రత్యుత్తర మీయకున్న నూరకున్న దని తలంచులోకమును బరిషత్తు దూరాలోచనము లేనిదానింగాఁ జింతించుచున్నది.

భాషాభిమానుల యాదరము తొల్లిటికంటె నింకముం దెక్కుడు కావలసియున్నది. రజతోత్సవోచితముగ నింతవఱకుఁ బరిషత్తు ప్రకటించిన గ్రంథములు నుపన్యాసములు విలసిల్లి యలంకారప్రాయములైనవి. సువర్ణోత్సవమునకుఁ దగునట్లు ముందుఁ బండితులుఁ, గవులు,విమర్శకులు సువర్ణశోభం గూర్చువ్యాసరాజములను దయచేసి ప్రసిద్ధు లగుచు స్వభాషావిభవము నాంధ్రలోకమున వెల్లివిరియింపఁ బ్రార్థన.

పరిషత్ప్రకటించిన యుత్తమ గ్రంథములను భాషాభిమాను లాదరించి తాముచదివి మిత్త్రబృందముచేఁ జదివించి వానిలోని విశేషములను దిలకింతురుగాక.

అపూర్వతాళపత్త్రగ్రంథములను సేకరించిన వారు వానిని బరిషత్పుస్తకభాండాగారమునకు దయచేయుదు రని ప్రార్థన.

పత్త్రికాగ్రాహకులు తమతమచందా ధనమును బంపుచు మిత్త్రులను బ్రోత్సహించుచు యథారీతిఁ బరిషత్తు నాదరింతురుగాక.

# కవిజనోజ్జీవని-సమస్యలు.

సమస్య లనఁగాఁ గవిని బరీక్షించుటకై పెద్ద లిచ్చెడు పద్యాది భాగములు. వీనిని గైపదము లందురు. కవికిఁ గలభాషాపాటవమును గనిపట్టుటకై కవితయందలి యభ్యాసవిశేషములను దెలిసికొనుటకై యొసఁగెడు ప్రశ్నలు. సమస్యలు సంస్కృతమునందును గలవు. తద్ద్వారముననే మన తెనుఁగులోనికిని దిగినవి. సమస్య యిచ్చుట యనునది కవిని బరీక్షించుటలోని కఠినభాగము. చదివిన శాస్త్రాంశముల నడిగిన నిట్టె చెప్పవచ్చును గాని సమస్య లట్టివి కావు. అష్టావధానములో నిది యొకయంగముగా నున్నది. సమస్యలిచ్చుటలో ననేకవిధములు. సాధారణముగాఁ బద్యము నాల్గవచరణము నిచ్చి మొదటి మూఁడుచరణములును సందర్భానుసారముగాఁ బూరింపు మందురు. కడపటిచరణములో నక్షరగోపనమో యర్థవంచనమో-యుండును. కొందఱేదియో యొక వాక్యము నిచ్చి యిది యేవృత్తములో నిముడు నని యడుగుదురు. కొన్నిపదములనిచ్చి వీని నీవృత్తములో నిముడింపు మని యడుగుదురు.

నగరు, వగరు, తొగరు, తగరు ననుమాటల నిచ్చి భారతభాగవతరామాయణార్థముల నిచ్చునట్లుపద్యములు చెప్పుమని రాధామాధవకవి నడిగినారఁటగదా. స, సే, మి, రా. - అ, ప్ర, శి, ఖ. అను సంస్కృత ప్రశ్నలును సమస్యలలోనే చేరును.

గోలకొండ, మాలముండ, పూలదండ, కొత్తకుండ యని సమస్యయిచ్చినఁ బద్యములో నొకకవి యిమిడించెనఁట గదా: ఇట్టివే సమస్యలు. ఇందుఁ గొన్ని చాలఁ దేలికగాఁ గనఁబడును. పూరించుటకుఁ గూడఁ దేలికయే యగును. కొన్ని చిక్కులుపెట్టునవి కలవు. సమస్యలను బూరించుటకుఁ గవి కుభయభాషలలోనేకాదు పరభాషలలోఁ గూడ ననుభవము కొన్నింటి కవసరమైనట్లు కనఁబడుచున్నది.

"తలకాయలపులుసుద్రావి తనిసిరిబాఁపల్"

"కప్పను గని పాము భీతి గడగడ వడఁకెన్."

ఇట్టివి చాలఁ దేలికగా నుండును.

"ఏకాదశినాఁడు సప్త మేడేగడియల్."

దీనిపూరణమునకై కొంతయూహా యుక్తియు నవసరము.

"గుంద్రాతికిఁ గాళ్లు వచ్చి గునగున నడిచెన్."

దీనిని బూరించుటయే ప్రధాన మైనది గాని-కోదండ్రాముఁడు, "ఇంద్రాప్రాసము" "ఈంద్ర" యాతఁడు సమస్య యిచ్చె ననుట యంత సరసముగాదు.

మొత్తముమీఁదఁ గవులను బరీక్షించుటకే సమస్యలు పుట్టిన వనుకొనవచ్చును. సమస్యాపూరణము వలన సాహిత్యబలము వృద్ధియగును. కొందఱకుఁ జదరంగపు వెఱ్ఱివలెనే సమస్యలవెఱ్ఱి యెక్కుడు. ఒక్కయష్టావధానిం గాంచిరా, యొక్కకవి తారసిల్లెనా, చాలఁజిక్కులసమస్య లిచ్చెదరు.

"ఇఁక నొకలక్షయిచ్చెదను నింపుకుఁ బద్యము చెప్పు సత్కవీ" యని సమస్యయిచ్చిన- "ఇఁక నొకలక్ష యిచ్చినను నింపుకుఁ బద్యము లేదు సత్ప్రభూ" అని చెప్పినట్లు వింటిము.

"సంస్కృతవాసనామహిమ చాలదుగా భువి నెంతవానికిన్" అని యెవ్వరో -మాదుగులసంస్థానములోఁ గాఁబోలు- సమస్య యిచ్చినట్లును అల్లమరాజు సుబ్రహ్మణ్యకవిగారుకాఁబోలును రెండుచరణములు పూరించినట్లును వినియుంటిని. విషయమును జెప్పుటకే కాని దీని యథార్థవిషయముగా నన్నింటిలో నెంచుటకుఁ గాదు. అతివిస్తారము వలదు.

ఈసమస్యల పుస్తకమును తిరుచునాపల్లిజిల్లా, నవసాలపురమను పుదుకోట (క్రొత్తకోట) రాజైన రఘునాథభూపాలుఁడు రచియించెను. పుదుకోట స్వతంత్రసంస్థానము. ఈరాజవంశమునకు, తొండమాను లను

బిరుదనామము గలదు. ఈరఘునాథతొండమాన్ భూపాలుఁడు 1767వ సం. మొదలు 1789 వ సం. వఱకుఁ బరిపాలించెను. ఈతనియొద్దఁ బెద్ద విద్వాంసుఁడు నుదురుపాటి వేంకనార్యుఁడని యొకఁడు కలఁడు. ఈరాజు తండ్రి విజయరఘునాథతొండమాన్ మహీపాలునియొద్ద నీవిద్వాంసుని తండ్రి యుద్దండకవి బిరుదుగల సీతారామశాస్త్రి యుండెను. ఈవెంకన కవికుమారులు సాంబకవి మున్నగువారుండిరి. వీరందఱును ననేకగ్రంథములను రచించిరి. ఈసమస్యలను వెంకనకవి యిచ్చుచుండిన రఘునాథ భూపాలుఁడు పూరించినట్లు పుస్తకములోఁ దెల్పఁబడినది. ఈరాజు మున్ను పార్వతీపరిణయమను ప్రబంధమునుగూడ రచియించియున్నాఁడు. దానిలోఁ దన యాస్థానమునందలి విద్వాంసుఁడగు వెంకన్నకవిని బ్రశంసించి యున్నాఁడు. దానింబట్టి కొందఱు వెంకనకవియే రచియించి పార్వతీ పరిణయమునకు రాజుపేరు పెట్టినాఁ డందురు. అట్లే దీనినిగూడ భావించెదరు. మనలో నున్నదియే, కృష్ణదేవరాయలు నే నాముక్తమాల్యదను రచించితి నని యెన్నో సాక్ష్యములతోఁ దెల్పుచున్నను మనవారు దానిని బాటింపక పెద్దనార్యుఁడు రచించి గాఁ డని చెప్పెదరు. ఇంకఁ దక్కినవారి మాటెందుకు. కల్పనలలో, నంగునను నిస్సారకల్పనలలో, వానిని నమ్ముటలో మనవా రందె వేసిన చేతులుగదా! సుప్రసిద్ధులు విద్వదగ్రణులు వేదము వేంకటరాయశాస్త్రులవంటివారు, ఆముక్తమాల్యదను శ్రీకృష్ణ రాయలు రచించిన దని యొప్పుకొనక పెద్దనపేరు లోకులు చెప్పుచున్నను దానిం బాటింపక, చివరకుఁ బుస్తకముమీఁదఁ దమ పేరైన వేసికొన్నారు గాని రాయలపేరు గాని పెద్దనార్యునిపేరు గాని వేయఁ జేయాడినవారు కారైరి. ఇంక నితరుల లెక్కయేమి. మల్లినాథసూరి యెంత కొట్టుకొనుచున్నను పెద్దిభట్టుగారని మనవారు వాడుటమాననుగదా? పండితబృందము సభలో నుండఁగా రాజు రసికుఁడు కారాదా, కాఁడా? రాజు లంతయజ్ఞానులా! భోజరాజుమాట యేమిచెప్పెదరో వీరు. ఇంక విస్తరింపరాదు. పండితుఁడగు నుదురుపాటి వెంకన్నకవి కవిత్వమునకును ఈరాజుకవిత్వమునకు

నుభేదమున్నట్లు విమర్శకులుఁ బండితులునిదివఱకొప్పుకొన్నారు. ఏవి వెంకన్నవంటివాఁడుప్రయోగింపఁడని రఘునాథరాజునెత్తిని రుద్దినాఁడో యట్టివియే యీసమస్యలలోఁగూడఁగలవుగావున దీనిని వెంకన్నకవి కంటఁగట్టరనితలఁచెదను. ఆర్యులారా! నానుడులను నమ్మక నానుడులను విశ్వసింపుఁడు. ఇటీవలి మృత్యుంజయ కవివంటివారు ధనాశచేఁ బలువురపేర బహుగ్రంథములు రచించినట్లు కనఁబడుచున్నదిగాని- ఆంధ్రభాషార్ణవమువంటి శ్రేష్ఠతరాంధ్రనిఘంటువును రచియించి యాంధ్రులకు భిక్షపెట్టినవిద్వాంసుఁడు డబ్బుకక్కుఱితిని హీనకార్యమును జేయఁడు. భోజమహారాజు మొదలిప్పటి చిన్నచిన్న ప్రభువులవఱకును వారివారిగూాస్థానములలో ననేకులు కవులుఁ బండితులు నిల్చియున్నారు. అరసికు లయినరాజులు కవుల నాదరింతురా.

ఏవయిన దోషపదములు (వరించేవేళ, దివ్యరత్నాకలితంబగుక ద్యుతివిభంబున)కలిగిన నవి యప్పటికిగ్రామ్యకక్ష్యలోఁ జేర్పనివారుకొందఱుండియుందురని తలంచుట లెస్స. కవులు సమ్మతించి రనవచ్చును. అట్లతియకాని రాజులుచెప్పినవి తప్పులు వారికవులుచెప్పినవి యొప్పులు ననుట సమంజసముగాదు. ఏవియోకొన్నిపదములు విరుద్ధములు దొరలినను- వానిని రాజు కవికిఁ జూపించిన సమర్థించి సందర్భశుద్ధిగానున్నందుననో దిద్దిన నచ్చుట సరిగాఁ గుదుర దనియో ప్రభువును దప్పులు పట్టుటకు శంకించియో యట్టివానిని సమ్మతించినంతన యేమాయె. మఱియు నొక్కరు రచించిన తప్పుల పుస్తకమును విద్వాంసుఁడు దిద్దిన నది యతనిశైలికే వచ్చును. భేద మెట్లు తెలియును. ఇప్పుడిట్టివెన్ని వెలువడుటలేదు! శాంతము పాపము!

ఈకవిజనోజ్జీవని పరిషత్పుస్తకభాండాగారములో 3852వ సంఖ్యను గలదు. ఈకాగితముపుస్తకము పరిషత్తునకుదక్షిణదేశమునఁ బుస్తకసంపాదన మొనర్చిన బ్ర. హరి సేతురామయ్యగారు సంపాదించినది. ఇదివారి స్వహస్తలిఖితము. ఈయన వెంకనకవిగారి బంధుకుటుంబములోనివారు,

తిరిచునాపల్లిలో నున్నారు. ఇందలివివరణములలోని కొన్నిమాటలు మేము సవరణ చేసితిమి. కొన్ని యిప్పటివారికి రుచింప వనితొలఁగించితిమి. ౧౦౪ పద్యములకు ౮౫ మాత్రమే ప్రకటించితిమి. తొలఁగింపఁ బడినవి యభిలాషగలవారు మూలగ్రంథములోఁ జూడవచ్చును.

లికుచంబులు కొండలంత లేదావాదా.

రాళ్లు తనుదాన గూసెకు రాజవదన.

మగదానికి వైరి యూఁడవాఁడే తలఁపక.

ధారుణి పొడవయ్యె గిరులు తలక్రిందయ్యెక.

అగ్నికిఁ గాళ్లు యిదుగాక యధికముగలదే.

ఇట్టివి పూరణములోఁ జమత్కృతి లేనివి, యసభ్యముగా నుండు నేమో యనుకొన్నవి తొలఁగింపఁ బడినవి. "పగటఁ జంద్రిక" యను 48వ సమస్యకు రెండుపద్యములున్నవి. మొదటిపద్యముందొలఁగించితిమి. ఇప్పటికిని గొన్నిపూరణములు శ్లేషలమూలమునఁ జక్కగాఁ గుదురుట లేదు. వంకాయ, వంకాయె, బీర(అ)కాయ-జంబీరకాయ యను నిట్టివి చూడుఁడు.

ఇది నిజముగాఁ గవిజనోజ్జీవనియే. 73వ పద్యము గ్లాప్రాసయుతము. 75వది-గోగ్రణిగోఅగ్రణీగవాగ్రణి.-ఇట్టివిపండితుఁడుకానివాఁడుపూరించినవికావు. పాండిత్యము లేనివాఁడు పార్వతీపరిణయమును రచింపఁ గలఁడా. అందెంత లోకానుభవవిషయమున్నదో చిత్తగింపరా! అక్షరగోపన వృత్తగోపన సమస్యలు, సాధారణములా. అవి సాధారణులకు సాధ్యములా! మాపరామననే కావచ్చును-గ్రంథముచివరకాగితములో నొక్కప్రక్కను "౨౪ (౩) నాలుగేళ్లును నెనిమిదే నలిననయన-

తే. గీ. ఏగునొక్కటికిని నాలుగెద్దులుండ
నిరుడు కొలుచుండె గాదెలఁ దఱచుగాను
అల్లయెద్దులలో సగ మమ్మివేయ
నాలుగేళ్లును నెనిమిదే నలిననయన."

అనుష్టుప్ఛ్లోకపద్యముగలదు. మొదట విడువఁబడినది. మూలములోఁ జేరలేదు. అర్థమేని జేర్చుకొనుఁడు. అంగళులలో దొరకుసమస్యల పుస్తకముకంటె నిందనేకవిధముల విశేషములతోఁ గూడిన పద్యములుగలవు. చదువరులకు నేను దెలుపనక్కఱయుండదు.

కవనమునం దాదరముగలపాఠకులార! సమస్యలనాదరింపుఁడు; సమస్యాపూరణమునందును సమస్యల నిచ్చుటయందును నిపుణుల రగుఁడు. పెక్కులు సమస్యలం జదివినఁగాని మీకు దానియం దుత్సాహము కలుగదు, కలిగినంగాని చమత్కారముగ సమస్యల నీయఁజాలరు, పూరింపఁజాలరు. సమస్యాదరణము-భాషాభివృద్ధికి మూలమగును.

పుదుకోట, దానిప్రభువులను, వారివిద్వాంసులను, వారివారి గ్రంథములం దెలుపుచు విరివిగాఁ బ.మత్తువారు చక్కని చరిత్రము వ్రాయుంపనున్నారు. కావున నీచిన్నిపొత్తము పీఠికలో విశేషింపలేము.

విద్వద్విధేయుఁడు,

క్రొత్తపల్లి సూర్యరావు.

# సాహిత్యసంస్కారము.

— కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు, సాలూరు —

మనము కావ్యవిషయ మరయుదమన్న ఖండకావ్యములు కావున నామూలాగ్రమరయ నక్కఱలేదు. ఒకటిరెండు విషయములే చాలును. ఈఖండకావ్యములును స్వల్పాల్పఖండకావ్యములు కాని మేఘదూతాదుల వంటివి కావు. చాటుపద్యములవంటివి. ఇట్టివి మనమహాకావ్యములలోఁ బరశ్శతము లున్నవి. ప్రాస్తావికశ్లోకములు, సుభాషితనీవి, విశ్వగుణాదర్శము, సుభాషితత్రిశతి, సుభాషితరత్నభాండారము, మున్నగుమహాగ్రంథములు గలవు. శతకములు నట్టివే యనవచ్చును. భ్రమరగీతాదులు నట్టివే. ఆంధ్రమునందు ననేకము లున్నవి. చాటుపద్యమణిమంజరి నరయుఁడు. ఇఁక నేఁడీఖండకావ్యములే మనోహరము లనియు నూతనము లనియు ననన క్కఱలేదు. అయినను నేఁడు పుట్టుచున్న వానియం దేవో నవత్వ మున్న దనుకొందము. కాని "పూర్వులవి" నేఁటివారివి భావములను మేళవించి రచించుచున్నారు. అప్రయత్ననిపతితపూర్వసద్భావసౌభాగ్యమునకు సంతసించి యధునాతనభావసత్తాపరిశీలనమును జేయుదము.

భారతిలో భావకవిత్వప్రభావమును భాషాభ్రంశప్రశంసయు విస్తారముగ నున్న దని తత్తత్ప్రకటితపద్యాంతర్విన్యస్తాంగ్లప్రశ్నచిహ్నాంకితములే చెప్పుచున్నవి. తత్సంపాదకులును బ్రబుద్ధాంధ్రాదిపత్రికలలోఁ దమకున్న భావకవిత్వభావమును బైటపఱచియే యున్నారు. అయినను నేదో నిర్బంధ ముంటఁ బ్రకటించుచున్నారు. ఇట్లే కొంద ఱున్నను మఱి కొంద ఱుద్దండస్వాతంత్ర్య మంతయును వాఙ్మయంబునఁ జూపుచుఁ గవు లందఱు నిస్తంత్రు లనుచు నేకలంఘనముగ విహరించుచున్నారు. ఇట్టి సాహిత్యమును సంపాదనయు గర్హ్యా మని బ్ర. శ్రీ నండూరు బంగారయ్యగారు రాజమహేంద్రవరమున నుపన్యసించిన ట్లాంధ్రపత్రిక ప్రకటించెను. ఆయామహామహులు తమలోఁ దాము వితర్కించుకొన్నచోఁ దమయర్హతలు బోధపడకపోవు. ఆత్మశిక్ష ధర్మశిక్ష.

నేఁటివారు కొందఱు తమరచనములను బరిష్కృతములను గావిం పనొల్లరు. పండితపరిష్కృత మనియుంట స్వవిజ్ఞానలోప మని తలఁతురు. ఇదియుఁ గాలమహిమ యనియుఁగాలోచితముగ నవ్యమార్పులు వచ్చు ననియు నొకముడిమాట పట్టుకొని యనన్వితముగ విమర్శించుకొనరాదు.

కాలమునుబట్టి సాధారణపరిణతి యున్నను సార్వత్రికము గాదు. అంతను గళావిషయ మట్టిది కాదు. కొన్నిలక్షణము లచంచలములై యుండకున్న మూలచ్ఛేద మగును. ఈరహస్య మెఱుంగక పరిణామవాద మాత్రసర్వవాదము గావింతురు. చూడుఁడు- పదికోట్లవత్సరములకుఁ బూర్వమున మనుష్యుఁడను నేఁటిమనుష్యుఁడును మనుష్యతత్త్వప్రత్యాయకముఖ్యసాదృశ్యలక్షణమున సమానుఁడుగనే యుండును. బాహిరము లెన్నియున్నను నాంతరము శరీరనిర్మాణానుబంధసత్త్వకమూలరూపము సమానము. కాకున్న సమతాబోధకతాజ్ఞానమును బ్రతీతముగాదు. అనుభవ విరుద్ధము. బోధనారూపవ్యవహారసౌలభ్యమునకు గ్రహింపవలసివచ్చినతత్తద్వాదములను బరమార్థముగ గ్రహించుట ప్రాచ్యులకు నచ్చనిదే కదా? మనకు గోచర మగునది మాధ్యమికస్వరూప మనియు నామాధ్యమికమునే భ్రాంతిచే నాదిమధ్యాంతవిభాగము చేసి కొని తృప్తిపడుచుంటి మనియు భగవద్గీతలో శ్రీకృష్ణుఁడు " అవ్యక్తాదీనిభూతాని " ఇత్యాదిగా నుపదేశించెను. మనలోకమును మధ్యమలోకమే. మన మనుభవించునది యంతయు నైంద్రియికమగుటనదియును మాధ్యమికమే. జడాద్వైతవాదులును నాద్యంతముల నిరూపణమున నిరుత్తరులు గావలసినదే. పరిణామ మనుటకన్న వివర్త మనుటయే న్యాయ్యముగ నుండును. ఈపరిణామ చక్రము నియతభ్రమణముతో నున్నది. కాని కాలాదిపరిచ్ఛేదకత్వ మైకాంతికలక్షణముగాదు. కావునఁ గాలోచితపరిణామ మగుట దుర్నివార మని పూన్కి మానరాదు. లాంకషైరులాగులే కాలమునకుఁ దగిన వని యూరకుండిరా ! నాటుగుడ్డలనీటు పాటింపలేదా ! ఆంగ్లమే విద్యామూల మని చేతులు ముడుచుకొనిరా ! స్వభాషాముఖదర్శనము సేయులేదా ; ఇంతయేల ? కాలమువలనఁ బ్రాప్తమైన జ్వరాదివ్యాధులను

వశమున సడలినను సవరింప సాధనాంతరములఁ గనుఁగొనరా? అపరి
హార్య మని యలసుల మగుదుమే? మార్పు నాఁపుట యన నేమియో
దృఢముగ నెఱుంగఁదగును. వ్యాధినిదానము నెఱింగి స్వస్థునిఁ జేయున
ట్టే యాధిలక్షణమును దెలిసి స్వస్థము గావింపవలయును. సాహిత్య మ
స్వస్థమై మూల్గుచున్నది. చికిత్స గావింపవలయును. అస్వాస్థ్యరూప మగు
నీమార్పు నాఁపవలయును.

సాహిత్యము కాలబద్ధమా యనుశంక నుత్తరించుకొందము.
అవ్వలఁ దదీయ స్వస్థత్వాది విచికిత్స వివేకింతము. కాలకృత మన్నచో
సనాతనధర్మము సత్యము ననుట కల్లయై వేదాదుల సాహిత్యము ప్రకృ
తోపయోగి కా దనవలయును. తత్తత్కాలీనము లయ్యెయంశము లున్న
ను బ్రకృతకాలీనలీనములై యుండవలయును. కాకున్నఁ బ్రకృతమును
గాదు. నిన్నఁటి దేవదత్తుఁడు నేఁటిదేవదత్తుఁ డని యభిజ్ఞాత మగుటలో
దేశకాలాద్యనవచ్ఛిన్న దేవదత్తేత్యభిజ్ఞానప్రతిజ్ఞాంశైక్య మఖండముగ
నుండవలయును గదా? అట్లే కాలకృతమునకుఁ బార్థక్యమును జూప
వలదు. కాలకారణకసాహిత్య ముండు నన్నఁ గాదనము. తత్తద్విభాగ
కారణకము తత్తత్పదార్థ మనుటలో విప్రతిపత్తి లేదు కాని తత్తదనపేక్షి
తము తత్తదభివ్యక్త మనుటలో విప్రతిపన్నులము గావలసివచ్చును. అం
తయుఁ బరస్పరతత్పరక మగును. తీఁగఁ గదలింప డొంక యంతయుఁ
గదలును. సారస్వతసాహిత్యకళాలలితకేంద్రస్థానము సుభగంభావుకదివ్య
పదం బగుటఁ దత్పదవికిఁ గాలవ్యవచ్ఛేదకత పొసఁగని దగుటనే విరత
యశావసఘనప్రాబల్యమున భారతి యేకస్థాయిఁ దనకచ్ఛపిని మీఁటి వినో
దగానము సేయుచు సత్యసౌందర్యాపాదకదివ్యశక్తి ప్రస్ఫురింపఁజేసి
బ్రహ్మను ముగ్ధునిఁ జేయుచున్నది. హంస పై నుఱచియున్నది. అదియే
భారతీసత్యసుందరగానవిశిష్టత. కావునఁ గాలసాన్నిధ్య మఖండదివ్య
త్వానుసంధాయకకృతికిఁ గలుగునే.

పరిణామవాదులును మూలభూతకణముల సామ్యమును సమ్మ
తించియే యున్నారు. పరిణామ మనఁగఁ బూర్వభూతవిఘాతము గాదు.

పూర్వభూతవిశేషము పరిణామము. పరిణామమున స్వాంశత్యాగ ముం డదు. స్వాంశవికసనమును స్వాంశాభ్యుదయవిధానానుకూలవ్యాపార విశేషమును బరిణామము.

ఈపరిణామమును జక్రభ్రమణకమే కాని యేకధారగ నట్టు మాఱుట కాదు. అనంతత్వ మైక్య మని గణితజ్ఞసమయము. సాంఖ్య తత్త్వమును నట్టిదే. అందువలన వర్తమానకాలమునఁ బొడసూపు నీపరి ణామము స్వస్థము నుచితముఁ గామి సంస్కరింపవలయును.

సాహిత్యమస్వస్థమా ? నానాజాతీయభావనలసాంకర్య మనన్వి తముగ ననాత్మ్యముగ నంటుటచే సాహితికి వ్యాధియే సంభవించెను. వ్యాధిపరీక్ష కష్టసాధనము లితరమున నున్నను నిందుమాత్రము స్థానస్థాని విచక్షణము గావించి త్రిదోషముల యుపశమనము నాచరించిన స్వస్థ ప్రకృతిక మగును. ఈవ్యాధికి స్థానము- పరధర్మాభిరతి. స్వత్వచ్యుతికి మూలము పరధర్మాభిరుచియే ప్రధాననిదానజ్ఞులవలనఁ జెప్పఁబడెను. వివిధపదార్థము లారగించినను నవి యన్నియుఁ నెట్లు శరీరరక్తారసత్వ రూపైకస్వరూపము నొంది యారోగ్యము నిచ్చునో యట్లే నానాభావ ములును మూలభూతస్వభావమునఁ గేంద్రీకరింపఁబడిన భావప్రభ దివ్యా లోకరమణీయమై యానందమును గూర్చును. స్వధర్మహృదయకుహర మున నీభావము లన్నియుఁ జొచ్చి తమపార్థక్యమునువిడిచి యేకస్వరూ పమును బొందునట్లు చేయవలయును. చేయకున్న రోగమే. ఆరోగము జీర్ణించి స్వరూపనాశము గావించును. మేల్కొనుఁడు.

ఆంగ్లహృదయము నాంధ్రవచనముు నాంగ్లధర్మము నాంధ్రక ర్మమును నాంగ్లవేషము నాంధ్రదేహమును నాంగ్లాంతరము నాంధ్రబా హిరము నగుచో నందు సొంపగుట ముమ్మాటికిని గల్ల. స్వసంప్రదాయా భినివేశముతో స్వాంశప్రశంసతో స్వాచారాభిరతితో స్వత్వసమాన్య త్వముతో స్వజనాద్యాదరగౌరవభావముతో స్వదేశాభిమానముతో స్వభాషామాధుర్యాస్వాదనాభిరుచితో స్వవేషనిష్ఠతో స్వీయమును రమణీయమును గావింపఁ దలంపు గలదేని ఫలకమును వరేణ్యమును

నగుఁగాని కేవలపరాధీనసర్వాంతఃకరణచతుష్టయదుష్టస్థితినున్న నిఁకఁ గమనీయత్వాదిహృద్యగుణము లేనివ.యమునను బొసఁగవని యనుభవజ్ఞులకు సుగోచరము, విస్తరింపనేల ?

నేఁటిసాహిత్య మట్టియస్వస్థత నుండుటచే సంస్కరింపఁబడవలయును. అసంప్రదాయముగ నుండుటయే యస్వస్థత. అభిప్రాయము లు స్వతంత్రము లగుట వికటము గాదు. కాని యనుకరణములును దస్స్మృతములును ననాచారములును గారాదు. అన్నియు నట్టివి యగుచు స్వత్వవినాశాగ్ని రగులుచున్నది. దానిజ్వాలలు వ్యాపించుచున్నయవి. ఏమగునో? ఆంధ్రసంస్కారములనాంధ్రత్వప్రతిభతో నాంధ్రకావ్యాములను బుట్టించిన హితమును బథ్యమును నగును. సీతాదులఁ గులటలఁజేసి రామాదులను "రౌడీ"లను జేసి వ్యాసాదుల నభాజనులఁ జేసి కాళిదాసాదులఁ గల్లబొల్లిచేసి నన్నయాదులఁ జిన్నపుచ్చి పూర్వకళాప్రతిభలఁ బూదిచేసి యిఁకఁ దా నేమిచేయఁగలఁడు ? ముక్కుపచ్చ లాఱని పాలబుగ్గలబాబులు కవిశిఖామణులు నటోద్భటులు నాటకరచనాధురీణులు శాస్త్రకర్తలు విమర్శకవీరులు నగుచో నెట్లుండదో ?

ఇఁక వర్తమానకాలమున సంప్రదాయబద్ధసారస్వతమే లే దందుమా ? ముమ్మాటుఁ గలదు కల దని చూపఁగలము. వడ్డాది సుబ్బరాయకవిశేఖరుల కావ్యములును, వేదము వారి విఖ్యాతవాఙ్మయంబును, చిలకమర్తివారి మధురరచనలును, జయంతివారి సారస్వతమును కాశిభట్టవారి గంభీరసాహిత్యమును, వేటూరివారి విమలధోరణులును, వీరరాజుగారి విచక్షణలును, దాసుగారి నవవైఖరులును, కవిగారి క్రమోక్తులును, వఝులవారి నిశితవివేకవిమర్శనములును, సెట్టివారి సిద్ధరసికప్రసంగములును, సిద్ధాంతముదొరల యురుకావ్యకళలును, వీరభద్రుల చారిత్రకగ్రంథములును, ప్రాచీపురమురాజుల ప్రవిమలవాగ్విశేషములును, సాలూరుపండితుల సాహిత్యపటిమయు, తాతావారి లోకాతీతశాస్త్రచర్చలును, మఱియు నెన్నియో కలవు. పింగళివారి సుందరవాచకములు, స్థానములవారి నటనాకౌశలములు, కవిహంసల క్రొన్నడకలును, కవిరాజుల నవకల్పనలును, లేవా ? చాలవు. పుట్టిన

దంతయును దేశహితమునకుఁ బుట్టవలయు నని యాశించుటయే పర మార్థము. మఱియు నన్నింట దేశాభ్యుదయనవకళాప్రతిభలు విస్ఫురి-ప వలయును. అహమిక లేనియమలశిక్షాభద్రబుద్ధులై విద్యార్థులు విన్న నువృత్తో నందఱును వెలయుదురు గాక యనియే పరమతాత్పర్యము.

ఇఁక సంస్కారపక్షవిత్వపటుత్వాదుల నుదాహరణముగఁ గ్రమ వికాసవిలాసవిశేషములతోఁ దెలిసికొందము. సంస్కృతమునఁ గాళిదా సు నుదాహరించు కొందము. కాళిదాసు సంస్కరించుకొనుచు నిరహం కారముగఁ గావ్యములఁ గళాప్రతిభలఁ బ్రదర్శించెను. ఏగ్రంథము తరువాత దేనిని వ్రాసెనో సప్రమాణముగఁ జెప్పనేరకున్నను శాకుంతలమునకుఁ బూర్వము కొన్నిగ్రంథములు రచియింపఁబడిన వనియు నవి కుమారసం భవాదు లనియు ననుకొనవచ్చును.

ప్రారంభగ్రంథములు కావుననే వస్తునిర్దేశమాత్రముగ రచింపఁ బడినవి. మేఘదూతము, కుమారసంభవము ను ప్రార్థనాశ్లోకములు లేక రచింపఁబడినవి. వస్తునిర్దేశముమాత్రము చేయుటవలననే లాక్షణికు లు "వస్తునిర్దేశోవాపి తన్ముఖమ్" అని యనిరి కాని "వస్తుమాత్రనిర్దేశ ము" పక్షాంతరము నార్యసర్వధానంగీకార్యము నగుట "అపి" శబ్దము చేర్పఁబడెను. మఱియును వాఙ్మయమునందును దత్సదృశరచనములు విరళములు. అట్లగుటచేతనే యనంతరకావ్యములం దెల్లఁ బ్రార్థనాశీ ర్వాదశ్లోకములతోఁ బ్రారంభము గలదు. ఇది సంస్కారలక్షణము గదా?

కావ్యములును విశిష్టవస్తుభావ్యములై యుండవలయు నని తలం చినవాఁ డగుటనే మేఘదూతమునఁ దక్క నితరముల వస్తువులఁ బవి త్రముగఁ బొందుపఱచెను. శాపహతుఁ డగునొక క్షుద్రయక్షునిఁ బ్రధా నముచేసికొని చెప్పుటకంటె నుత్తముల గ్రహించుటయే తగునని యెంచి నవాఁ డగుటనే 'వస్తుపురుషబహుమానాద్వా' అని యనంతరగ్రంథ మునఁ జేర్కొనెను. ఇట్లే యన్నివిషయములయందును సూక్ష్మముగఁ బరి శీలించుచో సంస్కరించుకొనుచుఁ గాళిదాసకవి పసితుఁ డైనట్లు తోఁచు ను. సంప్రదాయములు నట్టివే కలవు.

వ్యాసమహర్షియు సంస్కృతుఁడై భగవదేకగ్రంథములను వ్రాసె

నందురు. నానావిధదైవపరీక్షల నాఱితేఱిన కవనమునే పాటించినట్లు
ను గలదు. ఆంధ్రభాషయందును రసికులు స్వభాషాకావ్యముల నాద
రింతు రని చెప్పి నన్నయభట్టు తెనుంగున సంస్కారవంతముగ భారతము
ను రచించెను. పెక్కువిధము లగునియమములతో నిష్ఠలతోఁ బరమపవి
త్రాంధ్రకవితామాత నుపాసించి యాతల్లిని జూచి చూపించెను. ఎన్ని
విధములనో సంస్కరించుకొనుచు వ్రాయుటచేతనే యాంధ్రభారతము
కేవలాంధ్రీకరణము గాక యాంధ్రీకరభారతమై యపూర్వశోభతో వెలుఁ
గొందెను. తిక్కన్నకవియును త్తరరామాయణరచనముకన్న భారతమునందు
మిన్నగ రచనాపటిమ ప్రదర్శించెను. కాని కాలము గడచినకొలఁదియు
వికటమార్గములఁ ద్రొక్క లేదు. శ్రీనాథపోతన్నలును సంస్కారయుక్త
ముగ రచియించిరి. పెద్దన్న తిమ్మన్న మున్నగు కవులును సంస్కారమును
బాటించిరి. శృంగారరసము నందతివేలముగఁ గొందఱు కవులు వ్రాసినను
దదితరవిషయముల జాగరూకులై సంప్రదాయానుకూలముగనే వాఙ్మ
యమును వృద్ధికిఁ దెచ్చిరి కాని నేఁటివారివలె వెగటుఁదనమును గూర్ప
లేదు. పూర్వసంప్రదాయావేదకకథలఁ దత్క్రమము నెట్లున్నను మొ
దటినుండి శిక్ష, పరీక్ష, పెద్దలగువారు వినుట, సంతసించుట, సంస్కరిం
చుటయుఁ గలదనుటకు మాత్రము పరమప్రమాణము లనఁదగును.

వ్యాసుఁ డటనట భాషాపాటవప్రదర్శకముగ రచన ముచితస్థల
ములఁ బ్రదర్శించె నని యు నవియే వ్యాసఘట్టము లనియు ననుటకలదు.
"చ"కార బహుళముగా వ్రాయుటచేత నితఁడు "చకారకుక్షిగాఁ"
డన్నట్లు ను గలదు. కాళిదాసునందు సమన్వయపఱచి హృదయంగమ
ముగ నుపమలతోఁ దెల్పుశక్తిగల దని "ఉపమా కాళిదాసస్య" అనియం
దురు. భారవి కర్థగౌరవ మన విందుము. దండికవితయందుఁ బదలాలిత్య
మందురు. ఇట్లే పూర్వులు తమసంస్కారబలమునఁ దమరచనలయందుఁ
బ్రత్యేకవిశిష్టతను గడించిరి. వేదాంతముకంటెఁ గడుమిన్న యని కవితను
గొండాడిరి. ఇతరశాస్త్రము లన్నియు నట్లే శ్లాఘాపాత్రము లయ్యెను.
ఇట్టిస్థైర్య మావాఙ్మయమునకుఁ గలుగుటయందలిసంస్కారసత్త్వావిశేషమని
మనీషు లెఱుంగుదురు. అయ్యైరచనములయందలి ప్రసాదాదిగుణమ్ముల

యిప్పు నేఁటికినిసర్వబుధారాధనీయమై రమణీయమై కడు వెలుంగుట యె
ఱుంగమే. ఆప్రసన్నతయు నాపావనభావనాదీక్షయు నాసంస్కారసామంజ
స్యము నేఁటివాఙ్మయంబునఁగొఱవడి దేశీయహృదయసుప్రకాశవికసనము
ను గావింపక యుఁ దత్తద్గ్రంథముల యాదరము సన్నగిల్లుచున్నది. అంత
యుఁ గాకున్నను విశేషభాగ మట్లున్న దన్నఁ బెక్కండ్రు సమ్మతింతురు.
నేఁటిరచన లించుమించుగఁ గేవలదేశీయులఁ బ్రబుద్ధులఁ జేయనివే యగు
చున్నవి. సంప్రదాయదూరములు నగుచున్నవి.

వాఙ్మయతత్త్వము:—సాహిత్యము వాఙ్మయము ననునవి తదా
శ్రితులకు దివ్యానందమును దదఖిలకల్యాణగుణాభివృద్ధికారకముగ నొ
సంగకున్న లాభ మావంతయు నుండదు. సమస్తకర్మములును నిష్కామ
ములై చిత్తశుద్ధినిర్వాహకములై జ్ఞానస్వరూపవంతము లగునో యట్లే
నిరంతరపూర్వగ్రంథసమాలోకనాపరిణతధీవిశిష్టతతో సాహిత్యస్వరూప
ము నొందకున్న లాభ మేమి? పదికావ్యములైన దృఢముగ నెఱుంగక
కావ్యరచనమునకు మొదలిడిన నేమిసంస్కార ముండును? పూర్వజన్మ
వాసన, గురుప్రసాదము, కావ్యావేక్షణము, బుధసహగోష్ఠి, విశ్రుతపరి
తోషకరచనాపరతయు, గతిపయనియమనిష్ఠాధారణమును లేక యెం
దో ప్రజ్ఞగల దనియు నన్నింటికిఁ దగుదు ననియు ననుకొనుట కానిపని
గాదా! లావరి గారుడ మెఱుంగునా? అందగాఁడు పండితుఁడా? ఆంగ్ల
మాత్రసంస్కృతుఁ డాంధ్రాద్యగతికభాషల కాచార్యుఁడా? నటకుఁడు
కవియా? ధనికుఁడు తగవరియా? ఖద్దరుధారి కాంగ్రెస్సుమూర్తియా?
పాటగాఁడు పరమపండితుఁడా? జడలవాఁడు సాధువా? మత్తుమాట
లుదాసీనభావములా? పంద యమాయికుఁడా? పిఱికి శాంతుఁడా? క్రోధి
వీరుఁడా? అరసి యందలి యానుపూర్వికత నెఱుఁగవలయును. తన్నుఁ
దామే పరీక్షించుకొనుచు నున్న నెల్లదియు లెస్స యగును. కాని నోరి
కొలంది వాకొన్న నది పసందగునా?

కినియక మనవిని విని మన్నించి చక్కనిబాట గలదేని దానితే
ట తెనుంగుతేనియలఁ బోని పలుకుల పుష్పాళ్ల వలపించి మఱియు నర
యుక మెలఁగుదముగాక యనుటయే యనంతరవిచార్యము.

# సౌగంధికప్రసవాపహరణము.

(పదునాఱవశతాబ్దమునందలి కమ్మవీరులు.)

—కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ. కాకినాడ.—

"సౌగంధికప్రసవాపహరణ"మనుద్విపదకావ్యమును రత్నాకరము గోపాలకృష్ణకవి రచియించి, వెల్లుట్లగోత్రీయుఁడగు రావిళ్ల లింగభూపాలున కంకితమిచ్చెను. ఈవెల్లుట్లగోత్రసంజాతు లగురావిళ్లవారు కమ్మకులజులు. వీరు సుప్రసిద్ధదండనాయకులై విజయనగరసామ్రాజ్య మేలిన తుళువ, ఆర్వీటి వంశనరపాలు రగునరపతుల సామంతులుగ నుండి, గజపతులతోడ, నశ్వపతులతోడను వా రొనర్చినయుద్ధములం బాల్గొని, విజయమును జేకూర్చుచుండిరి. ఈద్విపదకావ్యపీఠికనుండి, కమ్మవీరుల యుదంతమును సంగ్రహముగ వివరించుచున్నాఁడను. బాహుబలదర్పశౌర్యసంపన్ను లగురావిళ్లవారి వృత్తాంతము కమ్మవారికే గాక, యఖిలాంధ్రలోకమునకు సంతోషదాయకముగ నుండఁగలదు. పీఠికభాగములోనుండి చరిత్రకు సంబంధించినభాగము మాత్రమే కైకొనుచున్నాను.

కృతజ్ఞత-గ్రంథపరిశోధనము:——ఈద్విపదకావ్యము క్రీ.శ. 1868 సంవత్సరములో, చెన్నపట్టణమునందు నేలటూరి సుబ్రహ్మణ్యముగారి విద్యావిలాసముద్రాక్షరశాలయందు పిళ్లారిసెట్టి రంగయ్యనాయనివారిచే ముద్రించి ప్రచురింపఁబడియెను. ఆప్రతి నామిత్రు లగు శ్రీనిడుదవోలు వేంకటరావుగారు నా కిచ్చి, దానియందలి చరిత్రాంశములను గూర్చి వ్యాసమును వ్రాయఁగోరిరి. తర్వాత గ్రంథపీఠికభాగమును జదివి, పీఠికలోని చరిత్రాంశములకు సంబంధించిన భాగములు తప్పులకుప్పలుగా నుండుటచే, నాంధ్రపరిషత్పుస్తకభాండాగారములో వ్రాఁతప్రతుల నరసి చరిత్రకు సంబంధించిన పీఠికభాగమును, నేనువ్రాసికొంటిని. పరిషత్తువారి పుస్తకభాండాగారములో మూఁడు తాళపత్రగ్రంథము లున్నవి. మూఁడును శిథిలములె. కాని విశేషశ్రమకోర్చి, పరిషత్కార్యవ్యవహర్తలును, పరిషత్పత్రికాసంపాదకులు నగు శ్రీ క్రొత్తపల్లి సూర్యారావుగారు వ్రాఁతప్రతులను జదివి, లేఖకప్రమాదములను సంస్కరించి, నాకుసాయపడని

చో నే నీవ్యాసమును వ్రాయలేకుందును. శ్రీవేంకటరావుగారికిని, సూర్యరావుగారికిని నాకృతజ్ఞతాపూర్వకనమస్కారములు. ఈసౌగంధికాప్రసవాపహరణకావ్యముయొక్క వ్రాతప్రతి చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములో నున్నట్లు తెలియుచున్నది[1]. శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుకార్యాలయములో నొకవ్రాతప్రతి యున్నది, కాని, దానిలో లేఖకులు చరిత్రాత్మకమైన పీఠికభాగమును బూర్తిగ వదలివేసి,ప్రథమద్వితీయ, తృతీయాశ్వాసములను మాత్రము వ్రాసియుంచిరి.[2]

ఈవ్యాసము వ్రాయుటలో నేను సంప్రతించిన గ్రంథములనామము లధోజ్ఞాపికలలోఁ బేర్కొనినాను. అందు రామరాజీయము, వసుచరిత్రము, బాలభాగవతములు ముఖ్యములు. ఈబాలభాగవతము దోనూరి కోనేరునాథుఁ డనుకవి క్రీ శ. 1547-48 సంవత్సరములో రచించి, అళియ చినతిమ్మరాజున కంకితమిచ్చెను. ఈగ్రంథమును చెన్నపురిలో విజ్ఞానగ్రంథమాలిక ప్రథమసంపుటముగ వేదము అండ్ కంపెనీవారు ప్రకటించిరి.[3] తంజనగర దేవరాజసుధీమణి పరిశోధించి చక్కనిటీకనువ్రాసెను. ఈగ్రంథమిట్లు తాము వ్యాసమునువ్రాయుటకుఁ గొన్నియేండ్లపూర్వమే ప్రకటితమైనసంగతి యెఱుఁగక శ్రీడాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు, భారతీపత్రికలో ద్విపదబాలభాగవతములోని ఆరవీటివంశావలిని ప్రత్యేకముగ వ్రాసి, యితరగ్రంథములనుండి దానిలోఁ జెప్పఁబడినవిషయములను గూర్చి,ప్రకటించిరి.[4] ఈబాలభాగవతముద్రితప్రతి ఆంధ్రపరిషత్పుస్తకభాండాగారమునందుఁ గలదు. దానినే నే నుపయోగించుకొంటిని. గ్రంథము శ్రీవేంకటరమణయ్యగా రూహించినట్లు చెదపురుగులకాహారముగాక,ముద్రాపకుల పరిశ్రమచే, కొంతవఱకు ముద్రితరూపమును దాల్చియున్నది.

---

1. Triennial Catalogue of manuscripts Vol. II. Part 3. Page 528-530.

2. శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుకార్యాలయములో "సౌగంధికము" అను పేరఁగల వ్రాతప్రతిని జూడుఁడు.

3. బాలభాగవతము—దోనేరు కోనేరుకవి.

విజ్ఞానగ్రంథమాలిక-ప్రథమసంపుటము. (1914)

4. బాలభాగవతపీఠిక- భారతిసంపుటము 6. సంచిక 6.

# రావిళ్లవారి వంశవృక్షము.

- మల్లభూరమణుఁడు
  - తిప్పభూపాలుఁడు=పెద్దమాంబ
    - పాపనృపతి=లక్కమాంబ
      - తిప్పనృపతి=వెంగమాంబ
        - లింగభూపాలుఁడు=సిద్ధాంబిక
          - కొండభూపాలుఁడు=రంగమాంబ
            - వేంకటనృపాలుఁడు
            - లింగభూపాలుఁడు=భాస్కరాంబ
              - రామభద్రుఁడు
            - ముద్దులనాయఁడు=తిరుమలాంబ
              - వెంగనృపతి.
          - అయ్యంనాయకుఁడు=అంగమాంబ
            - కొండనృపతి
    - వేంకటాద్రి

## మల్లభూరమణుఁడు.

ద్వి. ఆకమ్మవంశసుధాంభోధియందు, రాకానిశాకరురమణఁ జెన్నొంది
యనుపమాటోపసాహసవిక్రమాఢ్యుఁ, డనుచు రాయలుమాయ లభినుతింపఁగను
గొమరొంద గుడిపాటికోటచెంగటను, ......
కుతలాధిపతు లెల్లఁ గొనియాడి మెచ్చ, కుతుకంబుశౌహబలంబు ఘూర్ణించి నఱికి
చెల్లుగా రాయలచే హెచ్చుబిరుదు, లెల్లఁ గైకొని మదాహితరాజహృదయ
భల్లప్రతాపప్రభావుం డనంగ, మల్లభూరమణుఁడు మహిఁ గీర్తిగాంచె
...................................

## తిప్పభూవిభుఁడు.

రవికులంబునను శ్రీరామచంద్రుండు, భువి నుద్భవంబైన పోల్కి జన్మించి
జననాథు లెన్నఁగా జగతిపై వెలసె, ..................
ధీరుఁడు రావిళ్ల తిప్పభూవిభుఁడు, హేరాళముగ ధాత్రి యేలుచునుండి
భుజబలోద్దండుఁడై పొదలుచు వచ్చు, గజపతిదళములు గదిసి చెండాడి
వికలంబుగాఁజేసి వెన్నంటితఱిమి, .............
జనపాలు లెన్న రాజ్యము సేయుచుండె
పరమసాధ్వీమణి పటుశీల యనఁగఁ, బరఁగు శ్రీపెద్దమాంబాగర్భమునను
హరిహరసదృశులై యలరినసుతుల, నిరువురఁ గాంచె మహేశసన్నుతులఁ
వరశౌర్యధనుఁడు పాపక్ష్మాతలేంద్రు, నలఘుతేజుఁడు వేంకటాద్రిభూవిభుఁడు
నరయ నాయిరువురి యందగ్రజుండు, పరమపావనుఁడు పాపక్ష్మాతలేంద్రుఁ
డతిశీలవతి లక్కమాంబికయందు, సుతుని తిప్పన్న వసుంధరాధిపుని
గని మెచ్చి సకలభూకాంతులు గొలువ ......................

## పాపభూకాంతుఁడు.

వగలుగుల్కఁ? రాయవజీరుఁ డనుచు, ముగురు దునేదార్లు మొగి సన్నుతింప
బాపురే మాయయ్య భళిభళి యనుచు, గోపాలరాజుఁ బేర్కొనిమాచి మెచ్చ
నళుకు బెళుకు లేక యావహాభూమి, తెలుఁగుబిజ్జలుమాడ్కిఁ బెగువతోఁ జొచ్చి
మొనసి కర్నూల్ కోట ముట్టడిచేసి, మునుమున్నె విడిపించి మోహరంబైన
బలుగు నేదారుల భంజించివైచి, పొలుపొంద గంధేభముల మగ్గుఁజేసి
పావలుగనీబుల పొంక మణంచి, యెదురుపట్టాణీల నెల్లముట్టాడి
చెలరేగి యొగసి హోజీరుల దునిమి, కలడక్కనీల చీకాకు గావించి
దేరాల త్రాళ్లన్ని తెగనఱికించి, కోరి భండారము కొల్లలాడించి

తనపేరివారి కందనవోలుకోట, యనురాగమునఁ జొచ్చి యారాజుచేత
మెచ్చులుగైకొని మేదినీపతుల, నిచ్చ మెచ్చులు చూచి నృపులెల్ల నితఁడే
గెలుపులరాజని కీర్తించి పొగడ, విలసిల్లి రణకేళి విహరించె నెలమి.
..........

### తిప్పనృపతి.

అతనితనూభవుం డగుతిప్పనృపతి, కుతలాధిపతు లెల్లఁ గూర్మితో మెచ్చ
ధరణి పేరైన యాదవని దుర్గంబు, సురతాణిల్గాఁ జూఱలాడించి
తగువజీరుల దునేదారులఁ జంపి, పోరుతురుష్కులఁ బోనీక చంపి
సకలపాలియగాండ్ల జీకాకుచేసి, చెలరేగి జయలక్ష్మి చేకొనివచ్చి
చల్లనివాఁడని జనులు నుతింప, నిల మహీపతులెల్ల నేలుచునుండె.

### లింగభూపాలుఁడు.

అంగనామణి... యాలినీలవేణి, శృంగారవతియని చెలువొందినట్టి
రంగమాంబికయందు వితరణకర్ణు, లింగభూపాలు లాలితయశోధనుని, గనిరె
..............................

### కొండభూపాలుఁడు.

ఆలింగభూకాంతశేఖరుఁడు, పరఁగ నక్షత్రావుల పర్వతాధిపుఁడు
గన్నసిద్ధాంబిక కరుణావలంబ, నెన్నఁగాఁ బెండ్లియై యొసఁగుచునుండి
నీరజాస్త్రప్రభానిశితాధివిదిత, ఘోరటాతనృపాలు కొండభూపాలు
సతతవదాన్యప్రసన్నసత్కాంతి, జితచంద్రు నయ్యాలక్షితినాథు
పుత్త్రులుగాఁ గాంచి పొలుపువహించె.

### కొండభూపాలుని కుమారులు.

ఆకుమారులలోన నహితరాజన్య, భీకరశౌర్యుండు భీమబలుండు
బలభేదివిభవుండు పటుబెళగంటి, జలరాశి టంకశుంభత్ప్రౌఢిరాజ్య
పురహారకల్లోల, భువనబేతాళ, పరసైన్యభైరవ, బల్లాలరాయ
గండోగ్రగజగండ చండప్రచండ, గండరగండ విఖ్యాతకేళాది
రాయబాణాసి దుర్గవిభాసిచటుల, గాయగోవాళ రక్తచ్ఛత్ర బసవ
శంకరసర్వేశ నిశ్శంకసాహసుని, వేంకటభూపాలు విపులచారిత్రు
సంగరాటోపప్రచండాధిరాజ, పుంగవు ప్రాభవు భుజగర్వహరణ
కరుణాపయోనిధి గాయగోపాల, బిరుదాంకుఁ డగులింగపృథ్వీతలేంద్రు
గద్దరి రిపువీరగజసింహమూర్తి, ముద్దులనాయని మోహనాకారు
నిటువంటి తనయుల నిరవొందఁగాంచి, పటుసత్యశీలుఁడై ప్రబలుచునుండె.

## అయ్యపనాయఁడు.

బలియుఁ డాకొండభూపాలసోదరుఁడు, విలసితసాహసవిక్రమాఢ్యుండు
గురుతరపరవీర కోలాహలుండు, వరభవ్య గాంగేయవర్ణ కేతనము
రాజిల్ల వెలయు కర్ణాటశ్రీరామ, రాజసత్యకిరీట రమ్యభూషణుఁడు
మనసిజాకృతి చెంచుమలచూరకార, ఘనబిరుదాంకుండు కలితతేజుండు
వరనుతు నయ్యపనాయకేంద్రుండు, ధరణీశు లెన్న భూస్థలి వార్తకెక్క

## అయ్యపనాయనిపుత్త్రుఁడు కొండనృపతి.

ఆమోద మెసఁగ నయ్యపనాయకేంద్రు, భామిని యంగమాంబామణిగర్భ
జలనిధిసంపూర్ణచంద్రునిలీలఁ, గలిగె శ్రీకొండభూకాంతశేఖరుఁడు.

## లింగనృపతికుమారుఁడు కొండభూపాలుని శౌర్యము.

రాజతేజుండగు రావిళ్ళలింగ, భూజాని కొండభూవిభుఁడు మోదమున
సాలయుచుఁ బుత్త్రిల శుభముహూర్తమునఁ, జెలఁగుచు రాజ్యాభిషిక్తులఁ జేసి
మంతుకెక్కిన మేటిమన్నీలతోడఁ, బంతముల్గలధరాపాలురతోడ
బలువిడి చతురంగబలములతోడ, వలనొప్పు బలువైభవంబులతోడఁ
గరవరదీప్తుల కరవాలుఁబూని,... సల్లీలచికిలిపచ్చలబాకు వట్టి
కరలకెంపులు బాసికంబులు దాల్చి, తరలక కరవీరదామంబు బూని
సిరిగుల్కు రత్నాలసింహతలాటు, బిరుదాంకములు చాల పెంపొందుజవన
తురగంబు నెక్కి యాతురమగు వేడ్క, సరసులు వీరసేసలు చల్లుచుండ
గొప్పయెఱ్ఱనిపట్టు గొడుగులనీడ, నొప్పు చల్లనిగాలి యొదవుచునుండఁ
జెలువొంద జయలక్ష్మి చేకొనుకొఱకు, కులుకుచు నని పెండ్లికొడుకు చందమునఁ
బొదలుచు మానవపురిచెంత జేరి, వదరి నేరులు బాహుబలములమీద
కొదవక హరిణంపు గుంపులుగాంచి, కొదమసింహము చొచ్చుకొమరు చెన్నొంద
..................................................................
నెదురు రావంతుల నెలమి హజీర్ల, బొదలు దునేదార్ల పుడమిపైఁ గూర్చి
హత్తివెంబడి వచ్చు నవనీశు లెల్లఁ, దత్తరం బగు వేడ్క దండంబువెట్ట
నిరుమొనల్ నఱకిన నేదిమ్ముగన్న, ధర ద్రొల్లి యాడెడు తలలును మఱియు
నెడనెడుగాత్రంబు లెగురురక్తములుఁ, బొడిమైనశల్యముల్ పొలియు రాహుతులు
గలిగి యొప్పెడు మహాకదనరంగమున, నళుకుబెళుకును లేక నని సేయువేళ
వేయాఱు పెద్దగా వీఁపునవెడలు, గాయముల్ మణిపతకంబులు గాఁగ
వెక్కసంబున మేన విఱిగిన యలుగు, లక్కజంబగు వరహారముల్ గాఁగఁ
బెనఁగొని మైవ్రేలు వ్రేవులసొబగు, తనకు నుత్తరజన్నిదంబులు గాఁగ
......................................,భూచక్రము వహించి పోరిలో వెలసె.

## కొండభూపతికుమారుఁడు లింగనృపాలునిశౌర్యము.

ఘనుఁడు రావిళ్ల లింగనృపాలచంద్రుఁ, డెనయు వేడ్కల ధాత్రి నేలుచునుండె
...........................,రతిదేవి యనఁగ ధరాస్థలి వెలసి
పరఁగు శ్రీభాస్కరాంబాపయోజాక్షి, వరముహూర్తమున వివాహమై ప్రేమ
లొనర భావింపుచు నుచితవైఖరుల, వినుతకీర్తుల ధాత్రి వెలయుచునుండె
...........................,పరఁగు శ్రీభాస్కరాంబామణియందు
సరసరూపవిలాససత్కళామూర్తి,...........................
రామభద్రనృపాలురమణీయశీలు,...........................
బలరామసత్వసంపన్నుని గాంచి, చెలువు మీఱఁగను బోషింపుచునుండె
...........................,ధరణీతలేశు లెంతయు సన్నుతింపఁ
తిరుమణికోటిలో స్థిరముగా నిలిచి, పరవీరదుర్గముల్ పట్టణంబులును
సదలించి ఛేదించె నసువార్త దెలిపి, పొదలుచు నాతఁడు పొసఁగుమార్గముల
మలయు మన్నెదార్ల మన్నీలఁ బిలిచి, సెలవుమన్నించిన శీఘ్రంబె మరలి
చతురంగబలహితసంరంభు లగుచు, ధృతిమీఱఁగా నలుదెసలను గ్రమ్మి
యుదయాస్తమయములనురిమిలగ్గలుదరించినఱకి మహోగ్రశౌర్యమున
డాబలునైఁబడి డాగులుచేసి, జీబులు బలసిన సేనల దురిమి
మన్నీలదొరల సామంతులఁ జెండి, వన్నెమనెక్కు రేవంతులఁ ఒడిపి
...........................,యాలంబులోఁ జొచ్చి యఖిలశాత్రవులఁ
దోలి పెన్గొండకుఁ దోవలు చూపి, కురువీరబలములఁ గూల్చినయట్టి
నరుఁడీవిభుం డని వరనాథు లెంచఁ, గదిమిన శత్రువు ల్గళవళమందఁ
జెదరిపోవఁగలేక చేతులు మొగిచి, కావుము బసవశంకరబిరుదాంక
ప్రోవుము బెళగంటి పురిశిలాటంక, శరణుగండరగండ శత్రువిభాళ
కరుణించి రక్షించు గాయగోవాళ, కీర్తించెదము మిమ్ము కేళాదిరాయ
యర్థుల మన్నింపు మర్థి వేడెదము, అనివేడుకొనిన దయాదృష్టిఁ జూచి
తనర వేడ్కల ధర్మదారవట్టించి, సపరంబు చాలించి చయ్యన మరలి
రమణతో దారల రమణుల చేత, దళవాయి వేంకటధరణీశుచేత
నలరుచు హెచ్చగు నటు మెచ్చులంది, రావిళ్ల లింగభూరమణచంద్రుఁడు
పావనచరితుఁడై ప్రబలుచునుండె,...........................

## లింగభూపాలునిసోదరుఁడు ముద్దులనాయనిశౌర్యము.

ఆలింగధరణినాయకసోదరుండు, ...........................
నలువొంద ముద్దులనాయకేంద్రుండు, బలభేదివైభవభాగ్యసంపదల
సమరాంగణకిరీటి శాత్రవధరణి, రమణత్రిదశకోటి రణరంగవిజయ

ధాటి ఘోటకఖురోద్ధత వైరికోటి, కోటీరవాటిసద్గుణమణి పేటి
యగు కోటపాటి మాకావనీంద్రునకు, తగనుద్భవించిన తరుణీలలామ
సరసకళాధామ సౌందర్యసీమ, తిరుమలాంబామణి స్థిరలగ్నమునను
చెలఁగి కల్యాణమై సిరులచే నలరి, యెలమి ధరాస్థలి నేలుచునుండె
..........................., గాంగేయనగధైర్య గాంగేయశౌర్య
వెంగధాత్రీనాథు విమలచారిత్రుఁ, దనయునిఁగాఁగాంచి ధరణీశు లెన్న
వినుతసంపదలచే వెలయుచునుండె.

## ప్రథమాశ్వాసాంతమున కృతిపతివర్ణనము.

సుకవిపోషణు పేర శుభమూర్తి పేర, సకలపురాణార్థసంగ్రాహు పేర
నాదవనీదుర్గహారణుని పేర, చేదిభూవరదత్తసింహతలాట
కరహాటనృపదత్తకనకపతాక, నరపతిదత్తనానావర్ణరాయ
బిరుదాంకు పేర గంభీరాబ్ధి పేరఁ, గర మొప్ప జగనొబ్బగండని పేర
శతనృపాలకశైలశతకోటి పేరఁ, గతిచారాసిదుర్గవిభాళ పేర
...........................

## తృతీయాశ్వాసాంతమున.

వహికెక్క నశ్వరేవంతుని పేర, మహనీయచిత్రహేమధ్వజు పేర
సరసారుణోజ్జ్వలచ్ఛత్రుని పేర, గురుతర పల్లుట్లగోత్రుని పేర
నరపతిదత్తనానారత్నభూష, కరితురంగ శతాంగఘనభాగ్యు పేర
సింధురాజార్పితసింధురచిత్ర, సైంధవబంధురస్యందను పేర
సౌరాష్ట్రనృపదత్త సకలితరత్న, హారుని పేర దీనావను పేర
రణధీర ఘంటానిరాతంకమల్ల, ప్రణుతసింహతలాట పరబలభీమ
నిత్యాభిరామ నిర్జిద్రప్రతాప, సత్యహరిశ్చంద్ర సంగరరక్షు
పాలకగాయగోవాళహమ్వీర, కేళాదిరాయ సత్కీర్తికలాప
చలమర్తి వరగండ జగనొబ్బగండ, కవితాదవనిదుర్గగర్వవిభాళ
హత్తుమువ్వరగండ హర్యక్షశౌర్య, మత్తారిమదభంగమదనావతార
కనకవసంతాంక గగ్గోలురాయ, ఘనతరప్రజమెచ్చు గండాదిఘోర
బిరుదాంకు పేర గంభీరాబ్ధి పేర, వరభోగనిర్జిత వాసవు పేర.
..........................

## రావెలవారి వృత్తాంతము.

కుమారధూర్జటి కృష్ణరాయవిజయమునం దీరావెలవారిని గూర్చి ప్రశంసించెను. కృష్ణరాయలు కళింగదిగ్విజయయాత్ర వెడలినప్పుడు తోడ్పడిన వీరనికాయములో రావెలవారు గలరు. వీరు కృష్ణరాయలపక్షమున నుండి సమరరంగమున గజపతిదళములతోఁ బోరాడినవిధ మీక్రింది విధమునఁ గవి వర్ణించెను.

ఉ. రేవిగ సౌతువారును గడిందిరహిన్ వెలుగోటివార లా
　రావెలవారుఁ గూడుకొని రాత్రిపగల్ చతురంగసేనతో
　సేవగఁ జూచినం దెలియ నెంతయుశక్యముగానిదుర్గ మా
　భూవరమౌళిగాంచి యొకపూఁటనె దీసెదనంచు నుగ్రుఁడై. 3 59

విశ్వనాథనాయని స్థానాపతి వ్రాసిన రాయవాచకము (పుట 65) లోఁ గమ్మనాయకుల ప్రశంసకలదు.

"పెమ్మసాని రామలింగనాయడు హండె మల్లారావు బోయి రామప్ప హరివాణం కొమాళ్లయిన పదునెనిమిది కప్పణాలవారున్ను దళనాయకులు అప్పరపిళ్ల కుప్పరపిళ్ల సాళువనాయడు కొమారతిమ్మప్ప సంగరాజు చెర్వప్రధాని తిప్పరసు అయ్యప్పనాయడు కొటికం విశ్వనాథనాయడు చెవ్వప్పనాయడు అక్కప్పనాయడు కృష్ణప్పనాయడు వెలిగోటి యాచమనాయడు కన్నడ బసవప్పనాయడు సాళువ మేకరాజు మట్ల అనంతరాజు తిమ్మరాజు వీరమరాజు మొదలైనవారున్ను బొమ్మిరెడ్డినాగా రెడ్డి బసువారెడ్డి మొదలైనరెడ్డికొమాళ్ళున్ను కమ్మనాయకులు విఠలప్పనాయడు."

రాయలు మహమ్మదీయులపై దండు వెడలిన యెడ కమ్మనాయకులను గూడ యుద్ధరంగమునకుఁ గదలిరమ్మని కబురుపంపించెనఁట. (రాయవాచకము పుట 84)

"సాళువతిమ్మరుసయ్యగారినిన్ని పట్టమందు వుంచి దండుయాత్రకు జయధ్వనిగా దిక్కులు పిక్కటిల్లేటందుకు భేరితాడనము శేశి డమామి

టోకించమని ఉత్తరువు శేశి రాతులకు మావృత్తులకు అమరనాయకంవా ర్లను, అళ్లుండ్లు, కొమాళ్ళకు, రాజులకు, జెట్లకు, కంమ్మనాయకులకు అందరినిన్ని పయనం చెప్పిరమ్మని"

కృష్ణరాయవిజయ, రాయవాచకముల ననుసరించి, యీకమ్మ దండనాయకులు రాయుల సామంతులై యుండి, యాతఁ డొనర్చినదండ యాత్రలయందు గజపతులతోడను అశ్వపతులతోడను యుద్ధ మొనర్చు చుండి రని విశదము కాఁగలదు.

సౌగంధికప్రసవాపహరణమునందు కవివర్ణించిన విషయములు చరిత్రాత్మకములై యుండుటయే గాక, పదునాఱవశతాబ్దమునందు విజయనగరసామ్రాజ్య మేలిన సాళువ,తుళువ, ఆర్వీటివంశనరపాలురు కృతు లందిన ఆంధ్రకావ్యములందును వర్ణితము లయ్యెను. ఈకమ్మదండనాయకులు విజయనగరసామ్రాజ్యచక్రవర్తులకు సామంతులుగ నుండి, రాజకార్యనిర్వహణపారీణులై, విక్రమధనంజయులై, వితరణరాధేయులై, పండితపోషకులై ప్రఖ్యాతిని గాంచి, కీర్తిశేషు లయిరి. సౌగంధికప్రసవాపహరణకృతికర్త యగులింగభూపాలుఁడు దళవాయి వేంకటధరణీశుచే మెచ్చు లందె ననియు, నతఁడు, ఆదవనిదుర్గవిభాళుఁ డనియు, నరపతిదత్త నానారత్నభూషకరితురంగశతాంగఘనభాగ్యుఁ డనియు, శత్రునికాయమును గెల్చి వారిని యుద్ధభూమినుండి పలాయనులఁజేసి, పెనుగొండకు దోవలు చూపె ననియుఁ దెలియుచున్నది. ఇతనిపినతండ్రి యగుఅయ్యప్పనాయఁడు "రామరాజసత్యకిరీటరమ్యభూషణుఁడు"కావున, కృతిపతి, అళియరామరాయలకాలములో నుండె ననుట స్పష్టము. అళియరామరాయలకు "పెనుకొండ దుర్గసాధకుఁ డనియు, ఆదవేనిదుర్గాపహారణుఁ డనియు" బిరుదు లున్నట్లును నాతఁడు వానిని గెల్చినవిధమును రామరాజీయములో (ప 278-79) వర్ణింపఁబడెను.

గీ. అవని నిటువలెఁ బుత్రపౌత్రాభివృద్ధి
 రహిని వర్ధిల్లు తిరుమలరాయ వేంక

టాద్రిరాజానుజద్వయ మధికభక్తిఁ
గొలువ నళిరామభూపాలుఁ డలరు మిగుల.

గీ. సలకవిభుతిమ్మరాజుసేనలను ద్రుంచి
గుత్తిఁ బెనుకొండ మఱిగండికోటఁ గంద
నోలుపుర మాదవని నవలీల గెలిచి
తొలుదొలుత రామనృపతి దోర్బలము మెఱపె.

రామరాజభూషణుఁడు వసుచరిత్రములో రామరాయలనుగూర్చి వ్రాయుసందర్భమున (ఆ ౧. ప ౭౭) పెనుగొండ, ఆదవని (Adoni in the present Bellary District) దుర్గములను సాధించినక్రమము నీక్రిందివిధమున వర్ణించెను.

సీ. పట్టాభిషేకవిపర్యయంబునఁ బ్రోలు
వెడలి ప్రియానుజు ల్వెంటఁ గొలువఁ
జిత్రకూటాభిఖ్యఁ జెలఁగు పెన్గొండ సాం
ద్రహరిద్విపేంద్ర నాదవనిఁ జెంది
ఖలజనస్థానవాసులఁ బల్వుర వధించి
మహిమ సలకఖరస్మయ మడంచి
హరివీరభటమహోద్ధతి నభిగంపింప
దురమునఁ గదిసి తద్ద్రోహిఁ దునిమి

తే. యనఘుతరపార్థివేందిర నధిగమించి
సాధుకర్ణాటవిభవసంస్థాపనంబు
పూని శరణాగతుల నెల్లఁ బ్రోచె రాముఁ
డతఁడు నిజచరితంబు రామాయణముగ.

రామరాజరమ్యకిరీటభూషణుఁ డైన అయ్యపనాయుఁడు, కృష్ణరాయలకాలములో నుండి, యతని దండనాయకుఁడుగా నున్నట్లుతోఁచెడిని. రాయవాచకము (పుట ౮౫) లో, వివరింపఁబడిన నాయకులలో నీతఁ డొకఁడు. లింగభూపాలునితండ్రి యైనకొండభూపాలుఁడు మానవ

పురిచెంత నేమలఖానుని జయించినట్లును, ఈకొండభూపాలునితాత యగుతిప్పన్న యాదవనికోటను సాధించినట్లును సౌగంధికప్రసవాప హారణమునందుఁగలదు. ఈపౌత్రుఁడును పితామహుఁడును-అళియరామ. రాయల తండ్రియుఁ దాతలకాలములో నుండి, వారొనర్చిన సంగరరం గములందు సాయపడుచుండిరి. అళియరామరాయలతండ్రి యైనతిమ్మ రాజు మానవపురికడ నేమలుఖానుని జయించినట్లును, ఆదవేనిదుర్గము ను సాధించినట్లును ద్విపద బాలభాగవతమునందును బద్యబాలభాగవత మునందును వర్ణింపఁబడెను.

"రాజచంద్రుఁడు రామరాజుతిమ్మయ్య ... ... ...
కడిమిమై మానువకడ రణక్షోణి, గడుసరి నేమలఖాను జయించె
విక్రమంబున నాదవేని దుర్గంబు, విక్రాంతులెన్న వేవేగ సాధించి.[1]
" ... ... ...మానువకడ సవాబూని పోరను బరా
జయమునొందించె నేశౌర్యశాలి.[2]

తిప్పన్నృపతి తండ్రియగు పాపన్నృపతి కర్నూలుకోటను ముట్టడి వేసె నని వర్ణింపఁబడిన విధముననే, అళియరామరాయలతాత యగు (తిమ్మరాజుతండ్రి) రామరాజు కందనవోలు (కర్నూలు) ముట్టడి వేసిన విధమును, బద్యబాలభాగవత, ద్విపద బాలభాగవతములందును, రామ రాజీయవసుచరిత్రకావ్యములందును వర్ణితము.

"రామనృపాలుండు రాజేంద్రుఁ డౌదవె
నెందు నెన్నఁగఁ జాలునిద్ధశౌర్యమునఁ, గందనవోలిదుర్గంబులోనుండి
ఋక్కయరామభూభుజుఁడెల్లనృపులు, నెక్కువయియని యెన్నంగఁజాలి
వీరులు డెబ్బదివేవు రాశ్వికులు, చేరికొల్వంగ వచ్చినసవా నెదిరి
కలనంది పంచబంగాళంబు సేసి, గెలిచెఁ దచ్చరితంబుఁ గీర్తింపఁదరమె"[3]

---

1 ద్విపదబాలభాగవతము ప్రథమస్కంధము. పంక్తులు 261-270 పుట 20.

2 శ్రీవేంకటరమణయ్యగారు ప్రచురించిన ద్విపదబాలభాగవతపీఠిక. భారతి. సంపుటము 6 సం 6. దానిలో వారు పద్యబాలభాగవతమునుండి వ్రాసినసీసపద్యపాదము

3. Sources of Vijayanagar History, pages 205-206.

బాలభాగవతము. ప్రథమస్కంధము పంక్తులు 191-195 పుట 15.

“గబ్బిల్ డెబ్బదివేవురాశ్వికులు వేడ్కన్ గొల్వఁగాఁ గ్రిన్నపె
న్నబ్బిల్ గప్పఁగఁ గందనోలు కొనువేడ్కన్ జుట్టుముట్టన్ సవా
బబ్బి నుబ్బణఁగించి తోలె నరిరాడ్బృందము లంకాసర
న్యబ్బాంద్రాభుఁడు బుక్కభూవిభునిరామాధీశుఁ డాహాయనన్.[1]

సీ. మదకరి కొకటి కిర్వదిగుఱ్ఱములు గుఱ్ఱ
మునకును విలుకాండ్రు మువురు విచ్చు
కత్తులవా రేఁబదికాండ్రట్ల వర్తిల్ల
నిట్టియేనుఁగులను జుట్టి మూఁడు
వేలయేనూఱు నుద్వృత్తితో నడపంగఁ
గందనో ల్సాధింపఁగాఁ దలంచి
మొనద్రుంచి గట్టిగా ముట్టడి డిగిన నా
బిబ్బిని మిక్కిలి యుబ్బణంచి

గీ. ప్రకటసప్తాంగములఁ గొని రామవిభుఁడు
కందనోల్ రాజధానియుఁగాఁగ వసుమ
తియును నేలి మహోహవదీక్షఁ బూనె
బలిమి కలిమి నాశావనీపకులఁ బెనుప.[2]

వసుచరిత్రములో (1 ఆ. ప. 29-30) రామరాజు కందనోలిపురీని శాంతుఁ డని వర్ణింపఁబడెను.

క. ఆబుక్కనృపతి కతులభు
జాబందీకృతమదాంధశత్రురమావే
ణీబంధవిలసదసిధా
రాబంధురుఁ డైన రామరాజు జనించెన్.

సీ ... ... ... ...

---

1. పద్యబాలభాగవతము నుండి శ్రీ వెంకటరమణయ్యగారు వ్రాసినపద్యము.
2. రామరాజీయము. పుట38-39ప. 209.

గీ. అతఁడు మతిమంతుఁ డతిశాంతుఁ డరికృతాంతుఁ
 డనుపమస్వాంతుఁ డాశ్రితవనవసంతుఁ
 డనఘతరకందనోలిమహాపురీని
 శాంతుఁ డగురామమేదినీకాంతుఁ డలరు.

అళియరామరాయలతాత యైనరామరాజు సాళ్వ నరసింహరాయల సామంతుఁడుగ నుండి యతనిదండనాయకుఁడై, యాతని యాజ్ఞానుసారముగ కర్నూలుకోటను ముట్టడివేసినట్లుచరిత్రవల్లఁ దెలియుచున్నది. అట్లె కమ్మకులచంద్రుఁడైన పాపనృపతియు, నొక సేనానాయకుఁడై రామరాయలకర్నూలు దండయాత్రలోఁ బాల్గొనియుండును.[1]

పాపనృపతి తండ్రి యైన తిప్పభూపాలుఁడు గజపతిదళములతోఁ బోరాడినట్లును మల్లభూరమణుఁడు కుతుబుషాహిబలమును జెండాడినట్లును గవి వర్ణించెను. సాళువ నరసింహరాయ లొకవంక గజపతులతోడను, మఱి యొకవంక నశ్వపతులతోడను యుద్ధము లొనర్చిన సంగతి చరిత్రప్రసిద్ధము. అతనికాలములోఁ, దెలింగానా, బహమనీసుల్తాను సామంతుఁడుగ కూలీకుతుబుల్ముల్క్ అనునాతఁడు పాలించుచుండెను. ఇతఁడు క్రీ. శ. 1495 మొదలు క్రీ. శ. 1512 వఱకు సామంతుఁడుగ నుండి, తర్వాత బహమనీసుల్తానుని ద్రోసిరా జని, ఆసంవత్సరముననే కుతుబుసాహా యనునామమును దాల్చి స్వతంత్రుఁడై గోలకొండనుండి పరిపాలన మారంభించెను.[2] ఆ కాలములో బీజపూరు,

---

1. Kurnool District Manual, Page 24.

"Narasingarajah further instigated by the minister of the last Bahamani King Mahmad, who bore ill-will towards Mahmud-Yusuf Hdil Savai, the then Governor of Bijapur, despatched his general Ramarajah(grandfather of his name sake who afterwards fell at Tallikota) aganist Kurnool, then part of the Estate of Savai."

2. Brigg's-Ferishta Vol. II Page 544—549.

బీదరు, తెలింగానాలను బాలించెడు నవాబు లందఱును, విజయనగర రాజులతోఁ దఱచుగాఁ బోరాడుచుండిరి. మల్లభూపాలుఁడు పోరాడి నది, యీకుతుబుల్ముల్కుతోడ నై యుండును. కావున సౌగంధికాప హరణకావ్యమందలి చరిత్రాంశములు సత్యవృత్తాంతములును సమకాలి కాంధ్ర కావ్యములందు సహితము వర్ణింపఁబడిన చరిత్ర విషయములును, జరిత్రప్రసిద్ధములు నగుట మనము గ్రహింపఁగలిగితిమి. ఈద్విపదకావ్య పీఠికలోఁ గవి యతిశయోక్తుల నేమియు వ్రాయక జరిగిన చరిత్రాంశ ముల మనోహరముగ వర్ణించెను..

సౌగంధికప్రసవాపహరణమునందుఁ గవి వ్రాసిన రావెలవంశీయు లైన దండనాయకుల యుదంతమె గాక, తద్వంశీయులైన మఱికొందఱు వీరాగ్రగణ్యుల చరిత్ర మనకుఁ దెలియవచ్చుచున్నది. వారిలో రావెల వెలికొండ వెంకటాద్రి యొకఁడు. ఇతఁడు మట్ల అనంతభూపాలునిచే యుద్ధభూమిని సంహరింపఁబడెను.[1] తోప్పూరు యుద్ధములో తంజావూరి రఘునాథభూపాలునిచే నోడింపఁబడిన రావెల వెంకభూపాలుఁడొకఁ డు.[2] ఇతనిపేరు సంస్కృత రఘునాథాభ్యుదయములో రావిళ్ల వెంకయ నియుండఁగా విజయరాఘవనాయకుని యాంధ్రరఘునాథాభ్యుదయనా టకములో రావిళ్ల మాదన్న యని యున్నది. [3]

శాసనములందలి రావెలవారి వృత్తాంతము.

నెల్లూరిజిల్లా శాసనసంపుటములనుండి రావెలవారిచరిత్ర మనకుఁ దెలియవచ్చుచున్నది. రాజరాజదేవుని వంద్రెండవపరిపాలనాసంవత్సర శాసనమునం దొక రావిళ్లనాయకుని ప్రస్తావన గలదు. ఇదియె రావిళ్ల వారినిగూర్చి చెప్పెడి యత్యంతమైన ప్రాచీనశాసనమును, ప్రథమశాసన మునై యున్నది [4]

శాసనములలో వీరిని 'రావేల,' 'రావుల' 'రావెల' వా రని వ్రాయఁబడినది. వీరు నెల్లూరిజల్లాలో నుదయగిరి, పొదిలి సీమలను, కొచ్చెర్లకోటసీమను బాలించుచుండిన సామంతనాయకులు. వీరంద

1. Sources of Vijayanagar History P. 249.
2. Sources of Vijayanagar History P. 290.
3. Sources of Vijayanagar History P. 263.
4. Butterworth Venugopalachetti, Nellore Inscriptions. S. (6) (1257 A. D. ?)

ఱును విజయనగరసామ్రాజ్యమును పెనుగొండనుండి పాలించిన, సదా శివరాయ, శ్రీరంగరాయ, వేంకటాద్రిరాయలకు సామంతులు. వీరిలో రావెల తిప్పానాయకుఁడు పొదిలిసీమను, రావెలకోనేటితిమ్మానాయకుఁ డుదయగిరిసీమను బాలించిరి. ఔరంగజేబు పాదుషా రావిళ్ల తిమ్మా నాయకుని కొచ్చెర్లకోటసీమపాలకుఁడుగ నియమించినట్లు కొచ్చెర్ల కోటకైఫీయతులోఁ గలదట.* సౌగంధికప్రసవాపహరణ కావ్యము నందలి రావెలవంశీయులును శాసనములలోని రావెలవంశీయులును వెల్లుటగోత్రులె. వారికిని వీరికిని నెట్టిసంబంధము గలదో వంశవృక్షముల ననుసరించి చెప్పుటకు వీలుపడకున్నది. ఆశాసనములలోని రావెలవారి వంశవృక్షము లీక్రింద నుదాహరించుచున్నాను.

N. 124 (క్రీ. శ. 1582-83)

రావెల కంటినాయకుని పౌత్రుఁడు
|
తిరుమలయ్య
|
చినతిమ్మానాయఁడు.
(ఉదయగిరిసీమపాలకుఁడు)

G. 112. (క్రీ. శ. 1617-18)

వెంగళప్పపౌత్రుఁడు
|
రావెల వెంకటప్ప
|
వెంగళప్ప

P. 19 (క్రీ. శ. 1563-64

రావెలతిప్పానాయునింగారి పౌత్రుఁడు
|
(తి)ప్పానాయునింగారు
|
తిరుమలనాయనింగారు
(పొదిలిసీమపాలకుఁడు)

ఈపరస్పరసంబంధములను గూర్చి పరిశోధన సల్పిమఱియొకవ్యా సమునువ్రాసెదను.

* నెల్లూరిజిల్లా శాసనసంపుటములలో నీక్రిందిశాసనములను జూడుఁడు. D. 35; G. 52; G. 84; N. 33; N. 124; G. 112; P. 19.

# 'సంస్కృతవాఙ్మయచరిత్ర' సమాలోచనము.

[ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు యం. ఏ.]

ఆంధ్రగీర్వాణభాషోపన్యాసకులు,
పిఠాపురరాజకళాశాల, కాకినాడ.

'సంస్కృతవాఙ్మయచరిత్ర'-ద్వితీయసంపుటము : లౌకికవాఙ్మయము.

కర్త ఆంధ్రవిశ్వకలాపరిషత్కళాశాలలోఁ బ్రధానపండితులగు బ్రహ్మశ్రీయుతులు మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు.

పుటలు 2 + 2 + 8 + 7 + 3 + 3 + 417, 419-457. [సరస్వతీపవర్ ప్రెస్ రాజమహేంద్రవరము.] వెల: రు. 2—4—0.

'ఆంధ్రవిశ్వకలాపరిషత్ప్రచురణములు'—13 సంఖ్య. వాల్తేరు. [1936.]

- ౧ -

ఈకృతి శాస్త్రిగారు రచించి, 1933లో నాంధ్రవిశ్వకలాపరిషత్సమాదరణమున సూర్యాలోకము నందించిన 'సంస్కృతివాఙ్మయచరిత్ర'-[ప్రథమసంపుటము: వైదికవాఙ్మయము] యొక్క రెండవసంపుటము. శ్రీ శాస్త్రిగారు జగమెఱిఁగినబ్రాహ్మణులు, కవులు, పండితులు, నాటకకర్తలు, విమర్శకులు, ఆంధ్రభాషానుశాసకులు. ఆంధ్రగీర్వాణభాషావాఙ్మయములకుఁ జిరకాలమునుండి యమూల్యసేవ యొనరించుచున్నారు. ఆంధ్రగ్రంథము లనేకములు రచియించుటయే కాక, సంస్కృతిరూపకములను, దశరూపకమును ననువదించియు సంస్కృతకవిచరితమును రచించియు గీర్వాణశారదారాధన మొనరించి, యిపుడు సంస్కృతసారస్వతేతిహాసమును సమగ్రముగ రచించి ధన్యులైరి. నాకుఁ జిరకాలముక్రిందటనే వీరిపరిచయస్నేహభాగ్యము లభించినది. వీరి వైదికవాఙ్మయచరిత్రతో నాకించుక సంబంధము గలదు. ఈలౌకికవాఙ్మయసంపుటముతోడను నా కించుక బాదరాయణసంబంధము గలదు. అందువలన దీనిని విమర్శించుట నాకు ముదావహము.

సంస్కృతసారస్వతసాగరమును గూలంకషముగ మథించి, లౌకిక సంస్కృతవాఙ్మయచరిత మను బృహద్గ్రంథరాజమును రచించి ప్రచురింప నున్న డాక్టర్-మాడభూషి కృష్ణమాచార్యచరణులు [M.A., M.L., Ph. D., M. R.A.S.] దీని కాంగ్లమునఁ బ్రాక్కథనమును రచించిరి. రాజమహేంద్రవరమున న్యాయవాదులుగా నున్న శ్రీయుతులు వడ్డాది అప్పారావుగా రాంగ్లమున 'భూమిక'ను రచించియున్నారు. అందు [పు. vi] శార్ఙ్గధరుని 'పద్ధతి'ని బేర్కొనుచు 'శారఙ్గధరుఁడు' [Saranga-dhara] అని రెండుసారులు వ్రాసినారు. ఇది పొరపాటు. వేంకటాధ్వరికృత 'విశ్వగుణాదర్శము'ను (నీతికావ్య) సుభాషితగ్రంథములలోఁ జేర్చిరి. ఇది సరికాదు. విజయనగరమహారాజసంస్కృతకళాశాలాప్రధానాచార్యులగుశ్రీమత్పండిత పరవస్తు రామానుజస్వామిచరణులు [M. A.] దీనికాంధ్రమున నొకభూమికను రచించియున్నారు. ఇందు నాగానందాదిరూపకత్రయకర్తను 'శ్రీహర్షుఁడు' అనిపేర్కొనియున్నారు. 'శ్రీహర్షో నిపుణః కవిః' అని యీతఁడు దననాటకములఁ జెప్పుకొనినను నీతనిని హర్షవర్ధనుఁ డనియు, నైషధకారుని శ్రీహర్షుఁడనియుఁ బేర్కొనుట యుచితము.

ఈచరిత్రమును రచించుట కుపకరించిన గ్రంథనామముల పట్టిక యొసఁగఁబడెను. ఒకగ్రంథమునకే యనేకము లగుప్రతు లుండును. అందుచేఁ దా మేప్రతి నుపయోగించిరో యది యేసంవత్సరమున ముద్రితమో వీరు సూచించి యుండవలసినది. ఈలోపము పురాతత్త్వాన్వేషకులకు విశేషప్రతిబంధకముగా నుండును. ఈగ్రంథపట్టిక సమగ్రముగా నుండవలసినది. అల్పజ్ఞులుకూడఁ జేయనితప్పు లొండురెండు దొరలి నవ్వుపుట్టించుచున్నవి.

1. 'Catalogues Calalogorum' (P. xviii.) ఇది 'Catalogus Catalogorum' అని యుండవలెను.

2. విల్సన్ పండితుని 'Hindu Thoador' ఇట Hindu Theatre' అనవలెను.

3. చింతాహరణచక్రవర్తి 'భారతీయేతిహాసత్రైమాసికపత్రికలు'. ఇది 'డాక్టర్ నరేంద్రనాథలా' పండితుని సంపాదకత్వమున వెలువడు 'ఇండియన్ హిస్టారికల్ క్వార్టర్లీ' (Indian Historical Quarterly) అనుటకు వచ్చినతిప్పలు. ఈపత్రికను శాస్త్రిగారు చూచియైన నుండలేదని దీనివలనఁ దేలుచున్నది. ఈపత్రికలోఁ బ్రకటింపఁబడిన చింతాహరణచక్రవర్తిపండితుని 'సంస్కృతదూతకావ్యచరిత్రము'ను నే ననువదించి యాంధ్రసాహిత్యపరిషత్పత్రికలోఁ జిరకాలముక్రిందటనే ప్రచురించి యున్నాను. మూలమును జూడక నాయనువాదమును మాత్రము వీరు సంగ్రహించి మూలముగల యాంగ్లపత్రికను చింతాహరణపండితుని కంటఁ గట్టిరి. ఇది చింత్యము.

ఈపట్టికయందు వీరు చేర్పవలసిన పరశ్శతగ్రంథములమాట యటుంచి, కాళిదాసుని కృతులలో నీ రొక్కమాళవికాగ్నిమిత్రమును మాత్రము పేర్కొను టెంతయు ననుచితము. కాళిదాసుని రఘువంశాదికావ్యరత్నములను, శాకుంతల- విక్రమోర్వశీయములను బేర్కొనకపోవుటకు హేతు వేమో తెలియకున్నది. వీని యన్నిటికంటెను 'మాళవిక' మిన్న యని వీరి యభిప్రాయ మేమో!

'ఎపిగ్రాఫియా ఇండికా' 'Cambridge History of India' అని వ్రాసినారు. ఈరెండు నొకటి యనియేనా వీరితలంపు! ఇఁక 'అకారాదిపదపట్టిక-(200పు.) దండిభామహులపౌర్వాపర్యమును 'పేథక్' నరసింహయ్యంగారు, కాణేపండితులు విమర్శించినట్లు వ్రాయఁబడెను. ఇట 'పాఠక్' [Dr. K. B. Pathak.] అని యుండఁదగును. ఈవిషయములు పట్టికను వ్రాసినవారి కచుంబితము లగుటచేఁ గావలయు నిందును 'పేథక్' అనియే వ్రాయఁబడెను. (ii) వాసవదత్త 246, 247 మొ. పుటలలోఁబేర్కొనఁబడినట్లు 'ఇండెక్సు'నఁ గలదు. ఇది సరికాదు. 246 వ పుటలోఁ బేర్కొనఁబడిన వాసవదత్త 'మహాభాష్య'కారునిచే నుదాహరింపఁబడుటచే సుబంధుని 'వాసవదత్త' కంటె భిన్నము, ప్రాక్కాలికము, అందుచే నది వేఱుగా సూచింపఁబడవలసినది.

- ౨ -

ఇఁక నీసంపుటమునందలి తొమ్మిదియధ్యాయములయందలి విషయములను దిజ్మాత్రముగా సూచించి, శ్రీశాస్త్రులవారిచే నెడనెడ విడువఁబడిన కొన్నిముఖ్యవిషయముల ననుబంధించి, నా కందందు కలిగిన సందేహములను నభిప్రాయభేదములను జేర్చొనెదను.

I. ఈయధ్యాయమున- ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, శిల్పవేదము- అను నుపవేదములు వివరింపఁబడినవి. ఉపవేదములను గూర్చి కొన్నిసంవత్సరములక్రిందట నాంధ్రపత్త్రికాసంవత్సరాదిసంచికలో శ్రీయుతులు మానవల్లి రామకృష్ణకవి [యం. ఏ.,]గారొకచక్కనివ్యాసమును బ్రచురించియున్నారు.

II. రామాయణమహాభారతములు. 'బెరిడేల్ కీత్' మొదలగు పాశ్చాత్యసంస్కృతపండితులు రామాయణమహాభారతములను బురాణోపపురాణములను వైదికవాఙ్మయమునకుఁ జెందినవిగా నెంచి, తమ లౌకికసంస్కృతవాఙ్మయచరిత్రలలో వీనిని గూర్చి చర్చింపలేదు.

III. పురాణోపపురాణములు, తాంత్రికవిద్యలు. పురాణములం గూర్చి 'పార్జిటర్' [Pargiter] అను పాశ్చాత్యసంస్కృతపండితుఁడును, విశాఖపట్టణవాస్తవ్యులును, స్వర్గత మహామహోపాధ్యాయులు-శ్రీమత్పరవస్తు వేంకటరంగాచార్యార్యవరగురుపౌత్త్రులు నగు శ్రీపరవస్తు లక్ష్మీనరసింహస్వామిపాదులును గఠోరవ్యవసాయ మొనరించి,చక్కనివిమర్శల వెలయించిరి.

IV. వివిధదర్శనములు. షడ్దర్శనములంగూర్చిన 'మ్యాక్స్ మూలర్' [Max Muller] అను జర్మనీదేశసంస్కృతపండితుఁడు రచించిన బృహద్గ్రంథరాజము లోకవిదితమే. వివిధదర్శనములం గూర్చి ప్రత్యేకముగా 'కీత్' మొదలగు పండితులు కొన్నిగ్రంథముల రచించిరి. కీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు, [యం. ఏ.,] శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యపాదులు మొదలగువారు తెలుఁగున న్యాయవైశేషిక దర్శనములం గూర్చి విమర్శగ్రంథములఁ బ్రకటించిరి. విశిష్టాద్వైతాచార్యులుఁ బరశ్శతగ్రంథకర్తలునగు శ్రీమద్వేదాంతదేశికచరణులు నిర్మించిన

'పరమతభంగము' నిట స్మరింపఁదగును. 24 అధికారములలో వివిధ మతదర్శనములను పీఁచుఖండించి విశిష్టాద్వైతవేదాంతమును సయుక్తికముగ సిద్ధాంతీకరించియున్నారు. "మణిప్రవాళ" మను సంస్కృతద్రావిడ సమ్మిళితభాషలో రచింపఁబడిన యీకృతి సంస్కృతాంధ్రములలోని కనువదింపఁబడుట యత్యవసరము. శాస్త్రులవా రిం దక్కడక్కడ స్వనిర్మితములగు నాంధ్రపద్యముల నుదాహరించి యుండిరి. ఇవి యస్థానపతితములుగాఁ గానవచ్చును. ఇది సంస్కృతవాఙ్మయచరిత్ర కదా ?

V. శాస్త్రములు: వ్యాకరణము, జ్యోతిశ్శాస్త్రము, సాముద్రికము, అర్థశాస్త్రము, రాజనీతి, కామశాస్త్రము. వ్యాకరణశాస్త్రచరిత్రను 'బెల్వల్కర్' [Dr. S. K. Belvalkar, M. A., Ph. D.,] అను మహారాష్ట్రదేశీయసంస్కృతపండితుఁడు 'Systems of Sanskrit Grammar' అను గ్రంథమునఁ జక్కఁగ వ్రాసియున్నాఁడు. 'వాక్యార్థచంద్రిక' దాడిభట్ట విశ్వనాథశాస్త్రి కృతమని, 'చిత్రప్రభ' భాగవతుల హరిశాస్త్రి కృతమనియు మల్లాదివారు. ఇదితప్పు; రెండును హరిశాస్త్రికృతములే! వ్యాకరణశాస్త్రమున నుద్గ్రంథములను రచించిన యీయాంధ్రదేశసంస్కృతపండితులను [146-7 పు.] శాస్త్రిగారు పేర్కొనియున్నారు. కాని 'గురుప్రసాదమ' ను వ్యాకరణగ్రంథరాజమును రచియించిన మహామహోపాధ్యాయులు తాతా సుబ్బారాయశాస్త్రిచరణులను బేర్కొనరైరి.

VI. అలఙ్కారశాస్త్రము: ఈశాస్త్రమును గొన్నికొన్ని లక్షణములనుబట్టి వివిధయుగములుగా విభజించియుండినచోఁ జరిత్రరచనకు విశేషముగా ననుకూలించి రసరీత్యలంకారధ్వన్యాది వివిధసిద్ధాంతముల తత్త్వము సుగ్రాహ్యముగా నుండెడిది. జర్మనీదేశసంస్కృతవిద్వాంసుఁడగు 'జాకోబీ' [Dr. Jacobi] యీశాఖలోఁ బ్రత్యేకకృషి సల్పియున్నాఁడు. పాశ్చాత్యదేశీయులలో 'నోబెల్' పండితుఁడును [Dr. J. Nobel] భారతీయపండితులలో 'పాండురంగవామనకాణే' [యం. ఏ., యల్.యల్. యమ్.,] పండితుఁడును, ఆచార్య 'సుశీలకుమార డే'

[M. A., D. Litt.] యును, 'శంకరన్' పండితుఁడును [Dr. Sankaran, M. A., Ph. D.,] సంస్కృతసాహిత్యచరితము నాంగ్లమున రచించిరి. సాహిత్యశాస్త్రమునకుఁ గిరీటమువంటి భరతాచార్యుల నాట్యశాస్త్రమును- అభినవభారతితోఁ బరిష్కరించి ప్రచురించుచున్న శ్రీ మానవల్లి రామకృష్ణకవి, [యం. ఏ.,] గారి భగీరథప్రయత్నము నిట స్మరింపఁదగదా ?

(1) పుట 229:-భోజుని 'శృంగారప్రకాశము' లోనివిగా రెండు శ్లోకములు తెలియవచ్చిన వనియు నీగ్రంథము ముద్రితమైనట్లు కనఁబడదనియు వ్రాయఁబడియున్నది. ఇది సరికాదు. 36 ప్రకాశములు గల యీకృతి కొంతకాలముక్రిందట లభించినది. 26 వ ప్రకాశమును 25, 27, 29 వ ప్రకాశములలోఁ గొంతభాగము నుత్పన్నము లైనవి. దీనిం గూర్చిననాసమాలోచనమును మత్కృత 'సంస్కృతసారస్వతచింతామణి' [1 వ మరీచి] లోఁ గనఁదగును.

(2) అలంకారసర్వస్వము [పు. 233]: ఈకృతిని గుఱించియు, రయ్యకునిగుఱించియు-మదీయ 'సంస్కృతసారస్వతచింతామణి' యందలి 3, 4 వ మరీచులం గనునది.

(3) ధర్మసూరి 'సాహిత్యరత్నాకరము'- [పు. 244] క్షయసంవత్సరాంధ్రపత్త్రిక-ఉగాదిసంచికలో శ్రీరంగము సోమేశ్వరశాస్త్రిగారి 'సాహిత్యరత్నాకరము' అనువ్యాసమును, మదీయ సం. సా. చింతామణిలో 'సాహిత్యరత్నాకరము-నౌకామందరములు' [5 వ మరీచి] అనువానిం గనఁదగును.

VII. కావ్యములు: పద్యకావ్యములు, చారిత్రకకావ్యములు, కథాకావ్యములు, పౌరాణిక కావ్యములు, సందేశకావ్యములు, కల్పిత కావ్యములు, నీతికావ్యములు, దైవతకావ్యములు, గద్యకావ్యములు, చం'పు'కావ్యములు నీయధ్యాయమున వివరింపఁబడినవి. గద్యకావ్యములను, చంపూకావ్యములను ప్రత్యేకాధ్యాయములలో నింతకంటె విపులముగా వివరించిన బాగుగానుండెడిని.

(1) [పు. 246]—వల్లభదేవునికృతి 'సుభాషితావళి'గాని 'సుభాషితరత్నావళి' గాదు.

(2) ,, సదుక్తికర్ణామృతకర్త 'శ్రీధరదాసుఁడు' గాని, 'రాజశేఖరుఁడు' గాదు.

(3) [పు. 251] 'కుంతేశ్వరదౌత్యము'- కుంతలేశ్వరదౌత్య మనఁదగు. ఇది రఘువంశకారునిది గా దని శాస్త్రిగారు- ఇది సరిగాదు. దీనినిగూర్చిన నావ్యాసమును 'భారతి' (1930) లోఁ గనునది. ఋతుసంహారము గూడ నీతనిదే. [చూ. శ్రీఅరవిందఘోషుని Kalidasa's 'Seasons.']

(4) [పు. 253] 'మాఘుఁడు క్రీ. 550 ప్రాంతమువాఁడు'—ఇది సరికాదు. క్రీ. 700 ప్రాంతముల రచింపఁబడిన 'న్యాసము'ను పేర్కొనిన [II. 112] మాఘుఁడు, క్రీ. 800 ప్రాంతములకుఁ జెందినవామనునిచేఁ బేర్కొనఁబడెను. అందువలన మాఘుఁడు క్రీ. 750-800 లలో జీవించియుండె ననఁదగు.

(5) రామభద్రాంబ [పు. 262] సంస్కృతకవయిత్రులను గూర్చి యొక యధ్యాయము వ్రాయవలసినది.

వీరినిగూర్చి వెనుక నాంధ్రసాహిత్యపరిషత్సభలో నేనొక యుపన్యాస మిచ్చియున్నాఁడను. నాకు 50 మందికిఁ బైఁగాఁ గవయిత్రులు తెలియవచ్చినారు.

(6) [పు. 280] ధనంజయుని 'ద్విసంధానకావ్యము' ముద్రితము కాదఁట లభింపలేదఁట—ఇది సరిగాదు. ఇది చిరకాలము క్రిందటనే [క్రీ. 1895] వ్యాఖ్యతో నిర్ణయసాగరముద్రాలయమువారిచేఁ బ్రకటింపఁబడినది. ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక [భావ] లో నేను ప్రచురించిన 'సంస్కృతద్వ్యర్థిత్ర్యర్థికావ్యచరితము'ను జూచునది.

(7) [పు. 282] వేంకటాధ్వరి—రాఘవయాదవీయము'—యాదవరాఘవీయ మని యుండఁదగును. ఇది 30 శ్లోకముల కావ్యము, కాని

'మూఁడువందల శ్లోకములు' కలది కాదు. ఇది వ్యాఖ్యతోఁ జిరకాలము క్రిందటనే తెనుఁగులిపిలో మైసూరులోఁ బ్రకటింపఁబడినది.

(8) [పు. 288] బాలభారతము—'పన్నెండు సర్గలకావ్యము'- ఇందు 20 సర్గలు గలవు. దీనిని రచించిన యగస్త్యుఁడే ప్రతాపరుద్రీయ కర్త యగు విద్యానాథుఁడు. ఇతఁడు రచియించిన 'నలకీర్తికౌముది'లోని 2 సర్గలు మాత్రము కొంతకాలముక్రిందట -ఆం. సా. పరిషత్పత్త్రికలోఁ బ్రకటింపఁబడినవి. ఈకవిని గుఱించి, తత్కృతులను గాలమును గూర్చి నా'అగస్త్యుఁడు—బాలభారతము' అను లఘుగ్రంథమును జూచునది.

(9) [పు. 293-302] : సందేశకావ్యములు: ఇట శాస్త్రిగారు నావ్యాసములను సంగ్రహించి నాకు గౌరవ మొసంగినందులకు వారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

(10) [పు. 305-6]: మహిషశతకము-వాంఛేశ్వరుఁడు:—ఈకవి కుట్టికవి యనునామమునఁ బ్రసిద్ధుఁడు. ఈకృతి వ్యాఖ్యతోఁ దెనుఁగు లిపిలో క్రీ. 1875 లో ముద్రింపఁబడినది.

(11) [పు. 312]: జల్హణుని 'సూక్తిముక్తావళి' ముద్రిత మని, శాస్త్రిగారు-ఇది నేఁటివఱకు ముద్రింపఁబడలేదు. 'గైక్వార్ ప్రాచ్య గ్రంథావళి' లోనిది ముద్రింపఁబడనున్నది.

(12) [పు. 315] కృష్ణకర్ణామృతము 'త్రిశతక' మనఁబడును గాని యిందు 112 శ్లోకము లున్నవి'-ఇది సరి గాదు. వావిళ్ల వారి ప్రతిలోను, బొంబాయిలోఁ బ్రకటింపఁబడిన యొకానొక నాగరీపుస్తకమునను- త్రిశతకమును గలదు.

(13) [పు. 320] 'కపీనా మగళ ద్దర్పః-'ఈశ్లోకము బాణుని దగునా కాదా యనువిషయము విచారణీయము.' ఇది బాణునిదే; క్రీ. 12 వ శతాబ్దికిఁ జెందినశంకరపండితుఁడు (హర్షచరితవ్యాఖ్యాత) ఈ శ్లోకమునకు వ్యాఖ్య వ్రాసియున్నాఁడు. అందువలన వాసవదత్తాకారుఁడగు సుబంధుఁడు బాణునికంటె నవీనుఁ డనువాదము సరిగాదు. [చూ. కాణేపండితుని కాదంబరీపీఠిక-పు. xi-xiii; Indian Historical Quarterly-Vol. V. No. 4. P. 699-714.]

(14) [పు. 326] చంపూరామాయణకర్త 'ధారానగరాధీశుఁడగు భోజమహారాజని చిరకాలప్రసిద్ధి?' ఇది సందేహాస్పదము. ఈభోజుఁడు మాళవదేశాధీశుఁడు; చంపూరామాయణకర్త యన్ననో విదర్భాధిపతి యని యాగ్రంథముననే కలదు.

(15) [పు. 328] భోజచంపూపూరక మగు రాజచూడామణి 'యుద్ధకాండ మముద్రితము'-ఇది కొన్నివత్సరములక్రిందట-కలకత్తాలోఁ బ్రకటింపఁబడుచున్న 'ఇండియన్ హిస్టారికల్ క్వార్టర్లీ' పత్రికలోఁబ్రచురింపఁబడినది. [Indian Historical Quarterly- Dec. 1930.]

(16) [పు. 329] వేంకటాధ్వరి 'ఉత్తరచంపువు'-ఇది యముద్రిత మఁట ! ఇది తెనుఁగులిపిలోను, బొంబాయిలోని 'గోపాలనారాయణ కంపెనీ' వారిచే నాగరిలోను గూడ నచ్చొత్తింపఁబడినది.

VIII. రూపకములు:-

(1) రామాభ్యుదయనాటకము యశోవర్మకృతము కాదేమో యని శాస్త్రిగారిసందేహము. వీరు పరిశీలించిన 'ధ్వన్యాలోకలోచనము' లోనే [పు. 148] యభినవగుప్తుఁడు-'రామాభ్యుదయే యశోవర్మణా'—అని వ్రాసియుండుటచే నీకృతి యశోవర్మకృత మని సిద్ధాంతీకరింపఁజనును.

(2) [పు. 368] కుందమాలను '1923 లో, శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు సంపాదించిన లిఖితపుస్తకమును బట్టి శ్రీ జయచంద్రశాస్త్రిగారు లాహోరునగరమున ముద్రించిరి.' ఇదితప్పు. దీనిని మొట్టమొదట రామకృష్ణకవిగారే 'దక్షిణభారతీ గ్రంథమాల'లోఁ బ్రచురించిరి. దానిని బట్టియే తాము మరల ముద్రించుచున్నట్లు జయచంద్రశాస్త్రిగారు వ్రాసికొనియున్నారు. ఆంధ్రులకు రావలసినకీర్తి నాంధ్రేతరుల కంటఁగట్టుట శోచనీయము.

(3) [పు. 375] అనర్ఘరాఘవము-మురారి: రత్నాకరుని 'హరవిజయము' నందలి 'అఙ్కోఽథనాటక' అను శ్లోకములోని- అంక, నాటక, కవి మురారి- పదములప్రకృతముగా మురారిని దెల్పుచుండుటచే, రత్నాకరునికంటెఁ బూర్వుఁడైన మురారి క్రీ. 790-840 నడుమ

నున్నవాఁడను ప్రాచీనవాదమునే శాస్త్రిగారు పేర్కొనియున్నారు. ఉత్త మనాయకుఁడగురామునివధ'అనర్ఘరాఘవము'నలేదు. కావునఁ బైశ్లోక మీనాటకమును నప్రకృతార్థముగా మురారిని సూచించుటలేదు. "కవిః కునాటకే అస్మిన్ ఉత్తమనాయకస్య నాశే మిష మురారి రిత్థం యస్య నాశం వ్యథిత సః ఆక్రాన్తకృత్స్నభువనః దైత్యనాథః హిరణ్యకశిపుః సహబన్ధునర్గైః క్వగతః''—అని పైశ్లోకము నొకానొక ప్రాచ్యవిద్యా విచక్షణు లన్వయించిరి. మురారికాలనిర్ణయమునకుఁ బ్రమాణాంతరము గలదు:-'అనర్ఘరాఘవము' లోని [I. 58]. 'యదిన్దో రన్వేతి'- అను శ్లోకము క్రీ. 900 ప్రాంతమువాఁడగు రాజశేఖరుని 'కావ్యమీమాంస' లోఁ [xvi అధ్యా.] గానవచ్చుచున్నది. కావున నీతనికంటె మురారి ప్రాచీనుఁడని చెప్పఁదగును.['మురారిమహాకవి'-(1936)-అనునాగ్రంథ మును జూచునది.]

(4) [పు. 380]'భీమటకవి మైహనాటకములు నిర్మించెను.' ఈకవి 'ప్రతిభాచాణక్యము'ను గూర్చి సమదర్శిని యుగాదిసంచికలో నే నొక వ్యాసమును బ్రచురించియున్నాను. [1931-32 సం. ప్రజోత్పత్తిసంచిక, 98-99 పు.]

(5) [పు. 383] ప్రసన్నరాఘవము: జయదేవుఁడు-'12 వ శతా బ్దిలోని వాఁడని కొందఱందురు. ఈయుత్తమనాటకములోని శ్లోక మొ కటియు విశ్వనాథకవిరాజు సాహిత్యదర్పణమున లేకపోవుటచే నతని కితఁడు పరుఁడని కొంద ఱందురు' ఇది సరి కాదు. 'కదలీ కదలీ కరభః' అను ప్రసన్నరాఘవమునందలి శ్లోకము సాహిత్యదర్పణమున [IV పరి.] నుదాహరింపఁబడి యున్నది. అందువలన క్రీ. 1300-1350 నడుమ నున్న విశ్వనాథకవిరాజుకంటె జయదేవుఁడు ప్రాచీనుఁడు. మఱియు— రసార్ణవసుధాకరమున సింగభూపాలుఁడు (క్రీ. 1330) ప్రసన్నరాఘవ మును రెండుసారు లుదాహరించుకొనియెను. అందువలన జయదేవుఁడు క్రీ. 1300 కంటెఁ బ్రాక్తనుఁ డనఁదగును.

(6) [పు. 389] విశ్వనాథుని 'సౌగంధికాపహరణ' మముద్రిత మఁట! ఇది నిర్ణయసాగరముద్రాలయమున నేఁటికి 35 సంవత్సరముల క్రిందటనే [1902 లో] ముద్రింపఁబడెను.

(7) [పు. 390] కుమారదాసుని 'జానకీహరణము' కావ్యము గావున, నాటకప్రకరణమున దీనిప్రసక్తి యప్రస్తుతప్రశంస.

(8) [పు. 391] 'ప్రవరకవి కాదంబరీరామ మను నాటకమును నిర్మించెను.'-ఇది సరికాదు. 'అకాలజలద' ఇత్యాదిశ్లోకమునకు-* అకాలజలదుని శ్లోకములను దనవిగాఁ జూపి, కాదంబరీరాముఁడు నాటకరచనమునఁ గవిప్రవరుఁ డని పేరొందెననికదా తాత్పర్యము. దీనికి శాస్త్రిగా రపార్థము చేసిరి.

IX. నిఘంటువులు-ఛందశ్శాస్త్రము.

నిఘంటుచరితమును జర్మన్ భాషలో 'జకారియా' యను పాశ్చాత్యపండితుఁడు రచించెను. పిమ్మట కీ. శే. మ. మ. రామావతారశర్మగారు కల్పద్రుకోశమునకుఁ బీఠికారూపమున నిఘంటుచరితము నాంగ్లమున రచియించిరి. దీని ననుసరించి శ్రీ మేడేపల్లి వేంకటరమణాచార్యుల వారు తెలుఁగునఁ దచ్చరితమును రచించి, 3 వత్సరములక్రిందట- ఆంధ్రసాహిత్యపరిషత్ పత్త్రికలోఁ బ్రచురించిరి.

(1) [పు. 413] 'మ. మ. రంగాచార్యులవా రొకగొప్పనిఘంటువును నిర్మింప నారంభించిరి గాని, యది నెఱవేఱినది కాదు.' ఈనిఘంటురచనము పూర్తియైన దనవచ్చును. కాని, 'అ, ఆ' లతోఁ బ్రారంభించు పదములకు రెండుసంపుటములు తెనుఁగులిపిలోఁ జిరకాలముక్రిందటనే ప్రకటింపఁబడినవి. ఇది వాచస్పత్యమువలెనే విజ్ఞానసర్వస్వము. [Encyclopaedia.]

(2) [పు. 415] వృత్తరత్నాకరకర్త యగు కేదారభట్టు 'దేశకాలములు దెలియకున్నవి'- చండూపండితుఁడు (క్రీ. 1297) నైషధవ్యా

*శ్లో. 'అకాలజలదశ్లోకై శ్చిత్ర మాత్మకృతైరివ
జాతః కాదమ్బరీరామో నాటకే ప్రవరః కవిః.'

ఖ్యానమున- వృత్తరత్నాకరము నుదాహరించుకొనుటచే నీతనికంటెఁ గేదారభట్టు ప్రాచీనుఁ డనఁదగును.

- 3 -

సంస్కృతవాణి యుత్కృష్టపాశ్చాత్యభాషలకంటె మిన్నయని పాశ్చాత్యసంస్కృతపండితులు ముక్తకంఠమునఁ బ్రశంసించియున్నారు. 'సర్ విలియమ్ జోన్సు' [Sir William Jones] వాక్యమును జూడఁదగు: 'The Sanskrit language, whatever be its antiquity, is of a wonderful structure, more perfect than Greek, more copious than Latin, and more exquisitely refined than either.' సామాన్యముగా నిం దే శాఖను జూచినను నసారత్వము, నగాధత్వమును బొడకట్టుచుండును. అట్టివాఙ్మయచరిత్రను వ్రాయఁబూనుట సముద్రమున కేతా మెత్తుట వంటిదే. సంస్కృతవాఙ్మయవిచారకములగు గ్రంథములు 'జర్మన్, ఆంగ్లము, ఫ్రెంచ్' మొదలగుపాశ్చాత్యభాషలలోను, హిందీ మొదలగు భారతీయభాషలలోను బరశ్శతములుగా రచింపఁబడినవి. అందువలన నాయాశాఖలలోఁ బ్రత్యేకముగాఁ గఠోరవ్యవసాయ మొనరించి, యాధునికగవేషణావిధానమున నారితేరినపండితులచే సాహిత్యపరిషత్తులు గాని, విశ్వకళాపరిషత్తులు గాని రచియింపఁదగుదు. 'కేంబ్రిడ్జి' విశ్వవిద్యాలయమువా రాయాభాగములఁ బ్రత్యేకకృషి సల్పినవారిచే నాంగ్లవాఙ్మయచరిత్రమునం దాయాభాగముల రచియింపఁజేసిరి. ఈపద్ధతిని రచియింపఁబడిన కృతియందు రచనాశయ్యాదులం దేకత్వము లేకపోవుట, పూర్వాపరవైషమ్యము, పునరుక్తి మొదలగులోపము లుండవచ్చును. కాని ప్రధానసంపాదకుఁ డట్టిలోపముల సాధ్యమైనంతవఱకుఁ దొలఁగించును. ఏభాగమును జూచినను సమగ్రత, ప్రామాణ్యము నుండును.

పాశ్చాత్యపండితుల సంస్కృతవాఙ్మయసేవ, మహమ్మదీయ సంస్కృతపండితులసేవయు వివరింపఁదగును. ఆంధ్రవిశ్వకలాపరిషత్తు వారి

ప్రచురణ మగుటచే నాంధ్రులు గీర్వాణవాణికిఁ జేసినపరిచర్యను విపులముగ నొకప్రకరణమున వివరింపవలసినది. ఆంధ్రుల సంస్కృతసేవ యేమండలమువారిసేవకును వెనుకఁ బడదు. ఏశాఖయందుఁ జూచినను వీ రఖండసేవ యొనరించియున్నారు. వీరినిగుఱించి ప్రత్యేకముగా వ్రాయుచో నీసంపుటమంతగ్రంథ మగును.

భారతవర్షమున సంస్కృతపత్త్రికారాజము లనేకములు విలసిల్లి సురభారతీప్రచారమునకు విశేషముగాఁ దోడ్పడినవి. 'భిన్నరుచేర్జనస్య బహుధా ప్యేకం సమారాధన' మ్మను న్యాయమున నీపత్త్రికలు విచిత్రరుచులుగల సంస్కృతసారస్వతరసికుల సాహిత్యపిపాసను రగులుకొల్పి సంస్కృతవాఙ్మయాభ్యుదయమున కెంతయు నుపకరించినవి. అందుచే 'సంస్కృతపత్త్రికావాఙ్మయచరిత్ర'ను శాస్త్రీగా నొక ప్రకరణమునఁ బ్రత్యేకముగా వివరింపవలసినది. నేఁటివఱకుఁ దెలియవచ్చిన సంస్కృతపత్త్రికల నామముల నిట నొసఁగెదను-

1. అమృతభారతి [కొచ్చిన్]. 2. ఆర్యప్రభ [Vedavel Tora, Manbhum Dt.] 3. ఉద్యానపత్త్రిక [తిరువాడి]. 4. ఉద్ద్యోతము [సం. సా. పరిషత్తు-పంజాబు].5. కావ్యమాల [బొంబాయి]. 6. గ్రంథరత్నమాల [బొంబాయి.]. 7. పండితపత్రిక ['The Pandit'-Benares]. 8. బ్రాహ్మణమహాసమ్మేళనపత్రిక [కాశీ]. 9. మంజుభాషిణి [కాంచీపురము]. 10. మంజూష [కలకత్తా]. 11. మధురవాణి [బెల్గామ్]. 12. మిత్రగోష్ఠి [కలకత్తా]. 13. మీమాంసాప్రకాశము. [పూనా]. 14. మైసూరుమహారాజసంస్కృతకళాశాలాపత్రిక. 15. విజ్ఞానచింతామణి. [పట్టాంబి]. 16. విద్యావైజయంతి [కాశి]. 17. విద్యోదయము. 18. శారద [ప్రయాగ]. 19. శ్రీశారద [మైసూరు]. 20. 'శ్రీ'పత్రిక [కాశ్మీరము]. 21. సంస్కృతకళాశాలాపత్రిక [కలకత్తా]. 22. సంస్కృతచంద్రిక [కొల్హాపురము]. 23. సంస్కృతపద్యవాణి [కలకత్తా]. 24. సంస్కృతభారతి [బర్ద్వాన్]

25. సంస్కృతమహామండలపత్రిక [కలకత్తా]. 26. సంస్కృతరత్నాకరము [జయపురము]. 27. సంస్కృతవాదిని. 28. సంస్కృతసాహిత్యపరిషత్తు [కలకత్తా]. 29. సం. సా. పరిషత్పత్రిక [శ్రీనగరము]. 30. సహృదయ [శ్రీరంగము]. 31. సుప్రభాతము [కాశి]. 32. సురభారతి [కాశి]. 33. సూర్యోదయము [కాశి].

భారతవర్షమునందలి ప్రభువు లనేకులు సంస్కృతపండితులను, కవులను బోషించుటయేకాక తాము విద్వాంసులును కవులు నయి యనేకగ్రంథరాజముల రచించియున్నారు. భోజుఁడు, అవంతివర్మ, యశోవర్మ, అర్జునవర్మ, లక్ష్మణసేనుఁడు, కృష్ణదేవరాయలు మొదలగురాజకవులనుగూర్చి ప్రత్యేకముగా వ్రాయఁదగును. కాశీ, కలకత్తా, లాహోరు, బరోడా, పూనా, మైసూరు, మద్రాసు, తిరువాన్కూరు మొదలగుస్థలముల ననేకగ్రంథమాలలు బయలువెడలి యపూర్వసంస్కృతగ్రంథరత్నములఁ బ్రకాశింపఁజేసినవి. వీనిచరిత్ర, యించుక వ్రాయుట వాంఛనీయము. 'ఓరియంటల్ బుక్ ఏజన్సి' (పూనా) నిర్ణయసాగరసంఘము (బొంబాయి) మోతీలాల్ బనార్సీదాస్ (లాహోరు), మెహర్ చంద్ లక్ష్మణదాస్ (లాహోరు) మొదలగుప్రాచ్యగ్రంథవిక్రేతలు, ప్రకాశకులు సురభారతి కఖండసేవ యొనరించిరి. కావున వీరిని మఱువఁజనదు. శాస్త్రివర్యు లచిరకాలమున- ద్వితీయసంస్కరణమున - నీలోపములఁ దొలఁగింతురుగాక!

---

# జవ్వనము—యవ్వనము.

కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్., కాకినాడ.

---

బాలకవిశరణ్యమున (పుట 32) జవ్వనమునకు యవ్వనము రూపాంతర మనియు నందులకు మహాకవిప్రయోగములు గల వనియుఁ, బరిష్కరణంబుల నవి మార్పఁబడిన వనియు శ్రీ గిడుగు రామమూర్తిపంతులవారు వ్రాసియున్నారు. శ్రీనాథుఁడు శివరాత్రిమాహాత్మ్యమున యవ్వనపదమునే వాడియుండఁ బరిష్కర్తలు దాని యౌవన మని మార్చి రని వీరి వాదము. శివరాత్రిమాహాత్మ్యమున కొకటియేప్రతి గలదు. (పరిషద్భాండాగార సంఖ్య 3105) ఈగ్రంథమున శ్రీనాథుఁడు యౌవనజవ్వనపదముల వాడిన స్థలములను యథామాతృకముగా నిందుఁ జూపితిని.

| | ముద్రితప్రతి. | తాళపత్రప్రతి. |
|---|---|---|
| (1) 2.17 | శరలతాకాననమువోలె జవ్వనంబు— | జవ్వనంబ్బు |
| (2) 2-83 | జవ్వనం బావిర్భవించిన— | జవ్వనం బావిర్భవించిన |
| (3) 2 86 | ఆదిగర్భేశ్వరత్వంబు యౌవనంబు— | యవ్వనంబ్బు |
| (4) 2.88 | యౌవనారంభంబున— | యవ్వనారంభంబ్బునా |
| (5) 2.93 | యౌవనము దోషములకెల్ల నాస్పదంబు— | యౌవ్వనము దోషముల... |
| (6) 2-95 | నాదిగర్భేశ్వరత్వంబు యౌవనంబు— | యౌవ్వనంబ్బు |
| (7) 2-105 | జవ్వనమునను— | జవ్వనములు |
| (8) 2-109 | నవయౌవనాంకురోన్నత— | నవయవ్వనాంకురో... |
| (9) 3.17 | యౌవనసంప్రాప్తి— | యవ్వనసంప్రాప్తి |
| (10) 3-34 | చారుయౌవన— | చారుయొవ్వన |

ఇందు 1,2,7 స్థలముల జవ్వన మనియే గలదు. 3,6 స్థలముల 'ఆదిగర్భేశ్వరత్వంబు యౌవనంబు' అను దానికే యొకచో యవ్వనంబ్బు అనియు, మఱొకచో యౌవ్వనంబ్బు అనియుఁ గలదు గదా. ఇందు

మూల మేమై యుండును. 2-93 వ పద్యమున 'యౌవ్వనము' అనివ్రా
సిన వ్రాయసకానివ్రాఁతల ప్రామాణ్య మే మనవచ్చును.

ఆ. 3-17 పద్యమును జూడుడు.

క. దేవరప్రతినిధిఁగా సం
సేవింతుము యజ్ఞదత్తు సిద్ధమ యతనిన్
భావింతుము దత్తనయుని
యౌవనసంప్రాప్తి లేనియటము న్నెల్లన్.

ఇందు ప్రాసస్థానమున యౌవనశబ్దము గలదు. తాటియాకు
ప్రతియందు 'యవ్వనసంప్రాప్తి' యని కలదు. శ్రీనాథుఁడు దేవర, సేవిం
తుము, భావింతుము అనువానితో యవ్వన మని ప్రాసస్థానమున వ్రాసి
యుండునా ? అట్టిప్రాసము కవిసమ్మతమా ? లాక్షణికమా ? పద్మపు
రాణమున, ప్రాసస్థానమున యవ్వన ముండుటచే 'యవ్వనము' కవిప్ర
యుక్త మని వాదించు శ్రీపంతులవారు ప్రాసస్థానమునఁ గల పదము
యౌవనమై యుండును గాని యవ్వనమై యుండ దని యంగీకరింపక
తప్పదు. ఆ 2-109 నవయౌవనాంకురోన్నతపద మైన యనుచో సం
స్కృతసమాసమున యవ్వనశబ్దమును శ్రీనాథుఁ డుపయోగించె నన
వచ్చునా ? వ్రాఁతలో యౌవన మని వ్రాయుటకు మాఱుగ యవ్వన
మని వ్రాసియుండుట స్పష్టముగదా ? ఆ 3.34 చారుయౌవనరూప
సంపన్నయై యనుచో యొవ్వన మనియే మూలమునఁ గలదు. దీని
వలనఁ గూడ శ్రీనాథునిప్రయోగ మేమై యుండునో యూహింపఁ
దగును. ఒకపదమునకే యిన్నివిధముల వ్రాఁతలఁ గల్పించినవ్రాయస
కాని వ్రాఁతల కేమనవచ్చును ? వానిప్రామాణ్యమును గ్రహింపఁదలఁ
చినచో శబ్దస్వరూప మే మగును ? యౌవనశబ్దము ప్రాకృతమున
జొవ్వణ మగు నని మన మంగీకరించి జవ్వన మనుదానికియవ్వనము రూ
పాంతర మని యనుకొన్నను శ్రీనాథునిప్రయోగమువిషయమై సందేహ
ముండుటకు వీలులే దని గ్రహింపనగును. మఱియొకయూహ- యౌవ
నము పలుకుబడిలో 'యవ్వన'మగు నని సుస్పష్టము. అందువలన నిట్టి

ప్రమాదము వ్రాఁతలో సహజము. ఈసందర్భముల విజ్ఞు లూహింతు రుగాక.

సింగన పద్మపురాణమునఁ బ్రాసస్థానమున యవ్వన మని ప్రయోగించె నని వీరు వ్రాసియున్నారు. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునఁ బద్మపురాణమునకు మూఁడుప్రతులు గలవు. (గ్రంథసంఖ్య 115, 1106, 2057) బాలకవిశరణ్యమున (పుట 322) సీయఁబడినపాఠ మిది.

క. అవ్వనములు దమమయమై, యవ్వనము ......ప్రో వ్వ... ..

దీనికి 1106 సంఖ్యగల ప్రతియం దు

క. యవ్వనముల దమమయమై

అవ్వనముల నొకటి కొకటి నరుఁ ...

అనియు, 115, 2057 సంఖ్యగల ప్రతుల యందు

క. యవ్వనములు మృగమయమై

నవ్వనమున నొకటికొకటి నరుము ... మిగులన్

క్రొవ్వి కడు మసరుకవిసిన

నవ్విపినంబుల మృగంబు లవనీనాథా!

ఈపాఠములు సరియగు నర్థము నొసగుటలేదు. సింగన ప్రాసస్థానమునఁ 'యవ్వన' మని జవ్వనశబ్దమునకు రూపాంతరముగ వాడెనను, శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్యమునఁ గలపాఠములను బట్టి, యవ్వన మని శ్రీనాథుఁడు వాడియుండె ననుట పొసఁగదు.

# రెండు శృంగారనైషధ ప్రయోగములు.

---

క్రిందటి సంచికలో శృంగారనైషధపువ్రాఁతప్రతులయందు 'జేతు రనిన, (2 88) 'విసివినవిభంగి' (6-33) యను పాఠములు గానవచ్చుట లేదని తెలియఁ బఱచితిమి. పరిషద్భాండాగారమునఁ గల యితర తాళపత్ర ప్రతులయందుఁ గూడ నట్టిపాఠములు గననగుట లేదు. (గ్రంథసంఖ్య 1230, 2018, 2508, 2869). మోహింపజేయునతని, వినిన్విననిభంగిన యని యన్నిటియందును గలదు. ఇన్నిప్రతులలో సమానముగ నేమార్పును లేక కన్పడుచుండుటచే నవియే సరియగుపాఠము లని మనము నిర్ధారణ మొనర్పవలసియున్నది. అర్థముకూడ సుస్పష్టము. హంసతూలికాతల్పంబునందు మేను సేర్చినప్పుడు నేత్రరాజీవయుగము జేరి చుంబించి యతని మోహింపఁజేయు, నిద్రయు నీవు నేమాదిరొక్కొ. కొన్ని వ్రాఁతప్రతుల 'చుంబించు' అనికలదు. దానికన్న 'చుంబించి' యనునదియే సరియగుపాఠ మనుకొందును. 'మోహింపఁజేయుదు రన' యనునట్టియర్థమునే యిచ్చినను, తాళపత్రప్రతులఁ గన్పడదు. వినిన్విననిభంగి యని శ్రీనాథుఁడు ప్రయోగించె నని మనకు వివిధప్రతులవలన స్పష్టము. కాని వినిన్ యనుచో యుకారలోపము లాక్షణికసమ్మతము కాదు. బచ్చుకు ఇత్యాదులవలెఁ గవిసమ్మత మనవలెను. వినియున్ అని వ్రాయుటకు మాఱు వినిన్ అనియే ప్రయోగించె ననవలసియున్నది.

---

# శైలివిలాసిని.

— కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు, కాకినాడ. —

ఇటీవలి కలికాలకవితారంగస్థలిని, నవీనశైలీనీలాలక యొకర్తుక తననర్తనవిలాసములచే, లోకమును మోసగింప మొదలిడినది. ఈకుటిల కుంతలావిలాసలీలాతళుకురసభంగములు, సాగరతరంగమాలికాడోలి కలవలె నిలుకడలేక పలుతెఱంగులఁ బరుగిడుచున్నవి.

గ్రాంథికారణ్యప్రాంతోటజనివాససూరులును, క్రొందెలుంగుగూడెంపుగుడిసెల విహరించు సంస్కారధూర్వహులును గూడ, నీశైలీచేడీ విలోలలీలలఁ బ్రకటింపఁ బాటుపడుచున్నారు, కాని, యీచంచలవంచకురాలు స్వీయశైలీలీలల వెలుపలి పదవిన్యాసములందే కాక, వృత్తేజకము లగునాంతరంగికభావతరంగవీచికావాతూలపరంపరలయందు కూడఁ బ్రదర్శించుచుండుటచే భాషాద్వయసామ్రాట్టులకు సహితము పట్టువడక, స్వాటక్కరితనముచే వారల కులుకెత్తింపఁజూచుచున్నది.

ఓ! కళాసామ్రాజ్యతేఁడులారా! కంటిరా! ఈకలువకంటి కొంటితనంపుచేఁతల! అబలయగుశైలీనర్తకి కళాప్రౌఢ లగుమునిపీతల్లజుల *గోత్రకాంత మేలు సింహము లన్నట్లు, ట్రబుల్సు (troubles) పాల్సేయుచున్నదియో! అబ్బా! ఏమి! ఈవండర్ (wonder) ఇది సౌదామినీకామినీనీరజాక్షికిఁగూడఁ బట్టువడ సాధ్యముకాని ట్రిక్సు (tricks) చూపుచున్నది. విద్యున్నటిని లాంగెస్టు (longest) యినుపపోస్టు యగ్రంపైకి దింపవచ్చును, కాని, యీశైలీశైవలినీనీలవేణినినిలుకఁబెట్టుటకు మాత్రము పాత్తు (path) చూపట్టకున్నది. నే నీమధ్య యీన్యూ (new) శైలీసారంగిణీసంగతుల వాచి (watch) చేయఁ దలంచి, సాహిత్యారణ్యపాలిమేరలోని కేఁగి, వనమంతయు గాలించితిని గాని,

---

* ఈనడుమఁ గ్రొత్తగాఁ బ్రకటితము లగుచున్న సాహిత్యసారస్వతశైలీసంపదలఁ జిలికించుటచే నాకుఁ జేకూరెడు విజ్ఞానానందముల వెల్లడించుటకే యీవ్యాసము వ్రాయఁబడినది.

ఈశైలీలేడి తళుకుటోడియో పోడకట్టదాయె. అంతట నేనలసటచే డస్సి యొకదట్టమగుపత్త్రజొంపములతో నలరారు సురపొన్న ట్రీ (tree) నీడను, ఒకస్టోను (stone) పైఁ గూర్చుండి యిట్లు తింకింప (think) ప్రారంభించితిని. "శైలియన పదవిన్యాసమా? లేక, యర్థంపుముద్దయా? అదికాక, భావసౌభాగ్యగరిమయా ? ఆర్, (or) ధ్వనిసంపదయా ? ఇవెవ్వియూ గాక స్టయిలు (style) రీతియా ? లేక మాటల బ్యూటిఫుల్‌నెస్సా ? (beautifulness) అని వివిధరీతి కొట్టుకొన్ననూ, దీని తసాదీయ అసలుసత్తా మాత్రముదొరికినదికాదు. ఇటులుండ, కొంతవడి కావనీస్టోనుగుట్టలంగోనుండి నీమూషాతాషా గభీరధ్వానమువలె రోదోకుహరకూపగర్భగోళములఁ బూరించుచు నొక మెండగు సౌండు (sound) కర్ణరంధ్రములలోఁ జొరఁబడినది. తిరిగి యానాదకళ నుపాసింపఁజూతునుగదా ! ఆజంఝూధ్వాన మంతర్ధాన మాయెను.

నిజమే ! శైలిబ్యూటీ యిట్లుండవలె నని నిర్ణయించుట గొప్ప డిఫెక్టు (defect) వైయుండురా ? దానిసౌందర్యము యొక్క పసంగను నిరూపించు రోడ్డు లేనే లేదు. అందుమూలముచే నాచార్యబిరుదాంకితులకుఁ గూడ, దీనినిజరూపము నుపాసించు వే (way) దొరకదు. [illegible] శైలీకళావిలాసముల నాదోపాసకవరసింహుల [illegible] నాహ్వానించుచున్నాను. కోపింపక, కామ్ముగా (calm) సంజాయిషీ నీయవలయు.

హంసతూలికల కోమలమార్దవమునకును, మదకుంభికుంభవిరాజమానకేశరిబాలము మెత్తందనమునకును, శైలి యొక్కరీతి నుంట సాధ్యమా ? కళాసౌందర్యమాధుర్యభాగ్యసారము నాస్వాదించు నాంగ్లాంధ్రకోవిదులకే యీవిభాగమున భ్రమపరంపరామేఘము లడ్డుతగులుచుండునే ! యిక తక్కుంగల యార్డినరీ (ordinary) పండితులమాట చెప్పనేల.

ఐసుపీసుముక్క (ice piece) యొక్కచల్లఁదనమునకును మలయమందమారుతానిలశైత్యమునకును, నొక్కచక్కి శైలీవిభ్రమ ముందు

నా? చింకిచేటనాద మాధుర్యము ను మానసము చిగురొత్తునట్లు వర్ణింప నేర్పుగల కలము క్రొంగ్రొంపెట్టునినదము నెట్లు ప్రస్తుతింపఁజాలును? ఇది యింపాసబుల్ (impossible) కదూ! పాట్లులోఁ దమన మెదుగు రీతికిని, నదీవెల్లువదరిని రెల్లుపెరుఁగుదారికిని కంబైండుశైలిచొప్పడునా?

మంజులతర కాకలీకంఠరవకలిత మగుకోకిలకూఁతలఁ జిత్రించు కుంచీసంచారములఁ బ్రదర్శించు చిత్రకారుని మేధాశక్తిని జూపట్టుశైలికిని, కాకోదరభీకర మగు కేకినీవాణీవిలాసమును లిఖించు కవివ్యాఘ్రుని లేఖినీతీరునకును, సామానాధికరణ్య మెట్లొడఁగూడును? ఈరెంటను వ్యత్యాస ముండుట న్యాయమే కాని అన్నాచురల్ (unnatural) కాదు. దీనిం గాదను సారస్వతకళాకోవిదు లుండరు. ఒకచో నుండిన నుండనిండు. నారివాదము లొట్టె చొప్పబొడు లగును కాని, రస్సుల్గాలు కానేరవు.

స్నానసంధ్యాది మర్యాదాకలితుఁ డగుభక్తకవివరుని సరసలేఖినీపావనకవితాధార కుండుస్టయిలు, ఉభయభాగప్రక్షాలనాదూరుఁ డగు నాంగ్లాచారకవిమార్తాండుని కవితకుఁ బట్టుపడుట యెట్లో తెంకుచేయుఁడు. పైప్రశ్నల కేమి గాని, తెలుంగుప్రౌఁబోఁడి జట్టుముడికిని, కంబోడియామాదిపిడికిని శైలిలోఁ దారతమ్యము లేదందురా ? లేక కలదందురా ? ఉన్నచో, వర్ణించి చూపుఁడు. చూతము మీకవితావెరైటీని (variety).

బాగుగా, పండి మ్రానునుండి క్రిందఁబడిన రెండు ఎండుటాకులు కూడినచో ఫెళఫెళ నినదము చొప్పునుగాని, ముద్దుమాటల కలయిక యింపవలె స్వీటుబ్యూటీ (sweet beauty) పొడకట్టదుకదా! పెక్కుపంక్తులు చిత్రింపనేల. జరామృతుల దూరమొనర్చి, సప్తధాతురసముల సొంపును పెంపుచేసి, మనసును సలసల మరగింపఁజేయఁజాలు పియ్యూషరససోనల పానముచేయుటచేఁ, గైపెక్కి, నందనసుందరమందిరాంతమున బృందారబృందముల నడుమ పురందరుని ముందర మందహాససుందరవదనారవిందమునుండి పైకిలెగుచుభావకళాఫ్లేమ్సు (flames)

నిర్జరహృదయములకు హీటెక్కింప, (heat) కాళ్లయందలి చిరిగజ్జియలకిం కిణీసొంపున్న వియచ్చరజంపతీలతలకు యాశ్చర్యపల్లవముల తొడిగింప, రింగున నాట్యరంగమున దిగి నర్తనముచేయు- యుంగరముంగురయగు డివైను లేడీడ్యాన్సుకును, (divine lady dance) కడుపాఁకలిని పూఁటిగా మాన్పఁజాలని యరసోలెఁడు యవాగూ వాటరును గ్రోలి, శరీరసీరసముచే నూఁగాడుచు, తిండికై నడుసుగుంటలో దిగి, చిందులు ద్రొక్కు కూలియాలి వాలుకన్నుల భావకళాశైలికిని తారతమ్య ముండుట యొకవింతయా ?

కొందఱాంగ్లసారస్వతసాహిత్యసారపారావారమును దరించిన నవకోవిదులు మిల్టనుకవి మేటిపేరడైజులాస్టులో (Paradise Lost) చూపిన స్టయిలురమ్యతను, ఇప్పటియాంధ్రపొయిట్రీ (poetry)లోనికి దింపఁజూచుట యడియాసయే గాని, యుకయోగకారి కా దనుచున్నారు. మఱికొందఱు సాంస్క్రిట్టుస్కాలర్సు (Sanskrit scholars) కవిసార్వభౌముఁ డగుకాళిదాసవిబుధేంద్రుఁడు వర్ణించిన మబ్బుకబ్బములోని నాచురల్ సొబగును, నవయువకకవనములోనికి దిగలాగుట రొంబకష్టమనుచున్నారు. వేఱుకొందఱు త్రిలింగులు తెనుంగువారి నెకవితలోని నీటువెరైటీని (neat variety) వంగపొయిట్రీలోనికిఁ దేఁజూచుట వృథాట్రబు లనుచున్నారు.

పరికింప, పరమాణువులు మొదలు మహాగొప్పమౌంటెనుపంక్తులవఱకును గలపదార్థం గుంపంతయు, శైలీవిలాసినీసౌభాగ్యకళాకాంతిసంపదతోఁ దనరారుచున్నది. ఈసృష్టిలో శైలిలేని నలుసుకూడఁ గన్పట్టనుకదా ! కావున శైలీవిలాసినీసొబగుభాగ్యము మైండుకుమాత్రముటచ్చగును (touch) గాని, మాటల కంట నేరదు. ఆంధ్రశైలీస్వీటుపరబత్తులో యింగ్లీషుస్టయిలువైను పోసినఁ జక్కనికాంబి నేషన్ (combination) సమకూరునేమో ! అడాడా ! ఏమి. ఈశైలీకడబిడ. వడగాలికి టెండరు (tender) పల్లవములవలె రసికజనమానసకుందములు కందిపోవుచున్నవే.

అన్నలారా! ప్రకృతము నూత్నతైలింగ్య కవితాకన్యకామం గళకాయమానవితానమునకు శీలశ్రీకాంతికలితము లగు పదపారదగుళ కాగుంభనములు ముఖ్యములు కాని, కేవలశైలీశైవాలతోరణ డికరేషన్సు (decorations) ముఖ్యములు కావు. ఇది నాయూహ. ఆపైని యాజు యూలైక్కు. (as you like) కాని, చక్కగాపూరిన సారాయి వారిపూరంపుకుండలో సాలిగ్రామసంపుట ముంచినంతమాత్రాన దానికి తిరుతరవాణీనీరసారగౌరవము రానేర్చునే? చప్పిడిచొప్పదంటుపదకదంబముల కావ్యంపుపేజీలలో స్టోకెకరించినంతనే, ఆయది బాలరసాలసాల కోమలనవ్యకావ్యకన్యకాపేశలమేలిమేనును, పులకింపఁజేయఁగలదా!

స్వాతంత్ర్యజాఝూమారుతప్రేరితము లగునిర్లక్ష్యమబ్బులు చల రేగు యీహర్వాణశకమున సాహిత్యనిబంధనబాధల సరకుసేయువారెవ్వరు? ఎవరిశైలి వారిది. హిందూముస్లీముశైలులు వేరువేరుగా భారతావనియందు ప్రవహించుట లేదా? అట్లనే గ్రాంథికగ్రామ్యస్టయిలున్సు కూడ వేరువేరుగా సాగవచ్చును కదా! ఇందు కింత రంపేల. భాషకు తాకట్టువస్తువులకువలె వాడుకొనఁగూడదనుకట్టుఁబొట్లు లేవుకదా? కవితాకళకు కొళాయినీటికున్నట్లు కొలఁతమీఁట ర్లుండఁదగునా? శాంతినక్షత్రము సంసారికార్యమున కడ్డుదగులునట్లు శాస్త్రము కావ్యరమ్యతనడ్డుకొనఁగలదా? విశాలహృదయులు, "నీవ్యాసం, యీజ్ వెరీ బ్యూటీఫుల్లు" (is very beautiful) అనుదు రనెడి మహాహోప్సుతో (hope) వ్రాసితిని. ఆపైని దయామయుని విష్షెట్లుండునో (wish).

ఇట్లు వ్రాయుటచే శైలీవిలాసినీశిరోజచిక్కుజంటల వివేకసువాసననూనెచే సంస్కరించి, సాపుసేయువ్యాపారమునకు నాభావము లెగెన్స్టులని యూహింపకుఁడు. నేనాసించునది కవితాకళాసువాసినీకేశపాశశైలీమండనము కాని హాలోలేస్లేలుముండనము మాత్రము కాదని విన్నవించుచున్నాను.

---

# బ్రహ్మవిద్యా.

అడయారు విద్యాలయప్రకటితము. (సంపు-1 సంచిక-1)

అడయారులోని దివ్యజ్ఞానసమాజమువారి గ్రంథాలయమునఁ జాలవిలువ గల యముద్రితగ్రంథములు గలవు. ఆగ్రంథములఁ బ్రకటించుట కా సమాజమువారీపత్రికను నెలకొల్పియున్నారు. ప్రథమసంచికయందు మాధవకృత మగు ఋగ్వేదభాష్యమును దేవస్వామిభాష్యసహితముగ నాశ్వలాయనగృహ్యసూత్రములును మొదలిడఁబడినవి. యోగోపనిషత్తు లాంగ్లభాషాంతరీకరణముతోఁ బ్రకటింపఁబడుచున్నవి. ఇవిగాక - అడయారువిద్యాలయ మెట్లు స్థాపింపఁబడినదో మొదట వివరింపఁబడినది. కల్కి యనుపదమును గూర్చి ఆటోశ్రేడరుగారిచే రచియింపఁబడిన విమర్శకవ్యాసమును దిఙ్నాగుని ప్రమాణసముచ్చయముపై లఘుటీకయుఁ గలవు. ప్రాచ్యవిజ్ఞానమును గూర్చి యిట్టి యమూల్యగ్రంథములఁ బ్రకటింపఁబూనిన దివ్యజ్ఞానసమాజమువారికి మనమందఱము కృతజ్ఞులమై యుండవలసియున్నది. ఈపత్రిక వార్షికమూల్యము రు 6/— సంవత్సరమునకు నాలుగుసంచికలు వెలువడును.

## THE ADYAR LIBRARY BULLETIN Vol. I. Part I.

A very useful Bulletin called Brahma Vidya is now started under the auspices of the Theosophical Society, edited by Prof. C. Kunhan Raja M. A. D. Phil. (Oxon). Very many invaluable manuscripts have been collected by the society in the past and the society's attempt to bring forth this bulletin is an extremely laudable one. In the issue under review are commenced Madhava's commentary on Rgveda and Aswalayana's Grihya-sutras with the commentary of Devaswamin. An illuminating article from the pen of Prof. F. Otto Schrader attempts to give a derivaton of "Kalkin." We wish success to the publication of this journal and hope that all interested in Oriental Studies would encourage the same by becoming patrons and subscribers thereof. The Bulletin will be published in four parts per year and the annual subscription for the same is only Rs. 6.

వృక్షంబు కొమ్మల వ్రేలెడు జపమాలి
కలు మానులకు నిచ్చుకవులఁ గంటె
రవ్విచ్చు మునికుమారుల వేదపాఠంబు
లకుఁ దప్పు దిద్దుశారికలఁ గంటె
హోమవేళ లెఱుంగుచుఁ దామె వచ్చి
కుండ లటువెట్ట నిండఁ బాల్గురిసి మగిడి
పొలములకుఁ బోవు గోగణంబులను గంటె
యిందు మహిమంబు లేమన నిందువదన. ౧౪౧

వ. అని యయ్యాశ్రమంబు మహిమంబులు వొగడుచు నాచెంత నతి కాంతంబును గుసుమితలతాక్రాంతంబును నగు నొక్క యేకాంతవనాంతంబున నిలిచి ఋశ్యశృంగునిం గనుంగొంద మనుచు నలుదిక్కులుఁ జూచుచుండ. ౧౪౨

క. ఆఋశ్యశృంగమౌనియు
మూరెడుగడ్డంబు నెత్తిమొలచినకొమ్ముం
జాఱలమెకంబుతోలు వి
కారము దెలుపంగ నెదురుగాఁ గనిపించెన్. ౧౪౩

వ. కనిపించిన నయ్యంగనలు మందహాసకందళితకపోల లగుచు నందఱుం దమలోన. ౧౪౪

సీ. కొమ్మనో నడునెత్తిఁ గొమ్మొంది యాచుట్టు
జడలు చెంపల వ్రేలఁబడుట యొంది
మెడచుట్టుఁ జిల్లులచిడిపిరాల్గూర్చిన
తీరునఁ బూసలపేరు లేంది
బుసి గప్పుకొన్నచొప్పున మేన నిండంగ
మేదించినట్టి యీబూది యేఁది
కసవుముప్పిరిత్రాటఁ బొసఁగంగఁ గట్టిన
పొడచింకతోలు కచ్చడ మదేంది
నొసల మసిబొట్టి దేంది యెద్దెసల నిట్టి
బూచిఁ గనుఁగొన మక్క చూచినపుడె

వెఱపడరె యంచుఁ జేఁబొమ్ము చఱచికొనుచుఁ
గడఁగి దగ్గఱఁ జేరక కడనె యుండి. ౧౪౫

క. ఇమ్మానిసిమొకము స్మది
నమ్మఁ దగదు చేర గొబ్బునం జనకుఁడు పైఁ
గ్రమ్మి తల వంచికొని వడిఁ
గొమ్మున నటు చిమ్మెనేని కొద వగుఁ జుండీ. ౧౪౬

గీ. తరుణిరో వీని శుద్ధదంతముల మీఁద
లీలఁ దాంబూలరస మింత గీలుకొనినఁ
బాఁడి పగిలిన దాడిమీఫలములోని
విత్తు లన నుండు నెఱుఁగండు వీడియంబు. ౧౪౭

సీ. ఈపట్టువర్ధనం బేటికి నుదుటికిఁ
దీరుగాఁ గస్తూరి దిద్దరాదె
యీదర్భలపవిత్ర మేటికి వ్రేలికి
విడికెంపుటుంగరా లిడఁగరాదె
యీపొడచింకతో లేటికి మేనికి
వీణాము వలెవాటు వేయరాదె
యీతులసీభూష లేటికిఁ జెవులకుఁ
గట్టాణియొంటులు వెట్టరాదె
కొమ్ము మొలచినయంతనె కొదవ యేల
వచ్చు నితఁ డేమి చక్కనివాఁడు గాఁడె
యది కిరీటంబులోపల నణఁపరాదె
యంచుఁ బలికిరి మునిపుత్రుఁ గాంచి వేడ్క. ౧౪౮

గీ. ఘనుఁడె యితఁ డేమి యిందఱకన్న వేఱ
కొమ్ము మొలచెనె యని యాడికొందు రెంతుఁ
గొమ్ము మొలచిన దితనికిఁ గొమ్మలార
మునిశిరోమణి యితఁడెపో ముజ్జగముల. ౧౪౯

గీ. చెలియరో వీఁడు నా చేతఁ జిక్కె నేని
కళలఁ జొక్కించి సుఖనిద్ర గ్రమ్మఁజేసి

గురుసు దగులకయుండంగఁ గొమ్ము దివిచి
మంచి కస్తూరిబరణి వట్టించవచ్చు. ౧౫౦

గీ. ఇతఁడు వనములలోఁ జరియించుకతన
నెత్తి వసి నాటినదొ లేక నిక్కముగను
గొమ్ము మొలచినదో యిటు కొమ్మలార
మునులలో నీవికారంబు గనము వినము. ౧౫౧

గీ. కొమ్మె కనిపించుఁగాని మొకమ్మునకును
జొమ్ముపైఁ బడు గడ్డంబు రోఁత లేదు
మొలఁతరో వీఁడు మానిసిమొకము చూడ
వీని నెలయింపవచ్చునే లోను సేసి. ౧౫౨

సీ. తెలిగండవాఁడియ మంత్రించి మైనటు చల్లి
వెంటరా మరపెద వీనిఁ గొమ్ము
మొలనాలు దిగిచి కొమ్మున నుచ్చు దగిలించి
చేపట్టి కొని తెత్తుఁ జిగురుఁబోఁడి
గానంబుచేతఁ జొక్కఁగఁజేసి యిట్టట్టుఁ
జనకుండఁ జేసెద వనజగంధి
ఫలములందునె మేఁత వలనొప్పఁగాఁ గూర్చి
భ్రమనొందఁ జేసెద భ్రమరవేణి
యనుచు నీరీతిఁ బంతంబు లాడికొనుచు
నొకట నందఱుఁ గస్తురిమొకములట్టు
లంగనలు మేలితావు లుప్పొంగుచుండఁ
జేరఁ జనుదెంచి యాబుష్యశృంగుకడకు. ౧౫౩

సీ. ఒకకొమ్మె కనిపించుమొకము మానిసి యటంచుఁ
బొదలలోఁ జని మోసపోయి పోయి
మానిఁ గాంచియుఁ జెట్టుమాటుకొ మ్మెఱుఁగక
యితఁడు వేఱొకఁ డంచు నెంచి యెంచి
యాటకై బుషిపుత్రు లతనివేషము పూని
తిరుగ వారలవెంటఁ దిరిగి తిరిగి

కని యొంటికొమ్మమెకము మెకమ్ములలోన
　　　　　　　　　మైఁ గాంచి కాదని మరలి మరలి
మాటికిని ముందుచూచినచోటె చూచి
కులుకుగుబ్బెత లోకరీతి గుఱుతుపట్టి
చేరి యీతండెపో ఋశ్యశృంగుఁ డనుచు
నలరి తమలోన నిట్లని తలఁచి రంత. ౧౫౮

సీ. వలలుగా మనకొప్పువలలు నల్లడఁ దీర్చి
　　　　　　　　　తగిలించుకొనవచ్చుఁ దరుణులార
గంటలసరిపైణ గంటవేఁటలు వన్ని
　　　　　　　　　పట్టుకొనఁగవచ్చుఁ బడఁతులార
వలకారి జిలుగుదువ్వలువలఁ దెరవారి
　　　　　　　　　చిక్కించుకొనవచ్చుఁ జెలువలార
మొలనూలియురులు కొమ్మునఁ దగుల్గొనఁ జేసి
　　　　　　　　　కొనిపోవఁగావచ్చు వనితలార
యివియుఁ దానేల మనచూపు లెనయు వేఁట
యిట్టి వెనువెంటఁ జనుదెంచు నిట్టికరణి
వచ్చు మచ్చికపచ్చిక నిచ్చఁదగిలి
మునిమృగము వేడుకలు మీఱ ముదితలార. ౧౫౯

వ. అని చేరం జనుదెంచిన వనితలం గనుంగొని ఋశ్యశృంగుండును.

సీ. అబ్బురంబుగ నెద గుబ్బకొమ్ములు మొల్చె
　　　　　　　　　ఘనులు వీరౌర నాకన్న ననుచుఁ
బదములఁ బాడమెకుఁ బద్ధము ల్వీరల
　　　　　　　　　మహిమ యెంతటివింత మహినటంచు
ఘనములు వెనువెంటఁ గదియుచున్నవి జల
　　　　　　　　　దాకర్షణము వీరి కబ్బె ననుచుఁ
బలుకుల నమృతంబు పొలఁకెడు బళి వీర

గాన మెన్నఁడు నీసామగానగరిమఁ
గఠినపాషాణములు నీరుగాఁ గరంచె
నంచు మది నెంచి పలుమఱు నరుసుపడు మఁ
గొమ్ముకొన యూఁగఁ దల యూఁచికొనుచుఁ జేరె. ౧౫౭

సీ. కులుకుగుబ్బెతలమూపులు గల్వవిరులంచు
దేవతార్చనకుఁ గాఁ దివియఁబూను
మగువ లందును నవ్వ నగవువెన్నెలలోన
విరవాఁకజల మంచు మునుఁగఁబోవు
వల దని కేలాఁచువారి పచ్చలకడి
యాలనిగ్గులు దర్భ లనును డాయు
నది గని తెప్ప వేయక చూమకొమ్మల
ననిమిషు లనిమ్రొక్కి నగ్గలించు
నపుడు తనకొమ్ము కనుదాఁకు నంచు నొంగి
వెనుకకై పోవ వారలఁ గనుచుఁ జేరి
యకట నామీఁద దయ లేదె యనుచుఁ బలుకు
నౌర యీరీతి నమ్ముగ్ధపారికాంక్షి. ౧౫౮

సీ. చెలువలు పన్నీరుచెంబు లిచ్చినఁ గాశి
కుప్పెలజల మంచుఁ గ్రోలనెంచు
సతులు జవ్వాది యొసఁగ గోపిచందన
మని ఫాలమునఁ దీర్ప నగ్గలించుఁ
గాంతలు మరువంపుఁగాను కిచ్చినఁ దుల
సీదళం బనుచు భక్షింపఁ జూచుఁ
బొలఁతులు వెలిగందవొడి యిచ్చిన విభూతి
యిది యటంచుఁ ద్రిపుండ్ర మిడఁ దలంచు
నలరుఁబోఁడులు వజ్రాలహార మొసఁగఁ
బటికపు జపాక్షసర మంచుఁ బాణిఁ బూని

మౌని జపియింపఁ దివురు నెం దైనఁ గలరు
ముగ్ధ లగువార లటువంటి ముగ్ధ గలఁడె. ౧౫౯

వ. తదనంతరంబ. ౧౬౦

ఉ. మ్రొక్కి కరాబ్జము ల్మోగిచి ముందఱ నిల్చి మునీంద్రులార మీ
రెక్కడనుండి వచ్చితిరి యిచ్చటి యాశ్రమభూమి లెన్నఁడుం
ద్రొక్కఁగఁ జూడ మిట్టిశుభరూపము గన్గొన నెన్నఁడుం బున
న్మిక్కిలి వేడ్కయయ్యె నని మెచ్చుచు వారలఁ జేరి యల్లనన్. ౧౬౧

సీ. హోమకుండికలెట్లు లెద మోదికొన్నార
లని కుచంబులు కేల నంటి యంటి
యీతెల్లరుద్రాక్ష లేడఁ గ్గె నటంచు
హారము ల్పలుమాఱు నలమి యలమి
మంచివి కటిబద్ధమౌంజీగుణము లంచు
మొల్లనూళ్లు సారెకు ముట్టి ముట్టి
సూక్ష్మవల్కలము లెచ్చోటఁ దెచ్చితి రంచుఁ
బసిఁడంచుచేలలు పట్టి పట్టి
హోమరక్షలఁ బరిమళం బున్న దనుచు
మేలికస్తూరితిలకము ల్ఫాలసీమ
మోము దార్కొన మూర్కొని మునికుమారుఁ
డిట్లు భ్రమయంగ నంగన లెల్లఁ జూచి. ౧౬౨

గీ. నేఁడు మనచేతఁ జిక్కెఁబో వీఁ డటంచుఁ
బాదములగెల్పుబిరుదులు పదిలముగను
గట్టుఁ డీఁక నంచుఁ జంకలు దట్టికొనుచు
నొండొరులఁ జూచి చిఱునవ్వు లుల్లసిల్ల. ౧౬౩

గీ. ఇంతచాలు నేఁటి కిటమీఁద మిక్కిలి
రేఁపునడిమె నేని రేపు రాఁడు
మచ్చు చల్లినట్లు మరిగి యిచ్చోటికె
వచ్చుఁ బోఁడు వీఁడు వనితలార. ౧౬౪

క. చండకరతేజుఁ డైన వి
భండకముని యెఱిఁగెనేని పటుకోపకళం
కొండకమానం డిచ్చో
నుండక యటు దోలఁగవలయు నో చెలులారా ! ౧౬౫

వ. అని యిట్లు మతకంబు లాడికొనుచు ఋశ్యశృంగుం గనుంగొని.

గీ. వ్రతము సలుపంగఁ బోవఁగావలయు మాకు
వేగ నీవును హోమాదివిధులు దీర్పఁ
బొమ్ము నేఁటికి మీవనంబునకె మగిడి
యెల్లి వచ్చెద మిచటి కో ఋషికుమార. ౧౬౬

క. అని ఋశ్యశృంగమునిఁ దన
వనమునకుం బోవనిచ్చి వారవధూటుల్
చని తారుండిన మునుకటి
ననఁబొన్నలలోన నిలిచి నగవులు నిగుడన్. ౧౬౭

క. ఈపొదరిండ్ల సొంపులు
నీపువ్వుల తావిరీతి యే మనవచ్చున్
బాపురె యెట్లైన నమ్ముని
రే పిచటికిఁ దెచ్చి యుపచరింపఁగవలయున్. ౧౬౮

వ. అని యిట్లు కోరుకులు మీఱం బలుకుచు నవ్వనజనేత్రలారాత్రి యవ్వనంబులో నిద్రించి మేలుకని మఱునాఁడు రేపకడయ సంధ్యాదికృత్యంబులు నిర్వర్తించి చనుదెంచిన మునికుమారుం గనుంగొని యొయ్యనొయ్యన నొయ్యారంబులు మెఱయ డగ్గఱ కరిగి యేమియు ననక కొంతతడవు నిలిచి రంత ఋశ్యశృంగుండును నయ్యంగనలం గనుంగొని కరంబులు మొగిచి యోఋషులార మీరలు మాయాశ్రమంబునకు వచ్చి మా సేయు నుపచారంబులు గైకొనిపోవలయు నని ప్రార్థించి వారలం దోడ్కొని తనతపోవనంబునకుం జని యచ్చటం బర్ణశాలాంగణంబున రసాలసాలంబుల నీడ నందఱకు నందంబుగా దర్భాసనంబులు వైచి కూర్చుండ నియమించి నమస్కరించి. ౧౬౯

క. ఇదె యర్ఘ్యం బిదె పాద్యం
బిదె కుసుమఫలోపహార మిదె కొమ్మని స
మ్మద మొదవ ఋశ్యశృంగుఁడు
మదవతులకుఁ బూజ లొగి సమర్పణ సేసెన్. ౧౭౦

గీ. పూజ గైకొని వేడ్క నంభోజముఖులు
కంటిరే నేఁడు నిన్నటికంటె వెఱ్ఱి
మిగులఁ గనిపించె ననుచు లేనగవు లలర
నొయ్య డగ్గఱి కటుచేరి నెయ్య మొనర. ౧౭౧

సీ. కుందకందుకములచందానఁ జంద్రఖం
డములట్లు ఫేనషండములచాయఁ
బాండురచ్ఛాయలు పరిఢవిల్లుచునుండఁ
దెలిచక్కెరలును వెన్నలును గూర్చి
సొజ్జెలవగల మెచ్చులు పుట్టఁ జేసిన
కజ్జము ల్గొన్ని కైకొన్న లిచ్చి
మునినాథ మావనంబులపండు లివి కొన్ని
చవిచూడు మనినఁ గేల్సాఁచి యందు
త్రుంచి భక్షించుచునె కొమ్ముతుద యొకింత
గదలఁ దలయూఁచి సంకులకరణి ధవళ
దంతములు గానుపింపంగ సంతసంబు
చెలఁగ మొగమెత్తి నవ్వుచుఁ జెలులఁ జూచి. ౧౭౨

క. ఇవి మీవనతరుఫలములె
చవి యే మనవచ్చు నమృతసంభవులో యీ
భువి నెన్నఁడుఁ గనుఁగొన మా
దివి నైనం గలవె యిట్టి తీయని ఫలముల్. ౧౭౩

గీ. ఎంతదూరంబు మీవన మిచటి కనిన
దూర మేడది గడియెఁడుత్రోవ యింతె
వనము గనుఁగొని పండ్లు దేవచ్చు నొడలు
గదలకుండంగఁ దోడుక పోయెదము నిన్ను. ౧౭౪

వ. అనిన విని ఋశ్యశృంగుం డంగనలం గనుంగొని. ౧౭౫

క. చనుదెంచెద నేనును మీ
వెనువెంటనె యనిన నవ్వి వికచాంబురుహా
నన లెల్ల నుల్ల మలరఁగ
మనచేతికిఁ జిక్కె మునికుమారుం డనుచున్. ౧౭౬

సీ. తళుకుబంగరుఁ బ్రాఁత వలిపచేలలు వన్నె
సవతేరుపడఁ జాల హవణుమించఁ
గాసెలతీరుగాఁ గట్టి యాపై నల్ల
పట్టుదట్టులలీలఁ బరఁగ జడలు
నడుములఁ జుట్టి యందముగాఁగ నందుపై
బలుకెంపుమొలనూళ్లు పరిఢవించి
ఱవికెలు ముడులు జాఱకయుండ బిగియించి
ముత్తెల జన్నిదంబులు ఘటించి
మేలి చందురుకావి రుమాలు లొక్క
వింతగా నాల్గుచుంగులు వెడలఁ గట్టి
యొడల నిండంగఁ దెలిగందవొడులు చల్లి
పల్లవాధర లెల్ల సంభ్రమము మెఱయ. ౧౭౭

సీ. తరలాక్షు లిద్దఱొండొరుల చేతులు గూర్చి
పొడవుగా నెత్తి యిర్గడలఁ గొమ్మ
వగ హస్తములు సాఁచ వారివెన్నులఁ జన్నుఁ
గవహత్తి యిద్దఱంగనలు నిలిచి
దంతపుగొడెలచందానఁ గంకణకరం
బులు నిగిడింప వారలకు నడుమ
భామ లిద్దఱు నిల్చి పటముపోలికఁ గరా
బ్జాతంబు లుయ్యెలపట్టు గాఁగఁ
బట్టి యాచుట్టు మునసాబుపస పొసంగఁ
గుడిభుజంబులక్రిందట జడలు దెచ్చి

యెుండొరుల రొండిఁ జెక్కి పసిండి సరిగ
చేల పన్నాగముగ వైచి లీల మెఱయ. ౧౭౮

క. అందలము రీతి నందఱు
నందంబుగఁ గూడికొనుచు నందు మునీంద్రుం
బొందుగ నిడికొని పదరక
మందగతులు మెఱయ హరిమార్గము నంటన్. ౧౭౯

గీ. సాగి నడచిరి వికచాంబుజాతముఖులు
యోగివరు ఋశ్యశృంగుని నొకటఁ బొదివి
భోగిఁ జేపట్టుకొని పోవుబాగు మెఱయ
వేగిరము యంగవిభునకు వేడ్క సేయ. ౧౮౦

గీ. బటువుబిగిగుబ్బబటువులపై నొకింత
యొఱగి యొరగింతయును లేక యొప్పుచుండు
వనజనయనాభుజాందోళికను వసించి
తేజరిలె నప్పు డమ్మునిరాజు మిగుల. ౧౮౧

చ. వనజవిలోచన ల్మెఱుఁగునాలికచూపులు గ్రేళ్లు దాఁట స
మ్మునిసుతు సారె గన్గొనుచు ముద్దుల వేఁకచింక చిక్కెఁబో
యనుచు లసద్విలాసపరిహాసవచఃక్రమముల్ సెలంగఁగాఁ
జని రట సాగి యంగనృపచంద్రునిపట్టణపద్ధతిం దగన్. ౧౮౨

సీ. అడుగు జాఱకయుండ నడవుమీ యిచ్చోటఁ
బూఁదేనె జీరుఁడు పువ్వుఁబోఁడి
యెలమావి బలుకొమ్మ లిచట నడ్డము వచ్చె
నటుపోయి తిరుగు మోయంబుజాక్షి
కనుచుఁపు మెఱయ న్వికడ రాజనపువంక
యిరుమేల యొద్దిక సరసిజాక్షి
సంగడఁబులు గూడి చనుఁ డిందుముఖులార
కెందమ్మికొలఁకుల సందు త్రోవ
కలిగెఁ బన్నాఁటిమోపు బంగారుమోపు
భోపురే యంచు మేలంపుఁ బలుకు లలర

నొండొరుల నెచ్చరించుచు నింపువేడ్కఁ
గూడి నడచిరి మునిపుత్రుఁ దోడికొనుచు. ౧౮౩

క. కై లాగు తడుగు దిగుదల
మే లుప్పర మింపు జతన మే ల్బళి యనుచు
న్నేలము లాడుచుఁ జని ర
బ్బాలామణు లంగవిభునిపట్టణమునకున్. ౧౮౪

వ. ఇత్తెఱంగునవారాంగనలు ఋశ్యశృంగమునిపుంగవుం దోడ్కొని యం
గరాజరాజధానిం బ్రవేశించి రక్షణంబ జనులెల్ల నీక్షించుచుండ
నద్భుతంబుగ. ౧౮౫

సీ. చిమ్మచీఁకటులు పెచ్చిలఁ గాఱుక్రమ్ముచు
మేఘంబు లొయ్యన మిన్నుద్రాఁకె
మేఘజాలమునందు మిహిపైఁడితీఁగల
కరణిఁ గ్రాలమెఱుంగుగములు మెఱసె
మెఱపులతోడనె తెఱమగా నుఱుములు
ఘుమఘుమధ్వనుల దిక్కులఁ జెలంగె
నుఱుములతోఁ గూడ నొకట ధారాళమై
వాన ధారుణిఁ జలువానఁ గురిసె
దేవదుందుభినాదంబు దివ్యపుష్ప
వృష్టియుఁ బొసంగ జగము సంతుష్టి నొంద
ఋశ్యశృంగమునీంద్రుఁ డింపెసకమెసఁగ
నంగవిభుపట్టణము చేరినంతలోన. ౧౮౬

క. నిండుమదితోడఁ గూడి వి
భండకతనయుండు రోమపాదునిపురిలో
రెండడుగు లిడినమాత్రన
కుండలు గొని వంచినట్లు గురిసెన్ ఘనముల్. ౧౮౭

సీ. అంగరాజును ఋశ్యశృంగుని కెదురేఁగి
భయభక్తివినయసంభ్రమము లలర

సాష్టాంగ మెఱఁగి యర్ఘ్యముఁ బాద్యము నొసంగి
తననగరికిఁ దోడుకొనుచు వచ్చి
యంతఃపురంబున హైమపీఠిక నుంచి
పుష్పాక్షతంబులఁ బూజచేసి
మనసునఁ గోపంబు గనకుండునట్లుగా
నమ్మహాత్ముని బ్రసాదమ్ము గాంచి
శుభముహూర్తంబునందును విభవమెసఁగఁ
దనకుమారిక శాంత నమ్మునికి నొసఁగె
శాంతయును దాను నిప్పు డాసంయమీంద్రుఁ
డంగవిభునింట నున్నాఁడు హర్షమెసఁగ. ౧౮౮

వ. అని యివ్విధంబున దశరథమహీనవునకు సుమంత్రుండు ఋశ్యశృంగునికథ సవిస్తరంబుగా వినిపించెఁ దదనంతరకథాసంవిధానం బెట్టిదనిన. ౧౮౯

శా. ప్రస్తైమప్రకటప్రతాపతపనప్రోద్ధోష్మశుష్యన్నిశా
టస్తోమోచ్చలబంబ్బజవ్రజప్రచండస్థాణుకోదండవి
ధ్వస్తిధ్వానఘనానకస్వనసముద్దామక్షమాకన్యకా
హస్తేకృత్యభివర్ధితోదయ దయోదంచద్దృగంభోరుహా. ౧౯౦

క. కర్కశకలహాసముద్భట
మర్కటభటబంధితాబ్ధిమధ్యపథశుభో
దర్కకరదివ్యగుణగణ
యర్కకులాభరణ ఘననిజాంగస్ఫురణా. ౧౯౧

పంచచామరము:—

సురస్ఫురత్కిరీటకోటిశోభితాంఘ్రిపంకజా
శరాసభృత్కరా శరాగ్రజర్జరీకృతాశరా
మరుత్సరిచ్ఛరద్ఘనస్మరద్విషత్స్మితచ్ఛద
స్వరీశ్వరద్విపచ్ఛవిచ్ఛటానటద్యశోఘనా ౧౯౨

గద్యము. ఇది శ్రీరామచంద్ర సాంద్రకరుణాకటాక్షలబ్ధ సిద్ధసారస్వత విశేషనిరర్గళవాగ్వైభవాశేష సరససాహిత్య కళాభోజ, సత్యసంభాషితముఖాంభోజ, సకలసామ్రాజ్యధౌరేయ, నిత్యవితీర్ణధారారాధేయ, నిరతావారితాన్నసత్రసంతోషితపంచాశత్సహస్రభూసుర, బహువారావర్తితమహాదానవైభవానర్తితకీర్తిభాసుర, నిజనామాంకితాకలంకవస్తుసమగ్రబహుళాగ్రహారభూషితచోళధరామండల, నిఖిలభోగవిభవనిర్జితాఖండల, సాధితసముద్రాంతరద్వీప పరనృపాలసంస్తుతప్రతాప, నేపాలభూపాలస్థాపనాచార్య, కర్ణాటరాజపూజనీయధౌరంధర్య, రామసేతు శ్రీరంగ విజయరాఘవపుర కుంభఘోణాది దివ్యస్థలప్రతిష్ఠాపిత రామభద్ర, సర్వజనసంభావిత గాంభీర్యముద్రానిర్జితసముద్ర, సదాశ్రితభరణదీక్షాదక్ష, దక్షిణసింహాసనాధ్యక్ష, రాజాధిరాజసన్నుతాసాధారణశౌర్య, దిగంతప్రసిద్ధతరౌదార్య, సుజ్ఞానజనక, సతతసంసేవితజనక, పోషితవిద్వత్కవియూథ, భువనశోభితగుణసనాథ, బలవత్పరిపంథిగృహీత సామంతమహీకాంతవిమోచనశ్లాఘనీయ బాహుబల, మూర్తిమాంబాగర్భశుక్తిముక్తాఫల, చినచెవ్వయాచ్యుతనృపాలపుత్ర, సజ్జనస్తోత్రపాత్ర, రూపరేఖావిజితసుమసాయక, సకలధర్మసంధాయక రఘునాథనాయఁకప్రణీతంబైన శ్రీమద్రామాయణంబున విబుధజనవినుతవివిధకథాశాఖాప్రకాండంబగు బాలకాండంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

# రఘునాథ రామాయణము.

## తృతీయాశ్వాసము.

---

క. శ్రీకౌసల్యానందన
కాకుత్స్థకులాబ్ధిచంద్ర కరుణాసాంద్రా
లోక మునిలోకహృదయవ
శీకరణగుణాభిరామ శ్రీరఘురామా. ౧

వ. అవధరింపు మట్లు సుమంత్రుండు ఋశ్యశృంగునికథ చెప్పి మఱియు నద్దశరథమహీధవునితో నిట్లనియె. ౨

సీ. నరనాథ వినుము సనత్కుమారుఁడు వెండి
యాకథాంశమునంద యిట్లు లనియె
నిక్ష్వాకుకులమున నిద్ధచారిత్రుండు
దశరథుం డన మహీధవుఁడు పుట్టు
శాంత యన్నన్యక జనియించు నతనికి
నంగాధిపతితోఁ బొసంగు చెలిమి
యంగాధిపతికడ కతఁ డేఁగి ధరణీశ
నాకు నిప్పటికి నందనులు లేమ
ఋశ్యశృంగుని బనుపు మాఋషివరుండు
గడఁగి పుత్రేష్టి గావింపఁ గలరు సుతులు
ననుఁ గృతార్థునిఁ జేయు మెంతయును గరుణ
ననుచుఁ బ్రియ మొప్పఁగాఁ బల్కు వినయమొనయ. 3

వ. అనిన నంగరా జగురోమపాదుండును దనయల్లుం డగు ఋశ్యశృంగ మునిపుంగవు శాంతతోడంగూడ నమ్మహీధవుని వెంట నంపు ఋశ్య శృంగుండునుం బుత్రకామేష్టి సేయించు నతని మంత్రమహిమంబున నద్దశరథమహీధవునకు నలుగురు కుమారులు గలుగుదు రని సనత్కు

మారుండు తొల్లి ఋషులసన్నిధిం బలికె నిది నిస్సంశయం బో మ
హీపాల నీవ సకలబలసన్నాహంబు చెలంగ నంగరాజు డగ్గఱి కరిగి
ఋశ్యశృంగు నడిగి తోడ్కొని రమ్మనిన విని సుమంత్రుని వచనం
బున కలరి యమ్మహీకాంతుండు సంతసంబున నంతయుం దనగురుం
డగు వసిష్ఠమహర్షివరునకు విన్నవించి యతని యనుమతి వడసి శుభ
ముహూర్తంబున నంతఃపురకాంతలతోడం గూడం గదలవలయు నని
నిశ్చయించి మంత్రిసామంతుల కెల్లం బయనంబు చెప్పించి తానుం
బ్రయాణోచితవేషభూషితుండగుచు హెగ్గళ్ళం బిలిచి పల్లకులు గద
లింపుం డని నియోగించిన. ౪

శా. సాగెం బల్లకు లంత నాదశరథక్ష్మాపాలునాజ్ఞప్తి ము
క్తాగుచ్ఛస్ఫురదచ్ఛశోభ లెసఁగంగా జీని బంగారు మే
ల్తీఁగ ల్గ్రాల్చిన జాలకంబు లొఱపౌ దిండ్లొప్పు హొంబట్టుప
న్నాగంబు ల్తమిఁ జూచుచూపఱకు నానందంబు సంధింపఁగన్. ౫

గీ. కొన్నిపల్లకు ల్లొక్కట్టుఁ గూడి నడచెఁ
బద్ధములవ్రాఁత యపరంజిపంజరముల
నిగుడు జిగి యందులో నున్న నృపవధూము
ఖులకు నందంద చీఁకటు ల్దలఁగఁ జేయ. ౬

క. కొమ్ముల బంగరుటనుసులు
ముమ్మరముగ నెండ గాయ ముత్తెపుఁ బన్నా
గమ్ములు వెన్నెల గాయఁగఁ
గొమ్ములపల్లకులు కొన్ని గూడఁగ నడచెన్. ౭

సీ. ప్రోల భూసురయుగ్మములు గూడి సుస్వరం
బులు గూర్చి యష్టకంబులు చదువఁగఁ
బసిఁడి ఘుంగరముల బారుకోలలు పూని
గొల్లలు సందడి యెల్లఁ దలఁగ
బంగారు పెట్టెలు పరికించుకొనుచు హె
గ్గళ్లు తేజీలపైఁ గడలఁ జనఁగఁ

బట్టఁదిడ్డులకనై ల్వట్టి నెన్నడలచే
నుడిగంపుఁ జేడియల్ గెడలరాఁగ
నడచె దశరథవసుమతీనాథమౌళి
యగ్రమహిషుల కనకపల్యంకికలట
మెఱుఁగుఁదీఁగలలోపల మెఱయుచుండఁ
క. గమిచి ధరఁ జాగు చిత్రమేఘములలీల.

గీ. పసిఁడిపల్లంపుజోకలఁ బఱిఢవిల్లు
గోడిగలమీఁద ముసుఁగులు గొన్ని కదలెఁ
బల్లకులఁ గూడి పెదముసుసల్లు గొంద
వ. ఱెరుగడలయందుఁ దగ బరాబరులు సేయ.

క. చని రటు మంత్రులు నందఱు
సీ. వెనుకం దేజీల నెక్కి వినయము భయముం
గనిపింప నాత్మవర్తన
వినుతి గనం జేయు శుద్ధవేషము లలరన్.

సీ. కటగళన్మదములు కాల్వలై ప్రవహింప
సామజఘటలు పార్శ్వములఁ జెలఁగఁ
గనకకింకిణికానికాయంబు మొరయంగ
రథసమూహములు సారథులు నడుప
ఖురధూతధూళి దిక్కులఁ గ్రమ్మ నొక్కట
ఘోట్టాణహయములు గూడినడువ
నాయుధద్యుతులు మిన్నలమ నుద్భటవీర
భటనికాయంబులు బలసి కొలువ
వివిధవాద్యనినాదంబు దివియు భువియుఁ
జఱచి మ్రోయంగ బిరుదధ్వజములు మ్రోలఁ
బఱిఢవిల్లఁగ నంత నప్పంక్తిరథుఁడు
గదలె శిబికాధిరూఢుఁడై ముదము వొదల.

సరగల్ "హంసమాలిక"-స ।।౧, ర ౧।౧, గ ౧;
"కుమారలలితా"జ్సగ్-జ ।౧।, స ।।౧, గ ౧;
యయల్గంబు "శోలాఖ్యక"-య ।౧౧, య ।౧౧, గ ౧;
ఔ "సరసిజ"భసగ్-భ ౧।।, స ।।౧, గ ౧.

క. ఎనిమిదవ యా'యనుష్టు'
ప్పున బుతుశరనయన*వృత్తములఁ దగుఁ బండ్రెం
డును విద్యున్మాలాదులు
ఘనకృతులను జాల మీఱి కాయజవైరీ. ౭౯

వ. మాగా "విద్యున్మాలా"రీతుల్-మ ౧౧౧, మ ౧౧౧, గ౧, గ౧;
భాగగ "చిత్రపదా"ఖ్యన్-భ ౧।।, భ ౧।।, గ ౧, గ ౧;
"మాణవకం"బౌ భతవల్-భ ౧।।, త ౧౧।, వ ।౧;
మ్నాగాల్"హంసరుత"మయ్యెక-మ ౧౧౧, న ।।।, గా ౧ ౧;
ఔ "సమానిక"రజవల్-ర ౧।౧, జ ।౧।, వ ।౧;
"ప్రమాణిక" జరల్లగల్-జ ।౧।, ర ౧।౧, లగ ।౧;
"నారాచక" తరల్లగల్-త ౧౧।, ర ౧।౧, లగ ।౧;
"నాగరక" భరల్లగల్-భ ౧।।, ర ౧।౧, లగ ।౧;
జతల్గగంబు"లివిమానన్"-జ ।౧।, త ౧౧।, గగ ౧౧;
(వితాన మా దీనిపేరే) జ్మగా"లివితాన" మ్మా నెంచఁగ-జ ।౧।,
మ ౧౧౧, గా ౧౧;
"సింహరేఖ" రజ్గగంబుల్-ర ౧।౧, జ ।౧।, గగ ౧౧.

క. ఆనవసంఖ్య 'బృహతిఁ' గల
యేనూటుదు బదియు రెండు వృత్తంబులయం
దేనగుహాలముఖి మొద లగు
వానిని వచియింతు వినుము వాయుకుమారా. ౮౦

ఔ రనల్సము "హాలముఖిన్"-ర ౧।౧, న ।।।, స ।।౧;
"భుజగశశిరుత"న్నామల్-న ।।।, న ।।।, మ ౧౧౧;

---

* ౨౫౬. (బుతుశరనయన)

భారల "నుత్సుక" మాఁ గృతిక్-భ ౧।।, భ ౧।।, ర ౧।౧;
"భద్రకంబు" రనరంబులన్-ర ౧।౧, న ।।।, ర ౧।౧.

క. పది యగు 'పంక్తి' వెయిన్నిఁట
పదినాలుగువృత్తములను వహిఁ గెక్కును గా
ముదిమూఁడిగఁ బండ్రెం డవి
కదనక్షితివిదళితాక్ష కపికులదక్షా. ౮౧

౧౦. నతతగల్పొ-స్పనాఁ"గాముదిన్"-న ।।।, త ౧౧।, త ౧౧।,
గ ౧;
ప్రాఁకు"న్వృద్ధవి-రాటి"మస్జగల్-మ ౧ ౧౧, స ।।౧, జ ।౧।,
గ ౧;
మ్మ్యల్గం బుంపఁ "బ్ర-ణ"వ మైయుంచున్-మ ౧ ౧ ౧, న ।।।,
య ।౧౧, గ ౧;
"మగ్నవతిం" బే-ర్చున్భ్మసగంబుల్-భ ౧।।, మ ౧ ౧ ౧, స ।।౧,
గ ౧;
చాలున్ "మత్తన్" మభసలు గంబున్-మ ౧౧౧, భ ౧।।,స ।।౧,
గ ౧; దీనిపేరే హంసశ్రేణి.
సరజగ ల్దగు-"మ్మనోరమన్"-న ।।।, ర ౧।౧, జ ।౧।, గ ౧;
రజ్రగ"ల్మయూ-రసారి"కొప్పున్-ర ౧।౧, జ।౧।, ర ౧।౧,గ౧;
దీనిపేరే మయూరభాషిణి.
చాల్రనర్గమము-"నారి"యందున్-ర ౧।౧, న ।।।, ర ౧।౧, గ౧;
భమ్నలు గంబున్"చంపకమాలిన్"-భ ౧।।, మ ౧౧౧, స ।।౧,
గ ౧;
ఔరసాగల-నా"మణిరంగన్"-ర ౧।౧, స ।।౧, స ।।౧, గ ౧;
భత్జగముల్ప్రా-పగుసందికిన్"-భ ౧।।, త ౧౧।, జ ।౧।, గ ౧;
"పంక్తి"కి షడ్యతి-భాభగలా-భ ౧।।, భ ౧।।, భ ౧।।, గ ౧;
"పీరపిలసితో-ర్వి"భ్నల్జగల్-భ ౧।।, స ।।౧, జ ।౧।, గ౧.

క. పదునొకఁ డగు 'త్రిష్టుప్పనఁ'
బదపడి ద్విసహస్రసంఖ్యపై నలువదియొ

న్నిదిలోన నింద్రవజ్రము
మొదలుగ నిర్వది మొసంగు మునినుతచరితా. ౮౨

౧౧. ఇత్తాజగాలై తగు-"నింద్రవజ్రన్"-త U U |, త U U |, జ | U |, గా U U;

కృతిన్ "జతజల్గ"ము-పేంద్రవజ్రన్"-జ | U |, త U U |, జ | U |, గా U U;

ఈవజ్రముల్ రెంటను-నిట్లు కూర్పన్
సవజ్రదేహా "యుప-జాతి" యయ్యెన్.

తజాల"నుపస్థిత"-దాఁ జెలంగున్-త U U |, జ | U |, జ | U |, గా U U;

"తోదక"భాభల-తోగగమందున్-భ U | |, భ U | |, భ U | |, గగ U U;

ఆ రనల్రనము-తో"రథోద్ధతన్" ర U | U, న | | |, ర U | U, వ | U;
దీనిపేరే పరాంతికము.

ననరవలు పె-నంగు"భద్రికన్"-న | | |, న | | |, ర U | U, వ | U;

"స్వాగత"కా రనభ-సంగగగంబుల్-ర U | U, న | | |, భ U | |, గగ U U;

"కాంతిక" తజజల్వము-గల్గి తగుకా-త U U |, జ | U |, జ | U |, వ | U;

శ్రీశనాథ"సేని-కికా" రజల్రవల్-ర U | U, జ | U |, ర U | U, వ | U;

ఓ "వాతోర్మిక" మభ-తాస్వితవముల్-మ U U U, భ U | |, త U U |, వ | U;

ఓనా "కలికాంత" త-జావ లిడకా-త U U |, జ | U |, జ | U |, వ | U; దీనిపేరే గీతాలంబనము.

"శాలిన్యా"ఖ్యకా మించు-జాలెన్మతాగాల్-మ U U U, త U U
త U U |, గా U U;

---

తోదకవృత్తమునకు అప్పకవీయములో దోదకమని యున్నది. సేనికి శ్యేని యని యున్నది

నజజలగల్ దనరు "సుముఖిల్"-న ।।।, జ ।U।, జ ।U।,
 లగ ।U;

మభ్నల్వంబుల్ "భ్రమరవిలసితల్"-మ UUU, భ U।।, న ।।।
 వ ।U;

నసతగగముల్-సల్పొను "వృత్తల్"-న ।।।, స ।।U, త UU।,
 గగ UU;

నయమగుఁ "బృథివి"-నాజవలల్-న ।।।, న ।।।, జ ।U।, వ ।U;

ననసగగ లెనయు-నా"వృంతల్"-న ।।।, న ।।।, స ।।U, గగ UU;

"మౌక్తికమాలా"క్రమముభత్నల్గాన్-భ U।।, త UU।, న ।।।,
 గా UU;

"ఉపస్థితము" చేయుల్ జస్తగాప్తిల్-జ ।U।, స ।।U, త UU।,
 గా UU;

"శిఖండివిరుతుల్"-జెల్ జస్తగాలల్ జ ।U।, స ।।U, త UU।,
 గాU U;ఇదే శ్రీయనువృత్తము-

ఈమభ్జల్ గద్వయము-"నేకరూపల్"-మ UUU, భ U।।,
 జ ।U।, గా UU.

క. 'జగతీ' ఛందంబునఁ బొం
 దుగఁ గల్గిన నాల్గువేలుఁ దొంబదియును నా
 ఱగు వృత్తంబుల నిరువది
 దగు స్రగ్విణి యాదిగాఁగఁ దరుచరవీరా. ౮౩

౧౨. మద్యతిల్ రారరల్-"స్రగ్విణీ"వృత్తమౌ-ర U।U, ర U।U,
 ర U।U, ర U।U;

యయాయల్"భుజంగప్రయాతల్"వడేల్లల్- య ।UU, య ।UU,
 య ।UU, య ।UU;

తుదిదాఁక ససాసలఁ-"దోటక"మౌ-స ।।U, స ।।U, స ।।U, స ।।U;

మంబుల్ భస్సల్ "జలధర-మాలా"రీతుల్-మ UUU, భ U।।,
 స ।।U, మ UUU;

---

ఉపస్థితము, శిఖండివిరుతము రెండు నొక్కటియే. ఇదియే శ్రీవృత్తమును. అప్ప కవీయములో శ్రీవృత్తమనికలదు.

## శ్రీ ఆంధ్రసాహిత్యపరిషత్తు — ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజావారు; పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

కీ. శే. శ్రీ బొబ్బిలిమహారాజావారు.

### ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభావర్గము.

### కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

కిడాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

### —కార్యనిర్వాహకసభాసభ్యులు.—

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయఁడుగారు, (కోశాధ్యక్షులు)

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., ఎల్. టి.

దర్భా వేంకటశివరామదాసుగారు, బి. ఏ., బి. యల్.

అళక్కి వేంకట్రామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావునాయఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.

పిళ్లారిసెట్టి రంగబ్రహ్మరావునాయఁడుగారు.

# శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు.

శ్రీ పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని, రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమసంపుటము ముద్రితమై విక్రయమునకు సిద్ధముగా నున్నది. ఇందు, అకారము మొదలు, ఔకారమువఱకును గల యచ్చు లాదియందుఁ గల సంస్కృతాంధ్రశబ్దము లన్నియుఁ గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నింటికంటె నిది సర్వవిధముల నుత్తమమైనది. ఈ భాగము శబ్దరత్నాకరములో 186 పుటలలో నిమిడినది. దీనినిబట్టి యీరెండు నిఘంటువులకుఁ గల తారతమ్య మూహింపవచ్చును. ఈనిఘంటువునందు, సంస్కృతశబ్దములు పూర్వనిఘంటువు లన్నింటియందుకంటె మిక్కిలి యధికముగా నీయఁబడినవి. కావున సంస్కృతవిద్యార్థులకుఁ గూడ మిగుల నుపయోగకరముగా నుండును. ఇది యున్నచో సంస్కృతనిఘంటువు నపేక్ష యుండదు. ఆబ్దికపదములకుఁ గల యర్థభేదములఁ గనఁబఱచి వానికిఁ బ్రమాణవాక్యములును బూర్వగ్రంథములనుండి విపులముగా నీయఁబడినవి. లభ్యమైనంతవఱకుఁ దెనుఁగుశబ్దములకు సంస్కృతద్రావిడాదిభాషలయందుఁ గల సజాతీయపదములు చూపఁబడినవి. కేవలము విడిశబ్దములే కాక సందర్భానుసారముగ సమస్తపదములు (Phrases) ను దానికిఁ గలయర్థములును బ్రయోగములును గూడ నీయఁబడినవి. జనకశబ్దములక్రింద జన్యశబ్దములు చూపఁబడినవి. ఏవిధముగఁ జూచిన నిది యిదివఱకున్న నిఘంటువు లన్నింటికంటె మిన్నయని మఱియొకసారి నిస్సంశయముగఁ జెప్పవచ్చును. దళసరికాగితములమీఁద నచ్చువేయఁబడినది. చక్కనియక్షరములు, తోలు, క్యాలికోలతోఁ గట్టి బైండుచేయఁ బడినది. గిల్టు అక్షరములతోఁ బేరు గలదు. పుస్తకభాండాగారముల కిది యలంకారముగనుండును. విద్యార్థులకు సహకారి. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకే గాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగానుండవలయునను తలంపుతో సాదాప్రతి వెల రు. 5 లు, ఆర్టు పేపరు ప్రతి రు. 7 లు, మాత్రమే నిర్ణయింపఁబడినది. రైలు, పోస్టువ్యయములు, కొనువారే భరింపవలయును. కావలసినవారు, కాకినాడ, ఆంధ్రసాహిత్యపరిషత్తు కార్యదర్శులకు వ్రాయఁగోరెదము.

LIBRARY

Printed by N. Achutaramiah at the Cocanada Printing Works, Cocanada